శ్రీరస్తు.

రావణదమ్మీయము

అను నామాంతరముగల

# లంకావిజయము.

శ్రీ పిండిప్రోలు. లక్ష్మణకవి ప్రణీతము.

చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1927.

# పీఠిక.

ఈ లంకావిజయ మనెడి ద్వ్యర్థి కావ్యమును, పిండిప్రోలు లక్ష్మణకవి రచియించెను. గోదావరీమండలములోని సప్తగోదావరక్షేత్ర మగు ద్రాక్షారామపురమునకు సమీపమం దున్న కుయ్యేరీతని నివాసగ్రామము. ఇతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు, ఆపస్తంబసూత్రుఁడు, భారద్వాజగోత్రుఁడు, రామాంబాగోపాలార్యులకుఁ బుత్త్రుఁడు, శంకరాంబా రామకృష్ణులకుఁ బౌత్త్రుఁడు. ఇతఁడు గ్రంథావతారికయందు—"అని యిష్టదేవతావందనంబును కుయ్యేరుపురవర్ణనంబును... గావించి యే నొక్కప్రబంధంబు నవరసభావార్థలక్షణానుబంధంబుగా నూహించి కల్యబ్దములు 4898.....ఇంగ్లీషు సంవత్సరములు 1797.. అగు పింగళసంవత్సర శ్రావణమాసమునఁ రచియింప నుద్యోగించి యున్నసమయంబున" అని వ్రాసికొనినదానిం బట్టి యీకావ్యము క్రీ. శ. 1797 లో నారంభింపఁబడినట్లు తెలియుచున్నది. కాని యితఁ డీది యౌవనముననే రచియించి నట్లును చిరకాలము జీవించినట్లును నితని దౌహిత్రసంతతివా రిప్పటికిని జెప్పుచుండుటచే నిక్కవి 1840 ప్రాంతమువఱకును జీవించి యున్నమాట సత్యము.

కావునను ప్రాచీనకవుల కిట్టికవిత్వము చాటుధారగానే నిలిచి పోయినదిగాని గ్రంథరూపమును దాల్పలేదు. తరువాతివారిలో నైనను దిట్టకవిత్వమున గ్రంథములు రచియించినవా రితఁ డొకఁడును మొదటినుండి యగ్గలకవి యొకఁడును గాన వచ్చుచుండెను. అగ్గలకవి చంద్రశేఖరవిలాసమునకె నీలంకా విజయము ప్రత్యక్షరామాయణపరము గాక రాఘవార్థమును మాటువెట్టుగాని తెలిపినట్లు కనఁబడును. ఇందులకుఁ దనచంద్రికలోఁ గనఁబడి చెప్పినట్లుగాఁ గవి యవతారికలో వ్రాసికొనిన యీక్రిందిపద్యమే ప్రమాణము.

సీ. ఆరెవెట్టం బన్నయూర నుండెడురావు
 బుచ్చయ్య నరసమాపుత్త్రకుండు
దమ్మనరావన ధర్మరాయం డన
 నిరుపేళ్లతోడుత నెసఁగువెలను
ఆరయ భద్రయ్య జగ్గయ్య తమ్మయ్య భా
 వయ్య లన్నలుపుర కగ్రజుండు
పుత్త్రాదిసంపత్తిఁ బొసఁగునతఁడు మన
 కుయ్యేరు ప్రీతితో గుత్తచేసి
గీ. నీడులంకమాన్యము బల్మికిఁ హరించెఁ
గానఁ దత్ప్రీతికై రామకథయును మన
కథయును జతగాఁగ నర్థంబు ఘటనపఱిచి
కృతి రచించి గోపాలున కిమ్ము తనయ.

ఇతఁడు రెండర్థములను జతపఱుచుటలో నతిక్లేశపడి సంస్కృతాంధ్రపదసమ్మేళనంబునను సలక్షణపదప్రయోగంబునను నుభయార్థప్రకటనంబునను గొన్నిచోట్లఁ బొరపాటుపడి యీశ్లేషకావ్యము రచియించుటకుఁ గారణము కూచిమంచి జగ్గకవివలె నితఁడు ప్రతినాయకుఁడగుటఁ దిట్టఁదగిన దిట్టతనముగలవాఁడు కాక పోవుటయో లేక యాంగ్లేయప్రభుత్వము వచ్చిన యీకాలములో నట్టికృత్యము సాధ్యపడరామియో కావచ్చును.

ఈలంకావిజయము రాఘవపాండవీయాదులవలె నిర్దుష్టసుగమశ్లేషభాసురంబు గాక నిర్బంధశ్లేషబంధురమై కానవచ్చును. దీనికి రావణదమ్మీయమనునామాంతరము గలదు. పూర్వోదాహృతపద్యములోఁ జెప్పఁబడినట్లుగా ధర్మారాయని రావణునితోఁ బోల్చి లక్ష్మణకవి యీగ్రంథమును రచించి దీనికి రావణదమ్మీయ మనియే మొదటఁ బేరుపెట్టినట్లును పిదప నొకప్పుడు శిష్టు కృష్ణమూర్తినామకవిద్వత్కవి "అల్పాచ్చులు గలపదము పూర్వమందుండవలసివచ్చుటచే దమ్మరావణీయ మని యుండవలయు" నని యాక్షేపింపఁగాఁ దరువాత లంకావిజయమని పేరు పెట్టినట్లును వదంతి గలదు.

ఉత్తమవిద్వత్కవులకును బండితులకును విశేషరాజావలంబనము గలిగిన యాకాలమందు విశేషించి విద్వజ్జనపరిశ్రమ మెఱిఁగిన రేచర్లగోత్రజనితులగు రావువంశప్రభువులతో వైరము దెచ్చికొన్నయీకవి యెంతటిలౌకికశిరోరత్నమో వేఱుగాఁ జెప్ప నక్కఱలేదు. ఈకవి చెప్పిన వింకను గొన్నిచాటువులగుదూషణభూషణపద్యములు గలవుగాని కావ్యము మాత్ర మిది యొక్కటియే. ఇందు రెండే యాశ్వాసములు గలవు. ఇందు రామాయణకథను దన లంకగోపకనుగుణముగాఁ గవి సంగ్రహించుకొనెను. ఇందు రాఘవపరముగాను లక్ష్మణకవిపరముగాను వేఱువేఱర్థములను దెల్పుపద్యగద్యములు సుమారు రెండువంద లుండును.

ఇతనిది మఱియొకగ్రంథము లేకపోవుటచేతను, ఇది శ్లేషకావ్యమగుటచేతను నితనికవిత్వమును గూర్చి విశేషించి వ్రాయ వలనుపడ కున్నది గాని దీనిం బట్టిచూడఁగా నితనికవిత్వ మంత ప్రౌఢమైనదియుం నిర్దుష్టమైనదియుఁ గాదని విమర్శకులకుఁ దోఁచక పోదు. అయినను గొన్నికొన్నిపద్యములశైలి ధారాళముగానే కనవచ్చును. సహృదయరంజకం బగుశైలిని నిర్దుష్టముగ ద్వ్యర్థికావ్యములు రచియించి వన్నెకెక్కిన రామరాజభూషణుఁడు పింగళి సూరన్న మొదలగువారి కవితాపద్ధతి యిం దిసుమంతయుఁ గానరాకపోవుటకుఁ గారణ మిద్ది లోకమున నుపకరింపవలె నన్నసదుద్దేశముతోఁ గాక కేవల మొక్కని నిందింపవలె నన్నతలంపుతో రచియింపఁబడుటయే కాక వేఱు గాదు. ప్రాచీనులకవితాధార యర్వాచీనులకృతులయందుఁ గానరా దనుట కూడ నొకకారణమే యని చెప్పవచ్చును గాని శ్లేషబద్ధము గాని కేవలపుఁ దిట్టుకవిత్వమైనను, లోకోపకారబుద్ధితో రచియింపఁబడినశ్లేషకవిత్వమైనను నింతకంటెఁ గొంత రమ్యముగా నుండునని యూహింపవచ్చును. కాని యితండు తిట్టుకవిత్వమున వాక్శుద్ధి గలవాఁ డని లోకప్రతీతియే కాక గ్రంథాంతమందలి పద్యములును దెల్పుచున్నవి గాని యదియెంతవఱకు సత్యమో తెలియరాదు. కాని యితండు తనలంకను మరలఁ గైకొనె ననుట మాత్రము సత్యమని తెలియుటంబట్టి యాప్రతీతి గూడ సత్యమనియే తోఁచుచు

న్నది. ఇతఁడే గ్రంథమధ్యమున నుభయార్థకముగాఁ దిట్టు కవిత్వమందలి తన సామర్థ్యము నిట్లు వర్ణించికొనెను.

క. తెలియ విను రామకవ్యా, దులు సూరకవి ప్రముఖపృథు ప్రతిభావం
తులు భీమ శ్రీనాథు, ల్వెలయఁగ నాకరణి దిట్ట లేరూఢమతిన్.

పింగళిసూరనార్యు ననుకరించి యితఁ డెట్లో యతిక్లేశపడి గ్రంథాంతమున నొకయుభయభాషా కందము † చేర్చినట్లు కనఁబడుచున్నది. గాని మొత్తముమీఁద నితనికి సంస్కృతసాహిత్య మంతగానున్నట్లు తెలియరాదు. ఆంధ్రభాషలో విశేషపరిచితిగలవాఁడని చెప్పవచ్చునుగాని యందందు నలాక్షణికములైన ప్రయోగములు మాత్రము గానవచ్చుచున్నవి. శ్లేషకవిత్వమగుటచే నంతగాఁ బరిగణింపఁ దగనికొన్ని యపప్రయోగములమాట యటుంచి నను వ్యాకరణజ్ఞానముతక్కువ యనిపించెడు ప్రయోగములుగూడఁ గొన్ని యిందు లేక పోలేదు. ఇందుఁ గొన్ని పద్యములు కుంటుచు నడచుచున్నలోపమును వడిగాఁ బరువెత్తుచున్నకొన్ని పద్యములు తీర్చుచున్నవి. రాఘవకథయందుఁ గనఁబడుచున్న వెలితిని ప్రధానంబగు నిజకథాపోషణము మఱుఁగుపఱుచుచున్నది. విశేషించి కల్పనములు వర్ణనములు లేనిలోటును దిట్టుటయందలిగడుసుఁదనము పూరించుచున్నది. చదువరులు రెండర్థములను దెలిసికొనుటయందలి విసుగును జాలవఱకు నేకార్థబోధకములై యెడనెడ వచ్చుపద్యములు తొలఁగించుచున్నవి. శ్లేషసంబంధమునఁ గొన్నిచోట్లఁ గానవచ్చుశబ్దార్థవైరస్యమును మఱికొన్నిచోట్లఁ గానవచ్చు చక్కనిపదముల విఱుపునందలిసారస్యము క్రమ్ముచున్నది. ఎంతైననిట్టి కొన్నిరోగులు కొన్నిబాగులునుండుట సహజమే కావున మొత్తముమీఁదఁ దిట్టుకవిత్వమునకు బెట్టినపేరైన యీగ్రంథము పాఠకులహృదయము నాకర్షించు ననుటకు సంశయములేదు. ఇట్టిగ్రంథ మొక్కచంద్రరేఖావిలాపముగాక మఱియొకటి యాంధ్రభాషలో లేదనియే

---

† ఉభయభాషాకందము.

రామము దేవరకావవ, యామాజేజేయనయమయామున్నలజే
జేమదినినారదే మయి, తే ముద్దామోదరయదితేలం బానిన్.

చెప్పవచ్చును. పరదూషణ మనెడిదోషమీరెంటియందు సమానమే యైనను శృంగారరసాభాసబోధకం బగుదానికంటెఁ బావనంబగు రామచరిత్రమునుగూడఁ దెల్పుచు, వీరరసము ముఖ్యముగాఁ గలిగినయిదియే కొంతమంచిదనుట నిక్కము. కావున నిది కోపావేశంబున వెడలినదైనను గావ్యత్వమునఁ దన కవకాశము గల్పించుకొనుచున్నది. మఱియుఁ గోపావిష్టులగు నితరనాయకులమనోధర్మములను గవులమూలముగాఁ బరోక్షముగా నెఱుఁగుటకంటె మాత్సర్యగ్రస్తుఁడును గథానాయకుఁడును నగు కవియొక్క మానసధర్మములను ప్రత్యక్షముగాఁ దెలిసికొనుట యనెడివిశేష మిం దధికముగాఁ గన్పట్టును. ఇంకను స్వీయచరిత్ర మనుకారణమున లేనిపోని గొప్పలుసెప్పికొనుటకును గార్యశూరత్వమును వెల్లడించుకొనుటకై యహంకారదోషంబున నసత్యములు వ్రాసికొనుటయును నిందుఁ గానవచ్చును. ఇఁక నీతనికావ్యరచనం గూర్చి యించుక విమర్శింపఁదగి యున్నది.

ఇతఁడు గ్రంథాదియందుఁ దన్నును దనసోదరులను దనభార్యలను రామభరతాదులతోను వారిభార్యలగు సీతాదులతోను బోల్చి వర్ణించి కథ కొక యందము తెచ్చికొనెను.

రామపర మయినయుద్ధమున కనుగుణముగా శరదృతువర్ణనము గావించి యాసందర్భమునఁ జెప్పినపద్యములలోఁ గవి తనయుద్ధము నప్రకృతశ్లేషచే నతిక్లేశపడి పూరించి రాఘవార్థమును నిలువఁ బెట్టెను. అందలిదొక్కపద్యము.

గీ. బహులవారివాహినులు సత్ప్రభావమునను
మాత్తై నప్పతి నుత్కలికాప్తి జేర
హంససంతతి ఘనమార్గ మంత దెల్ప
నయగతుల్ చూపె వానరాలి యటు పోవ.

రావణునితో ధర్మారాయనిఁ బోల్చుటయే యిందుఁ బ్రధానముగాఁ గనఁబడును గాని మిగిలినరామాయణపాత్రములకుఁ దుల్యము లయినపాత్రము లిందు సరిగాఁ గాన రావు. అందలికథాక్రమమును బోలినకార్యక్రమము

నిందుఁ గానరాదు. ధర్మారాయఁడు రావణుఁ డయినపుడు తాను రాముఁడు గావలయును. లంక సీత గావలయును. ఆంజనేయాది పాత్రములకుఁ దగిన పాత్రములు వేఱుగానుండవలయును. ఈపాత్రసామ్య మొక్కచోఁ, గనఁబడి వేఱొక్కచోఁ గానరామి కథౌచిత్యమునకు హానిని గల్గించు ననిన నబ్బుర మేమి? ఆంజనేయుఁడు లంకాపురము నేరి సీతను జూచి మాటలాడి నట్లుగా ధర్మారాయనిఁ జూచి మాట లాడినదూతయయ్యె లక్ష్మణకవియే. మారుతి రావణునకు బుద్ధిసెప్పినట్లుగా దమ్మున్నకు బుద్ధి సెప్పినవాఁడును గవియే. రాముఁడు లంక గెలిచినట్లుగా లంకను గెలిచినవాఁడును లక్ష్మణకవియే. "అలలంకాపతి కవిశిష్యులచేత నవ్వార్త యంతయుఁన్ విని"ఇత్యాదులయందు లంకాపతియై రావణుఁ డైనవాఁడును లక్ష్మణకవియే. సీతాలంక లోకష్వు క్షేత్రశబ్దమున శ్లేషింపఁబడుచుండ మఱొక్కపుడు పురమాన్యములు లంకా పదమున శ్లేషింపఁబడును. ఇట్లే పాత్రములపోలిక యస్థిరమై యశ్లిష్టముగా నున్నది గాని యుచితముగా లేదు. పైసందర్భమందలిది లోక మెఱిఁగిన దొక్కపద్యము.

క. లేదమ్మా కష్టము నీ, కేదమ్మా సేఁగి భీతి ఘృణ నీ వొందర్
రాదమ్మా యిఁక మిన్నక, పోదమ్మ మదుక్తి నిజము బోలుపు గదమ్మా.

విభీషణుఁ డైనభద్రయ్య యన్నకుహితము సెప్పుటయుఁ నతఁడాగ్రహించుటయుఁ నిం దుచితముగా వర్ణింపఁబడినవి గాని యెంతశ్లేషసంబంధము గలిగినను, ఎంత యొరులమాటలు గా నున్నను దనవిషయమును దానే వర్ణించు కొను పైసందర్భమున "నతఁడు (లక్ష్మణకవి) కాళిదాసుఁడే. బాణభారవి సుబంధుభవభూత్యాదులకంటె విద్యయందు సూక్ష్మబుద్ధి గలవాఁడు" అని గొప్పచెప్పికొనుట మాత్ర ముచితము గాలేదు. ఇంకను బరిశీలించినచో

గీ. ఒనర మద్వాక్కులం దెలుంగునకు బద్ధుఁ
డగును వాగనుశాసనుఁ డైన నమ్ము
మలఘుమద్దివ్యగోచయంబులకు బద్ధుఁ
డగును శ్రీమనోవసుచోరుఁ డైన నిజము.

అనుపద్యమునందుఁ దనకు నన్నయచోరకవులు బద్ధు లగుదు రని చెప్పి కొన్నట్లున్నను వాగనుశాసన శ్రీమనోపసుచోరపదము లీకవులయందు యోగములు గాక రెండర్థములకు సరిగా నన్వయించుటంజేసి యిది యాత్మస్తుతి గాదని చెప్పవచ్చును గాని,

ఉ. బాణుని భారవిన్ ఘనసుబంధుని నాభవభూతి సర్వగీ
ర్వాణపదంబులం గొనినవారిఁ దదన్యుల విందుమే కదా
క్షోణిని వారికన్న మతిసూత్ముఁడ వారణ విద్య నిన్ను ని
ష్ప్రాణునిఁ జేయు నాతఁ డరయన్ బురుషోత్తముఁ డాకతంబునన్.

అని యెంతశ్లేషవశంబున నైనను రామాయణార్థమున నతిక్లిష్టముగా నన్వయించు నట్లు సుప్రసిద్ధకవి రూఢపదంబులు గైకొని పైవిధముగా వర్ణించుకొనుట లేనిపోని గొప్పచెప్పికొనుట యని సహృదయుల కెట్లు తోఁచక పోవును? మఱియుఁ బైపద్యమందలి "మతిసూత్ముఁడు" అనువిశేషణమే యట్లు వర్ణించికొనుటలో మతిలేనివాఁ డని తెల్పుచుండ నిఁక దానిఁ జర్చింపనేల? కాని కొన్నికొన్నిచోట్ల రెండర్థములు గూడ సుగమములై యొప్పును. ఇందులకు,

గీ. ఏడుపందు ముల్లోకంబు లెఱుఁగ లంక
నేలకొల్ప భరతే త్రాస్తి మేలు గాదు
నాదుపల్కు వే దమ్మని రూఢి నమ్ము

... ... ... ...

ఉ. గాసిగ నెల్లలోకములఁ గాఱియ పెట్టుట నీతిగాదు రా
కాసులబల్మి ధర్మహితకార్యము లొప్పగఁ జేసి నీవనం
తాసురకోటిఁ బ్రోచుచు నుదారమహావిభవం బెలర్ప నెం
తే సుఖలీల నుండుటయొ నీతియుఁ ఖ్యాతియుఁ భూరిహేతువున్.

ఇతఁడు నన్నయభట్టారకునితోఁ దన్ను రెండుమూఁడుచోట్లఁ బోల్చి కొన్నందులకు నీక్రిందిపద్యములో "ఆతనితోఁ దఁబుట్టువం తమ్మిహి కాంతుఁడు"

అన్నచోఁ బ్రాసమును సమర్థించుకొనుటకువలనుపడునేమో కాని "ఆతపకతంబున" అనుచో ముపర్ణకలోప మెట్లుసమర్థించుకొనవచ్చును? శ్లేషసంబంధ మయిన లేని పైప్రయోగము చూడఁగా నితఁడు 'కతము' అనునది తత్సమ మని భ్రాంతి పడినట్లు తోఁచక పోదు. పద్యము చూడుఁడు.

ఉ. అమ్మెయి నాతఁ డేగ నిట నప్పుడ యాతనితోడఁ బుట్టువం
తమ్మిహికాంశుఁ డాతపకతంబున వాఁడినరీతి దోఁప వ
క్త్రమ్ము వికాసభావదశ నైకొనఁ జేరఁగ డాసి యూరుపుల్
గ్రమ్మఁగ లక్ష్మణాగ్రజుఁడు కాతరతన్ గడునిర్వ్యచేష్టుఁడై.

మఱియు:—

1 నాకరణిదిట్ట లే రూఢమలిన్.
2 రూఢి దిట్టగా ననర్వాము లే పఁగఁ బూనుట లిన్...
3 పట్టుగ నంగ దా నలకుమారకముఖ్యుల.

ఇత్యాదిస్థలములయందు నొకయర్థమున నరసున్నలు గావలసివచ్చును. ఒకయర్థమునఁ బోవలసి వచ్చును. ఇది శ్లేషధర్మమని కొందఱు తలంతురు గాని,

"ఆశబర్యాప్తమై యున్నయాశ్రమమును" అన్నచో ఆశ+పర్యాప్తము, ఉన్నన్+ఆశ్రమము, అని లక్షణకవిపర మయిన యర్థమునఁ ద్వైవిధముగా సంధులకలయిక యెట్లుండఁదగునో యూహింపరాదు.

మఱియు "క్రమసుస్థితి న వ్యానరసమాజమణి" ఇత్యాదిస్థలములయందొకయర్థమునఁ గ్రావర్థకేకారసంధి శ్లేషమూలమున వచ్చిన దనవచ్చును గాని యాక్రిందివానిగతి యేమి?

"మానక నాయుంర్వరసంపదున్నతి"
"తప్పకం బనివడి నడిచారులు"

కాకర్లపూడి జగన్నాథరాజున కంకితముగా రచియించిన సర్వకామదా పరిణయమును శిష్టు కృష్ణమూర్తికవి యా రాజసభలోఁ జదువునపుడు మన లక్ష్మణకవి యనాహూతుఁ డయ్యు నాసభకు దయచేసి, యందలి,

చ. తరణిశశాంకు లాభరణదంభమున న్వదనాత్మకైతవం
బురుడసితోత్పలాగ్రమున ముద్దియకుంతలదేశ మాక్రమిం
చి శోకఫలంబు గాన నగుఁజివ్వనుచుం బరరూపయుక్తి ని
బ్బరముగ నంతసాంతముగ బ్రహ్మ యొనర్చినసీమ పొల్పగున్.

అనుపద్యమున లేనిపోనికుశంకలుచేసె ననియు నందుచే జగన్నాథరాజాకృతి నంద నిష్టపడనందునఁ గృష్ణమూర్తికవి యవమానితుఁడై వెడలె ననియు వ్రాయుచు "నివి సరళములైన సదాక్షేపణములు గాకపోయినను" అని కూడ లక్ష్మణకవిచరిత్రమునఁ గవులచరిత్రము తెల్పుచున్నది. కాని యిదియే లక్ష్మణకవి కృష్ణమూర్తికవిని జయించుట యని చాలఘుంది యాశయము. మఱియు నీ కవులచరిత్రమే కృష్ణమూర్తిశాస్త్రిగారికిఁ గల సంస్కృతాంధ్రములయందలి యనర్గళపాండిత్యమును, ఉభయభాషలయందలి కవననైపుణిని సంగీతమందలి నిరుపమానసామర్థ్యమును వక్కాణించుచు నితనిచరిత్రమున లక్ష్మణకవిని మరల నెక్కించి "(లక్ష్మణకవి) అతఁ డాంధ్రకవిత్వమునం దాఱితేఱిన ప్రౌఢుఁడు. తనకున్న సంస్కృతపాండిత్యము లే దనియాతని నధిక్షేపించి కృష్ణమూర్తికవి విఱ్ఱవీఁగుచుండెను; తనవలె నాంధ్రకవిత్వము చెప్ప నేరఁడని యాతని నధిక్షేపించి లక్ష్మణకవి తృణీకరించుచుండెను. కృష్ణమూర్తికవి పాండిత్యమెంత యెక్కువ గలవాఁ డయినను లౌకికజ్ఞాన మధికముగా లేని శుద్ధశ్రోత్రియశిఖామణి. లక్ష్మణకవి యల్పపాండిత్యము గలవాఁడే యైనను లోకానుభవమును యుక్తిచమత్కారమును నధికముగాఁ గల లౌకికశిరోరత్నము. అట్లగుటచే నిరువురుఁ దారసించినపు డెల్ల లక్ష్మణకవియే మేలుచేయి యగుచుండెను." అనెడి వ్యంగ్యప్రధాన మగునీవ్రాఁతయందలి వాస్తవ మిట్టు లోక మెఱుంగుఁగాక.

కృష్ణమూర్తికవి కున్నంత సంస్కృతపాండిత్యము గాదు సరిగదా యందుఁ గొంచె మయినపరిజ్ఞానము కలదో లేదోయని పూర్వోక్తవిమర్శనమే తెలుపఁగలదు. అయిదు సంస్కృతకావ్యములుగాక తెలుఁగున సర్వకామదా పరిణయము, పిఠ్ఠారణ్యమాహాత్మ్యము, వేంకటాచలమాహాత్మ్యము, పంచతంత్రము, స్త్రీనీతిశాస్త్రమును వ్రాసినకృష్ణమూర్తికవి, తనజన్మమున కెల్ల నీతెట్టి కావ్య మెట్టో గట్టెక్కించిన లక్ష్మణకవివలె నాంధ్రకవిత్వము చెప్ప నేరఁడనుట యెంత విశ్వసనీయమో లోక మెఱుంగకపోదు. ఇట్టియెడ నుభయభాషాపారంగతుఁ డగు కృష్ణమూర్తికవి విఱ్ఱవీఁగినను విఱ్ఱవీఁగనేమో కాని యల్పపాండిత్యము గలయీ తెలుఁగుకవి యాతని నెట్లు తృణీకరింపఁగలఁడో యాలోచింపుఁడు.

మఱియుఁ గృష్ణమూర్తికవి వైదికజాతియందుఁ బుట్టినంతమాత్రమున శుద్ధశ్రోత్రియశిఖామణి గాఁడగఁడు. శ్రోత్రియుఁ డనఁగా వేదము చదివిన వాఁ డనియర్థము. ఇతఁడు వేదము చదివినవాఁడు గాఁడు. ఈజాతియందు వైదికశబ్దము రూఢమైనట్లు శ్రోత్రియపదము గాదు. ఇఁక నిట్లే నియోగిజాతియందుఁ బుట్టినంతమాత్రమున లక్ష్మణకవి లౌకికశిరోరత్నము గాఁ డగఁడు. లోకము నెఱింగినవాఁడు లౌకికుఁడు. అనఁగా బహువిధ మయిన ప్రపంచజ్ఞానము లోకానుభవమును గలవాఁ డని తెలియ నగును. కావున నీజాతియందు నియోగిశబ్దము రూఢమైనట్లు లౌకికపదము గాదనుట స్పష్టము. కావున వేదము చదివిననియోగియుఁ శ్రోత్రియుఁడు గావచ్చును. లోక మెఱింగినవైదికుఁడును లౌకికుఁడు గావచ్చును. ఈలౌకికజ్ఞానమున నుభయభాషలయందలి యసాధారణవైదుష్యము ననేకరాజసభలకుఁ బోవుటయుఁ దోడ్పడ వేమో యెఱుఁగరాదు. ఇది యిట్లుండఁగా, లక్ష్మణకవి లౌకికశిరోరత్నత్వమునకు మూలము పుయ్యేరులో జన్మించుట, తన ప్రభువులు నుదారులు ధనులునగు రావువంశపు దొరలతో వివాదపడుట, తనకు సమీపగ్రామమున నున్న జగన్నాథరాజు సభ కనాహూతుఁడై వెళ్లుట, వివాహాదులకుఁ బోయి కవీశ్వరసంభావనలు గొనుట, తన మేనల్లునివైద్యము గొట్టివేసి శంకరమంచియనంతశాస్త్రిని దిట్టుట

బ్రౌనుదొరగారిని స్తుతించుట యనునవియాదిగాఁ గవులచరిత్రమే తెల్పుచున్నది. ఈచరిత్రమే కృష్ణమూర్తికవి శుద్ధశ్రోత్రియశిఖామణిత్వమును గూర్చి యితఁడు తనపాండిత్యమునకు సంతసించిన కాకర్లపూడి వేంకటకృష్ణరాజుగారి వలనఁ బదిపుట్లభూమిని సంపాదించుట, సేతుయాత్రాసందర్భమునఁ గాళహస్తి ప్రభువులగు దామెర వేంకటపతిరాయనింగారిచేఁ గోరఁబడి వారియాస్థానమునఁ జిరకాలము విద్వత్కవిగానుండుట శ్రీపిఠాపురరాజులగు రావు గంగాధర రామారావుగారివలన గొప్పబహుమానమందుట పిదప రావు వేంకటరాయఁడు గారివలన మంచిమాన్యమును సంపాదించుట తరువాత మాడుగల్లుసంస్థానాధీశులగు శ్రీకృష్ణభూపతిగారివలన సంవత్సరమునకు వేయిరూప్యములువచ్చు మాన్యమును గైకొని వారియాస్థానమునఁ గవిపండితశిరోభూషణుఁడై యుండుట మొదలుగా నభివర్ణించినది. దీనిం బట్టి చూచినను జనరంజకము రాజరంజకము నయినపాండిత్యమును లోకజ్ఞానమును గలవిద్వత్కవియెవఁడో లోక మెఱింగిన వారికిఁ దెలియక పోదు. కాకర్లపూడి జగన్నాథరాజు కృతి నందినయెడలఁ దానన్నప్రకారము నాలుగుపుట్లమాన్యమీయవలసివచ్చుననియేదో యొక నెపము వెదకుచుండ నీలక్ష్మణకవిశంకలు దొరకెను గాని యీతనియాక్షేపణమే యాతఁడు కృతినందకపోవుటకుఁ బ్రధానకారణము గాదని యిప్పటికిని గర్ణాకర్ణికగా వినవచ్చును. కావున నిది యాతని నితఁడు జయించుట యని నిష్పక్షపాతబుద్ధిగలసహృదయులు తలంప రనుట నిక్కము. అయిన నాతనిసర్వకామదాపరిణయాదులు సీతనిరావణదమ్మీయమును జదివినవారి కీయిరువురసామర్థ్యము తెలియకపోదు. ఇఁక "మీరుమాలా—బౌమాదిగా, కృష్ణమూర్తికా—అవు లక్ష్మణకవి, మాయింటికి వచ్చునపుడు తలవంచికొని రావలయును—మీదింత తలపంపులకొంప యని నే నెఱుఁగను." ఇత్యాదు లైనలౌకికయుక్తు లే వైన లౌకికశిరోరత్నత్వమును బోషింపఁగలవేమో కాని, వారిశిఖామణిత్వశిరోరత్నత్వములు మాత్రము వైవిధ్యముగా నున్నవి. సందర్భవశమున వచ్చినపైవ్రాఁతయందలి యాథార్థ్య మిట్లెఱిఁగింపవలసివచ్చినది గాని మొత్తముమీఁద సీతని లంకావిజయము చక్కఁగా నేయున్నది. సమకాలికు లను కారణమున నీయిరువురనుబోల్చి విమర్శించుట యుక్తము గాదనియు వారిలో నంత యంతరము

గలదనియుఁ శైవిమర్శనము నభిప్రాయము. అంతియ కాని లక్షణకవియందు వేఱభిప్రాయ మేదియును గాదు. శ్లేషమార్గమును విస్తరింపఁజేసిన యాతఁడున్న భాష కొంతయుపకారము గావించినాఁ డనుట నిర్వివాదము.

ఈగ్రంథ మిదివఱకు 1877-సంవత్సరమునఁ గాకినాడలో ముద్రింపఁ బడినది. ఆముద్రణము తప్పులతో నిండి యుండుటయే కాక యిప్పటి పుస్తకములు లోకములో విశేషముగా వ్యాపించినట్లు గానరాదు. కావున దానిని వ్యయప్రయాసముల కోర్చి సాధ్యమయినంతవఱకు నిర్దుష్టముగా ముద్రించితిమి. వ్యాఖ్యానమును సుబోధక మగునట్లుగాఁ గొంచెము సవరింపఁబడినది. సంగ్రహముగా భావమును వ్రాయఁబడినది. అయిన నెందయిన ముద్రణ లోపము లుండవచ్చును. అట్టివానిని బునర్ముద్రణమున సవరించికొనఁగలము. ఆంధ్ర భాషాభిమానులప్రోత్సాహముచే నీగ్రంథము విశేషవ్యాప్తిని జెందును గాక యని కోరుచున్నారము.

శ్రీరస్తు.



# లంకావిజయము.

(రావణదమ్మీయము).

## పీఠిక.

---

ఇష్టదేవతాదిస్తుతి.

లక్ష్మీ స్తనకుంకుమాంక మొకొ నాఁ
జైత్రాయుధం గౌస్తుభం
బోలిం గ్రాల దయారసం బురివి పై
నుప్పొంగ నా నెమ్మెయిన్
మేలాగందపుఁబూఁత యొప్పఁ దగుల
శ్రీజాని కుయ్యేటికిన్
పాలుం దైహికసౌఖ్యముం బరము శీం
భల్లీల మా కీవుతన్. 1

మ. తనయుద్వాహమునందు శైలసుత మోదస్వాంతయై ను
స్తకం, బున నిం పొందెడు ముత్తియంపుఁదలఁబ్రా లోవ
యంగ భావించి చ, య్యనఁ దాం ప్తిని గంటి నే ననుచు
హాస్యాయత్తుఁ డౌచంద్రుఁ గ, న్గొని హాసం బొనరించుశోంభుఁ 2
డిడు మాకున్నిత్యకల్యాణముల్.

చ. సుమహితశాఖలం దనరి శోభిలుచుండెడునంచితాఖిలా
గమములు జన్మభూము లనఁగాఁ దగుమీవదనంబు లెన్నిచం
దములఁ దలంచిచూచినను దారహితత్వమునొందియుండుట
బ్రమెయనువాణివాక్యచతురత్వము మెచ్చునజుంభజించెదన్.

సీ. హరిరాగసంప్రాప్తి సురుచిరత్వముఁ దాల్చి
కమలాహ్వయంబునఁ గ్రాలురమణి
విధుకరస్పర్శనవికసనంబు వహించి
యిందీవరఖ్యాతి నెసఁగువనిత
చక్రిభోగస్థితి స్వస్థతఁ గైకొని,
యుర్వీసమాఖ్యఁ జెన్నొందుతరుణి
యలగజేంద్రవరదేహానుగుణ్యము నొంది,
పద్మాఖ్యచేతను బ్రబలునతివ

గీ. త్రిజగములతల్లి దివ్యసాధ్వీమతల్లి
యర్ణవవరేణ్యపుత్త్రి సువర్ణగాత్రి
సత్కృపావీక్షణంబున సకలశుభము
లొసఁగి యనిశంబు మముఁ బ్రోచుచుండుఁగాత.

సీ. వరగోత్రజాత యైవఱలినగౌరి యా,
ర్యాభిధానముఁ గాంచు టబ్బురంబె!
సర్వమంగళ నానెసఁగుసతి శివ యన,
విఖ్యాతి నొందుట విస్మయంబె!
హైమవతి యనంగ నలరుచుండునపర్ణ,
సన్నపూర్ణ యనంగ నద్భుతంబె!
కాత్యాయనీసంజ్ఞఁ గాంచునంబిక వృష,
గతికుమారునిఁ బెంపఁగనుట యరుదె!

గీ. యంచు సుమనగకదంబంబు లెంచుచుండ
భాసిలి సమస్తసద్గుణప్రౌఢిమెఱయు
నట్టిసర్వజ్ఞభామిని యస్మదీయ
కామితార్థంబు లీవుతఁ గరుణతోడ. 5

క. అతినిర్మలశుభకరగుణ
వతిని సుధాహారహీరవారవలక్షా
కృతిని సరసిజాతాసన
సతిని సరస్వతిని గొల్తు సమ్మోదమతిన్. 6

ఉ. శ్రీయలరాగ సన్నుతులు సేసి నిరంతరభక్తిఁ గొల్తు దా
క్షాయణిసత్కుమారకు భుజంగమసంచయహారకున్ లస
త్కాయవిభావిశేషజితగైరికుఁ దుండకృతాహికారికున్
న్యాయవిచారసత్పథవిహారువినాయకుఁ గామ్యదాయకున్.

— నవగ్రహస్తోత్రము. —

చ. పరమహిమాధికత్వమును భాసురమైనప్రతాపవృత్తిచే
హారణము నొందఁజేయుచు నయంబలరంగమలానిశప్రమో
దరతిఁ దవర్చి చక్రసహితత్వమున న్వెలుఁగొందుచుండునా
హరిమముఁబ్రోచుఁగావుతదయారసపూరమునించి పెంపుగన్.

మ. ప్రకటంబైనకురంగలాంఛనముతో భాసిల్లి దాక్షాయణీ
సకలాభీష్టఫలప్రదుం డగుచు నాగీశాసామ్యాఖ్యఁ జెన్నొందిపా
ల్చుకుమారుం గని దేహశుభ్రరుచితో శోభిల్లునాసోమనా
మకుఁ డశ్రాంతశుభప్రదాయియగుచున్నమ్ముం గృపంబ్రోవుతన్.

ఉ. మేదురవృత్తి నాకముసమీపమునందు వసించుచుం బ్రవా
ళోదితకాంతితోఁ గడఁగి యొప్పి ద్విజాదిసదాశ్రితాళి కా

మోదమునన్ రుచుల్ దనరఁ బోల్పుగఁ గామ్యఫలంబు లెల్లనం
త్యాదరలీల నిచ్చు మహిజాధికత న్మదిలో నుతించెదన్. 10

మ. ఘనమార్గంబున సంచరించుచు సదా కావ్యప్రియైకాత్ముఁడై
యనయంబున్ బలభద్రుఁడంచును బుధుం డంచున్ సమస్తావనీ
జనము ల్వర్ణనసేయఁ బొల్చియుచితజ్ఞత్వంబునుం గల్గియుం
దనరంగాఁ జనురోహిణేయుని మదాత్మన్ నిల్పి వర్ణించెదన్.

మ. అరయ న్వర్ణనసేతుఁ దారకపదవ్యాక్రాంతవర్తిన్ గురున్
స్ఫురదుత్తుంగబలాతిరేకకలుషీభూతారిజీవున్ ఘనాం
గిరసాఖ్యాతు బుధౌఘపూజితపదున్ క్షేమంకరాంచత్తపో
భరసంతోషితసర్వమానిధిపుణున్ వాచస్పతి న్నార్యునిన్.

ఉ. పుణ్యజనప్రకాండపరిపూజితమంజుపదద్వయాద్భుతా
రుణ్యగుణప్రభావములరూఢిగ శుక్రసమాఖ్యయున్ మహా
ద్గణ్యత మిత్రజాతవిహితంబును గల్గి చెలంగుచుండు న
ప్పుణ్యుఁ గవిన్ ముదంబొదవఁ బొల్పుగ నెమ్మదిలో నుతించెదన్.

క. తనరఁగ నంజలి సేసెద
మనమున హర్షంబుతోడ మార్తాండతనూ
జునికిన్ సద్గుణఖనికిన్
శనికిం బరిపంథిగోత్రసంఘాశనికిన్. 14

క. తమునిం గాఢద్యుతిజితఁ
తముని న్వినివార్యశౌర్యధైర్యాదిగుణో
త్తమునిన్ భాసురమంగళ
తముని న్నుతి సేతు సంతతము నిం పమరన్. 15

క. చేతోవీథిన్ సన్నుతి
సేతు న్విక్రమసమేతు శ్రీకరగుణసం

ఘాతుఁ భవ్యామేయుని
కేతుఁ రిపువిపినధూమకేతుం గేతున్.

సంస్కృతాంధ్రకవిస్తుతి.

సీ. వరతపగపరిపూతు వల్మీకసంజాతు,
సన్మునిస్తుతిపాత్రు శక్తిపౌత్రు
నసమానపదగుంభనానుసారి మురారిc,
గల్పితార్థోల్లాసుc గాళిదాసు
సరసమనోహారాంచత్ప్రబంధు సుబంధు,
సూరిసన్నుతసద్విహారుc జోరు
సతతకావ్యరచనాహితవిచారు మయూరు,
మాన్యితకవితాసమాను భాను

గీ. శ్రీకరాఖిలవిద్యాధురీణు బాణు
మృదువచోమృతదానైకమేఘు మాఘు
మఱియు సంస్కృతసుకవిసమాజములను
మానసంబునc దలcచి నమస్కరింతు.

సీ. ఆర్యవర్యుని నన్నపార్యుని రమ్యయు,
శ్రీరాజిc దిక్కనసోమయాజి
రమణీయసుగుణాభిరాము నాచనసోము,
రసికత్వసాంద్రు నెఱ్ఱసుకవీంద్రు
సకలకవినుతయశస్కరు భాస్కరు,
గీతగుణసమాజుc బోతరాజు
భూనుతవాక్యభాషానాథు శ్రీనాథుc,
బృథుకకవిస్వాంతభీము భీము

గీ. సూక్తిచాతుర్యుఁ బింగళిసూరనార్యుఁ
బ్రీతబుధముఖ్యు నలసానిపెద్దనాఖ్యు
నాంధ్రభాషావిశారదు లైనయట్టి
సకలసత్కవివర్యుల సన్నుతింతు. 18

క. సేవింతు స్వద్గురుని య
శోవిలసితవిమలచిత్తు సురుచిరవిద్యా
ప్రావీణ్యుఁ గీర్తికులజు మ
హావినుతచరిత్రు సయ్యనంతాఖ్యుఁ దగన్. 19

క. కవివరులఁ జూచినంతనె
జవమునఁ బఱతెంచి తఱుమసాగెద రెపుడున్
భువిఁ గవుల మనుచుఁ గొందఱు
తవులగ వారలకు నిడుదు దండంబు తగన్. 20

కవిజన్మస్థానవివరణము.

వ. మజ్జన్మస్థలం బైనకుద్యేరు పురవరం బెట్టి దనిన. 21

మ. పురమధ్యస్థితవిష్ణుదర్పణమొ నాఁ బూర్వాశ నాత్రేయి భా
స్కరి దూతం బురిఁ జేరనీనికరణిం గాలాశమల్లీశుఁ డ
ప్పురలక్ష్మీసఖు లొక్కొనాఁ బడమరం బొల్లమ్మతాళ్ళమ్మ లు
త్తరదిగ్భూమిఁ ద్వారాలకో దుదధిచందం బొప్పఁ గుద్యే
టికిన్. 22

శా. భవ్యక్రోశయుగాతిదూరయమదిగ్భాగస్థమాంసంగతా
చ్ఛవ్యాకీర్ణతరంగశీకరసమంచద్వాతమీనామస
ద్దివ్యద్వీపవతీభవాదిమదిశాత్రేయీసుసంగోల్లస
ద్గవ్యాతిద్వయదూరసంస్థితమహాకల్లోలి కుద్యేరిలన్. 23

శా. దక్షారామపురీవినిర్మితగుహాంతస్థాయి భీమేశసం
జ్ఞక్షోణీధరకార్ముకాంతికవిరాజత్సప్తగోదావరా
శుక్షేమంకరనిర్ఝరానుగతసంశుద్ధోత్తరాశీకకు
ల్యాక్షీణోదకసంయుతాదిమదిశాస్థాత్రేయి కుద్యేరిలన్.

క. ఏటికిఁ బర్వ మొకటఁ గు
ద్యేటికిఁ దరి నత్రినది రహి న్మునిఁగిన వే
ద్యేటికిఁ దత్ఫల మామి
న్నేటికిదిగి మునిఁగినట్లు లెంతయు నొప్పున్. 25

క. కుద్యేరు ధనసమగ్రం
బద్యేరటఁ గట్టి దున్నిరఁట పంటల నిం
డద్యేరు పెన్నుదాల్పులు
పద్యేరుపడంగ భక్తి పరఁగుచు నొప్పున్. 26

### కవివంశప్రకారము.

శా. శ్రీరమ్యోరుతపోగరిష్ఠుఁడు మహర్షిశ్రేష్ఠుఁ డవ్యాజుఁ డా
భారద్వాజుఁడు భూరితేజుఁ డగుచు న్భాసిల్లఁ దద్గోత్రజుం
డై రాజిల్లెను పిండిప్రోలికులవీరామాత్యుఁ డుద్యత్ప్రభా
సారాదిత్యుఁడు నిత్యసత్యుఁడు సమస్తస్తావరస్తుత్యుఁడై.

శా. కుద్యేటం గలపిండిప్రోలుకులు లేకూటస్థుచే నుద్భవం
బయ్యెభ్యున్నతి నొంది రట్టికమనీయాకారనాసత్యు వీ
రయ్యామాత్యు జగన్నుతప్రబలదానౌన్నత్యు సంబోధి రా
ట్ఛాయ్యంఘ్రిద్వయభృత్యుఁ గేవలునిగాఁ జర్చింపఁగా న
ర్హమే. 28

క. విదితయశుం డావీరయ
కుదయించిరి సుతులు సౌమ్యు లురుకీర్తియుతుల్
పెదవేంకటమంత్రియు శా
మ్యదరాతి యగుచిన వేంకటామాత్యుండున్. 29

ఉ. వీరయసూనులందుఁ బెదవేంకటధీమణి వీరభద్రునా
ధీరుఁడు గోపరా జనకృతిన్ మఱి యాతఁడు భద్రిరాజు స
ద్భీరహితాత్ముఁ డిద్దఱును వేంకటరాముని సర్వమంత్రినిన్
వారలు నల్వురేసిగను బాపయముఖ్యులఁ గాంచిరిర్వురున్.

క. పటుతరమతి యగుచిన వేం
కటధీమణిసూనుఁ డమలఘనకీర్తివిభా
పటలీహిమభానుం డు
త్కటదానుఁడు వీరయాభిధానుం డెన్నన్. 31

క. ధీవీరతాదిగుణముల
ప్రోవీరసికుఁ డనఁ బిండిప్రోలికులీనుం
డావీరమంత్రి వెలసెను
సావీరాంధ్రాదిదేశసన్మంత్రులలోన్. 32

క. ఆవీరన పెండ్లాడెన్
భూవినుతగుణావలంబ ముఖనిర్జితరా
కావిధుబింబన్ హారికరు
ణావర్ధితనిజకుటుంబ నరసాంబ నోగిన్. 33

క. వీరనఘు లనఁగ నెగడిరి
వీరనయుఁ బతివ్రతాత్వవిజితోమాదే
వీరనరసాంబయును యదు
వీరనలినశరజననుల విధమున జగతిన్. 34

ఉ. ఆమిథునంబునం దుదయమై విలసిల్లిరి సింగమంత్రియున్
శ్రీమహనీయుఁ డై వెలయు కృష్ణసుధీమణియున్ లసద్యశో
ధాములు దీప్తధామహిమధాములయట్లు విభాకళాఢ్యులై
హైమమహీధ్రమంధరము లట్లు సముంచితధైర్యసారులై.

క. అందగ్రజుండు శాత్రవ
బృందారణ్యానలుఁడు పృథుబలుఁ డురుధీ
బృందారకగురుఁ డతిధృతి
మందరుఁ డన నెగడె సింగమంత్రి నిపుణతన్. 36

క. ఆసింగవిభువరుండుమ
హాసిం గదనమున రిపుల నణఁచును లంకా
వాసిం గకుత్స్థకులజుఁడు
వాసిం గడతేర్చినట్లు వరుస దలిర్పన్. 37

సీ. ప్రకటమా గణపతిరాజువారిజమిాంది,
వాన్గిరీ చేసె నేవరవిభవుఁడు
బహుదేశభూపసభాపూజ్యుఁ డగుచు నం,
దలమెక్కి తిరిగె నేతరణతేజుఁ
డన్నపానీయవస్త్రాదుల నర్థుల,
దృప్తులఁ జేసె నేదీప్తయశుఁడు
సంగీతసాహిత్యసరసవిద్యలకు నా,
శ్రయుఁ డనఁ దనరె నేచతురబుద్ధి

గీ. యతఁడు హరిభక్తుఁ డర్హధర్మానురక్తుఁ
డార్యజనహితుఁ డతులగాంభీర్యయుతుఁడు
చారురూపస్మరుఁడు సదాచారపరుఁడు
రుచిరగుణపాలి సింగనసచివమౌళి. 38

ఉ. మ్రింగఁడు దేవభూసురవరేణ్యధనంబుల నీతిచేత ను
ప్పొంగఁడు సజ్జనుల్ తనదుభూరిగుణంబులు లెక్కవెట్టుచోఁ
లొంగఁడు వైరు లెంద అనిలోన నెదిర్చిన మించె వన్నెవా
సింగఁడు బిండిప్రోలికులసింగఁడు మంత్రులలోన నెంతయున్.

క. ఆతనితమ్ముఁడు బుద్ధివి
ధాత నితాంతసువిభూతి ధరణీధరజా
మాత నిరూఢదయాశ్రీ
నేత నియతిఁ గృష్ణమంత్రి నెగడెం ధరణిన్. 40

సీ. కుయ్యేటి కీశాన్య మయ్యున్నతోరాల,
కోటిచెంత రచించెఁ దోఁట యొకటి
గ్రామస్థపాంథతర్పణమధురోదక,
ప్రప నిజావాసాజిరమునఁ గట్టె
నలఘుపుణ్యక్షేత్రముల దనని క్షేప,
మమరఁ జేసెను రమేశార్పణముగ
నుర్వీసురులకు గృహోపకరణధన,
క్షేత్రాదిదానముల్ సేసె మిగుల

గీ. భూరిదివ్యాలయతటాకములు ఘటించెఁ
గృతిముఖంబున నత్యంతకీర్తి వడసె
మంత్రిమాత్రుఁడె లోకైకమాన్యపిండి
ప్రోలి శ్రీకృష్ణవిభుఁ డుపర్బుధనిభుండు. 41

ఉ. ప్రేమను బిండిప్రోలికులకృష్ణసుధీమణి పెండ్లియాడె శ్రీ
రామను బోలినట్టిదగు రామను సద్వనితాలలామ నా
నామనుముఖ్యతారకసునామనుతిస్ఫుటకామ సద్యశ
స్తోమను వక్త్రకాంతిజితసోమను సద్గుణధామ నున్నతిన్. 42

చ. సరసత నొప్పుకృష్ణునకు సాధ్వికి రామకుఁ దిమ్మమంత్రియున్
స్థిరమతివీరరాఘవుఁడుసింగయయున్ వరదయ్యమంత్రియున్
నెరసయ్యమంత్రిచంద్రుఁడు ననందగు నేగురు పుత్రకుల్ జనిం
చిరి కలశాబ్ధి వేలుపులచెట్టులయ ట్లురుదానశీలురై. 43

మ. ఘనుఁ డాతిమ్మయమంత్రికి త్తమయనం గా నొప్పుభవ్యాం
గనా, జనచూడామణియందుఁ గాంచె సుతులన్ సన్మాన్యుల
న్రామకృ, ష్ణునిఁ దిమ్మయ్యను బుచ్చివేంకటసుధీంద్రున్ బ్రహ్మ
విష్ణ్వీశు లి, ట్లొనరం ధాత్రి జనించి రొక్కొ! యనియా
ర్యుల్ సన్నుతుల్ సేయఁగన్. 44

వ. అందు. 45

మ. దళితామిత్రుఁడు రామకృష్ణసచివోత్తంసంబు శ్రీశాంకరీ
కులకాంతామణియందుఁ గాంచె సుతులన్ గోపాలునిం దిమ్మ
మం, త్రిలలాముఁ ఘనుఁబద్మనాభసచివున్ ధీరత్నము
న్వేంకటా, చలమున్ రామయమంత్రి నేగుర యశస్సం
ఛాదితాశాళులన్. 46

ఉ. శ్రీలుఁడు సత్కృపాళుఁడు హరిస్మృతశీలుఁడు పిండిప్రోలిగో
పాలుఁడు రాజమాంబికయు బాగుగఁ గాంచిరిమమ్ము నల్వురన్
ధీలలితుండు శ్రీతిరుపతిప్రభుచంద్రుని రామకృష్ణునిన్
శ్రీలలనేశ్వరాంఘ్రియుగసేవకు లక్ష్మణు నన్ను రామునిన్.

చ. పెనుపుగ వీరమంత్రి చినవేంకటధీమణిఁ గాంచె వీరమం
త్రినతఁడు సింగకృష్ణులను గృష్ణయ యేగురనందుఁ దిమ్మ
జనఘుల రామకృష్ణముఖులౌ ముగురన్ మఱి రామకృష్ణుఁడిం
పెనయఁగ గోపయప్రభృతు లేగుర గోపయమమ్ము నల్వురన్.

ఉ. వీలుగఁ బిండిప్రోలికులవీరయధీమణి చిన్నవేంకట, శ్రీలలి
తాఖ్యు వీరవిభుఁ గృష్ణుని దిమ్మని రామకృష్ణు గో, పా
లుఁడు రాజమాంబ యనుభామయుఁ గాంచిరి తిర్పతిన్సుధీ,
లాలితు రామకృష్ణునిని లక్ష్మణుఁ డన్నను రాము నల్వురిన్.

వ. అని యిష్టదేవతావందనంబును, నవగ్రహధ్యానంబును, మద్గురుసేవనంబును, సుకవిజనస్తుతియుఁ, గుకవిప్రతారణంబును, మజ్జన్మస్థలం బైనపుర్యేరుపురవర్ణనంబును, మద్వంశసూచనంబునుం గావించి, యే నొక్కప్రబంధంబు నవరసభావార్థలక్షణానుబంధంబుగా నూహించి కల్యబ్దములు ౪౯౫౮ శాలివాహనశకాబ్దములు ౧౭౭౯ ఇంగ్లీషుసంవత్సరములు ౧౮౫౭ ఫసలీ ౧౨౬౭ నగు పింగళసంవత్సరశ్రావణమాసములో రచియింప నుద్యోగించి యున్నసమయంబున.

సీ. పాత్రభారద్వాజగోత్రుఁ డాపస్తంబ,
మునిసూత్రుఁ డగుపిండిప్రోలిరామ
కృష్ణమంత్రికి శాంకరీసాధ్వికిని బెద్ద,
పట్టి శ్రీతిమ్మయపద్మనాభ
వేంకటాచలరామవిభులకగ్రభ్రాత,
కీర్తి సీతారామకృతికి లక్ష్మి
యనుసతికిఁ దనూజ యగురాజమకుఁ బతి
ప్రథితుఁడౌ తిరుపన్న రామకృష్ణ

గీ. నామలక్ష్మణాఖ్యుని నను రాముఁ గన్న
తండ్రి గోపాలమంత్రి సన్మతివిశేష
దేవతామంత్రి ద్యుతిభాసి త్రిదివవాసి
కరుణ నొకనాఁడు నాకలఁ గాన నయ్యె. 51

## కృతికారణము.

క. అటు గనిపించిన నే ను
త్కటసంతోషమున లేచి తత్పదములకుం
బటుభక్తి మ్రొక్కుచు నిటల
ఘటితాంజలి నైన నన్నుఁ గని యి ట్లనియెన్. 52

సీ. ఆరెవెట్టంబన్నయూర నుండెడు రావు,
బుచ్చయ్య నరసమాపుత్రకుండు
దమ్మన్న రా వన ధర్మరాయం డన,
నిరువేళ్ల తోడుత నెసఁగు వెలమ
యరయ భద్రయ్య జగ్గయ్య తమ్మయ్య భా,
వయ్య లన్నలుగురి కగ్రజుండు
పుత్రాదిసంపత్తి బొసఁగునతఁడు మన
కుయ్యేరు ప్రీతితో గుత్తసేసి

గీ. *నీదులంకమాన్యము బల్మిని హరియించెఁ
గానఁ దత్ప్రాప్తికై రామకథయును మన
కథయు జతగాఁగ నర్థంబు ఘటనపఱచి
కృతి రచించి గోపాలున కిమ్ము తనయ. 53

క. మనకుయ్యేరున నెలనిం
బెనఁగొనుగోపాలమూర్తిపేరనె సుమ్మీ
మును నా పే రిడిరోను మ
† జ్జనకుం డటు గాన నతఁడె దైవము మనకున్. 54

క. ఆతనిఁ గృతిపతిఁ జేసిన

---

* 'మనదు లంక మాన్యమ్ము బల్మిని హరించె' అని పాఠాంతరము.

† యతివిచార్యము.

ఖ్యాతి యగుం గార్యసిద్ధి యగుఁ గైవల్యం
బే తుది నబ్బును మనకుల
జాతుల కందఱకు నిది నిజము లక్ష్మణుఁడా! 55

ఉ. కొందఱుశబ్దసౌష్ఠవముఁ గొందఱు భావముఁ గొంద అర్థ
ముం, గొందఱు సంధిసంఘటనఁ గొంద అలంకృతివృత్తిఁ
గొందఱుం, గొందఱు తెన్గు సంస్కృతముఁ గొందఱు చంగ
దముఁ గొంద అన్నియుం, గొందఱు జూతు రెల్లకవికోటి
బళీ యనఁ జేయుమీా కృతిన్. 56

వ. తత్కృతియందు. 57

గీ. లక్ష్మణుండు లంకాపతి లక్ష్మణాగ్ర
జుఁడు కవనచారి గోపాలసూనుఁ డజను
వంశజాతుఁడు రాజాంబవత్స పిండి
ప్రోలికవివరుఁ డనుపేళ్లఁ బొదలు మీావు. 58

క. అని పలికి యమ్మహాత్ముఁడు
సన నే మేలుకొని సంతసము నాశ్చర్యం
బును బటుభక్తియు ముప్పిరి
గొనుమదితో మ్రొక్కి లిడితి గోపాలునకున్. 59

ఆ. అట్లు మ్రొక్కి హితుల కందఱ కీవార్త
సెప్పి యర్థయుగము నేరఁ గబ్బ
మే రచింపవలతినే మున్ను పింగళి
సూరనాదు లైనసుకవు లట్లు. 60

వ. అనిన వార లి ట్లనిరి. 61

చ. గణుతికి నెక్కునట్టి ఘనకావ్యము లొప్పఁగఁ జేయ శాస్త్రవి
ద్గణములు మెచ్చభావములు కల్పన సేయ రసంబు లొప్ప భా

షణముల కర్థగుంభనము సమ్మతిసేయఁగఁ బిండిప్రోలి ల
క్ష్మణకవివర్య నీవె తగుజాణుఁడ వన్యులు నీసమానులే. 62

క. శ్రీమన్నారాయణకరు
ణామహిమప్రాప్తసహజనవరసభావా
ర్థామలవాగ్విలసనుఁడవు
సామాన్యకవీశ్వరుఁడవె చర్చింపంగన్. 63

మ. అనిన న్వారలప్రేరణంబునను ము న్నత్యంతసంప్రీతి మ
జ్జనకుండానతి యిచ్చుటం దుదిని మోక్షంబిప్పుడిష్టార్థముల్
గొనసాఁగంగ నొనర్పు శ్రీవిభునకుం గుయ్యేటిగోపాలదే
వునకీఁ గోరుటఁ జెప్పఁబూనితిసుకావ్యుల్ మెచ్చనీ కావ్యమున్

ఉ. పారములేని రామనరపాలకదేవుకథాసుధాబ్ధితో
గోరిక మత్కథామధురరూపమునుం జతగా రచించుటల్
తోరపుమేల్మిపైఁడిమలతోఁ దగ బంగరుపూదియుం జతం
జేరిచినట్లకాదె బుధశేఖరులార! తలంచి చూడఁగన్. 65

వ. కావున. 66

క. ఒప్పునితోఁచిన మెచ్చుఁడు
తప్పని తోఁచినను జాలఁ దఱచుం డొప్పం
దప్పని యుపేక్షసేయకుఁ
డెప్పుడు నోసుమతులార! యేఁ బ్రార్థింతున్. 67

క. అని బుధుల వేఁడికొని నా
మనమున గోపాలబాలు మాధవు భక్తా
వను దురితదూరుఁ దలఁచుచు
నను మోదముతోడ నమ్మహాదేవునకున్. 68

## షష్ఠ్యంతములు.

క. ప్రకటమహోన్నతనిజమ
స్తకమకుటాగ్రప్రదేశసంస్థాపితర
త్నకిరణనికరధగద్ధగి
తకకుద్భాగునకు భూరితరభోగునకున్. 69

క. కరుణామృతకలితాంతఃక
కరణునకు సురస్థిరతాచ్ఛకౌస్తుభరత్నా
భరణునకుం గల్పిషసం
హారణునకుఁ హాటకాంబరావరణునకున్. 70

క. శ్రితలోకగాఢతరదు
ష్కృతసంచయతిమిరతీక్ష్ణకిరణునకుఁ సరం
తతపాకశాసనాది
క్రతుభుగ్గణవినతభవ్యకరచరణునకున్. 71

క. నవనీతచోరునకు దా
నవమదసంహారునకుఁ గనద్వల్లవమా
నవతీజారునకును ధ్యా
నవదాత్మవిహారునకు ఘనవిచారునకున్. 72

క. సురుచిరసద్గుణజాలున
కురుతరమృగనాభితిలకయుతఫాలునకుఁ
శరధిసుతాలోలునకుఁ
గురుకీర్తివిశాలునకును గోపాలునకున్. 73

వ. సమర్పణంబుగా నాయొనర్పంబూనిన లంకావిజయం బను
ద్వ్యర్థిప్రబంధంబునకుం గథాప్రారంభం బెట్టి దనిన. 74

# లంకావిజయము

## ప్రథమాశ్వాసము.

### కథాప్రారంభము.

ఆ. అమరు సకలలోకసమితి కు య్యేరీతి
రహితముగను సిరి కిరవును విబుధ
విలసితంబు నగుచు విపులం బయోధ్య య
నునగరము సురపురి ననుకరించి. 1

[ఈపద్యము మొదలు రెండర్థములు వచ్చునట్లు చెప్పుచున్నాఁడు. నియమప్రకారము మొదటియర్థమున రామకథయును, రెండవయర్థమున లంకమాహాత్మ్యము ధర్మగాపు హరించుట మొదలగు లక్ష్మణకవిపక్షమైన యర్థమును దోఁచుచుండును.]

ప్రాథమార్థము.—సకలలోకసమితికున్ = సకలజనసముదాయమునకు ఒక్క మొత్తి, ని. "లోకస్తుభువనే జనే" అని యమరము. ఏరీతిన్ = ఏప్రకారము చేతను, రహితముగను = లేనట్లుగా, ఇక్కడఁ గుయ్యిశబ్దములోని యికారమునకు "కిమాదికస్యేతః" అను సాంధ్రశబ్దచింతామణి సూత్రము చేత లోపము. సిరికిన్ = లక్ష్మికి, ఇరవును = స్థానమును, విబుధవిలసితంబును = పండితులచేఁ బ్రకాశింపఁ జేయఁబడినదియును, అగుచు = ఒప్పుచు, విపులంబు = విశాలమైన, అయోధ్యయను = అయోధ్యయను పేరుగల, (ఇచ్చట, అనుశబ్దములోని అకారమునకు, ఆం. శ. చిం. "యత్రశ్రుతిమార్యా లఘుయం ప్రవదంతి" యను సూత్రమువలన యకారము.) నగరము = పట్టణము, సురపురిని = అమరావతిని, అనుకరించి = పోలినదియై, అమరున్ = వెలయును,

తా. జనులకు సౌఖ్యకరమయినది, సంపదలచే నొప్పునట్టిది, విబుధులు గలిగి స్వర్గముంబోలినది యయోధ్యయనుపట్టణ ముండెను.

లక్ష్మణార్థము.—(అనఁగా లక్ష్మణకవిపక్షమున వచ్చునర్థము)సకలలోక సమితి-సకల=విద్యలలోఁగూడఁగొనిన, లోక=జనమునకు, సమితి=సభాస్థానమైన, "సంఘే సభాయాం సమితిః" అని యమరము. కుర్యోరు=కుర్యోరను గ్రామము, ఈతిరహితముగను=ఈతిబాధలు లేనిరీతిని, "అతివృష్టి రనావృష్టి ర్మూషికా శ్శలభా శ్శుకాః, అత్యాసన్నాశ్చ రాజానః షడేతే ఈతిబాధయః" సిరికి=సంపత్తికి, లక్ష్మికి, ఇరవును=నివాసస్థానమును, విబుధవిలసితంబును = పండితులచేఁ బ్రకాశింపఁజేయఁబడినదియును (విబుధశబ్దమున దేవతలనియైనఁ జెప్పవచ్చును), అగుచు, విపులన్=భూమియందు "విపులాగహ్వరీ ధాత్రీ" యని యమరము. విపులశబ్దములోని దీర్ఘమునకు, ఆం. శ. చిం. "దీర్ఘాణాం హ్రస్వస్యాత్" అను సూత్రముచే హ్రస్వమైన-ప్రథమమీఁద - ఆం. శ. చిం. "కూర్చిలను నయో భవేద్ద్వితయ్యాతు" అనుసూత్రముచే నుకారమురాఁగా ఆం. శ. చిం. "బిందుం ప్రవదంతి తం క్వచిత్కేచిత్" అను సూత్రముచే బిందువురాఁగా, "ఇతరత్ర చద్వితీయా" అనుసూత్రముచే సప్తమ్యర్థము వచ్చినది.] పయోధ్యయను-పయోధి=సముద్రము, అయను=స్థానముగాఁ గల విష్ణువుయొక్క, పా "ఇకోయణచి" యనుసూత్రము ఇచ్చట "పరుషాద్ద్రుతప్రకృతికాత్సరళాస్యుః"అను ఆం.శ.చిం. సూత్రముచేఁ బత్వము వచ్చినది. పయోధ్యయను, అను ద్వితీయకు "షష్ఠిభవేద్ద్వితీయాతుల్యా" అనుసూత్రమువలన షష్ఠ్యర్థము వచ్చినది. నగరము=వైకుంఠము(పయోధ్యయనునగరము=వైకుంఠము), "నిరమో మహాతాం లుక్చస్యాత్"అను సూత్రముచే నుకారలోపము. సురపురిని=స్వర్గపట్టణమును, అనుకరించి=పోలి, అమరు=ప్రసిద్ధమగును.

తా. పండితులు గలిగినది, ఈతిబాధలులేనిది, సిరిసంపదలుగలది, వైకుంఠమును స్వర్గమును మించినది కుర్యోరను గ్రామము గలదు.

ఆ. తత్పురమున నియతి దశరథకుంభినీ
పతి భటాశ్వముఖ్య బలచయాప్తిఁ
దగు మహీపతిసమితిఁ దనపేరు వెలయ గో
పాలమంత్రి బుద్ధిపటిమ నమరు. 2

రాఘ.——తత్పురమున = ఆయయోధ్యాపట్టణమున, నియతి=నియమమున, దశరథకుంభినీపతి=దశరథమహారాజు, భటాశ్వముఖ్యబలచయాప్తిఁ దగు మహీపతిసమితిన్ = చతురంగబలయుతరాజసముదాయమునందు, తన పేరు వెలయన్=తనపేరు ప్రసిద్ధికెక్కునట్లు, గోపాలమంత్రిబుద్ధిపటిమన్ - గోపాల=ఇంద్రునియొక్క, మంత్రి=బృహస్పతియొక్క, బుద్ధిపటిమన్ = బుద్ధిపటిమవంటి బుద్ధిపటిమచేతను, "స్వర్గేషు పశు వాగ్వజ్ర దిఙ్నేత్ర ఘృణి భూజలే, లక్ష్యదృష్ట్యా స్త్రియాం పుంసి గౌః" అని యమరము. అమరును.

తా. ఆపట్టణమునఁ దశరథుఁడను రాజు గలఁడు. బుద్ధిని బృహస్పతి వంటివాఁడు. చతురంగబలము గలవాఁడు.

లక్ష్మీ.——తత్పురమున=ఆకుయ్యేటియందు, నియతిదశ=నియమావస్థచే రథకుంభినీపతిభటాశ్వముఖ్యబలచయాప్తిన్ = రథములు, పురుషగజములు (మగయేనుఁగులు), భటులు, అశ్వములు మొదలగు బలసముదాయముచేతను, తగు=ఒప్పునట్టి, మహీపతి=మహీపతిరావుయొక్క, సమితిన్=సభయందు, తన పేరు వెలయన్, గోపాలమంత్రి=గోపాలుఁడను నియోగి, బుద్ధిపటిమన్= అతిశయమైన బుద్ధికలిగి, అమరున్.

తా. కుయ్యేరను గ్రామములో, మహీపతిరావను సంధివిగ్రహిసభలో గోపాలమంత్రి యనుబ్రాహ్మణుఁడు గలఁడు.

క. ఎన్న మహాభోగరమా
భ్యున్నతి దనుజారిపిండిప్రోలివిభుఁ డనఁగ
సన్నయుఁ డాగోపాలుఁడు
వన్నెయు వాసియును గల్గి వర్తిలె ధరలోన్. 3

కుండు - దేవలోకపటుచేతోహర్ష = దేవతల సంతోషమును, దా = ఖండించు నట్టి, అహీన - (అహి+ఇన) అహి = క్షుద్ర శత్రువులలో, ఇన + ప్రభువు లగు తిమిధ్వజాదిరాక్షసులను, దాన = కొట్టివేయుటయందు, నిరూఢ = తప్పి పోవని, ఉజ్జ్వల = వాఁడిగల, పత్త్రికుండు = బాణములు గలవాఁడు, అతఁడు = ఆదశరథుఁడు, సన్మాన్యుండుగాక, యల్పుఁడా! కాఁడనుట. "అహిర్వృత్రే క్షుద్రశత్రౌ" అనియు, "ఇనస్సూర్యే ప్రభౌ" అనియు నమరము.

తా. ఆదశరథుఁడు పూర్వము తన సూర్యవంశస్థులైనరాజులందఱి కంటె మంచివాఁడను పేరునుసంపాదించినాఁడు. శిష్టరక్షణమునందునిపుణుఁడు.

లక్ష్మ.—తనభాస్వత్కులమందు = తన ప్రకాశించెడు వంశమందు, ఆద్యులగు = ఆద్యులైన, మేధాశాలి సద్రాజులందునను - మేధా = బుద్ధిచే, శాలి = ప్రకాశించినవారు అయిన, సద్రాజులందునను = (సత్ + రాజ = సజ్జన సముదాయము) సత్పురుషపంక్తులయందు, రాజన్ శబ్దమునకు "ఉద్వహాలేర్వే" యనుసూత్రముచే నుత్వము. ప్రబలుం డితం డని, జనుల్, స్తోత్రంబు సేయంగ, పొందు, సొసంగున్, మహీదేవ... పత్త్రికుండు - మహీదేవలోక = బ్రాహ్మణసముదాయమునకు, పటుచేతోహర్షదా = సమర్థమైన మనస్సంతోషమును గావించెడు, అహీన = తక్కువ కాని, దాన = దానములయందు, నిరూఢ = రూఢము చేయు, ఉజ్జ్వల = స్పష్టమయిన, పత్త్రికుఁడు = దానపత్త్రములు గలవాఁడు, అతఁడు = ఆమంత్రి, సన్మాన్యుండుగాక, యల్పుఁడే!

తా. ఆగోపాలమంత్రి తనపూర్వులకంటె బుద్ధిమంతుఁ డను పేరు వడసెను. బ్రాహ్మణులకు భూదానాదిదానములు చేయుచుండెను.

ఆ. సరభసముగఁ బూని పరులజీవనములు
పిండి ప్రోలివారి నిండువేడ్క
నొందఁ జేసె నాతఁ డుదయించినది మొద
ల్గాఁగ నతని నెన్నఁగా వశంబె. 5

రాఘు.—అతఁడు, ఉదయించినది మొదల్గాఁగన్ = పుట్టినది మొదలుకొని, సరభసముగన్ = వేగముతో, పూని = పట్టుపట్టి, పరులజీవనములు = శత్రు,

ప్రాణములను, పిండి=పిండి వైచి, ప్రోలివారిన్=పురవాసులను, నిండు వేడ్క-
నొందఁ జేసెన్=మిక్కిలి యానందింపఁజేసెను. అతని, నెన్నఁగా, వశంబె!

తా. శత్రువులను సంహరించి జనులను సంతోషపెట్టుటకే యాతఁడు పుట్టినది మొదలు యత్నించెను.

లక్ష్మి.—సరభసముగ=సంతోషముతో, పూని, పరులజీవనములు=అన్యులజీవనములను, పిండి ప్రోలివారిన్, నిండు వేడ్కన్, పొందఁ జేసెను, (పుట్టినది మొదలు చేసికొని) అతని, నెన్నఁగా, వశంబె, పొగడఁ దరముకాదని భావము.

తా. గోపాలమంత్రి పుట్టినది మొదలు, పిండి ప్రోలివారిని యితరులను సంతోషపెట్టెను.

క. గణుతింతు రెపుడు నాతని
గుణములు సత్కృతులలోను గోవిదులు సుధీ
గణకవితతులందున ను
ల్బణతం గనువిద్యల న్వలంతియగుటచేన్. 6

రాఘ.—గోవిదులు = విద్వాంసులు, సుధీగణకవితతులందునన్ = విద్వత్కవిసముదాయమునందును, ఉల్బణతంగనువిద్యలన్ = అతిశయించిన విద్యలయందు, వలంతియగుటన్=సమర్థుఁడగుటను, అతనిగుణములు=ఆ దశరథునిగుణములు, సత్కృతులలోను=రామాయణాది సత్కావ్యములలో, ఎపుడున్=ఎల్లకాలమును, గణుతింతురు=ఎన్నుదురు.

తా. దశరథుఁడు విద్యావంతుఁ డని యాతని గుణములను రామాయణాదిగ్రంథములలోఁ బొగడుచుండిరి.

లక్ష్మి.—గోవిదులు, సుధీ...లందున్ - సుధీ=మంచిబుద్ధిగల, గణకవితతులందున్=కరణముల సముదాయములోను, సత్కృతులలోను=యోగ్యులగు పేర్వరులలోను (సత్+కృతులు), "సత్యేసాధౌవిద్యమానే ప్రశస్తేభ్యర్హితే చసత్" అని యమరము. ఆతనిగుణములు = ఆగోపమంత్రిగుణములు, ఎపుడును, గణుతింతురు. ఏల? ఉల్బణతంగనువిద్యలన్, వలంతి, యగుటచేతన్.-

తా. బుద్ధిమంతులగు కరణములలో, యోగ్యజనులలో నధికుఁడనియు గోపాలమంత్రి గుణములను గొనియాడుచుందురు.

భుజంగప్రయాతము. హరించెం దగన్ దుర్జనాత్మానురక్తిన్
భరించెన్ రమానాథపాదాబ్జభక్తిన్
వరించెన్ జనంబెల్ల వర్ణించుయుక్తిన్
ధరించెన్ మహామంత్రతంత్రాదిశక్తిన్. 7

తా. దుర్మతుల యతిశయమును హరించెను. విష్ణుభక్తిని భరించెను. జనులందఱుఁ దన్నుఁ బొగడునట్టిదగు నుపాయమును గలిగియుండెను. మంత్రతంత్రములయొక్క శక్తిని ధరించెను.

ఈపద్యమున రెంటికి సమానార్థము.

గీ. అతఁడు రాజమందారాచ్ఛవితతకీర్తి
వంశశుక్తిముక్తామణి వరుస శోభఁ
గ్రాలువారి ముగురఁ గాళికాసమాన
వేణికల సమ్మదంబొప్పఁ బెండ్లియాడె. 8

రాఘ.—రాజమందారాచ్ఛవితతకీర్తి - రాజ=చంద్రునివలె, మందార=కల్పవృక్షమువలె, అచ్ఛ=స్వచ్ఛమైన, వితత=విస్తారమైన, కీర్తి=యశస్సుగలవాఁడును, వంశశుక్తిముక్తామణి=కులమను ముత్తెపుఁజిప్పకు మణియుఁ(నైన), అతఁడు=ఆదశరథుఁడు, కాళికాసమానవేణికలన్ = మేఘపఙ్క్తితో సమానమైన జడలుగలవారిని, శోభఁగ్రాలువారిన్ = సౌందర్యముచేఁ బ్రకాశించువారిని, ముగురన్=ముగ్గురు కన్నెలను, వరుసన్=క్రమముగా, సమ్మదంబొప్పన్, పెండ్లియాడె. "మేఘజాలేపి కాళికా" యని యమరము.

తా. ఆదశరథుఁడు యశస్సు, సత్కులము, సౌందర్యము గల ముగ్గురు కన్యలను బెండ్లియాడెను.

లక్ష్మి.—అతఁడు=గోపాలుఁడు, రాజమన్=రాజమ్మయను పేరుగల, తారాచ్ఛ=నక్షత్రములవలె స్వచ్ఛమైన (ముత్యాలవలె నని యైన)దానిని, వితతకీర్తి

వంశశు క్తిక_విశ్రుత=ప్రసిద్ధమైన, కీర్తి=కీర్తియను నింటిపేరుగల,వంశ=కులమ నెడు, శుక్తి=ముత్తెపుఁజిప్పను, ముక్తామణివరుసక=ముత్తెముభంగిని, శోభఁ గ్రాలు=శోభయతిశయించిన, వారిము... వేణికక_వారిముక్=మేఘములయొక్కయు, ఉరగ=సర్పములయొక్కయు, అళికా=పఙ్క్తితో, సమాన=సమానమైన, వేణికక=జడగలదానిని, సమ్మదంబొప్పఁ బెండ్లియాడెక=సంతోషపూర్వకముగ వివాహము చేసికొనియెను.

తా. గోపాలమంత్రి ,కీర్తియనునింటి పేరుగలవారి వంశమాణిక్యమయిన రాజమ్మ యను సుందరాంగిని వివాహము చేసికొనియెను.

వ. మఱియు. 9

అర్థము రెంటికి సమానము.

సీ. సరసరామాజనవరకోసలేశజ,
యాత్మహర్షముగ మాటాడు మనును
గైక రమ్మా నను గదియించి మది నాత్మ,
భూలీలఁ బ్రోవు మం చోలిఁ బల్కు
స్తోత్రార్హభావ సుమిత్రాబ్జనయన న,
న్నాదరించు మటంచు నాశ్రయించు
నట్లు రహస్యంబునం దాత్మదేవుల
నిష్టార్థసిద్ధికై యెపుడు వేఁడు

గీ. నవఘుఁ డతఁ డజసంతతిఘనుఁడు ధైర్య
మునను గాంభీర్యమున నీతి భూతిఁ గీర్తి
మూర్తి మానముననుఁ దానమున ద్యుతి మతి
శాంతి దాంతి నరయ నెందు సవతులేక. 10

రాఘ.—సరస...లేశజ-సరస=రసికురాండ్రయిన, రామాజన=స్త్రీలలో, వర=శ్రేష్ఠురాలవైన, కోసలేశజ=కోసలరాజపుత్త్రి! ఆత్మహర్షముగ=మన

ప్పనసంతోషముగ, మాటాడుము=పల్కుము, అనును = కోరును. కైక=కేకయరాజపుత్రీ! రమ్మా=ఇందురమ్ము, ననున్, కదియించి = కౌఁగిలించి, మదిన్, ఆత్మభూలీలన్ = మన్మథలీలయందు, ప్రోవుము=రక్షింపుము. అంచున్, ఓలి=వరుసఁగా, పల్కున్=అనును. స్తోత్రార్హభావ=స్తుతింపఁదగినభావముగల, సుమిత్రాబ్జనయన = సుమిత్రయను సుందరీ, నన్ను, ఆదరించుము. ఆటంచున్, ఆశ్రయించున్=చేరును. అట్లు, రహస్యంబునందు, ఆత్మదేవులన్=తనభార్యలను, ఇష్టార్థసిద్ధికై=కోరికఁ దీరుటకై, ఎపుడున్, వేఁడున్, అనఘుఁడు = పాపరహితుఁడు, అతఁడు (దశరథుఁడు), అజసంతతి = అజమహారాజు కొడుకు, ఘనుఁడు=గొప్పవాఁడు, ధైర్యముననను, గాంభీర్యమున, నీతిన్, భూతిన్ = ఐశ్వర్యమున, కీర్తిన్, మూర్తిన్=ఆకారమున, మానమునను=పౌరుషమున, దానమున, ద్యుతిన్=కాంతిచే, మతిన్=బుద్ధిని, శాంతిన్=కామక్రోధాదిరాహిత్యమున, దాంతిన్=తపఃక్లేశాదులనోర్చుటయందు, అరయన్=వెదుకఁగా, ఎందున్=ఏతావునను, సనతులేక=ఈడు లేనివాఁడుగానుండి (వక్ష్యమాణవచనముతో నన్వయము).

తా. దశరథుఁడు కౌసల్యా నాతో సంతోషముగ మాటాడుము. కైకా నన్ను గదియుము. సుమిత్రా నన్నాదరించుమని రహస్యమున భార్యలను వేఁడును. ధైర్యగాంభీర్యదానాదుల నతని కొరును సమానులు లేరు.

లక్ష్మ.—సరస=సరసుఁడా! రామా! జనవర=రాజా! కోసలేశ! జయాత్మ = జయస్వభావముగలవాఁడా! ఆత్మహర్షముగ మాటాడుము అనును. కై = చేయి, కరమ్ము = చేయిని, అనను = అనునట్లు, కదియించి = కూర్చి, మదిని, ఆత్మభూ=బ్రహ్మదేవుఁడా! లీలఁబ్రోవుము = విలాసముగా రక్షింపుము. అంచు, ఓలిన్, పల్కున్=కొనియాడుననుట. స్తోత్రార్హభా=స్తుతించుట కర్హమైనకాంతిగల, వసుమిత్రాబ్జనయన = అగ్నియు, సూర్యుఁడు, చంద్రుఁడును నేత్రములు గలవాఁడా! నన్నాదరించుమటంచున్, ఆశ్రయించున్ = శివుని భజించును. (వసు=అగ్ని, మిత్ర=సూర్యుఁడు, అబ్జ=చంద్రుఁడు) "దేవభేదేన వే రశ్మౌ వసుః" అమరము. అట్లు, రహస్యంబునన్ = మనస్సులోననుట. ధ్యాన

విశేషమునందు, ఆత్మదేవులన్ = తనయిష్టదేవతలను, అజసంతతిఘనుఁడు = బ్రాహ్మణశ్రేష్ఠుఁడు (అజ=బ్రహ్మ, సంతతి=కులము), ఇష్టార్థసిద్ధికై, ఎపుడున్, వేఁడున్, అతఁడు, అనఘుఁడు, ధైర్యమునను...... నెందునవతులేక. (ముందఱికన్వయము.)

తా. గోపాలరామా! నన్ను రక్షింపుము. బ్రహ్మదేవుఁడా! కరుణించుము. ఈశ్వరా! యాదరింపుము. అని యాత్మదైవతములను బ్రార్థించును. ఎందును నతని కితరు లీడురారు.

వ. ఇవ్విధంబున నిచ్ఛానువర్తనంబులు బ్రవర్తిల్లుచు నొక్కనాఁడు. 11

దీనియర్థము రెండుపక్షముల స్పష్టము.

చ. అతులితరూపనిర్జితసుమాంబకుఁ డాతఁడు సర్వలోకస
మ్మతిని సుమంత్రముఖ్యు లగుమంత్రులగోష్ఠి గురూపదేశసం
గతిఁ దనయాలినొందు మదిఁ గాంక్షఁ దనర్చి సదధ్వరక్షణా
దృతినిబురోహితున్సుమతిధీరునిశాంతవరుం బ్రియాన్వితున్.

రాఘ.—అతు...సుమాంబకుఁడు - అతులిత = ఉపమానరహితమైన, రూప = సౌందర్యముచే, నిర్జిత = జయింపఁబడిన, సుమాంబకుఁడు = పుష్పాస్త్రుఁడు (మన్మథుఁడు) గల, అతఁడు = దశరథుఁడు, సుమంత్రముఖ్యు లగు మంత్రులగోష్ఠిన్, గురూపదేశసంగతిన్ = వసిష్ఠోపదేశమున, సర్వలోకసమ్మతిని = సర్వజనుల సమాధానముతో, తనయాలినొందు = పుత్రసముదాయమును గనునిమిత్తమై, సదధ్వరక్షణాదృతిని-సత్ = శ్రేష్ఠమైన, అధ్వర = యజ్ఞమనెడు, క్షణ=ఉత్సవమునందలి, ఆదృతిని = ఆదరణముచే, పురోహితున్-పురా = ఇంతకుముందే, ఊహితున్ = ఊహింపఁబడియున్న, శాంతవరున్ = శాంతాదేవీభర్తయైన ఋష్యశృంగుని, ప్రియాన్వితున్ = భార్యాసహితుని.

తా. ఆదశరథుఁడు సుమంత్రాదిమంత్రులతో నాలోచించి సంతానము కలుగుటకై యొకయజ్ఞము చేయవలయు నని శాంతపెనిమిటి యగు ఋష్యశృంగుఁడను మునీంద్రుని (పిలిచెను).

లక్ష్మ.—ఆతఁడు = గోపాలమంత్రి, అతులితరూపనిర్జితసుమాంబకుఁడు, సుమంత్రముఖ్యులగు=సుష్ఠువులైన యాలోచనములు ముఖ్యముగాఁ గలిగిన, మంత్రులగోష్ఠిన్ = నియోగుల గోష్ఠిలో (గోష్ఠి=సభ), గురూపదేశసంగతిన్=గురువులుపదేశించినరీతిని, తనయాళిన్=తనభార్యను, ఒందు=పొందుకొఱకు, సదధ్వరక్షణాదృతిని-సదధ్వ=మంచిమార్గముగలవానిని, రక్షణ=రక్షించుటయందైన, ఆదృతిని=ఆదరణముచే, శాంతవరున్ = శాంతులలో శ్రేష్ఠుఁడయిన, ప్రియాన్వితున్ = ఇష్టముతోఁ గూడిన, పురోహితున్ = పురోహితుని.

తా. పెద్దలు చెప్పినరీతిని, తనవారియనుమతిపై పునస్సంధానకార్యము జరగించుకొనవలయునని శాంతుని బుద్ధిమంతుని బురోహితుని (వరించెను.)

వ. ప్రార్థనాపూర్వకంబుగా రప్పించి యతనికిం దగువిధంబునం
బూజలొనర్చి. 13

అర్థము రెండింటికి స్పష్టము.

ఉ. ఆప్తత గానిపింపఁ దనయాశయముం దెలియంగఁ జేసి త
త్ప్రాప్తికిఁ దొల్తనోయనఘ భవ్యశుచిక్రియ యుష్మదాత్మని
క్షిప్తములైనమంత్రములఁ జేయుము మన్యువుఁ బాపహారి ధ
ర్మాప్తినొనర్ప నాకు గురువారయ నీవ యటంచుఁ బల్కుచున్.

రాఘ.—ఆప్తత = స్నేహభావము, కానిపింపన్ = తోఁచునట్లు, తనయాశయమున్ - (తనయ+ఆశయము) తనయ=పుత్రులను గూర్చిన, ఆశయమున్ = అభిప్రాయమును, తెలియంగఁ జేసి, తత్ప్రాప్తికిన్=ఆతనయులు గలుగుటకు, తొల్తన్ = ప్రథమమున, ఓయనఘ, భవ్యశుచిక్రియన్ - భవ్య=ఉత్తమమైన, శుచిక్రియన్=అగ్నికార్యము (హోమము మొదలైనది), యుష్మదాత్మనిక్షిప్తములైన మంత్రములన్ - యుష్మత్ = నీయొక్క, ఆత్మ=మనస్సులో, నిక్షిప్త = ఉంచఁబడిన, మంత్రములన్ = మంత్రములచేత, మన్యువున్ = యజ్ఞమును, చేయుము. పాపహారి = పాపమునడంచి,

ధర్మాప్తినొనర్పన్ = ధర్మమును బొందునట్లొనర్చుటకు, నాకు, అరయన్, గురువు, నీవ=నీవే, అటంచున్, పల్కుచున్.

తా. ఋశ్యశృంగమునీంద్రా! మీరలే నాకు గురువులు, పుత్రులు కలుగునట్లనుగ్రహించి యొక పాపహారియైన యజ్ఞకార్యమును జేయుమని కోరెను.

లక్ష్మి.—ఆ ప్తత, కానిపింపన్, తనయాశయమున్ = తనయభిప్రాయమును (తన + ఆశయము) దెలియంగఁ జేసి, తత్ప్రాప్తికిన్ = తనయభిప్రాయమును పొందుటకు, తొల్తన్, ఓయనఘ = ఓపాపరహితుఁడా! భవ్యశుచిక్రియన్ = ఔపాసనాదికమును, మన్యువుఁబాప = కోపమును బోఁగొట్టుకొఱకు, హారిధర్మాప్తికిన్ = మనోహరమైన పుణ్యప్రాప్తిని, ఒనర్పన్ = ఒనరించుటకు, యుష్మదాత్మ...మంత్రములన్, జేయుఁడు ఆరయ, నాకు, గురువు, నీవ, యటంచున్, పల్కుచున్.

తా. గోపాలమంత్రి, పురోహితునితోఁ దనయభిప్రాయముం జెప్పి ఔపాసనాదిక్రియలు చేయించుమనియెను.

వ. అతని నొడంబఱిచి. 15

అర్థము రెండుతావుల స్పష్టము.

గీ. తదనుమతి నొక్కశుభముహూర్తమున దార
సహితముగఁ బూతమంగళస్నాన మొగి నొ
నర్చి సముచితకృత్యమంతయును నడపె
శుచిగురుసపర్య మున్నుగాఁ బ్రచురవిధిని. 16

రాఘ.—తదనుమతిన్ = ఋశ్యశృంగునియిష్టము ననుసరించి, ఒక్కశుభముహూర్తమున, దారసహితముగన్ = భార్యలతోఁ గూడ, పూతమంగళస్నానము, ఒగిన్ = క్రమముగ, ఒనర్చి = చేసి, ప్రచురవిధిని = ప్రకటప్రకారముగ (స్పష్టముగ), శుచిగురుసపర్యమున్నుగాన్ = శుచిర్భూత

క, గురుపూజ మొదలుకొని, కృత్యము=చేయఁదగినదానిని, అంతయుంక,నడపెక=జరగించెను.

తా. ఋష్యశృంగుఁడు చెప్పినట్లు శుభముహూర్తమున మంగళస్నానముచేసి భార్యలతోఁ గూడి దానికిఁదగినవిధానము నడపెను.

లక్ష్మి.—తదనుమతిక=ఆపురోహితునియిష్టముచొప్పున, శుచిగురుసపర్యమున్నగాక-శుచి=అగ్నిహోత్రుని, గురు=గురుని, సపర్య=పూజ, మున్నగాక=ముందుగా, తక్కినది సామాన్యముగానున్నది.

తా. ఒక్కసుముహూర్తమునఁ బురోహితుఁడు చెప్పినట్లు భార్యలతోఁ గూడ, స్నానముచేసి యగ్నికార్యాదు లొనర్చెను.

వ. తదనంతరంబ. 17

సీ. శాంతాంచితద్విజసన్మనూజ్జ్వలఘనా,
ధ్వరచితగతివిభావసుఁడు వెలుఁగ
నప్పుడు తన్మధ్యమందుండి దివ్యభూ,
షణభూషితుఁడు సులక్షణయుతుండు
నగుచు నొప్పారుకృష్ణాభిఖ్యఁ దగుదివ్య,
పురుషుఁడు దృష్టిగోచరత నొంద
నంత నాగోపాలుఁ డతిభక్తిఁ గేల్మోడ్చి,
చున్నవరవిభాప్రసన్నమూర్తి
ఆ. భవ్యపరమభక్తపాత్రి కాలసదరు
శ్రీకరస్థిత శుభకృద్గతియను
గుణమహిమయుతుండు గురుబుద్ధి యాతఁడు
హితతఁ జేరి పేర నతనిఁ బిలిచె. 18

రాఘ —శాంతాం—గతి-శాంతాంచితద్విజ=శాంతాదేవితోనొప్పుచుండినఋష్యశృంగునియొక్క, సన్మనూజ్జ్వల=సన్మంత్రములచేఁ బ్రకాశిం

చెడు, ఘనాధ్వర=పుత్రకామేష్టియందు, చితగతి=వ్యాపించినగతిగల,విభావసుఁడు=అగ్నిహోత్రుఁడు, వెలుఁగన్, అప్పుడు, తన్మధ్యమందుండి=ఆయగ్నిలోనుండి, కృష్ణాభిఖ్యుఁడగు=నీలవర్ణముగల, దివ్యపురుషుఁడు = ప్రాజాపత్యపురుషుఁడు, దివ్యభూషణభూషితుఁడు, సులక్షణయుతుండు, దృష్టిగోచరతనౌందర్ =కనఁబడఁగా,అంతన్,ఆగోపాలుఁడు=నరపాలుఁడు,అతిభక్తిన్=మిక్కుటమైనభక్తితో, శ్రేల్మోడ్చుచున్న న్=నమస్కరించుచుండఁగా, పరివిభా ప్రసన్నమూర్తి=శ్రేష్ఠకాంతిచే నిర్మలమైనయాకారముగల, భవ్య...స్థితి-భవ్య=శుభప్రదమైన,పరమభక్తపాత్రికా=పరమాన్నపాత్రతో (భక్తం=అన్నము, పరమ+భక్త=పరమాన్నము), "భిస్సా స్త్రీ భక్తమంధోన్న" అమరము.లసత్=ప్రకాశించుచున్న, ఉరుశ్రీ=గొప్పశోభకల,కరస్థితి=చేతులయొక్కస్థితిగలిగినట్టియు, శుభకృద్గతి=శుభముచేసెడునడకగలిగినట్టియు,అనుగుణమహిమయుతుఁడు=తగినమహిమతోఁగూడినట్టియు, గురుబుద్ధి=శ్రేష్ఠబుద్ధిగల, ఆతఁడు=అప్పురుషుఁడు, హితతన్=స్నేహభావముగ,చేరి=సమీపించి, పేరన్=పేరుపెట్టి, (దశరథుఁడాయని) అతనిన్, పిలిచెను.

తా. ఋష్యశృంగుఁడు చేయించుయజ్ఞమునం దగ్ని ప్రజ్వరిల్లుచుండ నందుండి యొకదివ్యపురుషుఁడు నల్లని మేనివాఁడు వెలువడెను.దశరథుఁడాతనికి భక్తిపూర్వకముగ నమస్కరించుచుండఁగా నొకపాయసపాత్రఁ జేతఁబట్టుకొని యాదివ్యపురుషుఁడు దశరథునిఁ బిలిచెను.

లక్ష్మ.—శాంతాం...గతి-శాంతా=శాంతముచే,అంచిత=పూజ్యులైన, ద్విజ=బ్రాహ్మణుల, సన్మను=సన్మంత్రములచే, ఉజ్జ్వల=ప్రకాశించెడువాఁడుకావున నే,ఘనాధ్వ=అంతరిక్షమందు,రచితగతి=చేయఁబడిననడకగల,విభావసుఁడు=సూర్యుఁడు, వెలుఁగన్, అప్పుడు, తన్మధ్యమందుండి=ఆసూర్యమండలములోనుండి, ఒప్పారు, కృష్ణాభిఖ్యుఁడగు=కృష్ణనామముగల,దివ్యపురుషుఁడు=నారాయణమూర్తి, దివ్యభూషణభూషితుఁడు, సులక్షణయుతుఁడు, అగుచు, దృష్టిగోచరతనౌందర్,అంతన్, గోపాలుఁడు=గోపాలమంత్రి,అతిభక్తిన్, శ్రేల్మోడ్చుచున్,నవ...మూర్తి-నవ=నూతనమైన, రవిప్రభా=సూర్యకాంతియొక్కడు,

ప్రసన్నమూర్తి=నిర్మలమైన దేహముకలవాఁడా! భవ్యపరమభక్తపా-భవ్య=శుభులైన, పరమ=ఉత్కృష్టులైన, భక్త=భక్తులను, పా=పాలించువాఁడా! త్రికా...స్థితి-త్రికాల=మూఁడుకాలములయందు, సత్, ఊరు, శ్రీకర=శుభకరమైన, స్థితి=ఉనికిగలవాఁడా! శుభకృద్గతి=శుభప్రదగమనముగలవాఁడా! అను=అనునట్టి, గుణమహిమయుతుఁడు=గుణమహిమతోఁ గూడుకొనినట్టియు, గురుబుద్ధి=బృహస్పతిబుద్ధివంటిబుద్ధిగల, అతఁడు=గోపాలుఁడు, హితత్ఁ జేరి, పేరను, అతని=నారాయణమూర్తిని వినుతించెను.

తా. సూర్యబింబము ప్రకాశించుచుండఁగా నాబింబమధ్యమున గృష్ణనామముగల యొక్క దివ్యభూషణభూషితుఁడైనపురుషుఁడు తనకన్నులకుఁ బొడకట్ట, గోపాలమంత్రి నమస్కారము చేయుచు, ఓప్రసన్నమూర్తీ! భక్తపాలక! శుభకర! మహిమాన్వితా! యని (సూర్యమండలవర్తియైన) నారాయణుని స్తుతించెను.

క. శ్రీపాయసంబుతోడుత
నేపగుకల్యాణపాత్ర మిదె కొను వం
చోపిక నొసంగె నతి వాం
ఛాపూరణకారణముగ సరసోక్తులతోన్. 19

రాఘ.—శ్రీపాయసంబుతోడుతన్=శోభాయుక్తమైనపరమాన్నముతో, ఏపగు=హెచ్చయిన, కల్యాణపాత్రము=సువర్ణపాత్రము, ఈవు=నీవు, ఇదె=ఇదిగో, కొనుము=పుచ్చుకొమ్ము. అంచు=అనిపలుకుచు, ఓపికన్, అతివాం...ముగ-అతి=విస్తారమైన, వాంఛా=కోరికను, పూరణ=పూర్తిచేయుటకు, కారణముగ, సరసోక్తులతోన్, ఒసంగెను.

తా. పరమాన్నముతో నిండినయొకబంగారుగిన్నెను, ఇదిగో నీవు పుచ్చుకొమ్మని దశరథునికోరిక తీరుటకుఁ గారణమయినదాని నాప్రాజాపత్యపురుషుఁడిచ్చెను.

లక్ష్మ.-శ్రీపా=లక్ష్మీపతీ! యసంబుతోడుతన్=కీర్తితో, ఏపగు, కల్యాణపాత్రము=శుభమునకు యోగ్యమైనవాఁడవు, "యోగ్యభాజనయోఃపాత్రం"

అమరము. ఈవు, ఇదె, కొనుమంచున్, ఓశ్రీశ, నతిన్=నమస్కారమును, వాంఛాపూరణకారణముగన్, సరసోక్తులతోన్, ఒసంగెన్.

తా. ఓలక్ష్మీపతీ! శుభాకరుఁడవు. ఇదె స్వీకరింపు మని గోపాలమంత్రి యాతనికిఁ దనకోర్కులు నెఱవేఱుటకై నమస్కారము చేసెను.

వ. అట్లొసంగి మఱియు నిట్లనియె. 20

అర్థము సుస్పష్టము.

క. అలయకమున్ బాయసమున్
లలితామృతమూర్తినిన్ ఘనశ్యామలు భా
మలు సేవింపఁగ నిమ్మిఁక
నలఘుమతిన్ దీనఁ గోర్కు లన్నియు నమరున్. 21

రాఘు.—అలయకమున్=అలయకమునుపు (ప్రాతఃకాలమందు), లలితామృతమూర్తినిన్-లలిత=సుందరమైన, అమృతమూర్తినిన్=అమృతస్వరూపమైన, పాయసమున్=పరమాన్నమును, ఘనశ్యామలు=మంచిపయస్సుగల, భామలు=స్త్రీలు (కౌసల్యాదులు), సేవింపఁగన్=భుజించుటకై, ఇమ్ము, ఇఁకన్=ఇంకమీఁద, అలఘుమతిన్=యోగ్యమైనమనస్సుతో, దీనన్=ఈపాయసముతో, కోర్కులన్నియున్, అమరున్=ఒనగూడును.

తా. అమృతస్వరూపమైనయీపాయసమును నీభార్యలకుఁ బ్రాతఃకాలమందు భుజింప నిమ్ము. దీనివలన నీకోర్కులు సిద్ధించును.

లక్ష్మి.—అల...బాయన్-అల=ఆ, అకమున్=పాపమును, పాయన్=పాపుకొఱకు "అకం పాపే దుఃఖే చ" అని విశ్వప్రకాశము. సమున్=సముఁడవైనట్టియు, లలితామృతమూర్తిన్=సుందరమైన మోక్షస్వరూపుఁడవైనట్టియు, ఘనశ్యామలున్=మేఘముభంగి శ్యామల (నీల) వర్ణుఁడవైనట్టియు, భామలున్-భా=కాంతిచే, అమలున్=స్వచ్ఛమైనట్టియు, నిన్=నిన్ను, సేవింపఁగ నిమ్ము=కొలువనిమ్ము, అలఘుమతిన్, దీనన్=ఈసేవవలన, కోర్కులన్నియున్, అమరున్=సమకూరును.

తా. పాపపరిహారమునకై యమృతస్వరూపుఁడవైన, మేఘవర్ణముగల కాంతియుతుని నిన్ను నాకోర్కెలు ఫలించునిమిత్తమై నన్ను సేవింపనిమ్ము.

గీ. అనుచుఁ బలికి యాతఁ డక్షిగోచరుఁడుగా
కుంటఁ దెలిసి యజకులోద్వహుండు
గురుతరప్రతిభుఁడు గోపాలుఁ డప్పుడు
వేడ్కతోడ నొక్కవెరవు వట్టె. 22

రాఘ.—అనుచున్, పలికి, ఆతఁడు=ఆదివ్యపురుషుఁడు, అక్షిగోచరుండు, కాకుంట=కనఁబడక పోవుటను, తెలిసి=తెలిసికొని (అంతర్ధానమగుటఁ గనిపెట్టి), గురుతరప్రతిభుఁడు=గొప్పదైన ప్రభావముగలిగిన, గోపాలుఁడు=జనపతియగు, అజకులోద్వహుండు=దశరథుఁడు, అప్పుడు, వేడ్కతోడన్, ఒక్కవెరవు=ఒకయుపాయమును, పట్టె.

తా. ఇట్లని చెప్పి యాదివ్యపురుషుఁ డంతర్ధానము నొందిన, దశరథుఁడు సంతోషముతో.

లక్ష్మ.—అనుచున్, పలికి, ఆతఁడు=ఆనారాయణమూర్తి, అక్షిగోచరుఁడుగాకుంటఁ దెలిసి, గురుతరప్రతిభుఁడు, అజకులోద్వహుఁడు=బ్రాహ్మణశ్రేష్ఠుఁడు, గోపాలుఁడు=గోపాలమంత్రి, అపుడు, వేడ్కతోడన్, ఒక్కవెరవు వట్టె.

తా. ఇట్లని గోపాలుఁడు స్తుతించి సూర్యబింబములోని నారాయణుఁడు కనఁబడకుండుటఁ దెలిసికొని.

క. వెలయ మనం బాయసమున్
లలి సామాదిప్రియకరలలితామ్నాయో
క్తుల కేకయనందన కిం
పలరు రసజ్ఞ కమృతంబునట్లు లొసంగున్. 23

రాఘు.—వెలయన్=ప్రకాశించునట్లు, మనన్=మన్నెడుకొఱకు, పాయసమున్, లలి=మిక్కిలి, సాను=సగము, ఆదిప్రియకు = మొదటిభార్యకు (కౌసల్యకు), అర=సగము, లలితా...నందనకున్-లలిత=ఒప్పుచున్నందు, ఆమ్నాయోక్తుల=సంప్రదాయవాక్యములుగల "ఆమ్నాయస్సంప్రదాయః" అమరము. కేకయనందనకు = కైకకు, ఇంపలరు, రసజ్ఞకు = జిహ్వకున్, అమృతంబునట్టు లొసంగెన్.

తా. పెద్దభార్యకును, కైకకును, జిహ్వకమృతమువంటి రుచిగలపాయసముం బెట్టెను.

లక్ష్మి.—మనంబు=మనస్సు, వెలయన్, అయసమున్=అసమానుఁడు లేని విష్ణుమూర్తిని, లలిన్, సామాది... క్తులకు - సామాది=సామవేదము మొదలగు, ప్రియకర=ప్రియముంగావించు, లలిత=మనోహరములైన, ఆమ్నాయోక్తులకు=శ్రుతివాక్యములకు, ఏక యనన్=ముఖ్యమైనది యనునట్లుగ, తనకు ఇంపలరురసజ్ఞకు, అమృతంబునట్టులొసంగుఁన్ (స్తుతిచేసెననుట.)

తా. సంతసముచే నాయసమానుఁడైనవిష్ణుదేవుని సామాదివేదోక్తులచే తననోటి కమృతప్రాయమైన స్తోత్రము గావించెను.

వ. అట్లొసంగి యంతలోన మఱియొకతలంపు పుట్టుటయుఁ ద
దధీముఖుండై యిట్లనియె. 24

అర్థము రెంటికిని స్పష్టము.

మ. నలి దేవుల్మగు రేకమైన మిము నానందంబుగాఁ జూడ నేఁ
దలఁతుం గావున గోతులారహితతం దద్దివ్యసద్భక్తరా
సులలోనం దగనుంచిసాములు బుధస్తుత్యస్థితుల్మీరు వే
డ్కలమీఱంగసుమిత్రభద్రపదమెక్కం జేయుటర్హంబగున్.

రాఘు.—నలి=మిక్కిలి, దేవుల్మగురు=భార్యలుముగ్గురును, ఏకమైనన్=భేదభావము లేకయుండిరేని, మిమున్, ఆనందంబుగాఁ జూడ నేఁ దలఁతున్

గావున, గోకులార=ఓ స్త్రీలారా! హితతన్=ఇష్టముచేత, తద్ది... లోనన్-తత్ =ఆ, దివ్య=దేవతాసంబంధమైన, సద్భక్తరాసులలోనన్=శ్రేష్ఠమైనపరమాన్నపు ముద్దలలో, సాములు=సగములు, తగనుంచి, బుధస్తుత్యస్థితుల్=పండితులుస్తుతిం పఁదగిన స్థితులుగల, మీరు, వేడ్కల, మీఱంగ, భద్రపద=శుభములకు స్థానమైన, సుమిత్రన్=సుమిత్రాదేవిని, మెక్కంజేయుట=భక్షించునట్టుల చేయుట, అర్హంబగున్=తగును.

తా. నాభార్యలైనమీరు ముగ్గురు నొక్కటిగా మెలఁగుట నా కెంతయుం నిష్టము కావున, మీకు నే నిచ్చినపాయసముంగొని సగము సగము భాగములు సుమిత్రకుఁ గూడఁ బెట్టుఁ డని దశరథుఁడు కౌసల్యను కైకను గోరెను.

లక్ష్మి.—నలి, దేవుల్లుగురేకమైనమిమున్=త్రిమూర్త్యాత్మకమైనమిమ్మును, ఆనందంబుగాఁ జూడనేఁదలఁతున్, గో=భూమియందు, కులారహితతన్=సామ్యము లేనట్టుగా, తద్దివ్యసద్భక్తిరాసులలో=ప్రసిద్ధమైన భక్తసముదాయమునందు, నన్=నన్ను, తగనుంచి, సాములు=స్వాములు, బుధస్తుత్యస్థితుల్ మీరు, సుమిత్రభద్రపదము-సు=శ్రేష్ఠమైన, మిత్ర=సూర్యునియొక్క, భద్రపదము=శుభస్థానమును, ఎక్కంజేయుట=ఎక్కునట్టుగానించుట, అర్హంబగున్.

తా. త్రిమూర్త్యాత్మకమైనమిమ్ము నేఁ జూడఁ గోరెదను. ఈభూలోకమున, ననుపమానులైనభక్తకోటిలో నన్నుఁ గూడ నొకనిగఁ జేర్చుకొని స్వాములువారలు నన్ను సూర్యపదప్రాప్తిని జేయవలయును. అని గోపాలుఁడు స్తుతించెను.

గీ. అనుచుఁ బల్కి యాతఁ డపుడే తదనుమతి
మిళితవాంఛితోక్తికలితుఁ డగుచు
వసతి ననుపమాన పాయసరససుఖా
నుభవదారయుతత శుభత దాల్చె. 26

రాఘ.—అనుచుఁ బల్కి, అతఁడు=ఆదశరథుఁడు, అపుడే, తదను... డగుచున్-తదనుమతిమిళిత=ఆయిద్దఱుభార్యలయిష్టముతో మిళితమైన, వాంఛి

తోత్కలితుఁడగుచున్, (సుమిత్రకుఁ దమతమపాయసభాగములను బెట్టుటకు సమ్మతింపఁగా) వసతిన్=గృహమునందు, "వసతీ రాత్రి వేశ్మనోః" అమరము. అనుప... యుతతన్—అనుపమాన=ఉపమానములేని, పాయసరస=పరమాన్నరసమును, సుఖానుభవ=సుఖముగాభుజించిన, దార=భార్యలతో, యుతతన్=కూడుకొనుటచేతను, శుభతన్, తాల్చెన్.

తా. తాను గోరిన ట్లాయిద్దఱును సుమిత్రకుఁ గూడఁ బాయసము పెట్టఁగా, దానిని భుజించిన భార్యలతోఁ గూడి శోభాయుక్తుఁడై యుండెను.

లక్ష్మ.—ఏతదనుమతిమిళిత వాంఛితోత్కలితుఁడు = పూర్వోక్తవాంఛితోక్తితో నొప్పుచున్నవాఁడై, వసతిన్=రాత్రియందు, అనుప.. తతన్—అనుపమ=సాటిలేని, అనపాయి = అపాయశూన్యమైన, సరససుఖానుభవము గలిగిన, దారయుతతన్=భార్యతోనుండుటచే, శుభతదాల్చెన్=శోభిల్లెను.

తా. పూర్వోక్తవాంఛితోక్తిచే నానందించుచు గోపాలమంత్రి రాత్రులయందు భార్యతో సరససుఖానుభవముల నొప్పుచుండెను.

వ. ఇవ్విధంబున నిష్టవినోదంబుల నుండి కొన్నిదినంబులకు
గర్భిణీత్వంబునఁ జెన్నొందుభార్యల సద్రూపంబు గనుంగొని
ప్రీతాత్ముండై యుండె నంత. 27

రాఘ.— భార్యల+సద్రూపము, అని పదచ్ఛేదము.

లక్ష్మ.—భార్య+లసద్రూపము, అని తక్కినది సమము సులభము.

శా. ఆరన్ రాజమహేలలందునను బెద్దైయొప్పుసత్పుణ్య సు
శ్రీరాజద్వరపాదభక్తిఁ గనియెన్ శ్రీరామనామున్నుతుల్
సేరన్ భార్గవురేణుకాతరుణిపోల్కిన్ భవ్యనానాతప
శ్శ్రీరక్తాత్మమరీచిజాతు నదితిస్త్రీలాగునన్ బాగుగన్. 28

రాఘ.—ఆరన్=వృద్ధిఁబొందునటుల, రాజమహేలలందునను=రాజస్త్రీలయందు, పెద్దైయొప్పు=జ్యేష్ఠురాలైన, సత్పుణ్య=పుణ్యాత్మురాలు, (కౌసల్య

యనుట) ''మహేన్ద్రానుమహిళాపిస్యాత్'' అని ద్విరూపకోశము. సుశ్రీ రాజద్వర పాదభక్తిన్ - సు=యోగ్యమైన, శ్రీ=శోభచే, రాజత్=ప్రకాశించెడు, పర=భర్తయొక్క, పాదభక్తిన్=పదభక్తిచేత, శ్రీరామనామున్=శ్రీరాముఁడను పేరు గలవానిని, సుతుల్ నేరంగనియెన్, భార్గవు రేణుకాతరుణిపోల్కిన్=పరశురాముని రేణుక కనినయట్లును, భవ్య...జాతున్ - భవ్య=శుభదమైన, నానాతపశ్శ్రీ=నానావిధ ప్రకాశసంపత్తి కలిగిన, రక్తమరీచిజాతున్ = ఎఱ్ఱనికిరణసముదాయముగలవానిని (సూర్యుని), అదితి స్త్రీలాగునన్, బాగుగన్.

తా. పెద్దభార్య యైనకౌసల్య పతిపాదభక్తివలన, శ్రీరాముఁడనుకొమరుని, రేణుక పరశురాము గనినయట్లు అదితి సూర్యుని గనినయట్లు కనియెను.

లక్ష్మి.— ఆరన్, రాజమ=రాజమ్మ యను స్త్రీ, హేలలందునను=విలాసములందున, పెద్ద=శ్రేష్ఠురాలై, ఒకప్పు=తగునట్టి, సత్పుణ్య...భక్తిన్ — సత్పుణ్య సుశ్రీ=పుణ్యముయొక్క శ్రేష్ఠమైనశోభచే, రాజన్వరపాదభక్తిన్=ప్రకాశించు పెనిమిటియొక్క పాదసేవను, మున్=పూర్వము, శ్రీరామ నా=లక్ష్మీకాంతవలె, భార్గవు రేణుకాతరుణిపోల్కిన్=జమదగ్నిని రేణుకవలె, భవ్యనానా...లాగునన్ - భవ్య=శుభకరమైన, నానాతపశ్శ్రీ=నానావిధతపస్సంపత్తియందు, రక్త=అనురక్తమైన, ఆత్మ=బుద్ధిగల, మరీచిజాతున్=కశ్యపుని, అదితిస్త్రీలాగునన్=అదితివలె, బాగుగన్, నుతుల్సేరన్, కనియెన్=పొందెను.

తా. గోపాలునిభార్య రాజమ్మ, తన పెనిమిటిని, పూర్వము, లక్ష్మీదేవి వలె, భృగుమహర్షిని రేణుకవలె, కశ్యపుని అదితివలె సేవించెను.

వ. మఱియును. 29

అర్థము సమము.

క. శ్రీకేకయనందన భ
వ్యాకృతి భరతసుసమాఖ్య నలరుకొమరు ము
ల్లోకములు మెచ్చఁ గాంచెను
శ్రీకరసుమవల్లి తావిరీతిం బ్రీతిన్. 30

రాఘ.—శ్రీకేకయనందన = శోభతోఁగూడినకైకేయి, భవ్యాకృతిన్=శుభాకారముగల, భరతసుసమాఖ్య నలరుకొమరున్=భరతుఁడను శ్రేష్ఠనామము గలకుమారుని, ముల్లోకములు మెచ్చ, శ్రీకరసుమవల్లి=శోభాయుక్తమైన పుష్పలతీఁగ, తావిరీతిన్=పరిమళమును వలెనే, ప్రీతిన్=ప్రేముడిచే, కాంచెను=కనియెను.

తా. కైక, పుష్పఁదీఁగె పరిమళమును గాంచినట్లు భరతుఁడను పుత్త్రుని బడసెను.

లక్ష్మ.—శ్రీకేకయనన్=సంపత్తికి ముఖ్యమైనది యనునట్టుల, తనభవ్యాకృతిభరతన్=తనశుభాకారభరణముచేత, సుసమాఖ్యనలరు కొమరున్-సుసమాఖ్యనలరు = సుకీర్తిసహితమైన, కొమరున్-తేటను (సౌందర్యమును), శ్రీకరసుమవల్లితావిరీతిన్, ముల్లోకములు మెచ్చన్, ప్రీతిన్=ప్రేముడిచే, కాంచెను=పడసెను.

తా. రాజమ్మ పతిసేవవలన సంపత్తికి ముఖ్యమైన తనశరీరకాంతిచేత నొకవిధమైన సౌందర్యమును వహించెను.

వ. తదనంతరంబ. 31

స్పష్టము.

మ. గణనాతీతమనోరథాళి స్వకుచాగ్రత్విడ్జితామర్త్యరా
ణ్మణిశుభ్రాస్యజితాబ్జరాజమముహుర్మందాంఘ్రివిన్యాసయై
ప్రణుతింపంబడుచున్ సుమిత్ర హితగర్భశ్రీ విశేషాప్తిల
క్ష్మణశత్రుఘ్నునిఁ గాంచెఁబుత్రకులసత్సంతోషమేపారఁగన్.

రాఘ.—గణనాతీతమనోరథాళి = లెక్కకుమించిన దౌహృదములు కలిగినట్టియు, స్వకు...రాణ్మణి - స్వ=తన, కుచాగ్ర=చూచుకములయొక్క, త్విట్=కాంతిచే, జిత=జయింపఁబడిన, అమర్త్యరాణ్మణి = ఇంద్రనీలమణులు కలిగినట్టియు, శుభ్రాస్యజితాబ్జరాజమ-శుభ్ర=తెల్లనైన, ఆస్య=ముఖముచే, జిత=జయింపఁబడిన, అబ్జ=పద్మములయొక్క, రాజ=చంద్రునియొక్క, మ=శోభకలిగినట్టియు, సుమిత్ర, ముహుర్మందాంఘ్రివిన్యాసయై-ముహుః=మాటి

మాటికి, మంద=మందమైన, అంఘ్రి విన్యాస=అడుగులు పెట్టునది, యై, ప్రణు తింపంబడుచున్=స్తుతింపఁబడుచు, హిత...షాప్తిన్-హిత=ఇష్టమైన, గర్భ శ్రీ=గర్భసంపదయొక్క, విశేషాప్తిన్ = అతిశయప్రాప్తిచేత, లక్ష్మణు, శత్రు ఘ్నునిన్, పుత్రకుల, సత్సంతోషము = సత్పురుషులకానందము, వి పారఁ గన్=వృద్ధియగునట్లు, కాంచెన్=కనియెను.

తా. అనేకములయినమనోరథములు గలిగి నల్లనైన స్తనాగ్రములు గలిగి నడకమందగించినసుమిత్ర లక్ష్మణుని శత్రుఘ్నుని గనియెను.

లక్ష్మ.—శుభ్రాబ్జ జితాబ్జ=తెల్లని ముఖము చేజయింపఁబడినచంద్రుఁడు గల, రాజమ=రాజమ్మ, సుమిత్ర...షాప్తిన్-సు, మిత్ర, హిత, గర్భశ్రీవిశే షాప్తిన్, లక్ష్మణున్=లక్ష్మీవంతుఁడును, శత్రుఘ్నునిన్ = శత్రునాశకుఁడును, అయిన పుత్రకున్=కొడుకును, లసత్సంతోషమే పారఁగన్, కాంచెన్.

తా. రాజమ్మ, తనబాంధవులకు స్నేహితులకుఁ బ్రియమగునట్లు గర్భముదాల్చి లక్షణవంతుఁ డైనయొకకొడుకును గనియెను.

వ. అంత. 33

సీ. కన్నమ్మ కోసలక్ష్మావరసుత ప్రీతి
 నిలఁ బురుషోత్తమ కలిగి తనుచు
భయదారి వీవు గోపాలజుండౌట సు
 శ్రీకైకవాంఛరాజిలె నటంచు
భోగీంద్ర నిన్ను నేఁ డీగతిఁ గనుట సు
 మిత్ర మోదస్థితి మించె ననుచుఁ
బిత్రుకృతాతిసుకృతోన్నతి వలనురి పురు
 షాకృతిహరివీవయ్యె ననుచు
గీ. నలినియోగులు బుధులు నెన్నఁగ నలుగురు
 రూపమున మీఱి రమలసద్రుచిబలమున

నొప్పెనయ లీల లభివృద్ధి నొంద నెసఁగు
నాయనఘనయశోభానియతు లెదుగఁగ. 34

రాఘు.—పురుషోత్తమ = విష్ణుమూర్తివైన శ్రీరామా! కన్నమ్మ=కన్న తల్లియైన, కోసలక్ష్మాపరసుత=కౌసల్య, ప్రీతిన్, నిలన్=నిలుచుకొఱకు, కలిగితనుచు=పుట్టితి వనియుఁ, సుశ్రీ = మంచిశోభగలభరతుఁడా! భయదారివి- భయ=భయమును, ద=ఖండించు, అరివి=విష్ణుచక్రమైన, ఈవు=నీవు, గోప్తృజుండౌటన్ = దశరథపుత్రుఁడవౌటచే, కైక = కైకయొక్క, వాంఛ = కోరిక, రాజిలెనటంచున్=ప్రకాశించె ననియును, భోగీంద్రున్=ఆదిశేషుఁడవైన (లక్ష్మణుఁడు), నిన్ను, నేఁడు, ఈఁగతిన్ (పుత్రుగాన్), కనుట, సుమిత్ర=సుమిత్రదేవియొక్క, మోదస్థితి = సంతోషము, మించెన్=ఎక్కుడయ్యె, ననుచున్, పితృ...న్నతిన్ – పితృ=తలిదండ్రుల = సుకృత=పూర్వపుణ్యము యొక్క, ఉన్నతిన్ = అతిశయముచే, వలమురి = విష్ణుశంఖము, పురుషాకృతిన్ = పురుషరూపముచేత, హారివి = మనోహరుఁడవైన, ఈవు=శత్రుఘ్నుఁడవైననీవు, నలిని=అత్యంతము, యోగులు = తపస్వులును, బుధులు = దేవతలును, ఎన్నఁగన్=మెచ్చఁగా, నలుగురు=ఆనలుగురుకుమారులు, రూపమున మీఱిరి=చక్కఁదనము గలవారైరి. అమలస్రుచిబలమునన్ = స్వచ్ఛమైన దొడ్డతేజస్సుయొక్కసామర్థ్యమున, ఒప్పెనయన్ = సొగసుహత్తునట్లు, లీలలభివృద్ధినొందన్=విలాసములభివృద్ధినందునట్లు, ఎసఁగు= ప్రకాశించెడు, ఆ, యనఘ=నిర్దోషమైన, నయ=నీతి, శోభ = శోభలయొక్క, నియతులు=నియమములు, ఎదుగఁగ=వృద్ధిపొందుకొఱకు, అని వెనుకకన్వయము.

తా. కౌసల్యసంతోషమునకై! ఓరామా, విష్ణుమూర్తివి నీ విట్లుపుట్టితి వని, కైకవాంఛతీర విష్ణుచక్రమవైనభరతుఁడా! నీవు పుట్టితివని, సుమిత్ర సంతోషించునట్లాదిశేషుఁడా! నీవులక్ష్మణుఁడవై పుట్టితివని, తండ్రి చేసినపుణ్యావశమున విష్ణుశంఖాంశమున శత్రుఘ్నా! నీవు జన్మించితి వని మునీంద్రులు మున్నగువారు స్తుతింప, రూపమున బలమున నసమానులై నల్వురు కొమరు లెదిగిరి.

లక్ష్మి.— కన్నమ్మకు = రాజమ్మకు, ఓసలక్ష్మ = శుభలక్షణసహితుఁడా! వరసుత = జ్యేష్ఠపుత్త్రుఁడా! ప్రీతినిఁక్ = సంతోషస్థితిఁగాంచు, పురుషోత్తమ = ఉత్తమపురుషుఁడా! కలిగితి, అనుచున్, భయదారివి = భయమును బోఁగొట్టువాఁడవు, అయిన, ఈవు = నీవు, గోపాలజుండౌటన్ = గోపాలమంత్రికిపుత్త్రుఁడవౌటచే, సుశ్రీకైక - సుశ్రీ = సుసంపత్తిగలవారిలో, ఏక = ముఖ్యుఁడా! వాంఛ = మాకోరిక, రాజిలెన్, అటంచున్, భోగీంద్రున్ = భోగవంతులలో మిన్నయైన, నిన్ను, నేఁడు, ఈగతిఁగనుటన్ = ఈచొప్పునఁజూచుటచే, సుమిత్త్రమోదస్థితి = మంచిమిత్త్రులసంతోషము, మించెన్, అనుచున్, పితృకృతసుకృతోన్నతి (యొక్క), వలము = బలము, రిపురుషాకృతివారివి - రిపు = శత్త్రువుల, రుషా = కోపముయొక్క, ఆకృతి = ఆకారమును, వారివి - వారించువాఁడవు, (అయిన) నీవు, అయ్యెననుచున్ (తండ్రిపుణ్యబలమే నీయాకారమయ్యెననుట), నలి, నియోగులు = స్వశాఖీయులయినబంధుగులు, బుధులు = పండితులు, ఎన్నఁగ = గణింపఁగా, నలు = నలునియొక్క, గురు = గౌరవమైన, రూపమున = ఆకారమున, మీఱి, రమన్ = లక్ష్మిచే, లసద్రుచిన్ = శోభచే, బలమునన్, ఒప్పెను. అయలీలలు = భాగ్యవిలాసములు, అభివృద్ధినొందన్, ఎసఁగున్, ఆయాన = ఆచిన్నవాఁడు, (నాయన = తండ్రియొక్క) ఘనయశోభానియతుఁడెసఁగఁగన్ = సుకీర్తిప్రభావియమవృద్ధిఁగాంచు, అని, వెనుకక్రియతో నన్వయము.

తా. రాజమ్మకు నీవు సలక్షణుఁడవు పురుషోత్తముఁడవు కలిగితివి. భయమును బోఁగొట్టువాఁడవు, ఇంద్రభోగము లనుభవించు నిన్నీగతిఁ జూచుచున్నస్నేహితులసంతోషము మించుచున్నది. నీతండ్రి చేసినపుణ్యమే నీవై పుట్టె నని నియోగులు, పండితులు సెన్న, నలరాజువంటిసౌందర్యముతో గోపాలమంత్రికుమారుఁ డుండెను.

వ. అంత నగ్గోపాలుండు తత్సంతానంబుఁ గాంచి పెన్నిధిఁగన్న పేదచందంబున సంతసించి పుత్త్రమహోత్సవం బొనర్చి సమస్త జనంబులభినందింప భూసురప్రముఖుల నానావిధంబులం

దనిపి సముచితసమయంబునఁ బుణ్యాహవాచనపూర్వకంబు
గా జాతకర్మనామకరణంబులు గావించె నివ్విధంబున.

రాఘ.— అగ్గోపాలుండు = ఆదశరథుఁడు - తత్సంతానంబుల్ = ఆనలుగురుపుత్రులను, కాంచి = కని.

లక్ష్మ.—అగ్గోపాలుండు= ఆగోపాలమంత్రి -తత్సంతానంబుల్ =ఆకు మారుని. తక్కినది సమము స్పష్టము.

సీ. క్షమరుచిరాజిసుసంతతి యట్లు నా
నాఁటికి మెఱయ నేఁటేఁట నొకొక
కొమరు గామితలక్షణము లొప్పఁగాంచె మా
తల సత్సుధాంశుమండలముఖులను
ముప్వురఁ దండ్రిని ముదమందఁ జేయుచు
నందగ్రజుండు గుణాధికతను
బొలిచె నారీతిఁ దత్పుత్రులు నల్వురు
నచ్యుతభుజములయట్లు బల్మి
గీ. వేదములచందమునను బవిత్రతలను
గమలసంభవుముఖములగతిఁ జదువుల
జలధులపగిది గాంభీర్యములను గాంచఁ
దగుటలుజనంబు వినుతింప నెగడి రంత. 36

రాఘ. —క్షమ . . . సంతతి—క్షమ=సమర్థమైన, రుచిర=సుందరమైన, అజి సంతతి=దశరథపుత్రులు (అజుఁడనురాజుకొడుకు-అజి, దశరథుఁడు. అజిసంతతి=దశరథుని సంతానము), అట్లు, నానాఁటికిన్, మెఱయన్, ఏఁటేఁటన్= ప్రతిసంవత్సరము, ఒకొకకొమరున్ = ఒక్కొక్కతేటను, కామితలక్షణము లొప్పన్ = కోరఁబడినచిహ్నములు ప్రకాశించునట్లుగా, కాంచెన్. సత్సుధాంశుమండలముఖులన్ = చంద్రబింబములవంటిముఖములుగల, మాతలన్=

తల్లులను, మువ్వురన్ = కౌసల్య, కైక, సుమిత్రలను, తండ్రికిన్ = దశరథుని, ముదమందఁ జేయుచున్ (వెనుకకన్వయము); అందు=ఆనలువురుకొడుకులలో, అగ్రజుండు=పెద్దవాఁడు (రాముఁడు), గుణాధికతను=విశేషగుణములచే, పొలిచెన్ = ప్రకాశించెను. ఆరీతిన్ = అట్లు, తత్పుత్త్రులు నల్వురున్=రామలక్ష్మణభరతశత్రుఘ్నులు, అచ్యుతభుజములయట్లు=విష్ణుదేవుని నాలుగుభుజములవలె, బల్మి=బలమును, వేదములచందమునను = చతుర్వేదములవలె, పవిత్రతలను, కమలసంభవుముఖములగతిన్=బ్రహ్మదేవుని నాల్గుమోములరీతిని, చదువులన్=విద్యలను, జలధులపగిదిన్=నాలుగుసముద్రములయట్లు, గాంభీర్యములను,= గంభీరభావములను, కాంచన్ తగుటలు=తగియుండుటలు, జనంబు వినుతింప, నెగడిరి. అంత.

తా. రామలక్ష్మణభరతశత్రుఘ్నులు ఓర్పున, కాంతిని, నానాఁటికి, ఏఁటేఁట నొకవింతచెలువము గానుపింప, తల్లిదండ్రుల కానందముం గల్పించుచుండిరి. అందుఁ బెద్దవాఁడు గుణాధిక్యమునువహించెను. ఆనలుగురు, విష్ణుదేవునిబాహువులవలె బలిమిని, వేదములవలెఁ బవిత్రతలను, బ్రహ్మముఖమువలె విద్యలచేతను, సముద్రములవలె గాంభీర్యముల జనులు పొగడఁ బెరిఁగిరి.

లక్ష్మి.—క్షమన్=భూమియందు, రుచిరాకృతిన్=కాంతిపజ్జిగల, సుసంతన=ఆగోపాలునిచక్కనికుమారుఁడు(తిరుపతిమంత్రి). అట్లు, నానాఁటికిన్ = దినక్రమమున, మెఱయన్=ప్రకాశించుచుండఁగా, ఏఁటేటన్, ఒకొకకొమరుగాన్ = ఒక్కొక్కకొమారునిచొప్పున, మితలక్షణము లొప్పన్ = శాస్త్రోక్తలక్షణములుకలుగునటుల, కాంచెన్. మాత=తల్లియైనగాజమ్మ, లసత్+సుధాంశుమండలముఖులన్=వెలుంగుచున్న చంద్రమండలములవంటి మోములుగల, మువ్వురన్=ముగ్గురు కుమారులను, కనియెననుట. తండ్రిన్=గోపాలమంత్రిని, ముదమందఁజేయుచు, అందగ్రజుండు=తిరుపతియనుపుత్త్రుఁడు, గుణాధికతను, పొలిచెను. ఆరీతిన్, తత్పుత్త్రులు నల్వురు = తిరుపతి, రామకృష్ణ, లక్ష్మణ, రామనామములుగలనల్గురు, కాంచఁదగుటలు=పొందఁదగియుండుటలు, జనంబు వినుతింపన్, నెగడిరి=వృద్ధినొందిరి.

తా. గోపాలమంత్రి పెద్దకొడుకట్లు దినదినాభివృద్ధి నొందుచుండఁ బ్రతిసంవత్సరము నొక్కొక్కకుమారునిగా మఱిముగ్గురను రాజమ్మ సలక్షణములు గలవారిని గనియె. వారిలోఁ బెద్దవాఁడైన తిరుపతి, తండ్రి కానందము గలిగించుచు గుణవంతుఁ డనిపించుకొనియెను. ఇట్లు నలుగురుపుత్రులు, తిరుపతి, రామకృష్ణ, లక్ష్మణ, రామ,నామముగలవారు వర్ధిల్లుచుండిరి.

వ. అట్లు క్రమక్రమంబున.

క. తారాగ్రహములు తమలోఁ
దారాగ్రహములు వదలియుఁ దద్దయు శుభసం
చారులగు వేళఁ బుట్టిరి
మారసమాకారు లక్కుమారులు ధీరుల్. 38

రాఘ.—— తారాగ్రహములు=నక్షత్రములు, గ్రహములు,తమలోన్, తారు=తమరు, ఆగ్రహములు = విరోధభావములు, వదలి, తద్దయున్=ఎంతయున్, శుభసంచారులగు వేళన్, మారసమాకారులు-మా=లక్ష్మిని, ర=గ్రహించిన (విష్ణువుతో), సమాకారులు=సమానమైనయాకారములుగల, ఆకుమారులు= రామాదులు, ధీరుల్, పుట్టిరి.

లక్ష్మ.——మారసమాకారులు=మన్మథాకారులు, తక్కినది సమానము.

తా. నక్షత్రములు గ్రహములుమంచిస్థితియందుండఁగా, శుభసంచారములు చేయుచుండఁగా నానల్వురుదయమందిరి.

సీ. రుచిరతాస్పదముదిరుపతి నాభాసితు
క్షేమమానయశోభి రాము జ్యేష్ఠు
శ్రీల నేలుమనియును రెండవసుతుఁ గీర్తి
జితరూప్యగిరిశు భరతుని రామ
కృష్ణుని మహనీయవృత్తిని విలసిల్లు
మనియును మూఁడవయతని లక్ష్మ

ణుని సుమిత్రానందనుని సమస్తజనమా
న్యప్రవర్తనలఁ జెన్నమరు మనియు
గీ. రూఢిగా రాముబలిమి శత్రుఘ్ను నాల
వకొమరుని ఘనవృత్తిని వఱలు మనియు
ధరణిజనులెల్ల మెచ్చనల్వ్రగను దద్గు
రుండు దీవించి పలికె నిరూపణముగ. 39

రాఘు.—రుచిర...పతినా-రుచిరతా = సుందరత్వమునకు, ఆస్పద= స్థానమైన, ముదిరు=మేఘునియొక్క, "ఘనజీమూతముదిరజలముగ్ధూమయోనయః" అమరము. పతినా=ప్రభువైన యింద్రునివలె, భాసితుక్=ప్రకాశించుచున్నవానిని, పతినా = ప్రతియనునట్లులు, (ప్రతిశబ్దగద్భవము, పతి. దేశ్యమని కొందఱందురు.) క్షేమమానసుశోభి = శుభసంపత్తి, నీతులచేఁ బ్రకాశించువానిని (క్షేమమా+నసు+శోభి), రాముక్=రాముని, జ్యేష్ఠుక్= మొదటివానిని, శ్రీలసేలుమనియుం = సంపదలనేలుమనియు, రెండవసుతుక్= రెండవకొడుకును, కీర్తిరూప్యగిరిశుక్-కీర్తి=యశస్సుచే, [illegible]=జయింపఁబడిన రూప్య = వెండియు, గిరిశుక్ = శివుఁడును గలిగినట్టివానిని, రామునివలెనల్లని కాంతిగలవానిని, భరతుని, మహానీయువృత్తిని మిం[illegible]ల్లుమనియుం, మూఁడవయుతనిక్, సుమిత్రానందనుని, లక్ష్మణుని, సమస్తజనమాన్యప్రవర్తనలఁ జెన్నలరుమనియుం, నాలవకొమరుని, రూఢి...త్రుఘ్ను-రూఢిగా రాము=ముద్దుచేత, బలియుం=ప్రబలు, శత్రుఘ్నుని, ఘనవృత్తిని వఱలుమనియుం, తద్గురుండు= వారిగురువైన వసిష్ఠుఁడు, నిరూపణముగ ధరణిజనులెల్లమెచ్చ,దీవించిపలికెను.

తా. మేఘశ్యాముఁడైనరాముని రామునిం బోలినభరతుని, లక్ష్మణుని, శత్రుఘ్నుని శ్రీల నేలుమనియుం. కీర్తిచే వర్ధిల్లుమనియు, జనమాన్యప్రవర్తనము గలిగియుండు మనియు ఘనుఁడవై యిలరుమనియుం గురువైన వసిష్ఠుఁడు వారి దీవించెను.

లక్ష్మ.—రుచిరతాస్పదముఁ = సౌందర్యస్థానమైనవానిని, దిరుపతినా = తిరుపతిమంత్రియన, భాసితుఁ, క్షేమ+మాన+యశోభిరాముఁ, జ్యేష్ఠుని, కీర్తిజితరూప్యగిరిఁ, శుభరతునిఁ = శుభాసక్తుని, రామకృష్ణునిఁ = ఆ పేరుగలవానిని, లక్ష్మణునిఁ = లక్ష్మణనామముగలవానిని, సుమిత్రానందనుఁ, మంచి స్నేహితులకానందము గల్గించువానిని, రూఢిగా = నిర్ణయముగ, రాముఁ = ఈ పేరిటివానిని, ప్రబలుని, శత్రుఘ్ను ని = శత్రునాశకుని, తద్గురుండు = వారి తండ్రి గోపాలమంత్రి, దీవించి పలికెను.

తా. గోపాలమంత్రి, తిరుపతిని, రామకృష్ణుని, లక్ష్మణుని, రాముని (తననలువురుకొడుకులను), దీవించెను.

వ. అంత. 40

ఉ. తాతను గన్నతండ్రి నుచితస్థితిఁ బోలిన పెద్దచిన్నవాఁ
డాతతబుద్ధిశాలి యగు చాత్మమునందలపోయ బాల్యమం
దే తెలివిఁ ఘనుం డగుట నెంతయు విస్మయ మొప్పసజ్జన
వ్రాతముఁ బ్రోవ దుష్టజనవర్గము చేవయడంపఁ బెంపునన్.

రాఘ—తాతను = బ్రహ్మను, కన్నతండ్రిఁ = కనినతండ్రియైనవిష్ణుదేవుని, ఉచితస్థితిఁ = తగినరీతిని, పోలిన = అనుకరించిన, పెద్దచిన్నవాఁడు (రాముఁడు), ఆతతబుద్ధిశాలియగుచు = విస్తారమైనజ్ఞానవంతుఁడై, ఆత్మమునందలపోయఁ = మనస్సునన్నాలోచింపఁగా, బాల్యమందే = చిన్నప్పుడే, తెలివిఁ, ఘనుండగుటఁ, ఎంతయుఁ = మిక్కిలి, విస్మయమొప్ప = ఆశ్చర్యకరముగాఁగ, పెంపునన్ = అతిశయముచే, సజ్జనవ్రాతముఁ బ్రోవఁ = శిష్టజనసమూహమునురక్షించుటకున్ను, దుష్టజనవర్గము చేవ = దుర్జనులగర్వమును, అడంపఁ = తగ్గించుటకును.

తా. విష్ణుమూర్తివలె రాముఁడు చిన్నతనమునందే బుద్ధిశాలియై దుష్టశిక్షణశిష్టరక్షణములయందు నేర్పరియై జనులకు విస్మయముంబుట్టించె ననుట.

లక్ష్మ.—తాతను = తాతగారిని, కన్నతండ్రిని = తండ్రిగారిని, ఉచితస్థితిఁ = వారివారిగుణములచేత, పోలినపెద్దచిన్నవానిని, తక్కినవి సులభము.

గీ. అన్నగారిభోగోన్నతి వన్నెమీఱు
చుండ రెండవయాతఁ డక్కొండికలిరు
వురును భక్తియు భయముగదురఁగఁ జేరి
కొలుచుచుండ గభీరతఁ బొలుచుచుండు. 42

కులకము, నాల్గుపద్యములు.

రాఘ.—ఆ+నగారిభోగోన్నతి-అ, నగారి=ఇంద్రునియొక్క, భోగోన్నతి=భోగాతిశయమువంటిభోగాతిశయము, వన్నెమీఱుచుండఁగ, రెండవయాతఁడు=భరతుఁడును, అక్కొండికలిరువురుఁ = ఆగమ్ములిద్దఱును (లక్ష్మణశత్రుఘ్నులు), భక్తియుం, భయముఁ, కదురఁగఁ, చేరి, కొలుచుచుండఁగ, గభీరతఁ=గాంభీర్యముచే, పొలుచుచుండు.

రాముఁడు, ఇంద్రభోగము లనుభవించుచు భరతలక్ష్మణశత్రుఘ్నులు తన్నుఁ బరివేష్టింప నుండును.

లక్ష్మ.—అన్నగారి=తిరుపతియొక్క, భోగోన్నతి=భోగాతిశయము, వన్నెమీఱుచుండఁగ, రెండవయాతఁడు=రామకృష్ణుఁడు, కొండిక లిరువురును=చిన్నవాండ్రైన లక్ష్మణరాములు, కొల్చుచుండఁగ, గభీరతఁ బొలుచుచుండును.

తా. అన్నగారైన తిరుపతిని తక్కినమువ్వురును గొలుచుచుండిరి.

క. తన కందమ్ములు నెఱయఁగఁ
గనుఁగొన సిరులీనునట్లు గ్రాలుచునుండుం
బెనుపొంద లక్ష్మణాఖ్యుఁడు
ఘనమతి జోడగుచు నుండఁగా నిత్యంబుఁ. 43

రాఘ.—తనకుఁ-రామునకు, అందమ్ములు నెఱయఁగన్=చెలువములు విస్తరించునట్లు, కనుఁగొన=కంటికిదుద, సిరులీనునట్లు=సంపదలిచ్చునట్లుగ, క్రాలుచునుండుఁ, పెనుపొందఁ, లక్ష్మణాఖ్యుఁడు=లక్ష్మణుఁడను, ఘనమతి=బుద్ధిమంతుఁడు, తోడగుచునుండఁ=జతకాఁగా, నిత్యంబుఁ=ప్రతిదినమును.

తా. రామునకు లక్ష్మణుఁడు జతయయ్యెను.

లక్ష్మి.—తనకందమ్ములు=తన నేత్రపద్మములు, నెఱయఁగఁగనుఁగొనన్= తేఱిచూడఁగా, సిరులీనునట్లు, లక్ష్మణుండను కుమారుఁడు, ఘనమతి=మంచిబుద్ధి యే, జోడు=కవచము, అగుచునుండన్ = కాఁగా, నిత్యంబున్=ప్రతిదినము, వ్రాలుచునుండున్=ప్రకాశించుచుండును.

తా. గోపాలమంత్రి తనయులలోని లక్ష్మణుఁడు (ఈతఁడే) యీ గ్రంథకర్త లక్ష్మణకవి), తనకు బుద్ధియే కవచముగా వెలుంగుచుండెను.

ఉ. అన్నలసుందరత్వము సమంచితధర్మవిచక్షణత్వసం
పన్నత హెచ్చుగా వెలసె బాలుఁడు రాముఁడు బాహుశక్తిన
త్యున్నతి కెక్కి మిక్కిలి సముజ్జ్వలతం దన తేజ మొప్పఁగాఁ
బిన్నలుఁ బెద్ద లందఱును బెద్దగఁ దన్గని ముద్దుసేయఁగన్.

రాఘ.—ఆ+నలసుందరత్వము=ప్రసిద్ధమైన నలమహారాజు సౌందర్యమువంటి సౌందర్యమును, ఇక్కడ (ఆ+నల=అన్నల) "ఊష్మరేఫాత్ పరిత్యజ్య ద్విత్వం సర్వహలాంమతం" అనుకారికవలన ద్విత్వము. సమంచి...సంపన్నత-సమంచిత=ఒప్పుచున్న, ధర్మ= ధనుస్సునుపయోగించుటయొక్క, విచక్షణత్వసంపన్నత=ప్రవీణతయొక్క యతిశయమును, బాహుశక్తిన్ = బాహుబలమున, అత్యున్నతి కెక్కి=మిక్కిలి ప్రసిద్ధుఁడై, తన తేజము= తనపరాక్రమమును, సముజ్జ్వలతన్ = ప్రకాశమానమై, ఒప్పఁగా, పిన్నలు, పెద్దలు, అందఱును, తన్నుగని, ముద్దుసేయఁగన్, బాలుఁడు, రాముఁడు, మిక్కిలి, వెలసెను.

తా. నలునిమించిన రూపమున, ధనుర్విద్యావిలాసమున, బాహుశక్తిని, ప్రతాపమునఁ, బిన్నపెద్దలు తన్ను, ముద్దుచేయురీతిని రాముఁడు సర్వోత్కృష్టుఁడై యుండెను.

లక్ష్మి.—అన్నల=ముగ్గురన్నలయొక్క, సుందరత్వము=సౌందర్యమును, సమంచిత ధర్మవిచక్షణత్వ సంపన్నత=ధర్మము నెఱుంగుటయందలి నేర్పును (న్యాయమును దెలిసికొనుట), బాలుఁడు, రాముఁడు=రాముఁడను నాలుగవ పుత్త్రుఁడు ప్రకాశించెను. తక్కినది సమానము.

తా. రాముఁడను గోపాలుని నాల్గవకుమారుఁడు న్యాయాన్యాయ విచారణదక్షుఁడై యెల్లవారికి ముద్దుగ నెగడెనఁట.

ఉ. అవ్విధిఁ బుత్రవంతుఁ డగు చయ్య మహీపతియాజ్ఞ నెల్లెడన్
నెవ్వఁగ లెల్ల వీడఁగను నేర్పు మెయిన్ బురి నెల్లవేడుకల్
నివ్వటిలన్ బ్రజాతతి వినీతిని రక్షణ మొందఁ జేయుచి
ట్లవ్వనజాయతాక్షునికటాక్షమునన్ ధృతిబల్మి నొప్పుచున్.

రాఘ.—అవ్విధిన్=ఆప్రకారమున, పుత్రవంతుఁడు=పుత్రసంతానము బొందిన, అయ్య=తండ్రియైన, మహీపతి=దశరథుఁడు, ఆజ్ఞన్=తనయానతిచే, ఎల్లెడన్=అన్ని తావులను, ఎల్ల నెవ్వగలు=దుఃఖములన్నియుఁ, వీడఁగన్=పోవునట్లు, నేర్పుమెయిన్=నైపుణ్యమున, పురిన్=అయోధ్యలో, ఎల్ల వేడుకల్=సమస్తవినోదములు, నివ్వటిలన్=జరుగఁగా, వినీతిని=న్యాయమార్గమున, ప్రజాతతిన్=జనసముదాయమును, రక్షణ మొందఁ జేయుచు=కాపాడుచు, ఇట్లు, అవ్వనజాయతాక్షునికటాక్షమునన్=నారాయణునిదయవలన, ధృతిన్=ధైర్యమున, బల్మిన్=బలమున, ఒప్పుచున్.

తా. సులభము.

లక్ష్మ.—అవ్విధిన్, పుత్రవంతుఁ డగుచు, అయ్య=జనకుఁడైన గోపాలమంత్రి, మహీపతియాజ్ఞ=మహీపతిరావుగారియాజ్ఞచే, ఎల్లెడన్, నెవ్వగ లెల్ల వీడఁగను, పురిన్=కుయ్యేరుగ్రామమందు, ప్రజాతతిన్=జనులను, రక్షణ మొందఁ జేయుచు, అవ్వనజాయతాక్షుని కటాక్షమునన్, ఒప్పుచున్.

తా. గోపాలమంత్రి మహీపతిరా వనునధికారి క్రిందఁ గుయ్యేరుగ్రామమునందలి జనులను నిర్బాధముగ, వేడుకలుపుట్టునట్లు న్యాయమార్గమున నేర్పునఁ బాలించుచుండెను.

క. తదనంతరంబ సుతులకు
విదితముగాఁగ నుపనయనవిధి గావింపన్

మదిఁ దలఁచి సర్వసమ్మతి
గదురఁగ శుభవేళ నట్లు గావించెఁ దగన్. 46

టీ. తదనంతరంబ=పిమ్మట, సుతులకున్=కొడుకులకు, విదితముగాఁగన్=ఎల్లవారికిఁ దెలియునట్లు, ఉపనయనవిధి గావింపన్ = వడుగులు చేయుటకు, మదిఁదలఁచి=ఎంచి, సర్వసమ్మతిన్=అందఱయిష్టమునుగొని, శుభవేళన్=శుభలగ్నమున, అట్లు గావించెన్=తాను దలఁచిన ట్లుపనయనములు చేసెను.

రాఘువార్థమున, లక్ష్మణార్థమున రెంటికినర్థము తాత్పర్యము సమానము.

వ. అంత. 47

సీ. రాముఁడును లక్ష్మణుండు గా రాముమీఱ
నున్నవారిద్దఱును గూడి యుచితవిద్య
లభ్యసించుచు నిజగురు నానతిం జ
రింపుచుండిరి మిక్కిలి పెంపుతోడ. 48

రాఘ.—రాముఁడును లక్ష్మణుండును=రామలక్ష్మణులిరువురును, ఉన్నవారిద్దఱును=మిగిలిన భరతశత్రుఘ్నులిద్దఱును, గా రాముమీఱన్, గూడి=జతలు గూడి, ఉచితవిద్యలు = వేదము ధనుర్విద్య మొదలైనవిద్యలను, నిజగురునానతిన్=తమయొజ్జలు చెప్పునట్లు, అభ్యసించుచు = నేర్చుచు, మిక్కిలి పెంపుతోడ, నుండిరి.

లక్ష్మ.—రాముఁడును = నాల్గవకుమారుఁడును, లక్ష్మణుండు = మూఁడవకుమారుఁడును, ఉన్నవారిద్దఱును, తిరుపతి, రామకృష్ణులును, గారాము మీఱన్, కూడి=కలసి, ఉచితవిద్యలన్ = తగినవిద్యలను, నిజగురునానతిన్=తమయుపాధ్యాయులు చెప్పినరీతిని, అభ్యసించుచు, చరింపుచుండిరి.

తా. గోపమంత్రి నలువురుపుత్రులును గూడి సకలవిద్యలు నేర్చుకొనుచుండిరి.

క. తాలిమి సద్విద్యలు గడు
మేలగుగుణములును గలిగి మెలఁగెడునగ్గో
పాలాంశభవుల యినకుల
పాలకు లనువాంఛఁ జూచి ప్రజ లెంచి రొగిన్. 49

రాఘు.—తాలిమి=ఓర్పు, సద్విద్యలు=మంచివిద్యలు, కడుమేలగు గుణములును=శ్లో. "శౌర్యం తేజోధృతిర్దాక్ష్యం యుద్ధేచాప్యపలాయనం, దాన మీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజం" అనునట్టి మేలిగుణములను, కలిగి మెలఁగెడు, అగ్గోపాలాంశభవుల=ఆవిష్ణువునంశమున జనించినవారల, ఇనకుల పాలకులు=సూర్యకులపాలకులు, అనువాంఛన్=అనునట్టికాంక్షతో, చూచి, ప్రజలెంచిరి, (ఒగిన్.)

తా. శాంత్యాదిగుణములు, విద్యలు, గలిగిన నారాయణాంశసంభూతులైన యాసూర్యవంశపు రాజపుత్రులను జనులు పొగడిరి.

లక్ష్మ.—తాలిమి, సద్విద్యలు, కడుమేలగుగుణములును గలిగి మెలఁగెడు, అగ్గోపాలాంశభవులయిన=ఆగోపాలమంత్రియొక్క యంశమున సంభవులైనవారిని, కులపాలకులను=కులము నుద్ధరించువారిని, ప్రజలు, వాంఛన్=కోరికతో, చూచి, ఒగిన్, ఎంచిరి.

తా. సద్గుణములు సద్విద్యలుగల గోపాలమంత్రిపుత్రులను జనులు వంశవర్ధను లని యెంచిరి.

వ. తదనంతరంబ. 50

సీ. స్థిరపరఖాంద్రి కౌశికుఁ డయ్యజనరక్ష
కై నియోగింపఁ దదగ్రసూతి
సుందరమణి సుబాహుం దక్కుఁగలవారి
నిజవిద్యఁ దగుశిక్ష నేరయఁజేసి

తా నహల్యను జాతదయ శుద్ధినొంది యా
    త్మవరసౌఖ్యంబు నొందఁగ నొనర్చి
సకలజను మెచ్చ సంప్రీతితోడుత
    నుగ్రధర్మ మడంచి యొప్పుమీఱ
గీ. నంత నాతండ్రి తనపెద్దయాత్మజునకు
    సొంపుతో నేలబోట్టె నిచ్చుట నిజ మిఁకఁ
    బెండ్లి కేతెం డటంచును బిల్వవచ్చి
    నట్టివారల మన్నించి యాదరించె. 51

రాఘ.—స్థిరపరభాద్రి-స్థిర=స్థిరమైన, పర=శ్రేష్ఠమైన, భా=కాంతి చేతను, అద్రి=సూర్యుఁడైన, "రవిరద్రి రవిర్హైళిః" అనియమరశేషము. కౌశికుఁడు=విశ్వామిత్రుఁడు, అయ్యజనరక్షకై = ఆయజ్ఞమునురక్షించుటకై, నియోగింపన్=నియమింపఁగా, తదగ్రసూతి=ఆదశరథుని పెద్దకొడుకైనరాముఁడు, సుందరమణిన్ - సుంద = సుందుఁడనురాక్షసుని, రమణిన్ = భార్యయైన తాటకను, సుబాహున్ = సుబాహుఁడనురాక్షసుని, తక్కుఁగలవారిన్ = మిగిలినరాక్షసులను, నిజవిద్యన్=తనవిలువిద్దచేతను, తగుశిక్షనెరయఁజేసి = తగినశిక్షయొనర్చి (చంపి), తాన్=తాను, అహల్యను=అహల్యాదేవిని, జాతదయన్=పుట్టినదయతో, శుద్ధినొంది=పవిత్రురాలై, ఆత్మవరసౌఖ్యంబునొందఁగన్=తనపెనిమిటితోడిసుఖములనుపొందునట్లు, ఒనర్చి=చేసి, సకలజనుల్, మెచ్చ, సంప్రీతితోడుతన్, ఉగ్రధర్మము=శివధనుస్సును, అడంచి = విఱిచి, ఒప్పుమీఱన్, అంత=అంతట, ఆతండ్రి=దశరథుఁడు, తనపెద్దయాత్మజునకున్=తనపెద్దకొడుకునకు (రామునకు), నేలబోట్టెనిచ్చుట=భూపుత్రికయైన సీతనిచ్చుట, ఇఁక నిజము, పెండ్లికి, ఏతెండు=రండు, అటంచును = అనిచెప్పుచు, పిల్వవచ్చినట్టివారలను=పిల్వవచ్చినవారలను, మన్నించి = గౌరవించి, ఆదరించె.

తా. రాముఁడు విశ్వామిత్రునియాగమును రక్షించుటకై చని తాటకను సుబాహుఁడు మొదలైన రాక్షసులను జంపి అహల్యను రాతి రూపము నుండి కాంతింజేసి శివునివిల్లు విఱిచినందున సీతను రామునకుఁ బెండ్లిసేసెదము రమ్మని పిలువవచ్చిన జనకరాజుపక్షమువారిని దశరథుఁ డాదరించెను.

లక్ష్మ.—స్థిర...కౌశికుఁడు - స్థిర=స్థిరమైన, పరభా = శత్రుతేజమును, అద్రి=పర్వతములను, కౌశికుఁడు = ఇంద్రుఁడైన, "మహేంద్రగుగ్గులూలూక వ్యాళగ్రాహిషుకౌశికః" అమరము. అయ్య = తండ్రీ, జనరక్షకై = ప్రజాపాలనమునకు, నియోగింపన్ = ఏర్పఱచుటకు, సుందరమణిన్ = సుందరులలో శ్రేష్ఠుఁడును, సుబాహున్ = మంచిబాహువులు గలిగినవాఁడునైన, తదగ్రసూతిన్ = అనలువురుపుత్రులలోఁ బెద్దవాఁడైన తిరుపతిని, తక్కఁగలవారిన్=తక్కినముగ్గురను, నిజవిద్యన్ = తననియోగవిద్యయందు, తగుశిక్షన్ = తగినయుపదేశము చేసి, తాన = తానే, హల్యనుజాతదయన్ -హలి = బలరాముని, అనుజాత=తమ్ముఁడైన శ్రీకృష్ణుని, దయన్ = దయచే, శుద్ధినొంది= పవిత్రుఁడై, ఆత్మ=మనస్సును, వరసౌఖ్యంబునొందఁగనొనర్చి=శ్రేష్ఠసుఖమును బొందింపనెంచి, ఉగ్రధర్మము=తీక్ష్ణమైనధర్మమును, అడంచి=విడిచి, అంతన్, ఆతండ్రితనపెద్దయాత్మజునకు, సొంపుతోనేలన్ = చక్కఁగాఁ గాఁపురము చేయుటకు, బొట్టైనిచ్చుటనిజము = మాబిడ్డనిచ్చుటసత్యము. ఇఁకఁ బెండ్లికే తెండటంచునుఁ బిల్వవచ్చినట్టివారల మన్నించి యాదరించె.

తా. గోపాలమంత్రి తాను దైవధ్యానమున మనస్సునకు సుఖపెట్టఁదలఁచి పెద్దకుమారునకుఁ దక్కినవారికిని,తనప్రజాపాలనభారము నీయ నిశ్చయించుకొనియుండఁగా, పెద్దకొడుకు తిరుపతి మంత్రి కొకరు కన్నె నిచ్చెదమని చెప్పవచ్చిరి.

వ. అట్లాదరించిన యతండు తత్కన్యకావృత్తాంతం బాతఱియగు నచ్చటి వర్తనం బంతయు సవిస్తరంబుగా వినువాఁడై యడిగిన వారలాదినుండియుం గలుగు తత్ప్రవృత్తి యేర్పడం జెప్పి రెట్లనిన. 52

అర్థము తాత్పర్యము రెండుపక్షముల సమానము సులభము.

ఉ. భూమిజనించి మించువిరిఁబోణులలో నుతిగాంచినట్టియ
బ్భామిని కచ్ఛపప్రపదభాగయు మత్స్యమకరేంద్రజంఘయుం
గోమలశంఖకంఠియును గుందరదాళియుఁ బద్మవక్త్రదీ
ప్తామలనీలవేణియు వరాంగియు నై నిధిరీతి నొప్పఁగన్. 53

రాఘ.—భూమిజనించి=భూమిలోఁబుట్టి, మించువిరిఁబోణులలోన్ = మెఱుపులయొక్కయుం పుష్పములయొక్కయుఁ గాంతిగలిగిన స్త్రీలలో (మించుఁబోణులు - విరిఁబోణులలో), కచ్ఛపప్రపదభాగయునున్ - కచ్ఛప=తాఁబేళ్లవంటి, ప్రపదభాగయుం = మీఁగాళ్లుగలదియు, మకరేంద్రజంఘయునున్ = శ్రేష్ఠమైన మొసళ్లవంటి పిక్కలుగలదియు, కోమలశంఖకంఠియును=సుందరమైనశంఖమువంటికంఠముగలదియు, కుందరదాళియున్ = మొల్లమొగ్గలవంటి దంతపఙ్క్తిగలదియు, పద్మవక్త్ర=పద్మమువంటి ముఖముగలదియు, దీప్తామలనీలవేణియున్=ప్రకాశించెడు చక్కనినల్లనిజడగలదియు, వరాంగియున్= శ్రేష్ఠావయవములుగలదియు నై, నిధిరీతిన్ = నవనిధులవలె, ఒప్పఁగన్, నిధి యనుటచే భూమిలోఁబుట్టినదనియు, కచ్ఛప, మకర, శంఖాదులగునవనిధుల రీతి నున్నదనియు ధ్వనించుచున్నది.

తా. (సీత) భూమిలోఁబుట్టి, యందఱు స్త్రీలనుమించి, సర్వాంగసుందరియై యున్నది.

లను.—భూమిజనించి మించు=భూలోకమునం బుట్టి యతిశయించిన విరిఁబోణులలోన్ = స్త్రీలలో, ప్రసిద్ధికెక్కినకన్యయై యున్నది. తక్కినది సమానము.

తా. తెరుపతన్న కిచ్చెదమన్న కన్యక లోకములోనున్న యువిదలలో నున్నతమైనది యనుట.

చ. కొనకొని పెండ్లికూఁతుజనకుండువివాహముసేయఁగోరి పూ
నెను దమయింటము న్నొగి ననేకతరంబులనుండి పూజ్యతం

గను శివధర్మముఁ గుణము గైకొనియా శ్రుతిమార్గవర్తనం
బొనరఁగఁ దాల్చునట్టి పురుషోత్తముతోఁ దనకూఁతుఁ గూ
ర్పఁగన్. 54

రాఘ.—కొనకొని=ఆరంభించి, జనకుండు=జనకమహారాజు, తనకూఁతున్=జానకిని, వివాహముసేయఁగోరి, మున్ను=పూర్వము, ఒగిన్=క్రమమున, అనేకతరంబులనుండి=తరతరములనుండి, తమయింట=తమగృహమున, పూజ్యతంగను=పూజింపఁబడుచున్న, శివధర్మమున్=శివధనుస్సును, గుణము గైకొని=నారిని గ్రహించి, ఆశ్రుతిమార్గవర్తనం బొనరఁగఁదాల్చునట్టి=ఆకర్ణాంతము దిగదీసిన, పురుషోత్తముతోన్=పురుషశ్రేష్ఠునితో (విష్ణ్వంశగలవానితో), తనకూఁతున్, కూర్పఁగన్, పూనెన్=ప్రతిజ్ఞ చేసెను.

తా. జనకుఁడు తనయింటనున్న శివుని విల్లెవ్వరెక్కువెట్టెదరో వారికి జానకి నిచ్చెదనని ప్రతిజ్ఞ చేసెను.

లక్ష్మ.—పెండ్లికూఁతున్=కన్యను, జనకుండు=తండ్రి, వివాహము సేయఁగోరి, తమయింటన్, మున్నొగిన్, అనేకతరంబులనుండి=బహుతరంబులనుండి, పూజ్యతంగను=ఆదరింపఁబడుచువచ్చిన, శివధర్మమున్=శిష్టాచారమును, గైకొని=స్వీకరించి, ఆ=ప్రసిద్ధమైన, శ్రుతిమార్గవర్తనంబు=వేదమార్గప్రవర్తనమును, ఒనరఁగ దాల్చునట్టి=విడువకుండఁ బూనునట్టి, పురుషోత్తముతోన్=మంచి పురుషునితో, తనకూఁతున్, కూర్పఁగన్=పెండ్లి చేయవలయునని, పూనెన్=యత్నించెను.

తా. తనయింట ననుగతమై వచ్చుచున్న యాచారప్రకారము వేదోక్తాచారప్రవర్తకుఁడైన యొక్కచక్కని పురుషునకుఁ దనబిడ్డ నీయవలయునని పెండ్లికూఁతుతండ్రి యత్నము చేసెను.

వ. అట్లు పూని యున్నంత. 55

క. ధరణీవరు లెందఱేనియుఁ
నరుదుగఁ దత్కన్యఁ బెండ్లియాడుటకై వ

త్తురు తజ్జనకుఁడు సెప్పిన
సరణిఁ మెలఁగంగ నొకఁడుఁ జాలఁ డనయమున్. 56

రాఘ.—ధరణివరులు = రాజులు, ఎందఱేనియున్ = ఎందఱైనను (అనేకులు), అరుదుగన్ = ఆశ్చర్యముగ, తత్కన్యన్ = సీతను, పెండ్లియాడుటకై వత్తురు. తజ్జనకుఁడు = సీతతండ్రి, చెప్పినసరణిన్ = చెప్పినచొప్పున, మెలఁగంగన్ = వర్తించుటకు (విల్లెక్కుపెట్టుటకు,) అనయమున్, ఒకఁడుఁ జాలఁడు = ఒక్కఁడును దగినవాఁడు కాఁడయ్యెను. (సమర్థుఁడు లేఁడు.)

తా. ఎంతమంది రాజులో వత్తురుగాని విల్లెక్కుపెట్టుట యొక్కనికిని సాధ్యముకా దయ్యెను.

లక్ష్మి.—ధరణిన్ = భూమియందు, వరులు = పెండ్లికొడుకులు, ఎందఱేనియున్ = ఎంతమందియో, అరుదుగఁ దత్కన్యఁ బెండ్లియాడుటకై, వత్తురు. కాని, తజ్జనకుఁడు సెప్పినసరణిన్ మెలఁగంగన్, ఒకఁడున్, చాలఁడనయమున్.

తా. ఎంతమంది పెండ్లికొడుకులైన వచ్చెదరుగాని యాకన్యతండ్రి చెప్పినట్లు, వేదమార్గప్రవర్తకుఁ డొకఁడును లేకపోయెను.

వ. అట్లప్రాప్తమనోరథుండై యుండఁ గొంతకాలం బరిగె నంత నొక్కనాఁడు. 57

దీనికి స్పష్టము.

క. అతనికి నభిరతిఁ దోఁచెన్
జతయై యొప్పారుమీసుసంతతితో నం
చితసంబంధము గలుగఁగు
రుత రా గాధేయమౌని రూఢాత్మధృతిన్. 58

రాఘ.—అతనికిన్ = ఆజనకమహారాజునకు, అభిరతిన్ = ఆసక్తిచేత, జతయై యొప్పారుమీసుసంతతితోన్ = జంటలై యున్న మీపుత్రులతో, అంచితసంబంధము గలుగన్ = ఒప్పుచుండెడు సహవాసము గలుగుకొఱకు, గురుతరా=

గౌరవమువచ్చుటకు, గాధేయమౌని = విశ్వామిత్రుఁడు, రూఢాత్మధృతిన్ - రూఢ=రూఢమైన, ఆత్మధృతిన్=ఆత్మధారణచేత, తోఁచెన్=కనఁబడియెను.

తా. జనకమహారాజునకు మీపుత్రులతో సంబంధముగలుగుటకును గౌరవమబ్బుటకును విశ్వామిత్రమహర్షి యొకఁడు దొరకెను.

లక్ష్మ.—అతనికిన్=అకన్యాప్రదాతకు, జతయై యొప్పారు=సమానమైయొప్పుచున్న, మీసుసంతతితోన్ = మీమంచివంశముతో, అంచితసంబంధముగలుగన్ = బంధుత్వము కలుగుకొఱకు, గురుతన్ = గురుత్వముచేతను, రాగాధేయమౌ = అనురాగమాధేయముగాఁగలిగిన, నిరూఢాత్మధృతిన్ = నిశ్చయమైన మనోధైర్యముచేతను, అభిరతి=ఆసక్తి, తోఁచెన్=ఉదయించెను.

తా. ఆకన్యాప్రదాతకుఁదనవంశముతో సమానమైన మీవంశముతో బాంధవ్యము సంపాదించుటకై యనురాగము, గౌరవముతోఁ గూడిన యాసక్తి కలిగినది.

వ. అమ్మహాత్ముండు. 59

సీ. మును మిమ్ముఁ బ్రీతిఁ గాంచి నుతించి యాత్మమ
ఘక్రియ కహితత గాంచఁగా మె
లంగునాకారాతులకు మారకుం గన్న
తండ్రి వీవని నినుఁ దనర నెంచి
తనదుహితమ్మదూర్తిఘనత నీసూను లీ
లను గూర్ప నుడివి గుర్వనుమతిఁ గడు
నెమ్మిఁ గొమరు నొప్ప నీవియ్యమౌని శ్రా
మోన్నతమతి నేమమున్నదువఁగఁ
గీ. జేసె నచ్చటనుండి నీజ్యేష్ఠసుతు స
లక్ష్మణుని దోడుకొని యింపలరఁ గరమ్ము

ప్రేమ జనకు గోపాలునిం బేర్మిc జూడ
జేరె వేగ మామోదసుస్థితిదృఢతను. ౬౦

రాఘ.—మును = పూర్వమందు, మిమ్ము = మిమ్మును, ప్రీతిcగాంచి = సంతోషముతోcజూచి, నుతించి = స్తోత్రముచేసి, ఆత్మమఖక్రియకు = స్వయజ్ఞకార్యమునకు, అహితతగాంచcగా మెలంగు = అపకృతి నొనర్చుటకై సంచరించు, నాకారాతులకున్ = రాక్షసులకు, మారకున్ = నాశకుని, కన్నతండ్రివి, ఈవు = నీవు, అని, నిన్ను, తనరనెంచి = చక్కcగ నాలోచించి, తనదుహితమృదూక్తిఘనతన్ = తనయొక్క యిష్టమైనమృదు వాక్యాతిశయముచేతను, నీసూనున్ = నీపుత్త్రుcడైనరాముని, లీలను, కూర్పనుడివి = ఇచ్చుటకు అకుcబలికి, గుర్వనుమతిన్ = గురువగువసిష్ఠునియనుమతిచే, కడునెమ్మిన్ = మిక్కిలిప్రీతిచేత, కొమరుని = కుమారుని, ఒప్పన్, నీవియ్యన్ = నీవిచ్చుట వలన, మౌని = విశ్వామిత్త్రుcడు, కామోన్నతమతిన్ = కోరికచేనున్నతమైన బుద్ధిచే, నేమమున్నడువcగcజేసెన్ = యజ్ఞనియమములను జరపించెను. అచ్చట నుండి = యజ్ఞశాలనుండి, నీజ్యేష్ఠసుతున్ = నీపెద్దకొడుకును, సలక్ష్మణునిన్ = లక్ష్మణసహితుని, తోడుకొని = వెంటcగొని, ఇంపలరన్, కరమ్ము = మిక్కిలి, జనకున్ = జనకుcడను, గోపాలునిన్ = రాజును, వేగము = త్వరగా, ఆమోదసుస్థితిదృఢతను = సంతోషస్థితియొక్క దృఢత్వముచేతను, పేర్మిన్ = గొప్పcగా, చూడన్ = చూచుటకు, చేరెను = సమీపించెను. (మిథిలాపట్టణమునకు వెళ్లెననుట.)

తా. విశ్వామిత్త్రుcడు మీయొద్దకువచ్చి మీరీయcగాc దనయజ్ఞభంగము చేయం రాక్షసులను జంపుటకై మీకొమరుని గొనిపోయి యజ్ఞము నిర్వర్తించి యక్కడనుండి, లక్ష్మణునితోc గూడినరాముని జనకునియొద్దకుc గొనిపోయెను.

లక్ష్మ.—అమ్మహాత్ముcడు = ఆకన్యాప్రదాత, మును = తొల్లి, మిమ్మున్, ప్రీతిcగాంచి = ప్రీతినొందించి, ఆత్మము = మనస్సు, ఆఘక్రియకున్ =

పాపకార్యమునకు, అహితతఁగాంచఁగా = అనిష్టమునుబొంది, మెలఁగు, ఆకారాతులకుమారకుఁ – ఆకార = రూపముచే, అతుల = అసమానుఁడైన, కుమారకుఁ = పుత్రుని, కన్నతండ్రివి, ఈవు, అని నిన్నుఁ దనరెంచి, మృదూక్తిఁ = మృదువాక్యములుగల, తనదుహితఁ = తనకొమార్తెను, ఘనతఁ = అతిశయముచే, నీసూనులీలనుగూర్పనుడివి = నీకుమారునివిలాసమునకుఁగూర్పవలయుననిపలికి, గుర్వనుమతిఁ = పెద్దలయనుమతిచే, కడుసొమ్మిఁ గొమరునొప్పు, నీవియ్యమా = నీవియ్యంకుఁడైన (కన్యాప్రదాత), నికామోన్నతమతినే = అత్యంతాతిశయబుద్ధిచేతనే, మముఁ = మమ్ములను, అచ్చటనుండి, నడువఁగఁజేసెఁ = ఇక్కడికివచ్చునట్లుచేసెను. (పంపెను) సలక్షణుని = శుభలక్షణయుతుఁడైన, నీజ్యేష్ఠసుతుఁ = నీపెద్దకుమారుఁడైన తిరుపతన్నను, తోడుకొని = తీసికొని, ఇంపలరఁగఁ, రమ్ము, ప్రేమజనకుఁ = ప్రేమనుగలిగించు, గోపాలునిఁ = గోపాలుఁడనుపేరుగల, నిఁ = నిన్ను, పేర్మిఁజూడఁ = మిక్కిలిచూడఁగా, వేగ=త్వరగా, మామోదసుస్థితి = మాసంతోషస్థితి, దృఢతనుఁజేరఁ = స్థిరతను బొందెను.

తా. ఆకన్యాప్రదాత నిన్నింతయో కొనియాడెను. చక్కనిపుత్రుని గన్నవాఁడని నిన్నెంచి పెద్దలయనుజ్ఞచే నీకుమారుఁడు తిరుపతిమంత్రిఁ దన కూఁతు నీయవలయునని మమ్మిక్కడికిఁ బంపినాఁడు. కాఁబట్టి పుత్రునిగొని రమ్ము. నిన్నుఁ జూడఁగానే మామనస్సులు సంతోషమును బొందినవి.

క. అనివారితసంతోషం
బొనరఁగ నట్లటకు వచ్చి యుచితోక్తుల దీ
వనలిడ నాగోపాలుం
డనుపమవినయముగఁ బూజ లమరఁగఁ జేసెఁ. 61

టీక.— అనివారితసంతోషంబు=నివారింపఁబడనియానందము, ఒనరఁగఁ = ఒప్పునట్లు, అట్లు=ఆప్రకారము, అటకువచ్చి, ఉచితోక్తులఁ=దగిన మాటలతోఁ, దీవనలిడఁ = విశ్వామిత్రుఁడు దీవింపఁగా, అగోపాలుండు=

జనకమహారాజు, అనుపమవినయమున = ఉపమానరహితమైన వినయముతో, పూజలు = సపర్యలు, అమరఁగఁజేసెన్ = కావించెను.

తా. అక్కడకు రామలక్ష్మణులతో వచ్చినవిశ్వామిత్రుఁడు దీవింపఁగా జనకుఁడు వినయముతోఁ బూజచేసెను.

లక్ష్మి.—అని = ఇట్లని, వారు = ఆపిల్వవచ్చినవారు, ఇతసంతోషం బొనరఁగన్ = పొందఁబడినసంతోష మొప్పుచుండఁగా, ఉచితోక్తుల దీవన లిడఁగా, ఆగోపాలుఁడు = గోపాలమంత్రి, పూజలు, అమరఁగఁ జేసెను.

తా. పెండ్లికిఁ బిల్వవచ్చినవారిని పిండిప్రోలి గోపాలము గారు పూజించిరి.

వ. తదనంతరంబ. 62

గీ. తగుజనములు మేలన శివధర్మ మొప్పఁ
జూపఁ జూచెను లేఖనృస్తుతుఁడు రామ
విభుఁడు గోపాలమంత్రిసద్విమలబుద్ధి
యంత దానిపై కప్పురయమున విప్పి. 63

రాఘు.—తగుజనములు మేలనన్ = సమర్థులందఱును మేలనిపొగడఁ శివధర్మము=శివధనుస్సును, ఒప్పన్, చూపన్=చూపఁగా, లేఖనృస్తుతుఁడు- లేఖ=దేవతలచేతను, నృ=నరులచేతను, స్తుతుఁడు=స్తోత్రముచేయఁబడినట్టియుం, గోపాలమంత్రిసద్విమలబుద్ధి - గోపాల = ఇంద్రునకు, మంత్రి=మంత్రియైన బృహస్పతియొక్క, సద్విమలబుద్ధి = సద్బుద్ధివంటి బుద్ధిగలిగినట్టియుం, రామ విభుఁడు=శ్రీరాముఁడు, అంతన్, దానిపైకప్పు=అవింటిగవిసెన, రయమున విప్పి.

తా. శివునివిల్లును జనకుఁడు చూపఁగా రాముఁడు దానిపైనున్నరెయిఱ విప్పివైచి.

లక్ష్మి.—తగుజనములు మేలనన్, శివధర్మము=శుభాచారము, ఒప్పన్= ఒప్పునట్లు, లేఖన్=శుభలేఖను, చూపన్=కనఁబఱుపఁగా, నృస్తుతుఁడు=నరులచే స్తోత్రముచేయఁబడినట్టి, రామవిభుఁడు-రామ=మనోహరమైన, విభుఁడు=

తేజస్సుగల, సద్విమలబుద్ధి, గోపాలుఁడు = గోపాలమంత్రి, చూచెను. అంత దానిపైకప్పురయమున విప్పి = లేఖను జుట్టియున్నదానివిప్పి.

తా. శుభాచారప్రకారము పెండ్లికివ్రాసిన శుభలేఖను వారుచూపఁగా గోపాలమంత్రి చూచి చదువుటకై దానిని విప్పి.

క. తగఁ జేకొని స్ఫుటరవమొం
దఁగ వింటన్ బాటవరహితతఁ జెందెదున
ట్లుగఁ జేసె వినియుఁ గనియున్
నగుమొగముల సకలభూజనంబులు పొగడన్. 54

రాఘు.—తగన్ = తగునట్లు, చేకొని = విల్లుచేతఁబట్టుకొని, స్ఫుటరవమొందఁగన్ = స్పష్టమైనధ్వని వ్యాపించునట్లు, వింటన్ = వింటియందు, పాటవరహితతఁ జెందెదునట్లుగన్ = పటుత్వము లేకుండునట్లుగా, నగుమొగములన్ = నలుతట్టులనున్న, సకలభూజనంబులు = సమస్తప్రజయు, వినియున్ = ధ్వనినివినియుఁ, కనియున్ = విఱుచుటఁజూచియు, పొగడన్ = స్తుతించునట్లుగా, చేసెన్ = ఒనర్చెను. (అనఁగా విఱిచెను.)

తా. రాముఁడాధనుస్సునుబట్టి వినినవారు కనినవారు పొగడునట్లుగాఁ బెద్దశబ్దము పుట్టునట్లుగా విఱిచివైచెను.

లక్ష్మ.—తగఁజేకొని = శుభలేఖంగొని, స్ఫుటరవమొందఁగన్ = స్ఫుటోచ్చారణము కలుగునట్లుగా, వింటన్ = వినుటచే, పాట = పఠించుట, వర - శ్రేష్ఠమైన, హితతఁజెందెదునట్లుగన్, వినియుఁ గనియు సకలభూజనులు, నగుమొగముల = నవ్వుగలముఖములతో, పొగడన్, చేసెన్ = చదివెను. "ఔపవిభక్తికనామ్నామత్వంస్యాత్సప్తమీతృతీయార్థే" యనుసూత్రము వింటయనుచోటవర్తించును.

తా. శుభలేఖ నందఱు వినునట్లు చదివెను.

వ. అప్పుడు. 65

క. ఘనతరసుజ్ఞాననియతి
జనకుఁడు గోపాలమంత్రి సన్మతి మోదం
బెనయఁగ నలరామవిభుఁడు
తనతనయ వరుం డటంచుఁ దగ నియమించెన్. 66

రాఘ.—ఘనతరసుజ్ఞాననియతి - ఘనతరము, సుజ్ఞాననియతి=మంచి జ్ఞానవిధిగల, గోపా...మతి - గోపాలమంత్రి = బృహస్పతివంటి, సన్మతి = సద్బుద్ధిగల, జనకుఁడు = జనకచక్రవర్తి, మోదంబెనయన్, అలరామవిభుఁడు = ఆ శ్రీరామదేవుఁడు, తనతనయవరుండటంచున్ = తనకూఁతురగు సీత పెనిమిటియని, తగన్, నియమించెన్.

తా. సుజ్ఞాననిధి యైనజనకుఁడు రామునకు సీత నిచ్చెదనని సంతోష మునఁగ నిశ్చయించెను.

లక్ష్మ.—ఘనతరముసుజ్ఞాననియతిన్ = అధికమైన జ్ఞాననిష్ఠచే, జనకుఁడు = జనకమహారాజువంటి, గోపాలుఁడు = గోపాలమంత్రి, సన్మతిన్, మోదంబెనయఁగన్, తనతనయవరుండు = తనయొక్క కొడుకులలో శ్రేష్ఠుఁడగు తిరుపతన్న, అలరామవిభుఁడు = ఆకన్యపెనిమిటి, అంచున్, తగన్, నియమించెన్.

తా. గోపాలమంత్రి తనపెద్దకొడుకునకుఁ, బిడ్డనిచ్చెదమని వచ్చిన వారిపెద్దకూఁతురు తగు నని నిశ్చయించెను.

క. అని శమహితవర్తను ల
త్యనఘు లైనవారు పెండ్లికై యుచితోక్తుల్
వినిపింపఁగ నజసంతతిఁ
ఘనుఁ డాగోపాలుఁ డధికకౌతుక మెసఁగన్. 67

రాఘ.—అని, శమ...నులు - శమహిత = శాంతముతోఁగూడిన, వర్తనులు = నడవడిగలట్టియు, అత్యనఘులునైనవారు = జనకునిచేఁ బంపఁబడినవారు, పెండ్లికై, యుచితోక్తుల్ = తగినమాటలు, వినిపింపఁగన్, అజసంతతి = అజునికుమారుఁడును, ఘనుఁడునైన, ఆగోపాలుఁడు = దశరథుఁడు, అధికకౌతుకమెసఁగన్.

తా. జనకమహారాజుపంపున దశరథునియొద్దికి వచ్చినపెద్దమనుష్యులు పెండ్లికై తగినమాటలాడఁగా దశరథుఁడు సంతోషించెను.

* లక్ష్మ.—అనిశ + మహితవర్తనులు = అత్యంతము పూజ్యవర్తనముగల, అనఘులైన వారు = చెప్పవచ్చినవారు, పెండ్లికై, ఉచితోక్తుల్, వినిపింపఁగన్ = పొత్తుపడుమాటలాడఁగా, అజసంతతిఘనుఁడు = బ్రాహ్మణశ్రేష్ఠుఁడు (అజ = బ్రహ్మయొక్క, సంతతి = వంశస్థుఁడైన బ్రహ్మవంశస్థులు బ్రాహ్మణులు), ఆగోపాలుఁడు = గోపాలమంత్రి, అధికకౌతుకమెసఁగన్ = మిక్కిలిసంతోషము వృద్ధిపొందఁగా.

తా. గోపాలమంత్రి యాపెండ్లివారిమాటలకు సంతోషపడియె.

ఉ. అప్పుడె పౌరలోకమున కాశుభదం బగువార్త యేర్పడం
జెప్పి వినిర్మలాంబరవిచిత్రసువర్ణమణీవిభూష లిం
పొప్ప నలంకరించుకొని యుజ్జ్వలగంధసమగ్రమాలికల్
విప్పగు శోభలీనఁగ నవీనవిశేషవిభూతి రొప్పఁగన్. 68

తా. దశరథుఁడు (గోపాలమంత్రియుం) తత్క్షణమె యాశుభవార్త యెల్లరకు నెఱింగించి, శుభవస్త్రములు భూషణములు నలంకరించుకొని గంధమాల్యములు ధరించి నూతనశోభ యతిశయించునట్లు. (రెంటికి సమము)

క. హితులున్ బంధులును బురో
హితులు సకలమంత్రులును గవీంద్రులు మఱియుం
బ్రతిభావంతులు గురుజను
లతులితముగ నెన్నఁ దగిన యందఱుఁ గొలువన్. 69

రాఘవార్థమున, మంత్రులు=సుమంత్రుఁడు మొదలైనవారు. లక్ష్మణార్థమున, మంత్రులు = నియోగులు.

తా. తగుపరివారము స్నేహితులు, బంధువులు కవులు, గురువులు, పెద్దలు, మఱియుంరావలసినయందఱును వెంటఁ బెట్టుకొని (రెంటికి సమానము

క. తనసన్నిధి నెసఁగుతనయు
లనుపమభద్రవరవాహనారూఢులునై
చను దేరఁగఁ దమచుట్టును
మునుకొని పున్నాగకాండములు నడ తేరన్. 70

రాఘు.—తనసన్నిధి నెసఁగుతనయులు = (ప్రస్తుతము) తనయొద్దనున్న భరతశత్రుఘ్నులిద్దఱును, అను... రూఢులునై - అనుపమ = ఉపమ లేని, భద్ర వర = గజశ్రేష్ఠములను, వాహనారూఢులు = వాహనముల నెక్కినవారు, ఐ, చను దేరఁగన్ = రాఁగా, తమచుట్టును = తమయందఱచుట్టును, పున్నాగ కాండములు - పున్నాగ = యేనుఁగులు, కాండములు = గుఱ్ఱములును, నడ తేరన్ = వెలువడఁగా, "కాండో స్త్రీదండబాణార్వవర్గావసరవారిషు" అమరము.

తా. రామలక్ష్మణులు మిథిలాపురమున నున్నారు. కావున తనయొద్దనున్న భరతశత్రుఘ్నుల నేనుఁగులపైఁ గూర్చుండఁ బెట్టి, యేనుఁగులు గుఱ్ఱములు బలసి రాఁగా.

లక్ష్మి.—తనసన్నిధిని = తనసమీపమున, ఎసఁగుతనయులు = ప్రకాశించెడు కుమారులు నల్వురు, అనుపమ, భద్ర = శుభప్రదములును, వర = శ్రేష్ఠములును ఐన, వాహనారూఢులునై = వాహనములలోఁ గూరుచుండి, చను దేర, తమచుట్టును, మునుకొని = మునుముట్టి, పున్నాగకాండములు = శ్రేష్ఠులైనపురుషులసముదాయములు, నడ తేరన్ = రాఁగా.

తా. తిరుపతన్న మొదలైనకుమారులను వాహనములలో నెక్కించి తమతోఁ బెద్దమనుష్యులను బలువురను వెంటఁదీసికొని బైలుదేఱి.

సీ. వందిమాగధసూతవర్గస్తుతులతోన
బుధజనాశీర్వచస్స్ఫూర్తు లెసఁగ
వేణువీణాశంఖ వివిధధ్వనులతోన
గాణలపాటలు క్రందుకొనఁగ

ఘనకాహళీమృదంగనినాదములతోన
నాగవాసంబుల నటన లమర
ముత్తెంపుగొడుగుల మొత్తంపురుచులతో
విసరుచామరముల మిసిమి గలయ
గీ. దారి దొలఁగు మటంచు ముందఱను వేత్ర
హస్తు లొకకొందఱు నడువ నపుడు గూడి
పౌరకాంతామణులు సేసఁబ్రాలుచల్లఁ
గొందఱు నివాళులివ్వ నానందలీల.

రాఘ.—
లక్ష్మ.— } గాణలు=గాయకులు, నాగవాసము = వేశ్యాజనుల మేళము.

తా. వందిమాగధులు పొగడుచుండఁ, బెద్దలాశీర్వదించుచుండ నానావిధవాద్యములు మ్రోయుచుండ, వేశ్యలనృత్యము, సంగీతవిద్వాంసుల పాటలు, ముత్తెంపుగొడుగులు ఛత్రచామరములుం గలిగి వేత్రహస్తులు,తొలఁగుఁడు దారియిండని ప్రజనొత్తిగించుచుండ, పుణ్యాంగనలు, సేసలు చల్ల హారతులిచ్చుచుండఁగా. (రెంటికి సమానము.)

వ. ఇవ్విధంబునఁ బురంబు నిర్గమించి యెడనెడ గ్రామంబులు పురంబులు సరోవరంబులు నుపవనంబులు మొదలుగా నన్నియుం జూచుచుం జనునప్పుడు పురసమీపంబునకు వచ్చినవార్త యెఱింగి యచ్చటివారునుం దగురీతి నెదుర్కొనిరి. అప్పుడిరుగడలయందునుదీపించుకరదీపికలప్రభలు సంధ్యారాగప్రభలను మునుమున్నుగాఁ గాల్చినకొమ్ముల బయలుదేఱి పొగలుఁ జీకట్లును మఱియు నందు వెడలి పై కెగసి పువ్వులుం జువ్వలును నానావిధంబు లగు నుడుగణంబులును జూచువారల నేత్రోత్పలంబులకు వికాసంబు

సేయుచున్న మత్తాబాదీధితులు చంద్రదీధితులునుంగా వెలయుచుండ నారాత్రికిరాత్రివచ్చినట్లు తోఁచె వెండియు నెసంగు చిచ్చుబుడ్లు నగాదునాళంబులును జక్రబాణంబులును లంకాపురులు నాదిగాఁ గలుగుప్రకాశంబువలన రాత్రియయ్యును బవలుగాఁ దోఁచి యొప్పుచుండెఁ దదనంతరంబ

తా. సకలసన్నాహములతోఁ బెండ్లివారు బైలుదేఱి రాఁగా పట్టణము వెలుపటఁ బెండ్లికూఁతువారెదుర్కొనిరి. అక్కడ ననేకవిధములగు చమత్కారములు చేయఁబడినవి. బాణాసంచు కాల్పఁబడియెను.

క. తగువిడిదల వారలు సూ
పఁగ నచ్చటికేగఁ బూని ప్రాభవ్యమ్ముల్
మిగులఁగఁ బరిజనసహిత
మ్ముగ మంగళతూర్యఘోషములు మ్రోయంగన్. 73

వ. విడిదలు ప్రవేశించిరి.

క. ఇదె లగ్నము చేరువగాఁ 74
గదిసెను వేగంబె పెండ్లి గావింపఁగ నె
య్యదిని దలఁపుఁ డాలస్యం
బదియేటి కటంచుఁ బెద్ద లందఱుఁ బల్కన్. 75

సీ. జలిబిలివలపులు గులికెడు పన్నీరు
చల్లినవీథివాకిండ్లు దాఁటి
కరమొప్పుమృగమదకర్దమం బలఁదిన
పెల్లైన కొల్వుసావిళ్లు దాఁటి

యరుణకాంతుల మీఱు నామ్రపల్లవపుఁదో
రణములుగల్గు ద్వారములు దాఁటి
విలువఁజెప్పఁగరాని తెలిముత్తియపుముగ్గు
లమరిన కక్ష్యాంతరములు దాఁటి
గీ. భాసురస్తంభవిపులము భద్రకుంభ
యోగ్య మఖిల భవ్యద్రవ్యయుతము నగుచు
మాన్యతగను చతుర్గృహమధ్యమాంగ
ణప్రదేశము జేరి రందఱును గడఁగి. 76

వ. అప్పుడు. 77

సీ. పెండ్లికొడుకువారిఁ బేర్కొని సుగుణాఢ్యుఁ
డగుపురోహితుఁడు మహాతపఃప్ర
శస్తి వసిష్ఠుండు సారసహితకులా
చారక్రమములు హర్షమునఁ జెప్పఁ
దత్పురోహితుఁడు శతానందుఁడాదిగాఁ
గలిగినవంశకర్తలను బేరు
కొనిచెప్పె నుభయులకులగోత్రలక్షణం
బులు విని సర్వజనులును మెచ్చఁ
గీ. బ్రీతిఁ బెండ్లికొమరుఁ బెండ్లికూఁతు నపుడు
మంగళస్నానముల నొనర్పంగఁ జేసి
యధికమాల్యాంబరవిభూషణాదికము ల
లంకరింపఁగ జేసి నిశ్శంకవృత్తి. 78

రాఘు—పెండ్లికొడుకువారిన్, పేర్కొని=పేరెత్తి, సుగుణాఢ్యుఁడు అగుపురోహితుఁడు, మహాతపఃప్రశస్తి=గొప్ప తపఃప్రభావము గలిగినవసి

ష్ఠుండు, సారసహితకులాచారక్రమములు = సూర్యవంశకులాచారమర్యాదలు, వార్షమునఁ జెప్పెఁ, తత్పురోహితుఁడు=జనకపురోహితుఁడగు, శతానందుఁడు, ఆదిగాఁగలిగిన=నిమి మొదలగు వంశకర్తలను, పేరుకొని చెప్పెను. సర్వజనులు, నారెండువంశముల పూర్వులగోత్రములు పేరులు విని మెచ్చిరి.

తా. పెండ్లికొడుకును పెండ్లికూఁతు మంగళస్నానముచేయించి వివిధ భూషణాదు లలంకరింపించి వసిష్ఠుఁడు, శతానందుఁడు రెండువైపులవారి ప్రవరలు చెప్పిరి.

లక్ష్మి.—మహాతపఃప్రశస్తిఁ=తపఃప్రాశస్త్యమున, వసిష్ఠుఁడు=వసిష్ఠమహర్షి వంటి, పురోహితుఁడు=గోపాలుని పురోహితుఁడు, సార=న్యాయముతో, సహిత=కూడుకొనిన, కులాచారక్రమములు=వంశమర్యాదలను, తత్పురోహితుఁడు=పెండ్లికూఁతువారి వైపు పురోహితుఁడు, శతానందుఁడాదిగా=బ్రహ్మ మొదలుకొని పేరుకొని చెప్పెను. తక్కినది సులభము.

తా. సులభము.

క. కమనీయము లగుమధుప
ర్కము లిడి యప్పెండ్లికొడుకు కాళ్లుగడిగి నె
య్యముగదుర ధారవోసెఁ
సుమేరుధైర్యుండు మామ సుతనుమణి సుతఁ. 79

రాఘ.— } కమనీయములగు=మనోహరములైన, మధుపర్కములిడి=మధుపర్కములిచ్చి, (మధుపర్కము = తేనెతోఁ
లక్ష్మి. — }
గూడిన పెరుఁగు మున్నారుపెట్టి)అప్పెండ్లికొడుకుకాళ్లు గడిగి,=మామ=మామగారు, సుతను=స్త్రీలయందు, మణిఁ=శ్రేష్ఠురాలగు, సుతఁ = కూఁతును, ధారవోసెఁ=ధారాపూర్వకముగ నిచ్చెను.

తా. సాధారణముగా మనలో మధుపర్కములనినఁ గన్నెను ధారవోయుసమయమున నిచ్చు నూతనవస్త్రముల కర్థము చేయుచున్నారు. ఈపేరు శాస్త్రసిద్ధముగాదు. మధుపర్కములు అను బహువచనము, తేనెగలిపిన

పెరుఁగు మూఁడుసారులు పెట్టుటచేవచ్చినది. పెండ్లికొడుకుకాళ్లుగడిగి మామ మధుపర్కము లిచ్చి తనసుతను ధారాదత్తముచేసెను. కవి, పెండ్లివిషయమిందు సూత్రక్రమముగా వర్ణింపలేదు. అనఁగా జరుగవలసిన విధానములం క్రమముగాఁ జెప్పలేదు. ప్రవరలు చెప్పించి మంగళస్నానములు చేయించినాఁడు. ఈక్రిందిపద్యములో మంగళసూత్రధారణము. దీనితర్వాత గౌరీపూజ మొదలైనవి.

వ. అప్పుడు. 80

చ. మదనజయంతులం దెగడుమానితరూపవిలాసలీల లిం
పొదవఁగ నున్న పెండ్లికొడుకొ ప్పెడిరెయొప్పులకుప్పయైనయ
మ్మదవతికంఠమం దిడిరెయి మంగళసూత్రముసర్వపుణ్యయో
షిదురుగళాగ్రసంగతి విశేషగుణాశ్రయసచ్చరిత్రముల్. 81

రాఘు.—
లక్ష్మ.— } మదనజయంతులన్=మన్మథునిజయంతుని, తెగడు=తిరస్కరించు, మానిత=పిప్పయిన, రూప విలాసలీల లింపొందవఁగ నున్న పెండ్లికొడుకు, అమ్మదవతికంఠమందు = ఆవధువుగళమున, సర్వపు... సచ్చరిత్రముల్—సర్వ=సమస్తమైన, పుణ్యయోషిత్ = పుణ్యస్త్రీల ఉరు, గళాగ్రసంగతిన్=కంఠములందుఁ దగిలించుటవలన, విశేషగుణాశ్రయసచ్చరిత్రముల్=అధికగుణముల కాలవాలమైన, చారిత్రముగల; మంగళసూత్రమును, ఇడిరెయ్=కట్టెను.

తా.(చిరకాలసువాసినులకంఠములందలి సూత్రమును దెచ్చి కట్టుటకుబదులు, సువాసినులకంఠమం దొక నూతనసూత్రముంచిదానిని గట్టుట యాచారమైనది). పెండ్లికొడుకు పెండ్లికూఁతుకంఠమునఁ దాలి గట్టెను.

క. గౌరీపూజావిధి కడుఁ
గౌరిమి నొప్పారుపెండ్లికూఁతు న్వేడ్కన్
జేరంగ సప్తపాదము
లారూఢిం ద్రొక్కఁజేసె నాత్మేశుండున్. 82

తా. గౌరీపూజచేయుటచేఁ బ్రకాశించు పెండ్లికూఁతుం జేరదీసి పెండ్లికొడుకు సప్తపాదములు త్రొక్కించెను. (కంటికింపుగ).

క. రాజితమతులు ధ్రువంతే
రాజావరుణో యటంచు రభసము మీఱం
గా జగతీసురవర్యులు
తేజంబుగ వేదవాక్తతిఁ దీవింపన్. 83

రాఘ.— } రాజితమతులు=వేదపఠనముచేఁ బ్రకాశించెడు హృదయములుగల, జగతీసురవర్యులు=బ్రాహ్మణశ్రేష్ఠులు, తేజంబుగన్, 'ధ్రువంతే రాజావరుణః' అటంచు, వేదవాక్తతిన్=వేదవాక్యములచే దీవింపన్=ఆశీర్వదింపఁగా.
లక్ష్మ.— }

క. ఇరువురు నొండొరులపయిం
దరితగతిన్ ముత్తియంపుఁదలఁబ్రాల్ జనుల
చ్చెరువంది చూడఁగాఁ బో
సిరి సిరిగలమొగములందుఁ జిఱునవ్వొలయన్. 84

తా. జనులందఱు నచ్చెరువునఁ జూచుచుండఁ జిఱునవ్వులతో ముత్యాలతలంబ్రాలు నొకరిపై నొకరు పోసికొనిరి. (కంటికి నమానము).

మహాస్రగ్ధర. అమరెన్ హృత్ప్రీతిగాఁ బణ్యయువతిమణి నా
ట్యప్రకారంబు లత్యు
త్తమభేరీకాహలీమర్దలపణవముఖ
ధ్వానముల్ వెల్లువెల్లన్
రమణీయంబై నసద్విప్రసముదయసమ
గ్రస్థిరాశీర్వచోబృం
దము లొప్పెన్ వందిలోకస్తవములు చెలఁగెం
దద్ద తత్కాలమందున్. 85

రాఘ.—
లక్ష్మ.— } తత్కాలమందున్ = అవివాహసమయమున, కళ్యా...ణారంబులు = వేశ్యాజనవర్తనంబులును, అమరెన్, అత్యుత్త...ధ్వానముల్ = శ్రేష్ఠములైన భేరులు, బూరలు, మద్దెల మొదలైన వాద్యవిశేషములచప్పుడులును, పెల్లు = అతిశయము, చెల్లన్ వర్తిల్లఁగా, రమణీయంబైన, సద్విప్రసముదయ = బ్రాహ్మణబృందముయొక్క, సమగ్రస్థిరాశీర్వచోబృందములు = పూర్ణములు స్థిరములునైన దీవనపలుకులు, ఒప్పెన్. వందిలోకస్తవము = వందు లనుపొగడెడు జాతివారియొక్క, స్తవములు = స్తోత్రములు చెలంగెన్. హృత్ప్రీతిగా = హృదయానందముగా.

వ. అంత నవ్వధూవరులు ప్రదక్షిణపూర్వకంబుగా వైశ్వానరు న కరుంధతీవసిష్ఠులకు సకలగురుజనంబులకు మఱియుఁదగిన వారలకు నమస్కరించి వారలచే దీవనలు వడసి యత్యంతానురాగరేఖలం దేజరిల్లుచుండి రవ్విధంబున. 87

తాత్పర్యము, అర్థము, సుగమము.

గీ. రమణమనువంశదీపిక రాజవదన
ధరణిజను లసమానవైఖరి నుతింపఁ
దగినరీతి గోపాలుఁ డెంతయు ముదమునఁ
బెద్దసుతునకు నాగతిఁ బెండ్లిచేసె. 87

రాఘ.—రమణమనువంశదీపికన్—రమణ = పెనిమిటిసంబంధమైన, మనువంశ = వైవస్వతమనువంశమునకుఁ, దీపికన్ = దీపమువంటిదానిని, రాజవదనన్ = చంద్రునివంటి మొగముగలిగినసీతను, ధరణిజనులు, అసమానవైఖరిన్, నుతింపఁదగినరీతిన్, గోపాలుఁడు = దశరథమహారాజు, ఎంతయుముదమునన్, పెద్దసుతునకున్ = రామునకు, ఆగతిన్ = పైనఁజెప్పఁబడిన విధమున, పెండ్లిచేసెను.

తా. మనువంశదీపిక యగుసీతను రామునకుఁ బెండ్లిచేసెను.

లక్ష్మి.—వంశదీపికన్=వంశమునకు దీపమువంటిదానిని, రాజవదనన్=చంద్రముఖిని, రమణమను=రమణమ్మ యను పేరుగలకన్యను, గోపాలుఁడు=గోపాలమంత్రి, పెద్దసుతునకున్=తిరుపతన్నకు, పెండ్లిచేసెను.

తా. గోపాలమంత్రి తనపెద్దకొడుకునకు రమణమ్మ యనుకన్యను బెండ్లి చేసెను.

వ. అప్పుడు కన్యకామణితండ్రి గోపాలున కిట్లనియె. 88

రాఘ.—కన్యకామణితండ్రి=సీతతండ్రి, గోపాలునకున్=దశరథునకు.

లక్ష్మి.—గోపాలుఁడను తిరుపతన్నతండ్రికి, ఇట్లనియెన్ = క్రిందఁ జెప్పఁబోవురీతి గాఁ బల్కెను.

క. మారరమణుఁ బట్టిఁగాఁ గని
యే రంజిలుచుంటిగాక యిట్టిత్తరి ని
న్నారిక్ శ్రీమత్కన్యక
నీరలు స్నుషఁ జేసికొనుట నే ధన్యుండన్. 89

రాఘ.—మారరమణున్=విష్ణువును, పట్టిఁగా = పుత్రునిఁగా, కనియే=కనుటచేతనే, రంజిలుచుంటిగాక=సంతోషించుచుంటిని కాని, ఇట్లు=ఈరీతిని. ఇత్తటిన్=ఇకాలమున, ఇన్నారిన్=ఈకన్యను, శ్రీ = మహాలక్ష్మిని, మత్కన్యకన్=నాకూఁతును, ఈరలు=మీరు, స్నుషఁజేసికొనుటన్=కోడలింగా నొనర్చుకొనుటవలన,ఏన్=నేను, ధన్యుండన్=కృతార్థుఁడను, (అయితిని.)

తా. మీరు విష్ణుమూర్తిని పుత్రునిగాఁ బడసినందుకై సంతసించుచున్నారు. లక్ష్మియైన యీనాకూఁతును మీకోడలిఁ జేసికొన్నారు కావున, ధన్యుఁడ నైతిని.

లక్ష్మి—మారరమణున్=మారరమణమ్మను, పట్టిఁగాన్ = కొమార్తెనుగా కని-కాంచి, ఏన్=నేను, రంజిలుచుంటిన్ = అనురాగాతిశయమునమంటిని

ఇట్లు, ఇత్తఱిన్, శ్రీమత్కన్యకన్ = లక్ష్మీయుక్తురాలైన కన్యను, ఈరలం స్నుషఁ జేసికొనుటనే, ధన్యుండన్.

తా. రమణమ్మ యను సీనాకూఁతును గాంచి యెంతయో సంతసపడు చుంటిని. పైఁగా మీకోడలైన కారణమున నేను ధన్యుఁడను.

సీ. ధృతి నాసముద్రమందిరుపతిరూపుగా
రాము విచారించి రమణ మహిత
నయఁ బెండ్లి చేసి జనకుఁడు రెండవవత్స
రమయనవరత భద్రగతి నెగడ
మనమునఁ దలపోసి తనకూర్మి లాలస
మానవివాహంబు పూనిసేయ
*నగు వేళ యిది యని సుగుణాలి నిందిరా
మందిరుపతి సునామజయశోభి
గీ. రామకృష్ణుతల్పముగాన రహి నొనర్ప
నౌనని సుమిత్రసంతతిలోనఁ బెద్ద
కొమరు గైకొని శుభరీతి కమరఁ జేసెఁ
బరమకల్యాణ మౌనని ప్రజలు మెచ్చ. 90

రాఘు.—ధృతిన్ = ధైర్యమున, సముద్రమందిరు = విష్ణువుయొక్క, పతిరూపుగాన్ = ప్రతిరూపముగాను, రామున్ = శ్రీరాముని, విచారించి = ఆలోచించి, రమణన్ = అత్యంతము, మహితనయన్ = సీతను, పెండ్లి చేసి, జనకుఁడు = మిథిలేశ్వరుఁడు, రెండవవత్స = ఊర్మిళ, రమయనన్ = లక్ష్మివలె, వరతన్ = శ్రేష్ఠతచే, భద్రగతి = గజగమన, నెగడన్ = వృద్ధిఁబొంద, మనమునఁ

* ఈనాల్గవచరణమునకు, అర్థము వ్రాయుటలో "అవసరంబిదియని యచలమందిరుపతకం బుర్వనుపమాన ఘనయశోభి" అను పాఠమును గ్రహించినారు. అది వేఱొకప్రతిలో నుండవచ్చును.

దలపోసి, తనదు, ఊర్మిళాలసమానవివాహంబు = ఊర్మిళయొక్క ప్రకాశమానమైన పెండ్లి, పూని, చేయన్ = చేయుటకు, అగువేళ = అవసరము. ఇది యని (ఇక్కడనుండి వరుని విశేషణములు) సుగుణాళిన్ = గుణసమూహము మున, ఇందిరామందిరపతి = లక్ష్మీపతితోఁ బ్రతి, సునామజయశోభి = మంచి పేరుతోఁ జయశోభగలవాఁడు, రామకృష్ణతల్పము = సుందరమైన విష్ణుని పాన్పు (అయినవాఁడు), కాన = కాఁబట్టి (లక్ష్మణుఁడు శేషాంశ కావున) రహిన్, ఒనర్పనౌనని = పెండ్లి చేయఁదగునని, సుమిత్రసంతతిలోనన్ = సుమిత్రకొడుకులలో, పెద్దకొమరున్ = లక్ష్మణుని, కైకొని = గ్రహించి, శుభరీతి కమరన్ = శుభప్రకారమున కమరినవాఁడై యొండఁగా, ఔనని ప్రజలు మెచ్చన్, కల్యాణము = వివాహమును, చేసెను.

తా. రామునికి సీత నిచ్చి పిమ్మట రామునితో సమానుఁడు శేషాంశగల వాఁడు నని యెంచి లక్ష్మణునకు తనరెండవపుత్రిక యూర్మిళను బెండ్లిచేసెను.

లక్ష్మ.—ధృతిని = ధైర్యముచేతను, ఆశన్ = ఆశచేతను, ముద్రన్ = సంతోషసంపత్తిచేత, తిరుపతి = తిరుపతియను పెద్దకొమారునియొక్క, రూపు = రూపమును, గారాము = గారామును, విచారించి = ఎంచి, రమణము = రమణమ్మను, హితనయన్ = ఇష్టమైన నీతిగలదానిని, పెండ్లిచేసి, జనకుఁడు = తండ్రియైన గోపాలమంత్రి, రెండవవత్సరము = మరుసటియేఁడు, అనవరతభద్రగతి = ఎడతెగని శుభప్రవర్తనము, నెగడన్ = వృద్ధిఁబొందుటకు, మనమునం దలపోసి, తనయూర్మి = తన ప్రీతి, లాలసము = కోర్కిని, అనన్ = పొందునట్లుగా, పూని వివాహంబు సేయన్, అగువేళ యిది యని, అచలమన్ - అచల = చలింపని, మన్ = లక్ష్మిగల, తిరుపతకన్ = తిరుపతక్క, తిరుపతియొక్క (గామక్క, బ్రహ్మక్కవలె) యను (తిరుపతి + అక + అన్ - తిరుపతక్కన్) పుర్వ . . . శోభి - పురు = విస్తారమైన 'పురుభూః పురుభూయిష్ఠ' మ్మని యమరము. అనుపమ = ఉపమలేని, అనఘు = పాపరహితమైన, నయశోభి = నీతిచేఁ బ్రకాశించు రామకృష్ణతల్పముగాన - రామకృష్ణ = రామకృష్ణుఁడను రెండవకుమారుని, తల్పముగాన్ + అ = భార్యగా నౌ "తల్పంశయ్యాట్టదారేషు" అమరము. రహిన్,

బరర్పనగునని, సుమిత్రసంతతి = సుప్రజ్ఞనము, లోనన్ = మనమున, పెద్దగా మరుగైకొని = దొడ్డతేటను అవలంబించి, శుభరీతి కమరన్ = శుభమర్యాద కాయితీముకాఁగా, జానప్రజలు మెచ్చఁ బరమకల్యాణమును జేసెను.

తా. గోపాలమంత్రి తిరుమతన్నకు రమణమ్మను బెండ్లిచేసి రెండవ యేఁడు రామకృష్ణునకుఁ దిరుమతమ్మను వివాహమొనర్చెను.

వ. ఇట్లిరువురకు వివాహంబు చేసి మఱియును. 91

రాఘ.—ఇరువురకున్ = సీతోర్మిళలకు.

లక్ష్మ.—ఇరువురకున్ = తిరుమతిరామకృష్ణులకు.

ఆ. అంతఁ దజ్జనకుఁడు స్వాత్మముఁ దమ్మబి
డ్డలపయి స్సమత్వమలరఁ జేర్చి
యున్న వారిరువుర కొగిఁ బెండ్లి సేయఁగ
వరుసఁ దలఁచె హితులు గురులు మెచ్చ. 92

రాఘ.—అంతన్ = పిమ్మట, తజ్జనకుఁడు = ఆజనకరాజు, స్వాత్మమున్ = తనమనస్సును, తమ్మబిడ్డలపయిన్ = కుశధ్వజునికొమారితలయందు, సమత్వము = స్వపుత్రియందుంచినట్లు భేదరహితముగ, అలరఁజేర్చి = ఉనిచి, ఉన్నవారిరువురకు = భరతశత్రుఘ్నులకు, హితులు, గురులు, మెచ్చ, వరుసఁ బెండ్లిసేయఁగ దలఁచె.

తా. జనకుఁడు తనయిద్దఱుపుత్రికలకుఁ బెండ్లిచేసి తనతమ్మునిబిడ్డలకుఁ గూడ భరతశత్రుఘ్నులకిచ్చివివాహముఁ జేయ నలుగురు మెచ్చునట్లు తలంచెను.

లక్ష్మ.—అంతన్ = పిదప, తజ్జనకుఁడు = గోపాలుఁడు, స్వాత్మము దమ్మున్ = మనస్సంతోషమును, బిడ్డలపయిన్ = పుత్రచతుష్టయముపైని, సమత్వమలరఁజేర్చి, ఉన్న వారిరువురకున్ = లక్ష్మణరాములకు, పెండ్లిచేయఁదలఁచెను.

తా. గోపాలమంత్రి తక్కినయిద్దరుకొడుకులకుఁ బెండ్లిచేయ నెంచెను.

వ. అట్లు తలంచి యొక్కసముచితసమయంబున. 93

మ. అవునంచెన్న జగమ్మనావిలసితాఖ్యన్ మించుసామోదమ్మా
లవి యన్మధ్యమలోకసన్నుతగుణాలంకార శృంగారసం
స్తవనీయాననవార్జ నాభరతుఁడన్ సచ్చక్ర తేజస్స్ఫుర
న్నవధీశాలికి లక్ష్మణాగ్రజునకుం దాఁ బెండ్లి చేసెం దగన్.

రాఘు.—జగమ్ము = జగత్తు, ఔనంచెన్నన్ = బళీయనునట్లు, అనావిలసితాఖ్యన్ = స్వచ్ఛమైనకీర్తిచేతను, మించు = హెచ్చినట్టియుం, సామోదన్ = సంతోషముతోఁగూడినట్టియుం, మధ్యమలోకసన్నుతగుణాలంకారన్ = భూలోకముచే స్తోత్రముచేయఁబడినగుణములును, అలంకారములును గుట్టియును, శృంగా...ర్జను-శృంగార = సౌందర్యముచేత, సంస్తవనీయ = స్తుతిచేయఁదగిన, ఆనన=ముఖమును, వార్జను = (వాః + జ + ను) పద్మముగలిగిన మాలవియన్ = మాళవియనుదానిని, ఆ, భరతుఁడన్ =భరతుఁడను, సచ్చక్రతేజస్ఫురన్నవధీశాలికిన్ -సత్ చక్ర =విష్ణుచక్రముయొక్క, తేజః=అంశముచేత, స్ఫురత్ =ప్రకాశించుచున్న, నవధీశాలికిన్ = నూతనబుద్ధిశాలికి, (భరతుఁడు విష్ణుచక్రాంశమునఁ బుట్టెను) లక్ష్మణాగ్రజునకున్ =లక్ష్మణునికంటెఁ బెద్దవానికి, తగన్, పెండ్లిచేసెన్.

తా. సుందరాంగియైన మాళవిని భరతున కిచ్చి పెండ్లిచేసెను.

లక్ష్మ.—అవునంచెన్నన్, జగమ్మనా = జగమ్మయను, విలసితాఖ్యన్ = తెలసినపేరుతో, మించు, సామోదమాలన్ =పరిమళించు పుష్పమాలికగలదానిని, వియన్మధ్యన్ = ఆకాశమువంటి మధ్యభాగముగల, లోకసన్నుత గుణాలంకారన్, శృంగారసంస్తవనీయాననన్, వార్జనాభరతుఁడన్ -వార్జ=పద్మము, నాభ = నాభిగలవిష్ణువునందు, రతుఁడన్ = ఆసక్తుఁడను, సచ్చక్రతేజస్ఫురన్నవధీశాలికి – సచ్చక్ర = సత్పురుషసముదాయమునందు, తేజస్స్ఫురన్నవధీశాలికి, లక్ష్మణాగ్రజునకున్ =లక్ష్మణుఁడను (బ్రాహ్మణునికి) వానికి, పెండ్లిచేసెను.

తా. జగ్గమ్మ యనుకన్యను మూఁడవపుత్త్రుఁడు లక్ష్మణునకుఁ బెండ్లి చేసెను. 95

వ. అప్పుడు.

గీ. ఈరుచిరమూర్తి యైనసుధీరమణికి
నీశుభరతనామోదాత్తహితమతిఁ బ్రమ
దగజగమనఁ గూరిచె నేఁడు తప్పకుండ
శుభము లొనరింప సాగె నీసుకృతి బళిర. 96

రాఘ.—ఈరుచిరమూర్తియైన=ఈసుందరదేహముగల (ఈ=లక్ష్మివలె రుచిరమూర్తి), సుధీరమణికిన్ = మంచిబుద్ధిగలస్త్రీకి, ఈశు = ప్రభువయిన, భరత...మతిన్-భరత=భరతుఁడను, నామ=పేరుగల, ఉదాత్తహితమతిన్= అతిశయమైన 'యిష్టబుద్ధిగలవానికి, ప్రమదగజగమనన్ = మత్తేభగామినిని, కూరిచెన్ = పెండ్లిచేసెను. నేఁడు, తప్పకుండన్, (అందఱకు) ఈసు. కృతి = జనకుఁడు, శుభములొనరింపసాగెన్, బళిర.

లక్ష్మ.—ఈరుచిరమూర్తియైన, సుధీరమణికిన్ = సుధీరులలో శ్రేష్ఠుఁడైనలక్ష్మణునకున్, ఈశుభరతన్-ఈ=పరిస్పృశ్యమానమైన, శుభరతన్=శుభములయందాసక్తిగలదానిని, ఆమోదాత్తహితమతిన్=సంతోషముతో స్వీకరింపఁబడిన యిష్టమైనబుద్ధిగలదానిని, జగమనన్ = జగ్గమ్మను, ప్రమదగన్ = భార్యగా, ఏఁడుతప్పకుండన్ = ప్రతిసంవత్సరము, శుభములు = పెండ్లిండ్లు, ఈసుకృతి, ఒనరింపసాగెన్, (సుకృతి = పుణ్యాత్ముఁడు).

తా. లక్ష్మణునకు జగ్గమ్మను బెండ్లిచేసెను.

వ. అనుచుఁ దత్పురజనంబు లగ్గోపాలుం బ్రశంసించి రంతమఱియును. 97

రాఘ.—తత్పురజనంబులు = మిథిలాపురవాసులు, అగ్గోపాలున్ = జనకమహారాజును, ప్రశంసించిరి.

లక్ష్మ.—తత్పురజనంబులు=పయ్యేటివాసులు, అగ్నోపాలుఁ, ప్ర
సించిరి.

గీ. ఘనుఁడాజనకుఁ డనిశశో
భనుఁడా శ్రుతకీర్తిరామపరిణయ మింక నే
నొనరింపవలయు నీవా
యనమున నని యూహచేసె నర్థ్యామగుతటిఁ. 98

రాఘ.—ఘనుఁడు, ఆజనకుఁడు, అనిశశోభనుఁడు=ఎడతెగని శుభవ
తుఁడు, ఆశ్రుతకీర్తిరామ = ఆశ్రుతకీర్తియను కన్నెయొక్క, పరిణయము
వివాహము, ఇంక, నేను, ఈవాయనమునను = ఇచ్ఛాపూర్వముచేత, అని; అర్థ
మగుతటిఁ=మంచితరుణమున, ఊహచేసెను.

తా. శ్రుతకీర్తి యనుకన్నెను వివాహముచేయవలయు నని జనకుఁ
డూహించెను.

లక్ష్మ.— ఆజనకుఁడు = ఆతండ్రి గోపాలమంత్రి, ఆశ్రుతకీర్తి=అంగీ
కరింపఁబడినకీర్తిగలవాఁడు "ఊరీకృతమురరీకృతమంగీకృత మాశ్రుతం" అమ
రము. రామపరిణయమును = రాముఁడనుకనిష్ఠపుత్రుని వివాహమును, ఈవా
యనమున = ఈసంవత్సరముననే, యని యర్థ్యామగుతటి నూహచేసెను.

తా. గోపాలమంత్రి తననాల్గవపుత్రునకుఁ బెండ్లిచేయఁ దలఁచెను.

గీ. అట్టు లూహచేసి యప్పట్టికి సువ
స్త్రాంగరాంగమాలికాభరణము
లాదిగాఁగఁ గలుగునట్టియలంకృతు
లొనరిచి యొకశుభముహూర్తమునను. 99

రాఘ.—అట్టులూహచేసి, అప్పట్టికిఁ = శ్రుతకీర్తికి, సువస్త్రా...భర
ణములు, మంచివస్త్రములు, మెఱుఁగుపూఁతలు, హారములు, నగలు, ఆది

గాఁగల్ = మొదలైన, కలుగునట్టి యలంకృతులు = కలిగినభూషణములు, ఒన శిచి, ఒకశుభముహూర్తమున = ఒకశుభలగ్నమున.

లక్ష్మ.—అప్పట్టికిన్ = ఆరామునకు. తక్కినది సమానము.

క. కుతుకమునఁ బెండ్లి సేసెన్
వితతాదర మొప్ప నతఁడు వేంకటలక్ష్మిన్
శ్రుతకీర్తిరామనామా
న్వితునకు శత్రుఘ్నునకు వినీతి దల్పిరన్. 100

రాఘ.—కుతుకమున=సంతోషముతో, వేంకటలక్ష్మిన్=పాదములు కొట్టివేయుం సంపత్తిచేతను, శ్రుతకీర్తిరామను=శ్రుతకీర్తియనుమగువను, ఆమా న్వితునకున్ = ఆలక్ష్మియుక్తుఁడైన, శత్రుఘ్నునకున్, వినీతిదలిర్పన్, విత తాదరమొప్పన్=మిక్కిలియైన యనురాగముతో, పెండ్లిసేసెన్.

తా. శత్రుఘ్నునకు శ్రుతకీర్తిని బెండ్లిసేసెన్.

లక్ష్మ.—శ్రుతకీర్తి=ప్రసిద్ధకీర్తిగల, వేంకటలక్ష్మిన్ = వేంకటలక్ష్మి యను కన్యను, శత్రుఘ్నునకున్ = శత్రునాశకుఁడైన, రామనామాన్వితునకున్ = రాముఁడను పేరుగలవానికి, వినీతిదలిర్పన్ = న్యాయముగా, కుతుకమునన్, వితతాదరమొప్పం బెండ్లిసేసెను.

తా. రామునకు వేంకటలక్ష్మిని బెండ్లిసేసెన్.

వ. తత్సమయంబున. 101

క. హృద్యయములై శుభగత్యన
పద్యములై సకలలోకవర్గమనోమో
దాద్యములై పంచమహా
వాద్యము లొప్పఁగఁ జెలంగె వర్ణ్యము లగుచున్. 102

టీ. హృద్యములై = మనోహరములై, శుభగత్యనవద్యములై = శుభ శీలినిశ్రేష్ఠములై, సకల...దాద్యములై = సమస్తజనుల సంతోషమునకు

స్థానములై, పంచమహావాద్యములు = అయిదువిధములగు ప్రసిద్ధవాద్యములు, వర్ణ్యములగుచున్ = వర్ణనార్హములగుచు, ఒప్పన్ = తగునట్లు, చెలంగెన్.

(రెండువైపుల నర్థము తాత్పర్యము సమము.)

వ. అట్లు తద్వివాహమహోత్సవంబు విధ్యుక్తప్రకారంబునం బ్రవర్తిల్లుచున్నంత దినచతుష్టయానంతరంబున శృంగారప్రకారంబున రచియించిన ప్రోలియందు నవవధూవరులు ప్రవేశింప నాకబలి విధానంబును నయ్యె నప్పుడు. 103

రాఘు.—అట్లు, తద్వివాహమహోత్సవంబు = ఆ రామలక్ష్మణభరతశత్రుఘ్నుల పెండ్లివేడుకలు, విధ్యుక్తప్రకారంబునన్ = శాస్త్రప్రకారము, ప్రవర్తిల్లుచున్నంతన్ = జరుగుచుండఁగా, దినచతుష్టయానంతరంబునన్ = నాల్గుదినములు గడచిన పిమ్మట (ఐదవనాఁడు), శృంగారప్రకారంబునన్ = శృంగారముగా సుందరరీతిని, రచియించిన = కావించిన, ప్రోలియందున్ = (నాకబలిపట్టులో) ప్రవేశింపన్, నాకబలివిధానంబును, అయ్యెను.

లక్ష్మ.—తద్వివాహమహోత్సవంబు = ఆనాల్గవకుమారుఁడైన రాముని వివాహసంభ్రమము. (తక్కినది సమము.)

క. రమణీచతురాకృతిమధు
రిమ సొగసగుపిండిప్రోలి శ్రీరామున కా
త్మముద మమరఁగను దమ్ముల
కు మహోత్సవ మొనరఁజేసెఁ గొసరక వరుసన్. 104

రాఘు.—రమణీచతురాకృతిమధురిమ-రమణీ = పెండ్లికుమార్తెయొక్క చతుర = సొగసైన, ఆకృతి = ఆకారముయొక్క, మధురిమ = మాధుర్యమును, సొగసగుపిండిప్రోలి = చక్కనిరంగుల పిండిచే రచింపఁబడిన నాగవల్లిపట్టుయొక్క, శ్రీ = శోభయును, రామునకున్ = శ్రీరామునకు, ఆత్మముదము =

మనస్సంతోషమును, అమరఁగన్, తమ్ములకున్, పరుసన్ = క్రమముగా, ఒనరఁజేసెను.

తా. రామునకును, దక్కిన మువ్వురుతమ్ములకును, భార్యలసౌందర్యమును నాగవల్లి పట్టు చమత్కారమును నానందము గలిగించెను.

లక్ష్మ.—రమణీ...మధురిమ = భార్యయొక్క సుందరాకారముయొక్క రుచి, సొగసగు పిండిప్రోలి శ్రీరామునకున్ = పిండిప్రోలివారి శ్రీరామునకు, ఆత్మముదముమరన్, కనుదమ్ములకున్ = నేత్రపద్మములకు, పరుసన్, కొసరక, మహోత్సవ మొనరఁజేసెన్ = ఆనందము కలిగించెననుట.

తా. వేంకటలక్ష్మి సౌందర్యము రామునకుఁ గన్నులపండువ యొనర్చెను.

వ. అప్పు డగ్గోపాలసంతతిం గనుంగొను వేడ్క నరుగుదెంచిన జనంబులు తమలోన. 105

రాఘ.—అగ్గోపాలసంతతిన్ = దశరథపుత్రులు నలువురు.

లక్ష్మ.—అగ్గోపాలసంతతిన్ = గోపాలమంత్రి పుత్త్రుఁ డగు రాముని.

తా. పెండ్లిచూడవచ్చినజను లీక్రింది విధమున మాటలాడుకొనిరి.

క. కనుఁగొంటిరె శ్రీరామా

ఖ్యు నిత్తఱిం గ్రొత్తపెండ్లి కొమరుండై మా

ల్యనవాంగరాగభూషా

ఘనవస్త్రాదికములొప్పఁ గ్రాలెడువానిన్. 106

టీక. ఇత్తఱిన్ = ఈపెండ్లిముహూర్తమున, క్రొత్తపెండ్లికొమరుఁడై, మాల్య = పుష్పమాలలు, అంగరాగములు, భూషణములు, నూతనవస్త్రములతో, గ్రాలెడువానిన్ = ప్రకాశించువానిని, శ్రీరాముని = దశరథునిపెద్దకొడుకును, గోపాలమంత్రిసాల్వపుత్త్రుని, కనుంగొంటిరె = చూచితిరా. (కొంటిరని సమానము.)

వ. అని పలికి యచ్చేరువనున్న రామునితోఁబుట్టువులం బేర్కొని క్రమక్రమంబున నిట్లనిరి. 107

టీ. రామునితోఁబుట్టువులన్ = శ్రీరామునితమ్ములైన లక్ష్మణ భరత శత్రుఘ్నులను, పేర్కొని=పేరువెట్టి (పొగడి), ఇట్లనిరి. క్రమముగ, రామునితోఁ బుట్టువులన్ = గోపాలమంత్రిపుత్రుఁడైన రామమంత్రితోడఁబుట్టిన వారిని, తిరుపతన్న రామకృష్ణయ్యలక్ష్మణులను.

క. అవలోకింపరె లక్ష్మణు
సవిశదనీతిదృఢబుద్ధి సద్యత్నపరు
న్నవలీలా ప్తవివాహో
త్సవు నీతనిఁ జూడ మదికి సంతసమయ్యెన్. 108

రాఘ.—సవిశదనీతిన్ = స్పష్టమైన న్యాయవర్తనముగలయట్టి, దృఢబుద్ధిన్=దార్ఢ్యమైన బుద్ధిగలయట్టి, సద్యత్నపరున్ = సత్కార్యములానర్ప యత్నించువానిని, నవ=నూతనమైన, లీలా=విలాసముచే, ఆప్త=పొందఁబడిన, వివాహోత్సవున్ = పెండ్లికొడుకగువానిని, లక్ష్మణునిన్=లక్ష్మణస్వామిని, అవలోకింపరె=చూడుండు. (ఆదరముచేఁ బ్రార్థించుట).

తా. పెండ్లిమహోత్సవములో నున్నయీలక్ష్మణస్వామిని చూడుఁడు. మనస్సునకు సంతోషము కలుగుచున్నది.

లక్ష్మ.—లక్ష్మణున్ = లక్ష్మణకవిని, సవిశదనీతిదృఢబుద్ధిన్, సద్యత్న ... వాహోత్సవున్ = సత్పురుషులైన బంధువులయొక్క ప్రయత్నముచే, పరుత్ = నిరుడు, 'పరుత్పరార్యైషమో ఽబ్దే' అమరము. నవలీల = నూతనలీలచేతను, ఆప్త=పొందఁబడిన, వివాహోత్సవున్.

తా. నిరుడుసంవత్సరము పెండ్లియైనయీలక్ష్మణకవిని జూడఁగా సంతోషము గల్గుచున్నది.

గీ. అద్భుతం బగుఁ జూడరే యతని ఘనత
డంబుమీఱు నూతనమహోశంబరారి
నవముదాత్తమాతులసుకన్యాకరుఁ బ్రచు
రధృతిమాలోలు భరతుని రామకృష్ణు. 109

రాఘు.—అద్భుతంబగుఁ = ఆశ్చర్యమగుచున్నది, ఘనతఁ = మూర్తి మంతుఁ డగుటచేతను, దంబుమీఱు = ప్రకాశించు, నూతనమహాశంబరిఁ = క్రొత్తమన్మథుని (శంబరరాక్షసుని మన్మథుఁడు సంహరించెను.) (దేహధారియై యున్న మన్మథునివలె నున్నవానిని), నవ...కరుఁ-నవముత్ = నూతనసంతో షముచే, ఆత్త = స్వీకరింపఁబడిన, మాతుల = లక్ష్మీసమానురాలైన, సుకన్యా = చక్కనికన్నెయొక్క, కరుఁ = హస్తముగలవానిని, ప్రచురధృతిమాలో లుఁ = తక్కువగానిధైర్యసంపత్తియందాసక్తుని, రామకృష్ణుఁ = రామునిన ల్లనివానిని, భరతునిఁ = భరతుని, అతనిఁ, చూడరే = చూడుఁడు.

తా. నవమన్మథాకారుని, రామునివలె శ్యామలవర్ణముగలవానిని పెండ్లికొడుకును భరతుని జూచుచున్నారుగదా.

లక్ష్మ.—చూడరే = చూడుఁడు, అతనిఁ = (రామకృష్ణయ్యను) చేయివెట్టిచూపుచున్నారు. ఘనతఁ = సాంద్రత్వముచే, దంబుమీఱు, నూ తనమహాశఁ = క్రొత్తయాసచే, పరాగినవసుదాత్తమాతులసుకన్యాకరుఁ-ప రాగిణమందటేఁడు, నవముత్ = క్రొత్తసంతోషముతో, ఆత్త = స్వీకరింపఁ బడిన, మాతులసుకన్యాకరుఁ = మేనమామకూఁతును బెండ్లిచేసికొనినవానిని, ప్రచురధృతిఁ = ప్రకటధైర్యముగలవానిని, మాలోలుధరతునిఁ - మాలో లుభ = లక్ష్మీలోలుండైన విష్ణువునందు, రతునిఁ = ఆసక్తిగలవానిని, రామ కృష్ణుఁ = రామకృష్ణయ్యమంత్రిని.

తా. రామకృష్ణయ్యగారికి గతసంవత్సరమున మేనరికము వివాహ మైనది యనుట.

గీ. రమణ మాధవుదరమె వర్ణనముసేయ
నవనియందు శత్రుఘ్నసమాఖ్యఁ దగుని
తండు నేతత్సువత్సత్రితయమునకును
మున్మహిమ హత్తగా ర్హస్థ్యముఁ భజించె. 110

రాఘు.—రమణ = అత్యంతము, మాధవుదరమె = విష్ణుదేవునిశంఖమే, వర్ణనముసేయఁ = స్తుతిసేయఁగనట్టుల, అవనియందుఁ = భూలోకమున, శత్రు

ఘ్నసమాఖ్యన్ = శత్రుఘ్నుఁడనుపేరుతో, తగున్ = ఒప్పుచున్నది. ఇతండు = ఈశత్రుఘ్నకుమారుఁడు, ఏతత్సువత్సత్రితయమునకున్ = ఈముగ్గురుచిన్నవాండ్రకును, మున్నహిమమహత్తన్ = మహిమ హెచ్చునట్లుగా, గార్హస్థ్యమున్ భజించెన్ = పెండ్లికొడుకయ్యెననుట.

తా. ఈశత్రుఘ్నుఁడు భూలోకమునం జనించిన విష్ణుశంఖావతారము. ఈతఁడు పెండ్లికొడుకగుట తక్కినముగ్గురన్నలకు సంతోషమును గల్గించుచున్నదనుట.

లక్ష్మి.—రమణమాధవున్ = రమణమ్మపెనిమిటిని (తిరుపతిమంత్రిని), వర్ణనముసేయఁదరమె, (శ్లేషప్రధానకావ్యముగాన 'రమణమాధవుఁదరమె' యని యర్థానుస్వారము నిలుపనందులకు విచారింపవలదు) వర్ణింపశక్యము గాదు. అవనియందున్, ఇతండు = తిరుపతి, శత్రుఘ్నసమాఖ్యన్ = శత్రునాశకుఁడనుకీర్తిచే, తగున్ = తగియుండును. ఏతత్ = ఈచెప్పఁబడిన, సువత్స = మంచివత్సరములయొక్క 'వత్సతర్ణకవర్షాద్వా' అమరము. త్రితయమునకును = రామలక్ష్మణరామకృష్ణులకుఁ బెండ్లిండ్లయిన మూఁడుసంవత్సరములకంటె, మున్ = పూర్వసంవత్సరమందు, మహిమమహత్తన్, గార్హస్థ్యమును భజించెన్ = గృహస్థుఁడయ్యెను.

తా. రమణమ్మ పెనిమిటి యగుతిరుపతిమంత్రికి నాలుసంవత్సరముల క్రిందట వివాహమైనది. ఇతనిం బొగడఁ దరముకాదు.

వ. అనుచు నల్వురం బ్రశంసించి తత్పత్నులం జూచి. 111

{ పెండ్లివేడుకలు చూచుచున్న పురజను లింక పెండ్లికొమార్తలను వర్ణించుచున్నారు. }

క. పక్ష్మలలోచన వేంకట
లక్ష్మి నిరాజన్మహోత్పలరుచిరవక్త్రన్
సూక్ష్మావలగ్న నీశుభ
లక్ష్మయుతన్ రాముభార్య లలిఁ గాంచితిరే. 112

రాఘ.—పక్ష్మ...లక్ష్మిని - పక్ష్మల = మంచిఱెప్పలుగల, లోచన = నేత్రములయందు, వేంకట - వేం+కట = పాపనాశకమైన, లక్ష్మిన్ = శోభ కలదానిని 'శోభాసంపత్తిపద్మాసులక్ష్మీః' అమరము. ఇరాజన్ = భూపుత్రికను, 'ఇరాభూవాక్సురాప్సుస్యాత్' అమరము. మహోత్పలరుచిరవక్త్రిన్ = పద్మమువంటిముఖముగలదానిని, సూక్ష్మావలగ్నన్ = సన్నని నడుముగలదానిని, ఈశుభలక్షణయుతన్ = ఈశుభలక్షణములతోఁగూడిన, రామభార్యన్ = రామునిసతియైనసీతను, లీలన్, కాంచితిరె = చూచినారుగదా !

తా. నేత్రములయందు లక్ష్మికళగల పద్మముఖి, భూపుత్రియైన రాముని భార్య సీతను జూడుఁడు.

లక్ష్మ.—పక్ష్మలలోచనన్, వేంకటలక్ష్మినిన్ = వేంకటలక్ష్మమ్మను, రాజన్మహోత్పలరుచిరవక్త్రిన్ = ప్రకాశించుచున్నపద్మములబోలిన మోముగల దానిని, సూక్ష్మావలగ్నను, ఈశుభలక్షణయుతన్ = ఈయెదుటనున్నవివాహ చిహ్నముగల, రామభార్యన్ = రామమంత్రిభార్యను, కాంచితిరే.

తా. రామయ్యమంత్రిభార్యను గల్యాణాలంకారములతో నున్నవేంకట లక్ష్మమ్మను జూడుఁడు.

చ. సరసతమిూఁదఁ గన్గొనరె సాధ్విని లక్ష్మణపత్ని యైనకుం
దరదన రమ్యలోచన నితంబిని నూర్మిల సద్వళిన్ సుకం
ధరను జగమ్మనేకమహితస్థితులం గొనియాడ నొప్పుభా
సురగుణపఙ్క్తిచే మిగుల సొంపువహించినదాని మానినిన్.

రాఘ.—సాధ్విని=పతివ్రతను, సద్వళిన్ = మంచివళులుకలదానిని, సుకంధరన్=మంచికంఠముగలదానిని, రమ్యలోచనన్ = చక్కని నేత్రములు గలదానిని, నితంబినిన్, లక్ష్మణపత్ని=లక్ష్మణునిభార్య, ఐనకుందరదనన్ = మొల్లమొగ్గవంటి దంతములుగల, ఊర్మిలన్ = ఊర్మిళను, జగమ్ము=లోకము, అనేక మహితస్థితులన్=పెక్కుమంచిరీతులచే, గొనియాడన్=పొగడుటకు, భాసుర గుణపఙ్క్తిచేసొంపువహించిన దానిని, మానినిన్=మానవంతురాలిని, సరసతమిూఁదన్, కన్గొనరె.

తా. సర్వాంగసుందరియై సద్గుణసంపత్తిగల యూర్మిలయనులక్ష్మణు భార్యను జూడుండు.

లక్ష్మ.—లక్ష్మణపత్నియైనసుందరదనన్ = లక్ష్మణకవిభార్యను, ఊర్మిల సద్వళిన్ = తరంగములవంటి వళులుగలదానిని, జగమ్మను = జగ్గమ్మను, ఏకవహితస్థితులన్ = ముఖ్యమైనపూజ్యస్థితిచేత, కానియాడన్, ఒప్పు సుగుణవర్తిచే మిగులసొంపువహించినదానిని, మానిని, కన్గొనరె.

తా. లక్ష్మణకవిభార్యయైనజగ్గమ్మను బాగడందగినగుణములుగలదానిని జూడరా.

వ. అని పలికి మఱియును. 114

క. చారుతరాకృతి భరతకు
మారుని నలుఁబోలినసుకుమారుని విలస
ద్ధీరాత్ము రామకృష్ణుని
సారమతిం గూర్చినట్టి సతి యిదిసుండే. 115

రాఘ.—చారుతరాకృతిన్ = చక్కనిరూపముఁగల. భరతకుమారునిన్ = భరతుఁడనుచిన్నవానిని, నలుఁబోలినసుకుమారునిన్ = నలమహారాజువంటి సుకుమారముగలవానిని, విలసద్ధీరాత్మున్ = ప్రకాశించెడుధైర్యముఁగలవానిని, రామకృష్ణుని, సారమతింగూర్చినటిసతి, ఇదిసుండే = ఈమూలవిద్యేచుండా.

లక్ష్మ.—చారుతరాకృతిభరతకున్ = సురూపమునుభరించుటకు, మారునిన్ = మన్మథుని, నలున్ = నలచక్రవర్తిని, పోలినసుకుమారునిన్, రామకృష్ణునిన్ = రామకృష్ణయ్యను, గూర్చినసతి = జతచేసినపతివ్రత, ఇదిసుండే — (అని హస్తనిర్దేశము.)

వ. అనుచుం దత్సతీలలామంబు గనుంగొని. 116

సీ. సరసవృత్తు లరసితిరుపమ నియ్యంతిఁ
జెప్పి చెప్పఁగలరె తీతి ననుచు గు

రత వచించి రొండొరులకు నాకచగన
వ్యసుమమాలవినయవతినిఁ జూచి. 117

రాఘు.—సరసవృత్తులు = సరసవ్యాపారముగలమీరు, అరసితిరి=చూచినారుగదాయనుట. (విమర్శించితిరి) ఉపమను=సామ్యమునందు,ఇయ్యింతిన్ =ఈమాలవిని, చెప్పిచెప్పఁగలరె = చెప్పినపిమ్మట మరలఁజెప్పుట కింకొకరున్నారా, క్షితిన్ = భూమియందు, అనుచున్, గురుతన్ = గురుత్వమును చేతను, వచించిరొండొరులకు = ఒకరితోనొకరు చెప్పుకొనిరి. ఆకచగనవ్యసుమన్ = కొప్పునుబొందిన నూతనపుష్పములుగల, వినయవతిని = నీతికలదానిని, మాలవిన్ = మాలవియనుదానిని, చూచి. (వెనుకకన్వయము).

తా. ఈమాటవిని మెచ్చినపిమ్మట నీమె కుపమగా రెండవస్త్రీని జెప్పుటకు నవకాశములేదు.

లక్ష్మి—సరసవృత్తులరసి = సరసములైనవ్యాపారములు విమర్శించి,ఉపమను = తిరుపతమ్మయును, ఇయ్యింతిన్, చెప్పిచెప్పఁగలరె, క్షితి, ననుచు, వచించిరొండొరులకు, ఆకచగనవ్యసుమమాలన్, వినయవతిన్, చూచి.

తా. ఆతిరుపతమ్మను గనుంగొని యందఱును నింతచక్కనిది లేదని పొగడిరి.

వ. అందుఁ గొందఱు మఱియును. 118

గీ. చూడుఁ డీరు రమణ శ్రుతకీర్తి సశుభల
క్షణయుతముఖకమలఁ జందిరు పతి
యన నభిఖ్యనొప్పునట్టిశత్రుఘ్నుని
పత్ని యైనయల్లపరమసాధ్వి. 119

రాఘు.—ఈరు = మీరు, రమణ = అత్యంతము, శ్రుతకీర్తిన్ = శ్రుతకీర్తియను చిన్నదానిని, సశుభలక్షణయుతముఖకమలన్ = శుభలక్షణములతోఁగూడుకొనినముఖపద్మముగలదానిని, చందిరున్ = చంద్రునియొక్క "చంద్ర

శ్చచందిరః" ద్విరూపకోశము. పతియనక్ = ప్రతియగునటుల, అభిఖ్య
నొప్పు = కాంతిశాలియైన, శత్రుఘ్నునియొక్క, పత్నియైన యల్ల పరవ
సాధ్వీక్ = పరమపతివ్రతను, చూడుఁడు.

తా. శత్రుఘ్నుభార్య యైనశ్రుతకీర్తిని గనుంగొనుండు.

లక్ష్మి —ఈరు, చూడుఁడి, రమణక్ = రమణమ్మ యను స్త్రీని,' అః
ఉ స్త్రీవిషయాః' అని నన్నయభట్టీయసూత్రమువలన రమణయని ప్రయో
గము. శ్రుతకీర్తిక్ = ప్రసిద్ధకీర్తిగలదానిని, సశుభలక్షణయుంతముఖకమలక్ =
శుభలక్షణములతోఁగూడిన, ముఖపద్మముగలదానిని, (కమల = ఉదకమున,
జ=పుట్టినది, పద్మము) తిరుపతియననభిఖ్యనొప్పు = తిరుపతిమంత్రి యను పేరు
గల, శత్రుఘ్నుపత్ని = శత్రునాశకునిభార్య, ఐనపరమసాధ్వీక్.

తా. తిరుపతిమంత్రి భార్యయగు నీరమణమ్మను గనుంగొనుండు.

వ. అనుచు ననేకు లనేకవిధంబుల వర్ణించుచుండ నగ్గోపాలుం
డు తద్వధూజనకదత్తభూషణాదిసమస్తపదార్థంబులు గై
కొని కవిగాయకప్రముఖజనంబులకుఁ దగినవిధంబున సకల
వస్తువు లొసంగి తనపురంబునకేగ నుద్యోగించి సపరి
వారుండై చనుచుండఁ బురోభాగంబున. 129

తా. దశరథుఁడును గోపాలమంత్రియుం వివాహములైన పిమ్మట పెండ్లి
కూఁతురువారిచ్చిన బహుమానములంగొని తామీయవలసిన బహుమానములు
దాసదాసీజనులకుఁ బురోహితాదులకు నిచ్చి, అయోధ్యకును, (కుప్యేరు
నకును) బోవ నమకట్టిరి. అట్లు వెళ్లుచుండఁగా మార్గమధ్యమునందు.

సీ. భాస్వదైకసువర్ణపరశుభాస్వాయత
కరసుధర్మాక్షితకాండములు మ
హాదరం బొనరింప నమరి రామయమిత
తాసాధువాక్తతి వాసిగ నని.

కోర్కెఁ దెల్ప నెసంగు క్షోణీసుపర్వరా
జుల్లసద్రభసతాసూత్రితబుద్ధి
రాజమానారి వరపురుషు సురుచిరా
జితనయుఁ గనుఁగొనఁ జేరునంత
గీ. సంభ్రమమున గోపాలుఁడు సముచితార్చ
లాచరింపఁగ శివధర్మహారి యగుట
నెంచి శ్రీరామునొద్దకు నేఁగ నాతఁ
డింపుతోడుతఁ దగునమస్కృతి యొనర్చె. 121

టీక.—భాస్వర = ప్రకాశించుచున్నట్టియుం, ఏక = ఒక్కటియైనట్టి, సువర్ణపరశు = సువర్ణఖచితమైన గండగొడ్డలిచేతను, భాసి = ప్రకాశించుచున్న, ఆయతకర = దీర్ఘహస్తమునందు, సుధర్మ = మంచివిల్లును, అక్షత కాండములు = కొట్టఁబడని బాణములును (అమోఘబాణములు), మహోదరంబొనరింపన్ - మహోదరంబు = భయమును, ఒనరింపన్ = కలుగఁజేయఁగా, 'చతుర్దశదరత్రాసౌ' అమరము. అమరి=అభిముఖుఁడై, రామయమి = పరశురాముఁడను. యోగి, తత + అసాధు+ వాక్తతిన్ = వ్యాప్తమైన క్రూరవాక్య సముదాయమును, వాసిగన్, అనికోర్కెఁదెల్ప = యుద్ధమునందలి యభిలాషమును జెప్పుచుండఁగా, ఎసంగు = విజృంభించుచున్న, క్షోణీసుపర్వరాజు = విప్రశ్రేష్ఠుఁడు, ఉల్లసద్రభసతాసూత్రితబుద్ధి=ఉజ్జృంభించుచున్న వేగముతోఁ గూడిన బుద్ధిగలవాఁడు, రాజమానారి = రాజులమానమునకు విరోధియైనవాఁడు, పరపురుషు = పురుషోత్తముఁడైన పరశురాములు, సురుచిరాజితనయున్ = సుందరుఁడైన శ్రీరాముని, కనుఁగొనన్ = చూడుటకు, చేరునంతన్, సంభ్రమమునన్ = తొట్రుపాటుతో, గోపాలుఁడు = దశరథుఁడు, సముచితార్చలాచరింపఁగన్ = పూజింపఁగా, శివధర్మహారియగుటన్ = శివునివిల్లు విఱిచినవాఁడగుటను, ఎంచి = ఆలోచించి, శ్రీరామునొద్దకు నేఁగన్ - అతఁడు = దశరథరాముఁడు, ఇంపుతోడుతన్, తగునమస్కృతి=నమస్కారమును, ఒనర్చెన్.

తా. దశరథునకు మార్గమధ్యమునఁ బరశురాముఁ డెదురుపడి తనగురువైన యీశ్వరుని ధనుస్సును విఱిచిన రామునితో యుద్ధమును గోరె ననుట.

లక్ష్మ.—భాస్వరైకసువర్ణపర - భా = కాంతిచేతను, స్వర = ఉదాత్తాదిస్వరములచేతను, ఏక = ముఖ్యములైన, సువర్ణ = శ్రేష్ఠాక్షరములు (వేదాక్షరములయందు), పర = ఆసక్తిగలవిగనుకయే, శుభ = శుభప్రదములైన, ఆస్య = ముఖములును, ఆయతకర = దీర్ఘహస్తములయందు, సుధర్మాక్షతకాండములు = శ్రేష్ఠాచారముగలయక్షతలును, మహాదరంబొనరింపన్ = మిక్కిలియాదరణచేయునటుల, అమరి = ఆసన్నులై, రామయ = రామయ్యయను పెండ్లికుమారుని, మితతాసాధువాక్తతిన్ = మితత్వముచేతసాధువులైన వాక్యములచే, వాసిగనని = ఆశీర్వదించి, కోర్కెదెల్పన్ = వాంఛ తెల్పుటకు, ఎసఁగు, క్షోణీసుపర్వరాజులు = బ్రాహ్మణసముదాయము, లసద్భసతాస్యాతబుద్ధిన్ = ప్రకాశించుసంతోషముచేఁ గూర్పఁబడినబుద్ధిచేతను, రాజమా = రాజమ్మయను, నారి = స్త్రీకి, వర = భర్తయైన, పురుషున్ = మంచితేజస్సుగల, రాజితనయున్ = మంచినీతిగలవానిని, కనుఁగొనఁజేరునంతన్ = రాఁగా, సంభ్రమమునన్ = సంతోషముతో, గోపాలుఁడు = గోపాలమంత్రి, సముచితార్చలాచరింపన్ = తగినపూజలొనరింపన్, శివధర్మహారియగుటన్ - శివధర్మ = పెండ్లిచేతను, హారి = మనోహరుఁడగుటను, ఎంచి, శ్రీరామునొద్దకున్ = పెండ్లికొడుకైన రామయ్యదగ్గఱకు, ఏగన్ = వెళ్లఁగా, అతఁడు, నమస్కృతి యొనర్చెను.

తా. (రాఘవాగ్రమున నల్వురపెండ్లిండ్లు, నొక్కసారియైనట్లు లక్ష్మణకవియర్థమున రామయ్యపెండ్లి యొక్కటియే యైనట్లునుగవియొక్కమాటలో నిల్పికొనుచు వచ్చుచున్నాఁడు) రామయ్యపెండ్లి యైనది; బైలుదేఱి యింటికివచ్చుచుండఁగా వేదవిదులైనబ్రాహ్మణు లాశీర్వదించి మంత్రాక్షతలిచ్చి వారికోరికఁ దెల్పిరి. గోపాలమంత్రి వారిం బూజించి తగినసత్కారము చేసెను. పెండ్లికొడుకు వారికి మ్రొక్కెను.

వ. అంత నాబ్రాహ్మణసంతతి రాజమాధవున కిట్లనియె. 122

రాఘ.—అంతట, బ్రాహ్మణసంతతి = పరశురాముఁడు, రాజమాధవునకున్ = రాజు గాఁబుట్టిన విష్ణుదేవుఁడగు శ్రీరామునకు, ఇట్లనియెన్ = ఈక్రిందఁజెప్పఁబోవునట్లు పలికెను.

లక్ష్మి.—అంత, ఆబ్రాహ్మణసంతతి = ఆవేదవిదులైనబ్రాహ్మణులు, రాజమాధవునకున్ = రాజమ్మపేరిమిటిద్రియైన గోపాలునకు, ఇట్లనిరి.

గీ. సత్స్వశక్తిదాత సర్వజ్ఞధర్ముఁ డా
రామసుకృతి దివ్యధామముఖ్య
కరుఁ డటంచు విన్నకతన వచ్చితి మొగి
నినుఁ గనంగ రభస మినుమడింప. 123

రాఘ.—సత్స్వ...ధర్ముఁడా - సత్ = శ్రేష్ఠమైన, స్వశక్తి - స్వసామర్థ్యముచే, దాత = ఖండింపఁబడిన, సర్వజ్ఞధర్ముఁడా = శివధనుస్సు గలవాఁడా, 'దాతంది తం' - అమరము. రామ = ఓరాముఁడా, సుకృతీ = నేర్పరీ, దివ్యధామ = దివ్యతేజస్సుచే, ముఖ్య = ముఖ్యమైన, కరుఁడటంచున్ = కరములు గలవాఁడని, విన్నకతనన్ = వినియుండుటచే, ఒగిన్, నినుఁగనంగన్ = నిన్నుఁజూచుటకు, రభసము = వేగము ఇనుమడింపన్ = రెట్టింపఁగా, వచ్చితిమి, వచ్చినాము. (తనగౌరవమునకొఱకు బహువచనము.)

తా. శివ ధనుర్భంగము గావించినరాముఁడా! నిన్ను మహాబలశాలి వని విని చూడవచ్చినాఁడను.

లక్ష్మి.—సత్స్వశక్తి - సత్ = ప్రశస్తమైన, స్వ = ద్రవ్యముయొక్క, శక్తి = బలముకలవాఁడు, "స్వోజ్ఞాతావాత్మనిస్వం త్రిష్వాత్మీయే స్వోఽస్త్రియాం ధనే" ఇత్యమరః. దాత = వితరణశీలుఁడు, సర్వజ్ఞధర్ముఁడు = సర్వమునెఱిఁగిన స్వభావముగలవాఁడు, "ధర్మాః పుణ్యయమన్యాయస్వభావాచారసోమపాః" అమరము. ఆరామ = తోఁటలు, సుకృతి = మంచిప్రబంధములు, దివ్యధామ = దేవాలయములు, ముఖ్యకరుఁడు = మొదలుగాఁగలవానిం జేసినవాఁడు, అంచున్, నిను, విన్నకతనన్ = వినుటచే, నినుఁగనన్, రభసము, ఇనుమడింపన్, వచ్చితిమి.

తా. నీవు ధనముగలవాఁడవు, ధర్మాత్ముఁడవు, సమస్తములఁ దెలిసినవాఁడవు, దాతవు నని విని నిన్నుఁ జూడ వచ్చితిమి.

వ. కావున. 124

క. ఇదె పురుషోత్తమధర్మము
పొదుపుగ దీనిఁగొను సుగుణమున నీభూరి
ప్రదరైక మిడఁగ నే మన
క దొడిన సంఖ్య మగుసుగతి గలుగుఁ మీఁదన్. 125

రాఘ.—ఇదె = ఇదిగో, పురుషోత్తమధర్మము = విష్ణుధనుస్సు, పొదుపుగన్ = పొందికగా, దీనిఁగొను = స్వీకరింపుము, సుగుణమునన్ = శ్రేష్ఠమైన యీవింటినారియందు, ఈ భూప్రదరైకమున్ = ఈబాణశ్రేష్ఠమును, ఇడఁగనే = సంధింపఁగనే, మనక = మనయుంభయులకే, తొడిన = శీఘ్రముగ, సంఖ్యమగున్ = యుద్ధమగును. సుగతి=పుణ్యలోకము, మీఁదన్=తర్వాత, కలుగున్. (యుద్ధములో మృతినొందిన స్వర్గముగలదనుట.)

తా. ఈ విష్ణుధనుస్సు నెక్కుపెట్టి బాణమును సంధించుము. మనమిరువురము యుద్ధము చేయుందము. అని ధనుర్బాణములు పరశురాముఁడు శ్రీరామున కిచ్చెను.

లక్ష్మ.—ఇదె = ఈదాతృత్వమె, పురుషోత్తమధర్మము = పురుషులకుత్తమమైనస్వభావము, దీనిఁగొను=దీనినవలంబించిన, సుగుణమునను=సద్గుణముచే, ఈ = ఇమ్మా, భూరిప్రద = ఓసువర్ణదాతా, రైకమున్ = ధనమును, ఇడఁగన్ - ఇవ్వఁగా, (రై = ధనము, స్వార్థమున కప్రత్యము), 'అర్థరైవిభవా అపి' అమరము. ఏమనక = మాఱువల్కక, తొడిన = శీఘ్రముగ, అసంఖ్యమగుసుగతి = గణనాతీతమైనపుణ్యలోకము, మీఁదన్ = తరువాత, కలుగున్ = చేకుఱును.

తా. దాతృత్వమే పురుషునకు ముఖ్యధర్మము. దీనివలన నక్షయపుణ్యలోకములు గలుగును.

గీ. అనిన నట్లకాక యనుచు నా ధర్మకు
శలుఁడు తదవనిసుర సంతతి గడు

గోరిన ట్లొసర్ప గురుతరాద్భుతవార్ధి
మగ్న మైనయట్టి మనసుతోడ. 126

రాఘ.—ఆధర్మకుశలుఁడు = ధనుర్విద్యానిపుణుఁడైన శ్రీరాముఁడు, అట్లేకానిమ్మని, తదవనిసురసంతతి = ఆబ్రాహ్మణుఁడైన పరశురాముఁడు, కోరినట్లొసర్పఁగా = విల్లెక్కు పెట్టఁగా, గురుతర = గొప్పదైన, అద్భుతవార్ధిమగ్న = ఆశ్చర్యమను సముద్రములో మునిఁగిన, మనసుతోడఁ.

తా. ఆపరశురాముఁడు చెప్పినట్ల యందుఁధమునకు సమ్మతించి విల్లెక్కు పెట్టెను. పరశురాముని కాశ్చర్య మయ్యెను.

లక్ష్మ.—ఆధర్మకుశలుఁడు= న్యాయమందు నేర్పుగల గోపాలమంత్రి, అట్లేకాకయని, తదవనిసురసంతతి = ఆబ్రాహ్మణబృందము, కోరినట్లొసర్పఁగ = కోరినద్రవ్యదానముసేయఁగా, గురుతరాద్భుతవార్ధిమగ్నమైన యట్టిమనసుతోడ, (మిక్కిలియాశ్చర్యమునొంది.)

తా. బ్రాహ్మణులుకోరినట్లు గోపాలమంత్రి ధనమీయఁగా వారద్భుతపడి.

సీ. పొగడఁగవశమె నీబుద్ధిని యోగిశ
యనఘ శ్రీరామ కృష్ణాంశమునను
మహనీయతరసర్వమంగళానీకా శ
శాంకరీతి లసత్ప్రసవసుగంధ
వహ కోసలక్ష్మావరహితసుతతనయా
గ్రణి వై జనించిన ఘనుఁడ వీవు
శ్రీరాజమావరభూరిదానైకశీ
ల యటంచు నట్లు తెల్లముగఁ బలుకఁ
గీ. దదనుమతిధర్మమును గూర్చి తావదలిన
డంబుమీఱుసద్రవిణకదంబమహిమ

మమ్మహీసురసంతతి యన్యలోక
ములను గూర్చి యేగెడుత్రోవఁ బోవఁ ద్రోచె. 127

రాఘు.—పొగడంగవశమె నిన్ = నిన్ను స్తుతింపఁదరమా, బుద్ధిని, యోగీశ = యోగులకుఁ బ్రభువైనవాఁడ, అనఘ=పాపరహిత, శ్రీరామ, కృష్ణాంశమునను = విష్ణ్వంశముచేతను, మహనీయతరసర్వమంగళాసీక = అత్యంతపూజ్యములైన సర్వశుభసమూహము కలవాఁడా, శశాంకరీతి = చంద్రునివలె, లసత్ప్రసవసుగంధవహ=ప్రకాశించుచున్న పుష్పములయొక్క గంధమువంటి సుగంధమును వహించినవాఁడా, కోసలక్ష్మావరహితసుత = కౌసల్యయొక్క, తనయాగ్రణివై = కుమారుఁడవై, జనించినఘనుఁడవు, ఈవు, శ్రీరాజశ్రీ = శోభాయుక్తురాలైన, ఇరాజ = భూపుత్రియొక్క, మా = లక్ష్మియొక్కయు, వరభూరిదానైకశీల = వరములయొక్క విస్తృతదానమందు ముఖ్యస్వభావముగలవాఁడా, అటంచు, అట్లు, తెల్లముగ=స్పష్టముగా, పలుకన్, తదనుమతిన్ = పరశురామానుమతమున, ధర్మము గూర్చి = ధనుస్సునెక్కువెట్టి, తాన్ = తాను, వదలినన్ = విడువఁగా, సద్రవిణకదంబమహిమము-సద్రవిణ = బలముతోఁగూడిన, "ద్రవిణంతుబలేధనే" అమరము. కదంబ=బాణములయొక్క, మహిమము = సామర్థ్యము, అమ్మహీసురసంతతి=ఆపరశురామునియొక్క, అన్యలోకములను గూర్చియేగెడుత్రోవ = ఊర్ధ్వలోకమునకుఁబోవుటకై నిర్మింపఁబడినమార్గమును, పోవఁద్రోచెన్ = కొట్టివేసెను.

తా. పరశురాముఁడు రామునిశక్తికి మెచ్చి నీవు సాక్షాద్విష్ణుదేవుఁడవు. కౌసల్యగర్భమున నుదయించితివి. యోగీశ్వరుఁడవు. ఈయమోఘబాణమును నేను స్వర్గమున కేగుటకై కట్టినసోపానమార్గమును భేదించు మనిన రాముఁ డట్లు చేసెను.

లక్ష్మి.—పొగడంగవశమె. నిన్-బుద్ధిన్, నియోగీశ = నియోగిశ్రేష్ఠుఁడా, అనఘ, శ్రీరామకృష్ణాంశమునను= రామకృష్ణమంత్రియంశమున, మహనీయతర సర్వమంగళాసీశాశ = మహనీయురాలైన పార్వతీసమానురాలైన, శాంకరీ = శాంకరియను పేరుగల, తిలసత్ప్రసవ=నువ్వుపువ్వువంటి, సుగంధవహతన్ = నాసికగలదానికి, "క్లీబేఘ్రాణంగంధవహా ఘోణానాసాచనా

శికా" అమరము. శుభలక్ష్మా = శుభలక్షణములతోఁ గూడికొనినవాఁడా, వరహితసుతతన్ - వర = శ్రేష్ఠుఁడవు, హిత = ఇష్టుఁడవునైన, సుతతన్ = పుత్రుఁడవౌటచేతను, నయాగ్రణివై = నీతిచేతనుత్కృష్టుఁడవై, జనించిన, ఘనుండవు, ఈవు, (ఘనుఁడవు = మేఘుఁడవు. దాతృత్వమునకు) శ్రీరాజమావర = లక్ష్మీసమానురాలైన రాజమ్మ వరుఁడా, భూరిదానైకశీల = బంగారును దానము చేయువాఁడా, (భూరి = విస్తారము.) అంచున్, తెల్లముగ, పలుకన్, తదనుమతిన్ = ఆ బ్రాహ్మణులయనుమతిచే, ధర్మమును గూర్చి = పుణ్యార్థమై, తావదలిన = తానిచ్చిన, సద్రవిణకదంబమహిమము = ఉత్కృష్టమైనధనరాసుల సామర్థ్యము, అమ్మహీసురసంతతి, ఆ బ్రాహ్మణులయొక్క, అన్యలోకములను గూర్చి, వేఁగను త్రోవన్ = ఇతరజనులను మరలయాచింపవలసిన మార్గము (అవసరము), బోవఁద్రోచెన్ = తొలంగించెను.

తా. బ్రాహ్మణులు గోపాలమంత్రిని, నీవు రామకృష్ణయ్యకు, శాంకరీమానినికి జనించి రాజమ్మకుఁ బెనిమిటివైన వాఁడవు. ఘనదాతవు. అని యెంతయుఁ బొగడిరి. వారికి భూరిదానము గోపాలమంత్రి యొసంగెను. దానితో నాబ్రాహ్మణులు మఱియొకచోఁ బున యాచించవలసినది లేకపోయెను.

వ. తదనంతరంబ. 128

సీ. గోపాలునకుఁ బ్రేమ గూర్పంగఁ దగు రామ
రాజమహితవేషరమ్యమూర్తి
నున్న యమ్మందిరు పన్నలసన్నుతుల్
కోర్కిమీర నొనర్చి కొంతసేపు
రామకృష్ణాభిఖ్య రంజిల్లునతనిని
లక్ష్మణాగ్రజుని నలఘుకళాభి
రాము నిరామయనాముఁ దమ్ము లపుడు
భజియించువానిని బ్రమద మొప్పఁ

గీ. గొలిచి దీవించి తదనుజ్ఞఁగొని చనియెను
సత్వరితముగ నిజనివాసమున కింపు
గను మహేంద్రపురోధస్స్థితిని సుబుద్ధి
నమరునవ్విప్రసంతతి యాదరమున. 120

రాఘ.—గోపాలునకున్ = దశరథునికి. ప్రేమన్ = సంతోషమును, పూర్వంగన్ = సమకూర్చుటకు, తగు = తగిన, రామరాజమహితవేషరమ్యమూర్తిన్ = రామనామము, రాజనుపూజ్యవేషము వీనిచే సుందరమైనయాకారముతో, ఉన్న, అబ్జమందిరు = ఉదకనివాసుఁడైన నారాయణుని, పన్నల = పాదపద్మములయొక్క, సన్నుతుల్ = స్తోత్రములు, కొన్నిమారుల్, కొంతసేపు, ఒనర్చి, రామకృష్ణాభిఖ్యారంజిల్లునతనిని = సుందరమైన నీలచ్ఛాయగల వానిని, లక్ష్మణాగ్రజున్ = లక్ష్మణునికంటెఁ బెద్దవానిని (అన్నను), సత్కళాప్రపూర్ణధామున్ = షోడశకళాపరిపూర్ణమైన దేహముగలవానిని, "గృహదేహత్విట్ప్రభావా ధామాని" అమరము. నిరామయనామున్ = ఆరోగ్యనామముకలవానిని, తమ్ములపుడు భజియించువానిని = భరతాదులచేఁ గొల్వఁబడువానిని, రామున్ = రామచంద్రుని, కొలిచి = సేవించి, దీవించి, ప్రమదమొప్పన్, తదనుజ్ఞఁగొని = శ్రీరామాజ్ఞనుబొంది, మహేంద్రపు = మహేంద్రపర్వతముయొక్క, రోధః = తీరమందు (చరియయందు). స్థితిన్, సుబుద్ధినమరు = మనస్సుగలిగిన, అవ్విప్రసంతతి = పరశురాముఁడు, సత్వరితముగ, నిజనివాసమునకు, చనియెను.

తా. దశరథునకు సంతోషముగలుగునట్లు నీవు నరరూపముదాల్చితివని నీవు కేవలనారాయణుండవని పొగడి యారాముని సెలవుగొని మహేంద్ర పర్వత ప్రాంతమునకుఁ దపస్సుచేసికొనఁ బరశురాముఁడు వెళ్లెను.

లక్ష్మ.—గోపాలునకున్ = గోపాలమంత్రికి, ప్రేమగూర్పంగఁదగు రామన్ = ప్రేమంబుట్టించు స్త్రీని, రాజమన్ = రాజమ్మను, హితవేషన్ = ఉచితవేషముగల, రమ్యమూర్తినున్నయమ్మన్ = చక్కనిదేహముతోనున్న యామెను, తిరుపన్నన్ = తిరుపతిమంత్రిని, లసన్నతుల్ కొన్నిమారులొనర్చి =

వారియిష్టము వచ్చినట్లుపొగడి, కొంతసేపు, రామకృష్ణాభిఖ్యరంజిల్లునతనిని = రామకృష్ణయ్యయను కుమారుని, సత్కళాప్రపూర్ణధాముఁ = విద్యానిధియైన, లక్ష్మణాగ్రజన్మునిఁ = లక్ష్మణకవిని, రామయ్యనా = రామయ్యయను, ముదమ్ములభజించువానిని, ప్రమదమొప్ప, కొలిచి, దీవించి, తదనుజ్ఞఁగొని = వారిసెలవుపుచ్చుకొని, మహేంద్రపురోధస్థితిఁ = బృహస్పతివలె, సుబుద్ధినమరు = మంచిజ్ఞానముగల, అవ్విప్రసంతతి = ఆబ్రాహ్మణబృందము, సత్వరితముగ, నిజనివాసములకుఁ = స్వస్థానములకు, ఇంపుగను, చనియెను.

తా. ఆబ్రాహ్మణు లందఱును గోపాలమంత్రిని, భార్యను, బిడ్డలను, స్తుతించి, దీవించి, నిజగృహాంబులకుం బోయిరి.

వ. తదనంతరంబ సమస్తజనంబులు నభినందింప ముదమ్మున నిజపరిజనమ్ముం బురస్కరించుకొని యచ్చోటు వెల్వడి య గ్గోపాలుండు. 130

తా. దశరథుఁడును, గోపాలమంత్రియును, పరశురాముఁడును, బ్రాహ్మణులును జనిన పిమ్మట నక్కడనుండి సకలపరిజనంబు వెంటరా బైలు వెడలి.

సీ. అక్లేగుచు నట సహస్రకరప్రభం
        జనవిస్మయప్రదశక్తి నలరి
    కొమరొప్ప తనపెద్దకొమరుఁ దదవరజు
        లక్ష్మణుఁ దదనుజు లాలితగతి
    రాఢి నిజపురికి వేడుకతో నేగి
        లాజలతతులు నీరాజనములుఁ
    గొని యెదు రేగుదెంచిన పౌరజనముల
        కుత్సాహ మొందించి యుక్తరీతి
గీ. నగరు సొత్తెంచి దీనజనముల నర్థి
    మండలము నుచితస్థితి మహితవృత్తిఁ

దనిపి మాన్యులఁ బూజించి ఘనతమీఱు
సిరులఁ జెన్నొందుచుండె విశేషగతుల. 131

రాఘ. అట్లేగుచున్ = ఆరీతిని బోవుచు, అటన్ = అనంతరము (అక్కడ), సహస్రకర = కార్తవీర్యార్జునుని, ప్రభంజన=కొట్టినపరశురామునకు, విస్మయప్రద=ఆశ్చర్యమును జేసిన, శక్తిన్=పరాక్రమముచే (విస్మయ=గర్వమును, ప్రద = కొట్టివేసిన, శక్తిన్ = సామర్థ్యముచే), సహస్రకర = సూర్యునియొక్క, ప్రభన్ = కాంతివంటికాంతిచే, జనవిస్మయప్రదశక్తిన్= జనులకాశ్చర్యముకల్గురీతిని. అలరి, కొమరొప్ప, తనపెద్దకొమరున్ = శ్రీరాముని, తదపరజున్ = భరతుని, లక్ష్మణున్-తదనుజు = శత్రుఘ్నుని, లాలితగతిరూఢిన్ = సుందరమైనగమనరూఢిచే, నిజపురికి వేడుకతో సేగి, లాజలు=పేలాలు, అక్షతలు, పసుపుగలిపిన బియ్యము, నీరాజనములు=నివాళులు, కొని=తీసికొని, ఎదురేగుదెంచిన = ఎదుర్కొనిన, పౌరజనములకున్ = పురమునందలివారికి, ఉత్సాహమొందించి = సంతసముకలిగించి, ఉచితరీతిన్ = తగినట్లు, నగరుసొత్తెంచి = కోటలోఁ బ్రవేశించి, దీనజనముల = దీనులను, అర్థిమండలమును = యాచకులను, ఉచితస్థితిన్ = వారివారికిఁ దగినగతి, మహితవృత్తిన్ = మంచిహృదయముతో, తనిపి=తృప్తినొందించి, మాన్యులఁ బూజించి = పూజ్యులైనవారిని బూజించి, ఘనతమీఱు = అతిశయించిన, సిరులన్ = ఐశ్వర్యములతో, విశేషగతులన్ = పెక్కుభంగుల, చెన్నొందుచుండెన్ = విలసిల్లుచుండెను.

తా. దశరథుఁడు, పరశురామునికద్భుతముగలిగించినరాముని, తక్కిన ముగ్గురుపుత్త్రులను వెంటఁబెట్టుకొని మహావైభవముతో నిజపురంబున రా మందిరము ప్రవేశించి దనజనులదైన్యము పాపి, పెద్దలఁ బూజించి సకలసు ముల సానందము నొందుచుండెను.

లక్ష్మ.—తనపెద్దకొమరు=తిరుమన్నను, తదపరజు= రామకృష్ణయ్యను, తదనుజున్ = రామయ్యను, సహస్రకర...శక్తి మొదలైనవానికి రాఘవా ములోనే వ్రాయఁబడినది.

వ. అప్పుడు. 132

క. కమనీయశుభాచారుఁ
గమలజకుల బంధువంశకలశాంబుధిశీ
తమయూఖు నాతనిం గని
సమధికమోదాత్ము లైరి జను లెల్లెడలన్. 133

రాఘ.—కమనీయ = మనోహరమైన, శుభాచారున్ = శుభకరాచారముగలవానిని, కమలజ...మయూఖు - కమలజ = పద్మములయొక్క, కుల = వంశమునకు, బంధు = ఇష్టుఁడగుసూర్యుని, వంశ = కులమను, కలశాంబుధి = పాలసంద్రమునకు, శీతమయూఖుని = చంద్రునివంటి, ఆతనిన్ = ఆదశరథుని, కని, జనులు, ఎల్లెడలన్ = ప్రతితావునను, సమధికమోదాత్ములైరి = అధికహర్షమును బొందిరి.

తా. సూర్యవంశశ్రేష్ఠుఁడగునదశరథుం గాంచి జనులెల్లరు సంతసించుచుండిరి.

లక్ష్మి.—కమనీయశుభాచారున్, కమలజకుల = బ్రాహ్మణవంశమును బంధువంశ = బాంధవవంశమును (పోషించు), కలశాంబుధిశీతమయూఖున్ ఆతనిన్ = ఆగోపాలుని, కని, జనులెల్లెడ సమధికమోదాత్ములైరి.

తా. బ్రహ్మవంశశ్రేష్ఠుఁడు బంధుజనప్రియుఁడు నైనగోపాలుం గాంచి జనులు హర్షము నొందిరి.

వ. అవ్విధంబున నత్యంతవిభవసమన్వితుండై యుండి యతం డొక్కనాఁడు తనచుట్టునుం బరివేష్టించియున్నసభ్యజనుల యనుమతంబున. 134

తా. అర్థము రెండిఁటికి సమము.

క. ప్రతిభావంతుని సద్గుణ
యుతు నగ్రతనూజు నవనియోగ్యాచార
స్థితి మెఱయ నేలుచుంటకు
హితోపదేశంబు సేసి యిట్లని పలికెన్. 135

రాఘు.—ప్రతిభావంతునిన్ = బుద్ధివిశేషముగలిగినట్టియుం, "బుద్ధిర్మనవవోన్మేషశాలినీప్రతిభామతా" సద్గుణయుతున్ = సద్గుణములతోఁగూడినట్టియుం, అగ్రతనూజున్ = పెద్దకొడుకును, అవనిన్ = భూమిని, యోగ్యాచారస్థితిన్ = యోగ్యమైనరాజ్యపరిపాలనమర్యాద, మెఱయన్ = ప్రకాశింప, ఏలుచుంటకు = (ఏలుచుండు) పరిపాలించుచుండునిమిత్తమై, హితోపదేశంబుసేసి = హితమునుపదేశించి, ఇట్లని, పలికెన్.

తా. దశరథుఁడు గుణవంతుఁడు బుద్ధిమంతుఁడు నైనరామునికి భూపరిపాలనంబుచేయువిధం బుపదేశించి యిట్లనియెను.

లక్ష్మ.—ప్రతిభావంతుని, సద్గుణయుతు, అగ్రతనూజున్=పెద్దకొడుకు తిరుపతిమంత్రిని, నవ = నూతనమైన, నియోగ్యాచారస్థితిన్ = నియోగులయాచారస్థితిని, మెఱయన్, ఏలుచుంటకు, హితోపదేశంబు చేసెననుట

తా. గోపాలమంత్రి తిరుపన్నకుఁ దమనియోగులు జేయవలసినరాజకీయవ్యవహారాదులను బోధించి యిట్లనియెను,

ఉ. తమ్ములు నీదుపల్కులు హితమ్ములుగాఁ గొనిచేయ నార్యజా
తమ్ములు నీదుసద్గుణశతమ్ములు సంస్తుతిసేయఁ బక్షపా
తమ్ములు లేక న్యాయకలితమ్ములుగాఁ గ్రియలొప్ప సర్వభూ
తమ్ములు విశ్వసింప సుకృతమ్ములు వర్ధిలునట్లు చేయుమీ. 136

తా. నీతమ్ములు నీవుచెప్పినచొప్పున నిష్టముగాఁ బనిచేయుచుండఁ, బెద్దలు నీగుణములను బొగడునట్లు, పక్షపాతము లేకుండ న్యాయముగాఁ గార్యము లొనర్చుచు సమస్తభూతకోటియుఁ ను నమ్మునట్లుగాఁ బుణ్యకార్యము

లోనర్చుచుండుము. అని దశరథుండు రామునకును, గోపాలుండు తిరువన్న
కును బోధించిరి.

గీ. అనుచు మఱియును దగుమాటలాడుచు గరు
ణారసమ్మున నభిషేచనంబు సేయ
నాతఁ డత్యంతసంతోష మందె నప్పు
డచట వినినట్టిజనము లౌనౌననంగ. 137

రాఘు.—అనుచున్, మఱియును, తగుమాటలాడుచున్=ఉచితవచనంబులువల్కుచు, కరుణారసమ్మునన్=దయారసముచే, అభిషేచనంబు సేయన్=పట్టాభిషేకము సేయంగాఁగను, అతఁడు=రాముఁడు, అప్పుడచట వినినట్టిజనములు, ఔనౌననంగన్=మేల్మేలనునట్లు, అత్యంతసంతోష మందెను.

లక్ష్మి.—అనుచు మఱియును దగుమాటలాడుచు, కరుణారసమ్మునన్=దయారసముచే, అభిషేకము సేయన్=చల్లఁగాఁ దయగనఁబఱుపఁగా, అతఁడు=తిరువన్న, అచట వినినట్టి జను లౌనౌనన నత్యంతసంతోషమందెను.

వ. అట్టిసమయంబున. 138

గీ. దైవవశమునఁ జేసి స్వస్థానసంస్థి
తయయి యున్నను దనయగ్రతరుణి మీఁద
దలఁపు విడిచియ రెండవతరుణిఁ గోరి
ధృతిని గోపాలుఁ డంతఁ దద్గృహము నొందె. 139

రాఘు.—దైవవశమునఁ జేసి=దైవగతివలన, స్వస్థానసంస్థితయైయున్నన్=తనగృహమునం దున్నదియైనను, తన యగ్రతరుణిమీఁదన్=కౌసల్యపైని, తలఁపువిడిచియు=తలంపును మాని, రెండవతరుణిన్=కైకను, కోరి, గోపాలుఁడు=దశరథుఁడు, తద్గృహమును=ఆమెయింటిని (గూర్చి), అంతన్, పొందెన్=(వెళ్లెననుట).

తా. విధివశమున దశరథుండు దగ్గఱనున్నకౌసల్యను విడిచి కైకగృహమునకుఁ జనియెను.

లక్ష్మ.—దైవవశమునఁజేసి, స్వస్థానసంస్థితయైయున్నను = స్వర్గస్థ
మందుంపఁ బడినదైయుండఁగా, తనయగ్రతరుణిమీఁదన్ =రాజమ్మయందు,
తలఁపువిడిచియ = ఆసక్తిమాని, రెండవతరుణిఁ గోరి = ద్వితీయభార్యనుగోరి,
గోపాలుఁడు=గోపాలమంత్రి, దద్గృహమును=ఆరెండవభార్యను, "దారశ్చ
గృహ" అమరము. పొందెన్=వివాహమాడెను.

తా. దైవవశమున రాజమ్మ మృతినొందగ గోపాలమంత్రి రెండవవివా
హము చేసికొనెను.

సీ. అట్లొందియున్న యయ్యవసరంబందున
దృఢతరామోదసమృద్ధి గలయ
మందరాగోర్జితమానాధి కైక యీ
హితపటువరరూపమితగురూక్తి
ననయమచ్చ మవివేకాత్మబుద్ధివరుసం
గాలంబుగోరిన లీలహత్తి
యారామభద్రరాజ్యాశఁ దాఁ బట్టుట
గోపాలుసన్నిధి నేవుతోడ
గీ. నగ్రసుతుగుఱిచి మహాభవనప్రవే
శముఁ బ్రియాన్వితముగఁ జలుపు మనుచుఁ
బలుకఁ బడినమాతృభాషణ మాలించి
పెద్దతనయుఁ డపుడు ప్రీతుఁ డగుచు. 140

రాఘ.—అట్లు, ఒందియున్నన్ = కైకయింట జొచ్చియుండఁగా
ఆయవసరంబున=ఆసమయమున, దృఢతరామోదసమృద్ధిన్ = మిక్కిలి దృఢ
మైన సంతోషాతిశయముతో, కలయన్ = కూడఁగా, మందరాగోర్జితమా
నాధి-మందరా=మందరయను పరిచారికయొక్క, ఆగః=అపరాధమును, ఆధి
=మనోవ్యథయును గలిగిన, కైకయి=కైకచేతను, ఈహి...రూక్తి-ఈహిత=
కోరఁబడినట్టియు, పటుతర = సమర్థమైనట్టియు, వరరూప = వరములనెడు,

మిత=మితమైన, గురు=దుర్భరమైన, ఉక్తి=వాక్యము, అనయ = నీతిరహితమైన, మచ్ఛము=మీనము, అవివేకాత్మబుద్ధివరుసన్ = అవివేకమైనస్వబుద్ధిక్రమముచే, గాలంబుఁగోరినలీలన్ =గాలమునుభక్షణార్థంబుగోరినట్లు, హత్తి, ఆరామభద్రరాజ్యాశన్ = శ్రీరామునియొక్కరాజ్యమందలియాశను, తాఁబట్టుటన్ =తానుస్వీకరించుటచేతను, గోపాలునిసన్నిధిన్ = దశరథుని సమీపమున, తదగ్రసుతుఁ గుఱిచి=దశరథునిపెద్దకొడుకునుగుఱించి, మహౌఘ=గొప్పతేజస్సుగలవాఁడ, వనప్రవేశమున్, ప్రియాన్వితముగన్ = ఇష్టముతోఁగూడుకొనునటుల, సలుపుమంచున్ = చేయుమని, పలుకఁబడిన, మాతృభాషణము=తల్లిపలుకులను, ఆలించి=విని, పెద్దతనయుఁడు = రాముఁడు, అపుడు, ప్రీతుఁడగుచున్ =(సమ్మతించి యనుట).

తా. దశరథుఁడు తనయింట నున్నపుడు కైక మందరచెప్పినదానివలన వరమునుమిషపై భరతునకు రాజ్యము నిప్పింపఁదలఁచి రాముని వనమునకుఁ బొమ్మనియెను. రాముఁ డామెపలుకులకుఁ బ్రీతినొందె.

లక్ష్మ.——అట్లొండియున్న యయ్యవసరంబందున = గోపాలుఁడు రెండవభార్యనుస్వీకరించియుండఁగా, దృఢతరామోదసమృద్ధిగల, అమందరాగోర్జిత-అమంద = తక్కువకాని, రాగ=అనురాగముచే, ఊర్జిత=ఊర్జితురాలైన, మానాధికైక=అభిమానముచేనధికులైనవారిలో ముఖ్యురాలైన,ఈహిత=కోరఁబడిన, పటు=సమర్థమైన, వర=పెనిమిటియొక్క, రూప = రూపముగలిగినట్టి, మితగురూక్తి=మితమైనశ్రేష్ఠవాక్యముగలిగి, అచ్ఛమ = అచ్ఛమ్మయను ద్వితీయభార్య, అనయము=అత్యంతము, వివేకాత్మబుద్ధిన్=వివేకముగలతనబుద్ధిచే, సంగాలంబున్ -సంగ=సాంగత్యమును, ఆలంబున్ = అవలంబించినట్టి, వరు=పెనిమిటిని, కోటనలీలహత్తి=కలసి, ఆరామ=అచ్ఛమ్మ, భద్రరాజ్యాశన్=శుభరాశియొక్కయాశను, తాఁబట్టుటన్ = తానుబట్టియుండుటచే, గోపాలునిసన్నిధిన్=గోపాలమంత్రియొద్ద, ఏపుతోన్, తదగ్రసుతుగుఱించి = పెద్దకుమారుఁడు తిరుపన్నను గుఱించి, మహాభవనప్రవేశము=పెద్దయింటిలోఁ ప్రవేశము, ప్రియాన్వితముగన్=భార్యతోఁగూడ, సలుపుము=చేయుము,అనుచుఁ

బలుకఁబడిన, మాతృభాషణము = సవతితల్లి మాటలను, ఆలించి, ప్రీతుఁడగుచున్.

తా. సవతితల్లి యచ్చమ్మ తిరుపన్నను సాతనిభార్యను రెండవయుంటఁగాఁపుర ముండుమని చెప్పెను.

సీ. వినయమ్మున సుమిత్రతనయాగ్రణి సతిదా
        ను నట విహితలీల నొనరఁ బూని
    ధృతిని యోగిమణివిశ్రుతవేషమునను గ
        దలి వేగమే గంగ నెలమిఁ గాంచి
    గురుని భరద్వాజగోత్రు మ్రొక్కి యనుజ్ఞ
        యడిగి తదనుమతి నరిగి యవలఁ
    జిత్రకూటముఁ బ్రవేశించి సముదవృత్తి
        గామునిలీలలఁ గడఁగి యంత
గీ. ఘనతనయయుగాభీలవర్తనలు గాంచు
    చుండియు దటినియమగతి నొందుటఁ గడు
    విబుధలోకపూజితుఁ డయి వెలసె నంత
    నంతయుఁ దలంచి తండ్రి బల్వంత గుండి. 141

రాఘ.—వినయమ్మునన్ = అడఁకువగా, సుమిత్రతనయాగ్రణి = లక్ష్మణుఁడును, సతి = సీతయు, తానును, ఆటవిన్ = అడవియందు, హితలీలన్ = ఇష్టమైనవిలాసమును, ఒనరన్, పూని, ధృతిని = ధైర్యము చేత, యోగిమణి = యోగిశ్రేష్ఠులయొక్క, విశ్రుత = ప్రసిద్ధమైన, వేషమునను = జటావల్కలాదులం దాల్చి, కదలి = పట్టణమునుండినడచి, వేగమే, గంగన్ = గంగానదిని, ఎలమిన్ = సంతోషముతో, కాంచి = దర్శించి, భరద్వాజగోత్రున్ = భరద్వాజుఁ డను పేరుగల, గురున్ = పూజ్యుఁ డగుమునిని, మ్రొక్కి = నమస్కరించి, అనుజ్ఞ యడిగి = అనుమతిం బ్రార్థించి, తదనుమతిన్ = ఆమునియనుజ్ఞాప్రకారము, అరిగి = కడచిపోయి, ఆవలన్ = ఆవల, చిత్రకూటమున్ = చిత్రకూటపర్వతమును, ప్రవేశించి = చేరి, స+ముద్వృత్తిగా = సంతోషవృత్తిచే,

మునిలీలన్ = మునివృత్తులయందు, కడఁగి = ఒప్పి, అంతన్, ఘనతన్ = శ్రేష్ఠతచే, నయయుంగాభీలవర్తనలు-నయ = నీతితో, యుంక్ = కూడిన, ఆభీల = కష్టములగు, వర్తనలు = నడవడులను, కాంచుచుండియున్ = చూచుచునుండి, తఱిన్ = సమయమందు, నియమగతిన్ = నియమప్రకారమును, ఒందుటన్ = పొందుట, కడున్ = మిగుల, విబుధలోకపూజితుఁడు = దేవజనులచేశ్లాఘింపఁబడినవాఁడు, అయి వెలసెన్. అంతన్ = ఇదియంతయును, తలఁచి = విచారించి, తండ్రి = దశరథుఁడు, బల్వంత = బలమంతయును, కుంది = నశించి.

తా. రాముఁడు సీతాలక్ష్మణసమేతుఁడై పురంబువిడిచి యోగివేషమున గంగానదిం దాఁటి భరద్వాజాశ్రమముం జేరి, చిత్రకూటమున కరిగి యిట్లు సమయపరిపాలనమునకై వనవాసమునం గుందుచుండ దశరథుఁడు చింతిల్లి నీరసించి.

లక్ష్మ.—వినేయమ్మునన్ = వినయమ్ముగానే, సు+మిత్రతనయాగ్రణి = యోగ్యస్నేహితులుగల పెద్దకొడుకైనతిరుపన్న, సతి = భార్యయును, తాన్ = తానును, అట = అచ్చట, విహితలీలన్ = నిర్ణయింపఁబడినరీతిని, ఒనరన్ = ఒప్పునట్టు, పూని = అంగీకరించి, ధృతిన్ = ధైర్యముతో, నియోగిమణివిశ్రుతవేషమునను = నియోగశ్రేష్ఠులకుచితమైన వేషముతో, కదపి, వేగంగన్ = వేఁగా, ఎలమిన్ = ఇష్టముగా, భరద్వాజగోత్రున్ = భరద్వాజగోత్రముగల, గురున్ = ఉపాధ్యాయులను, కాంచి = చూచి, మ్రొక్కి, అనుజ్ఞన్, అడిగి, తదనుమతిన్ = ఆగురునియంగీకారముచే, అరిగి, అవల, చిత్రకూటము-చిత్ర-విచిత్రములైన, కూటము = కొట్టములు గలగృహమును, ప్రవేశించి, సముద్వృత్తిన్-సముత్ = సంతోషముతోఁగూడిన, వృత్తిన్ = జీవనముచేత, కామునిలీలలన్ = మన్మథక్రీడలయందు, కడఁగి = తేలి, అంతన్ = అంతట, ఘన..వర్తనలు-ఘన-ఘనులయిన, తనయయుంగ = ఇద్దఱుకొమరులయొక్క, ఆభీలవర్తనలు = నడవడులు, కాంచుచున్ ఉండి. తఱిని = కాలమునందు, యమగతిన్ = మరణమును, ఒందుటన్ = పొందుటచే, కడున్ = మిక్కిలి, విబుధలోకపూజితుఁడు = దేవ

లోకమందుఁ బూజింపఁబడినవాఁడు, అయి, వెలసెన్. అంతన్, అంతయుఁ దలంచి, తండ్రి=గోపాలుఁడు, బల్వంతన్=గొప్పదుఃఖముచే, కుంది=క్షీణించి.

తా. సవతితల్లి నియమించినట్లు భార్యతోఁ గూడఁ దిరుపతిమంత్రి వేఱింటికాఁపురము చేయుచుండి యిద్దఱుపుత్రులం గని సుఖజీవనము చేయుచు నుండి దైవవశమున స్వర్గస్థుఁ డయ్యెను. ఇదియంతయుఁ విచారించి గోపాలుఁడు దుఃఖముచే క్షీణించి.

క. మునుపట దుర్జ్ఞానంబున
నొనరఁగ నొకపుణ్యుసుతవియోగము నొందం
గ నొనర్చుటచే నివ్విధి
ననుభవ మొందంగవలసినది నా కనుచున్. 142

రాఘు.—మునుపట=పూర్వము, దుర్జ్ఞానంబునన్ = దుర్బుద్ధిచే, ఒకపుణ్యు=ఒకమునిని, సుతవియోగమునొందించుటన్ = కొమరుఁడు లేనివానింగాఁ జేయుటకారణముగ, ఇవ్విధిన్ = ఈరీతిగా, అది=ఆకర్మము, అనుభవమొందంగవలసెన్ = అనుభవింప వలసివచ్చినది, అనుచున్ = తలంచుచు.

తా. దశరథుఁ డొకప్పుడు వేఁటకుఁబోయి యొకమునికుమారుని మృగమనుభ్రాంతితోఁ జంపియున్నాఁడు కావున నామునిశాపముననే తనకీపుత్రవియోగము సంభవించె నని విచారించెను.

లక్ష్మ. మునుపట=పూర్వజన్మమున, దుర్జ్ఞానంబునన్=అజ్ఞానముచే, ఒనరఁగన్, ఒకపుణ్యున్=ఎవ్వరో యొకపుణ్యాత్ముని, సుతవియోగమున్=పుత్రవియోగమును, ఒందంగనొనర్చుటచే=పొందునట్లు చేయుటచే, అది = ఆపాపము, ఇవ్విధిన్=ఈప్రకారము, అనుభవమొందంగవలసెన్ = అనుభవింపవలసివచ్చినదని, అనుచున్=అని విచారించుచు.

తా. గోపాలుఁడు, "పూర్వము నేనెవ్వరిపుత్త్రు నెడఁ బాసితినో నాకిప్పు డాపాపమనుభవమునకు వచ్చిన"దని శోకించెననుట, కష్టములు సంభ

వించినప్పుడు నేనెవ్వరిని గష్టపెట్టితినో యది యిప్పుడు నాకుఁ బ్రాప్తించిన దనుకొనుట స్వభావము.

వ. అట్లగ్రతనయుంబాయుటకు ననేకప్రకారంబులం జింతించుచు మఱియు నప్పుడు క్రొత్తయై వగలం బుట్టించు తనయ బలాగ్రగణ్యా విలాసాద్యదర్శనంబు దుస్సహంబైన నతండు.

రాఘ.—అట్లు = ఆరీతిగా, తనయుంబాయుటకై = రాముని నెడఁబాయుటకు, అనేకప్రకారంబులన్ = పలువితముల, చింతించుచున్ = చింత నొందుచు, మఱియుం,అప్పుడు, క్రొత్తయై=నూతనములుగావున, తనయ=పుత్రుల యొక్క, బల=బలము, అగ్రగణ్య=మొదటిదిగాఁగల, విలాసాది=విలాసాదుల యొక్క, అదర్శనంబు = కనఁబడకపోవుట, దుస్సహంబైనన్ = సహింపఁదరముకాకపోఁగా, అతండు = దశరథుఁడు.

తా. తనతనయుల విలాసాదాదులు చూచుట లేకపోవుటయే యాదశరథునకు దుస్సహమైనది.

లక్ష్మ. అట్లు, అగ్రతనయుఁన్ = తిరుగన్నను, పాయుటకున్ = ఎడఁబాయుటకు, అనేకప్రకారంబులం జింతించుచు, మఱియున్,అప్పుడు, క్రొత్తయై, వగలంబుట్టించు, తన=తనయొక్క, అబల=పెద్దభార్య రాజమ్మయొక్క, అగ్రగణ్య=శ్రేష్ఠములగు, విలాస = చమత్కారములయొక్క. (అబలాగ్రగణ్య=మొదటిభార్య,) అదర్శనంబు = చూడకపోవుట, దుస్సహంబు=సహింపరానిది, అయినన్, అతండు = గోపాలుఁడు.

తా. తిరుపనమంత్రి కాలధర్మమునొందినంత గోపాలమంత్రికిఁ గ్రొత్తక్రొత్తగాఁ బుట్టుచున్న దుఃఖములలోఁ దనపెద్దభార్య రాజమ్మ జ్ఞాపకమునకువచ్చినది. (ఆమెవిలాసములు, నామెకొడుకు తిరుపన్నవృత్తి యును తనిఖీ భరింపరాని వయ్యెను.

క. పూతగుణా భాసురలీ
లాతత్పర మాన్యకీర్తి లక్ష్మీకాంతా

సీతారామ సుతా విడి
పోతే సుకుమార చనితె పొలుపుగ ననుచుఁన్. 144

రాఘు.—పూతగుణా = పవిత్రగుణములుగలవాఁడా, భాసురలీలాతత్పర=ప్రకాశమానమైన విలాసాభిలాషముగలవాఁడా, మాన్యకీర్తి=సుయశస్సు గలవాఁడా, లక్ష్మీకాంతా = శ్రియఃపతీ, సీతారామా, సుతా=కొడుకా, విడిపోతే = ఎడఁబాసిచనితివా, సుకుమార = సౌకుమార్యముగలవాఁడా, చనితె, పొలుపుగన్, అనుచున్. (దశరథుఁడు దుఃఖించుట.)

లక్ష్మ.—(భార్యనుద్దేశించి గోపాలుఁడు)పూతగుణా,భాసురలీలాతత్పర, మాన్యకీర్తి... సుతా-మాన్య = పూజ్యులైన, కీర్తి=కీర్తివారను నింటిపేరుగల లక్ష్మీకాంతాసీతారామసుతా = లక్ష్మమ్మ సీతారామయ్యలను దంపతులపుత్రికా, సుకుమారా = మంచికుమారులను గనినదానా, విడిపోతే=చనితే, అని దుఃఖించుచున్నాఁడు.

క. తనయగ్రభార్య వేడ్కలు
బెనిచెడు నగ్రసుతుఁ దలఁచి పెరిఁగినవగతో
డను గొన్నాళ్లకుఁ దానును
జనియె మహాత్ముం డతండు స్వర్గంబునకున్. 145

రాఘు.—తనపెద్దభార్య వేడ్కలు = కౌసల్యముచ్చటలను, పెనిచెడు తనయగ్రసుతున్ = వృద్ధినొందించు తనపెద్దకొడుకును, తలఁచి, పెరిఁగినవగతోన్ = అతిశయించినదుఃఖముచేత, కొన్నాళ్లకున్ = మఱికొన్నిదినములకు, మహాత్ముఁడు, తానును, అతఁడు=దశరథుఁడు, స్వర్గంబునకుం జనియెను= కాలధర్మము నొందెను.

తా. పుత్రశోకమునఁ గొన్నాళ్లకు దశరథుఁడును మృతినొందెను.

లక్ష్మ. తనయగ్రభార్యను=రాజమ్మను, వేడ్కలు పెంచెడునగ్రసుతున్, తిరుపన్నను, తలఁచి=తలంచికొని, పెరిఁగినవగతోడను, గొన్నాళ్లకు దానును మహాత్ముఁడైనయతఁడును = గోపాలమంత్రియుం, స్వర్గమునకుఁ జనియెను.

వ. అట్లు పరలోకగతుం డైనతండ్రికి రెండవసుతుం డనుజసమేతుం డై పరలోకక్రియలు నిర్వర్తించి యగ్రజన్మానుమతంబున నానందిగ్రామంబున స్వకార్యధురంధరుం డై యుండె నంత. 146

రాఘ.—అట్లు = విచారించి విచారించి, పరలోకగతుం డైనతండ్రికి = మరణించిన దశరథునకు, రెండవ సుతుఁడు = భరతుండు, అనుజసమేతుం డై = శత్రుఘ్నునితోఁగూడి, పరలోకక్రియలు నిర్వర్తించి = ఊర్ధ్వలోకమున కేగఁదగినక్రియాకలాపముఁ నడపి, అగ్రజన్మానుమతంబున = అన్న యైనరాముని యంగీకారముచే, ఆనందిగ్రామమునన్ = నందిగ్రామమను గ్రామమునఁ, స్వక = స్వవంశస్థులగు, ఆర్య = పెద్దలవలె, ధురంధరుఁ డై = రాజ్యభారమును వహించి, ఉండెన్.

తా. భరతుఁడు తండ్రికి పితృలోకక్రియలు చేసి యన్నగారియనుమతిపై నందిగ్రామమున నుండి రాజ్యము చేయుచుండెను.

లక్ష్మ.—అట్లు పరలోకగతుం డైన తండ్రికిన్ = గోపాలమంత్రికి, రెండవసుతుఁడు = రామకృష్ణయ్య, అనుజసమేతుఁ డై = తమ్ములతోఁగూడ, పరలోకక్రియలు నిర్వర్తించి, అగ్రజన్మానుమతంబునన్ = బ్రాహ్మణులయంగీకారముచేత, (తండ్రి జీవించియుండగా అన్నకు అజ్ఞాధికారము లేదు) ఆనంది = సంతోషముకలవాఁ డై, గ్రామంబునన్ = ఉయ్యూరులో, స్వకార్యధురంధరుం డై = కరిణీకభారమును వహించి, ఉండెను.

తా. రామకృష్ణయ్య తక్కినయిద్దఱుతమ్ములతోడను దండ్రికిఁ బరలోకక్రియ లాచరించి ఉయ్యూరుకరణీకమును బెద్దలయనుమతిచేఁ జేయుచుండెను.

సీ. అట మహోన్నతి గాన నాయాసగతి బూని
దారానుజన్మాన్వితంబుగాఁగ
నుండు లక్ష్మణపూర్వజుం డొక్కనాఁడు ప్రి
యానుజాలును దాను నరిగి యొకెడ

నత్రిజగజ్జనస్తోత్రార్హ నత్రికు
ల్యనసూయ శుభమీనాయతాక్షిఁ
గమఠపదాగ్రభాగ మకరజంఘిక
వరతరంగవళి నావర్తనాభి
గీ. సైకతశ్రోణి ఫేనహాసఘనదీర్ఘ
వేణి మంచియడుగుసొంపు వెలయుదానిఁ
బూతవృత్తి వియన్నదిఁ బోలుదాని
నఘహరస్మృతిదర్శనార్హ యగుదాని. 147

రాఘ.—లక్ష్మణపూర్వజుండు=రాముఁడు, అట్టి, మహోన్నతిన్ = ఘనుఁడౌటచే, కానన్ = అడవియందు, ఆయాసగతిన్ = కష్టప్రయాణమును, ఘనిదారానుజన్మాన్వితంబుగన్ = భార్యయుఁ దమ్ముఁడు గలసిరాఁగా, ఉండు = ఉండునట్టివాఁడు, ఒక్కనాఁడు, ప్రియానుజులును = ప్రియురాలైనసీతయుఁ దమ్ముఁడు లక్ష్మణుఁడును, దానును, అరిగి= పోయి, ఒకెడన్ = ఒకచోట, అత్రిన్ = ఈపేరుగలమునిని, జగజ్జనస్తోత్రార్హన్ = జగత్తునందలి జనులస్తుతికిఁబాత్రురాలైన, అత్రికుల్యన్ = అత్రిమునికులకాంతయగు, అనసూయన్ = ఈపేరుగలపతివ్రతను, శుభమీనాయతాక్షిన్ - శుభ = ప్రకాశించుచున్న, మీన = మత్స్యములవలెఁ జరించుచున్న, ఆయతాక్షిన్ = విశాలనేత్రములుగలదాని, (ఇది యుపమానపూర్వపదము) ముందునిట్లే, కమఠపదాగ్రభాగన్ = తాఁబేళ్లవంటి మీఁగాళ్లుగలదాని, మకరజంఘికన్ = మొసళ్లవంటిపిక్కలుగలదాని, వరతరంగవళిన్ = తరంగములవంటి వళులు గలదాని, ఆవర్తనాభిన్ = సుడివంటిబొడ్డుగలదాని, సైకతశ్రోణిన్ = ఇసుకతిన్నెలవంటి శ్రోణులుగలదానిని, ఫేనహాసఘనదీర్ఘవేణిన్ = నురుగువలెఁ దెల్లనైననిడుదయగు వేణీభారము గలదానిని, మంచియడుగు సొంపువెలయు దానిన్ =సుందరపాదములుగలదానిని,పూతవృత్తిన్ =పవిత్రతచే, వియన్నదిఁ బోలుదానిన్ = స్వర్గంగవంటిదానిని, అఘహార = పాపమునుహరించు, స్మృతిదర్శనన్ = స్మరణమును దర్శనమును గలదాని, ఆర్యయగుదాని = పూజ్యురాలైన యనసూయను.

తా. రాముఁడు భార్యయుం దమ్ముఁడును దోడరాఁ జని యత్రిమునిని నాతనిభార్యయనసూయను (దర్శించిరనుట.)

లక్ష్మ.—అటన్ = అప్పుడు, మహోన్నతిగాన్ = అతిశయముగ, అనాయాసగతి = ఆయాసములేని గమనమును, పూని = గ్రహించి, దారానుజన్మాన్వితంబు గాన్ - దార=భార్యతో, అనుజన్మ=తమ్ములతో, అన్వితంబుగన్ = కూడుకొని, ఉండు=ఉండినట్టి, లక్ష్మణపూర్వజుండు = రామకృష్ణమ్మ (లక్ష్మణకవికంటెముందుఁబుట్టినవాఁడు), ఒక్కనాఁడు, ప్రియా, అనుజుల్, తానును, అరిగి, ఒక్కెడన్, అత్రిజగజ్జనస్తోత్రార్హన్ - అ=అట్టి, త్రిజగత్ = మూఁడు లోకములందున్న, జన = జనుల, స్తోత్ర = స్తుతికి, అర్హన్ = తగినట్టియుం, అనసూయన్ = గుణములయందు దోషమారోపించుటలేనిది. (అనఁగాఁ బ్రకరణవశమున నిచ్చట నిర్మలమైనది యని యర్థము.) అత్రి-ఈపేరుగల ఋషిచేఁ దేఁబడిన, కుల్యన్ = నదిని (అనఁగా ఆత్రేయియనుగోదావరి యేడుపాయలలో నొకదానిని), "కుల్యాకులవధూసరిత్" అనినిఘంటువు. ఈ క్రింది వాక్యములు నదికి విశేషణములు, మీనాయతాక్షిన్ = చేఁపలనెడుకన్నులు, కమఠపదాగ్రభాగన్ = తాఁబేళ్లను మీఁగాళ్లు, మకరజంఘికన్ = మకరములే జంఘలు, వరతరంగవళిన్ = తరంగములనువళులు, ఆవర్తనాభిన్ = సుడియను నాభి, సైకతశ్రోణిన్ = ఇసుకతిన్నెలను పిఱుఁదులు, ఫేనహాసన్ = నురుగను నవ్వును. ఘనసద్దీర్ఘవేణిన్ = ప్రవాహమను దీర్ఘమైనజడలుగలదానిని, పూతవృత్తిన్, నియున్నింబోలుదానిన్, మంచియడుగు సొంపువెలయుదానిన్, (ఇక్కడ నదియొక్కయడుగు) క్రిందితావుగలదానిని, అఘహారస్మృతిదర్శనన్ = స్మరించినను దర్శించినను పాపములం బోఁగొట్టుదానిని, ఆర్యయగుదానిన్ = పూజ్యురాలైనదానిని.

తా. రామకృష్ణమ్మ యాత్రేయీనదిని సేవింపఁ బోయెను.

సీ. భక్తి వీక్షించి పల్మఱుఁ బ్రణతిచేసి
వారిఁ గొనియాడి తద్దేవివలనన శుభ
కరత గలయంగరాగంబుఁ గాంచి యొప్పు
మహితనయయుక్తి నొంది వారు హితలీల. 148

రాఘ.—భక్తిన్=భక్తిపూర్వకముగా, వీక్షించి=చూచి, పల్కుచున్=మాటిమాటికి, ప్రణతిచేసి = నమస్కరించి, వారిఁ గొనియాడి = అనుమునిదంపతులను బొగడి, తద్దేవివలనను = అనసూయవలన, శుభకరత = శుభమును జేయుట, కల = కలిగిన, అంగరాగంబున్ = చందనలేపమును, కాంచి= పొంది, ఒప్పుమహితనయయుం క్తిన్ = ఒప్పునట్టిసీతతోఁగూడి, వారు=ఆరామలక్ష్మణులు, హితలీలన్=ఇష్టరీతిచేత.

తా. అత్రిని, అనసూయను దర్శించిరి. అనసూయ సీత కొకయంగరాగ మిచ్చినది.

లక్ష్మ.—భక్తిన్, వీక్షించి, పల్కు, ప్రణతిచేసి, వారిన్ = ఉదకమును, కొనియాడి = స్తుతించి, తద్దేవివలనను=ఆత్రేయివలన, శుభకరతన్ = శుభముచేయుటను (శుభకరశబ్దమునకు,తల్. ఈప్రత్యయము పరముకాఁబట్టి 'త్వతలోర్గుణవచనస్య' యనుసూత్రముచేఁ బుంవద్భావము) కలయంగన్ = కలియుటకొఱకు (శుభమును బొందుకొఱకు), రాగంబున్ = ఆసక్తిని, కాంచి, ఒప్పు, మహిత = పూజ్యమగు, నయ = ఉపాయముయొక్క, యుం క్తిన్ = కలియుటను, ఒంది, వారు = రామకృష్ణమ్మ మొదలైనవారు, హితలీలన్ = హితప్రకారమున.

తా. ఆత్రేయినదిని స్తోత్రముచేసి ఉదకప్రభావమును గొనియాడి.

వ. తద్దేవిని గూర్చి యి ట్లనిరి. 149

తద్దేవియన – అనసూయయుం, ఆత్రేయీనదియును.

క. భువి నినుదర్శించిన మా
నవులె కృతార్థులు జగజ్జనని యాత్రేయీ
భవదచ్యుతశివగోవర
పవిత్రగతి వశంబె నిన్నుఁ బ్రస్తుతి సేయన్. 150

రాఘ —భవ... వర-భవత్ =పుట్టుచున్న, అచ్యుత = విష్ణువు, శివ= శివుఁడు, గోవర=బ్రహ్మయునుగలదానా(అనసూయయందుఁ జంద్రదత్తాత్రేయ దుర్వాసులై బ్రహ్మవిష్ణుమహేశ్వరు లుద్భవించిరని పురాణగాథ.), భువిన్ =

భూమియందు, నిను, దర్శించినమానవులె, కృతార్థులు, జగజ్జనని=లోకమాత? పవిత్రగతి = పవిత్రమగు నూర్ధ్వలోకములగల, ఆత్రేయీ = అనసూయా, నిన్నున్, ప్రస్తుతిసేయఁగన్=పొగడుటకు, వశంబె=శరమా.

తా. త్రిమూర్తులను బుత్రులనుగాఁగనినది కనుకయే జగజ్జననీ యని సంబోధనము, అనసూయాదేవీ నిన్నుఁజూచినవారు కృతార్థులు, నిన్నుఁ బొగడదరముగాదు.

లక్ష్మ.—జగజ్జనని, భవ...గతి-భవ = సంసారములను, దః=ఖండించునట్టి (విష్ణువులవలన), చ్యుత=జారిన, శివ=శుభప్రదములగు, గోవర=ఉదక శ్రేష్ఠములచేత, పవిత్ర=పవిత్రమైన, గతి=ప్రవాహములుగల, ఆత్రేయీ=ఓనదీ, భువి, నినుదర్శించినమానవులె కృతార్థులు, నిన్నుఁ బ్రస్తుతిసేయ వశముగాదు.

తా. సంసారనాశకుఁడైనవిష్ణుపాదమునుండి యుద్భవించిన పవిత్రోదకములుగలయాత్రేయీ నీవు లోకమాతవు. నినుఁగాంచినవారు పుణ్యాత్ములు. నీచరిత్రం బప్రమేయము.

క. అని వినుతించుచు నందున్
మునిగిరిధృతి నియతిఁ గొంత ప్రొద్దర్హ్యవిధుల్
గనుచున్ సేవించిరి పెం
పెనయ ననుజ్ఞ గొని రంత నెంతయు వేడ్కన్. 151

రాఘ.—అని, వినుతించుచున్=స్తోత్రముచేయుచు, అందున్=ఆయాశ్రమమందు, కొంతప్రొద్దు=కొంతసేపు, అర్హ్య=సర్హోచితమగు, విధుల్=పూజావిధులను, కనుచున్=పొందుచు, నియతిన్ = నియమముచే, గిరిధృతిన్=పర్వతమువంటిధైర్యముగల, మునిన్=అత్రిని, సేవించిరి-పెంపెనయ-ననుజ్ఞగొనిరి=అనుజ్ఞపొందిరి. అంతన్, ఎంతయుం వేడ్కన్ = మిక్కిలి యానందముతో.

తా. అత్రిముని, అనసూయను సేవించి వారియనుమతిం బొంది.

లక్ష్మ.—అని, వినుతించుచున్, అందున్=ఆనదిలో, ధృతిన్ మునిఁగిరి=స్నానము చేసిరి. (రాఘవార్థమున, మునుఁగులోని సిద్ధఖండమునకు లోపము

వచ్చినది.) నియతిక్ =నియమముగా, కొంతప్రొద్దు, అర్ఘ్యవిధుల్ =సంధ్యావందనాదులు, కనుచుక్, సేవించిరి. ఎంతయుం వేడ్కక్, అనుజ్ఞగొనిరి.- ఆనదిని యనుజ్ఞ యడిగిరి. (పోవుటకు)

తా. ఆనదిలో స్నానముచేసి యచట సంధ్యాద్యనుష్ఠానములు తీర్చికొని వెడలిరి.

వ. అట్లచటువెలువడి ప్రియానుజులు దానును వతండు. 152

రాఘ.—ప్రియా=భార్యయగు సీతయుం, అనుజాలు=లక్ష్మణుండును.

లక్ష్మ.—ప్రియా=ప్రియంరాలును, అనుజాలు=తమ్ములును, లేక, ప్రియ=ప్రియంరాలైన, అనుజాలు=తమ్ముళిద్దఱును.

సీ. సన్నుతమౌనివాసప్రదేశవిలోక
నము సేయుచును వెర వమరఁ గడఁగి
యాదండకావీథి మోదం బమర నేగి
యమ్ముందర నొకమహాసురారి
సకలపుణ్యజనహర్ష కరు గోపాలసు
మూర్తిసామ్యరహితుఁ బొసఁగ నొక్క
నెలవునఁ గని నిజకులగోత్రనామముల్
చెప్పియున్నతితోడఁ జేరి పలికె

గీ. నీవు చిత్రతరవిఖ్యాతి విరాధా జీవి
తేశసముఁడ వగుచు దృఢత నెపుడు
మునిజనంబు చేరువను సంచరించుచు
నుందు వతుల దా మహోన్నతముగ. 153

రాఘ.—సన్నుత = స్తుతింపఁబడిన, మౌని = మునులయొక్క, వాస=నివాసములయొక్క, ప్రదేశవిలోకనము=స్థలదర్శనము, చేయుచుక్, వెరవు=ఉపాయము, అమరక్, కడఁగి=ప్రయత్నించి, ఆదండకావీథిక్=ఆదండకా

రణ్యమార్గమందు, మోదంబునురన్ = సంతోషయుక్తముగా, ఏగి = నడచి, అమ్ముందరన్ =ఎదుట, సకలపుణ్యజనహర్షకరున్ - సకల=సమస్త, పుణ్యజన= రాక్షసులకు, హర్షకరున్ = సంతోషమును గల్గించు, కోపాలసున్ - కోప= క్రోధముచే, అలసున్ =మందబుద్ధికలిగిన, మూర్తిసామ్యరహితున్ - మూర్తి= శరీరముచే, సామ్యరహితున్ =సాటిలేనట్టి (గొప్ప దేహముగలవాని), మహాసు రారిన్ =పెద్దరాక్షసుని, ఒక్కనెలవునన్ = ఒక్కచోట, కని=చూచి, పొసఁ గన్, నిజకులగోత్రనామముల్ = తమకులగోత్రనామమును, చెప్పి, ఉన్నతి తోడన్ =అతిశయముగ, చేరి=సమీపించి, పలికెన్ =(రాముఁడిట్లనివానితో) అనియెను. ఓవిరాధా=విరాధనామరాక్షసుఁడా, నీవు, చిత్రతరవిహృతి=ఋషి వధమొదలగు వినోదవిహారములు కలవాఁడవు, జీవితేశసముఁడవు = యమసమా నుఁడవు. అగుచున్, స్పృహతన్, ఎపుడున్, మహోన్నతముగన్ = ఉన్నతుఁ డవై, మునిజనంబులచేరువన్ = మౌనులసమీపమున, సంచరించుచుందువు= వారినిభక్షించుటకై మెలంగెదవు, అకుల = కులరహితుఁడా! (గృహములేని వాఁడా యనియును) దా=రా, (గమ్మనుట) దా యనునది దేశ్యపదము.

తా. అక్కడనుండి మునులయాశ్రమములం జూచుచు దండకారణ్య మార్గమునం బడిపోవుచు నొకచోట విరాధుఁడనురాక్షసుని గాంచి రాముఁడు పల్కుచున్నాఁడు.

లక్ష్మ.——సన్నుతవహా = స్తోత్రము చేయఁబడునట్టి, నివాస=గృహముల యొక్క, ప్రదేశవిలోకనము చేయుచున్ = స్థలములం గాంచుచు, అమరన్, వెరవున్, కడఁగి=పొంది, ఆదండకన్ = ఆభాగమునకు, ఆవీథిన్ =ఆమార్గ మున, మోదంబు = సంతోషము, అమరన్, ఏగి, అమ్ముందరన్, సకలపుణ్య జనహర్షకరున్ =సమస్తపుణ్యాత్ములకు నానందమును గల్గించు, గోపాలసుమూ ర్తిన్ =గోపాలస్వామిని, సామ్యరహితున్ =సాటిలేనియట్టి, మహాసురారిన్ = ఘనుఁడైనరాక్షసద్వేషిని, పొసంగన్, ఒక్కనెలవునన్ =ఒక్కదేవాలయమున, కని=దర్శించి, నిజకులగోత్రనామముల్ చెప్పి, చేరి, రాధాజీవితేశ = రాధ యను వనితకుఁ బ్రియుఁడా, నీవు, చిత్రవిహృతి=గోపీవస్త్రాపహారము మున్నగు

చిత్రలీలలు కలవాఁడవు, సముఁడవు=శత్రుమిత్రులయందు సమబుద్ధిగలవాఁడవు, అనుచున్, దృఢతన్, మునిజనంబుల చేరువన్ = మానులయొద్ద, సంచరించుచుందువు (వారిని రక్షించుటకనుట,) వకులదామ = వకుళపుష్పమాలికల స్వామీ, హా! (ఆశ్చర్యము) ఉన్నతముగన్.

తా. రామకృష్ణమ్మ కుమ్మరవీధిఁబడిపోవుచు గోపాలస్వామిని దర్శించి స్తుతించెను.

వ. అని మఱియును. 154

సీ. అసురజ్యేష్ఠుఁడవై విచిత్రగతుల
నొనరసృజించుచునుండు దీవు
శూలాయుధుండవై చొచ్చి చరాచర
భూతంబుల నణంపఁ బూనుదీవు
సద్గోత్రభేదివై సత్వరితముగ నా
సవభాగములు గొన జరుగు దీవు
చండకరుండవై జగతీజనులకు నీ
వేఁడిమిఁ జూపుచు వెలయు దీవు

గీ. హేల నివ్విధి నెపుడు నిజేచ్ఛనిట్లు జ
రించు నీలీల మాయ గావించు నేను
గోరి యివ్వేళ నినుఁ గనుఁగొన్నవాఁడ
నింక నిన్ను విడుచుటది యెట్లు గలుగు. 155

రాఘు.—అసురజ్యేష్ఠుండవై=రాక్షసులకుఁ బెద్దవై, ఈవు=నీవు, విచిత్రగతులన్ = అద్భుతరీతులను, (ఒనరన్, సృజించుచునుందువు = పుట్టించుచున్నావు; స్త్రీలను చెఱవెట్టుట,మునులభక్షించుట మొదలైనవానిం జేయుచున్నావు) శూలాయుధుండవై=శూలముసుధరించి, చొచ్చి=చొరఁబడి, చరాచరభూతలంబులన్-చర=సురమానుషగంధర్వాదులను, అచరభూతంబులన్= గిరివృక్షాదులను, అడంపన్ =నశింపఁజేయుటకు, పూనుదువు, సద్గోత్రభేదివై-

సత్=శ్రేష్ఠములగు, గోత్ర=బ్రాహ్మణాదికులములను, భేదివై=భేదించువాఁడవై, ఆసవభాగములు = యజ్ఞభాగములు, కొనన్ = గ్రహించుటకు, జరుగుదువు= వెళ్లెదవు. జగతిన్, చండకరుండవై=భయంకర హస్తములుగలవాఁడవై, జనులకున్, నీ వేఁడిమిన్ = నీతీవ్రమును, చూపుచున్ = కనఁబఱుచుచు, వెలయుందు, హేలన్ = విలాసముచే, ఇవ్విధిన్ = ఈప్రకారముగా, నిజేచ్ఛమై= నీయిచ్చవచ్చినట్లు, చరించు = సంచరించు, నీలీలన్ = క్రియను, మాయన్ = మాసిపోవునట్లు, కావించునేను = చేసెడునేను, కోరి, ఇవ్వేళన్, ఇటన్, కనుఁగొన్నవాఁడన్ = చూచినాఁడను. ఇంకన్, నినున్, విడుచుట, ఎట్లు కలుగు (కలుగదనుట.)

తా. మునులను స్త్రీలను చరాచరములను నశింపఁ జేయుచున్న నిన్ను, జంప వచ్చితిని. నీ వింకెందుఁ బోయెదవు. అని విరాధునితో రాముఁడు పలుకును.

లక్ష్మ.—అ. గోపాలమూర్తిని బ్రహ్మరుద్రశక్ర సూర్యరూపముగా నుతించుచున్నాఁడు.—అ+ సురజ్యేష్ఠుండవై = బ్రహ్మవై, విచిత్రగతులన్ = దేవ తిర్యఙ్మనుష్యాది భేదవిచిత్రముగా, ప్రజలను, సృజించుచు నుందుదువు. కాలాయంధుండవై= ఈశ్వరుఁడవై, చరాచరభూతంబులన్, అణంపఁబూని దవు = నాశముచేసెదవు, సద్గోత్రభేదివై = శ్రేష్ఠుఁడగునింద్రుండవై, సత్వరితముగన్ = త్వరగా, ఆ+సవభాగములు = యజ్ఞభాగములను, కొనన్ = గ్రహించుటకు, జరుగుదువు. చండకరుండవై= సూర్యుఁడవై, జగతీజనులకున్, నీ వేఁడిమిన్ = ప్రతాపమును, చూపుచు, వెలయుందువు, ఇవ్విధిన్ = ఈరీతిని, నిజేచ్ఛమై, చరించునీలీలన్ = ఆచరించునట్టి నీవిలాసమును, మాయగావించున్ = మాయయనియాలక్షించుచు, కోరి, ఇవ్వేళన్, నిన్ను, కనుఁగొన్నవాఁడను, ఇఁకన్, నిన్నువిడుచుట యెట్లు కలుగున్.

తా. నీవు బ్రహ్మరూపంబున సృజింతువు, రుద్రరూపమున నశింపఁ జేసెదవు. ఇంద్రుఁడవై యజ్ఞభాగములఁ గొందువు. సూర్యుఁడవై జనుల వెలింగింతువు. నిన్ను దర్శించితిని. నిన్నిఁక విడువను. అనేకజన్మసంసిద్ధిచే గాన్పించిన నిన్ను సేవింపక విడుచువాఁడం గాను.

గీ. అనియు శ్రీధరాభవాపహారణుఁ డగు
యాతు భీతికరబలాఢ్యు నినుర
మేను రెండు నగుచు నెసఁగునంబకముల
గంటి చేసి యలయక మును గదిమి. 156

రాఘ.—— భీతికరబలాఢ్యున్ = భయంకరబలముగలిగినవానిని, శ్రీధరాభవాపహారణుఁడు - శ్రీ+ధరాభవా = భూపుత్రి యగుసీతకు, అప హారణుఁడు = అపహరించినవాఁడు, అగుయాతున్ = రాక్షసుఁడవైన, నినుర= నిన్నురా, (నిన్నేరా) మేను = దేహము, రెండు, అగుచున్, ఎసఁగు, అంబ కముల = బాణములచే, గంటిచేసి = గాయముచేసి, మునుగదిమి = ముందటి కదిమి, (ముందుపద్యములోని కనఁజేసెనను క్రియతో నన్వయము.)

తా. రాముఁడు మఱియు నిట్లనును, భయంకరరాక్షసుఁడ, నీమేను రెండుగా ఖండించెదను.

లక్ష్మ.——అనియు = పైరీతిఁబలికియు, (మఱియు) శ్రీధరా = విష్ణు దేవా! భవాపహారణుఁడు = సంసారమునపహరించువాఁడు, అగుయా......ఢ్యున్ - అగు = అగునట్టి, యాతు = రాక్షసులకు, భీతికర = భయంకర మైన, బల = బలముచే, ఆఢ్యున్ = కూడికొనినట్టియు, రమా+ఇనున్ (రమేనున్) = లక్ష్మికిఁబతివైన, నిన్నున్, రెండునగుచు నెసఁగునంబకములఁ గంటిన్ = రెండైనకన్నులతోఁ గనుఁగొంటిని, చేసి, అలయకమును = ఆపాపమును, గదిమి = తఱిమి.

తా. రాక్షసనాశకరుఁడ వైననిన్ను లక్ష్మీనాథుని నారెండుకన్నులఁ గనుఁగొంటిని. పాపములం బోఁద్రోలి.

క. కనిమఱి తగుగోనికర మ
తని నంటఁగఁ జేయుచు మహితనయను దీనో
క్తి నతనివలనను ముక్తిక్
గనఁ జేసె నమరవినుతులు గడుఁ బెక్కులుగాన్. 157

రాఘ.—కని, మఱి, తగుగోనికరముఁ = తగినబాణసమూహమును, ఆతనిఁ = ఆవిరాధుని, అంటఁగఁ = అంటునట్లు, చేయుంచుఁ, దీనోక్తిఁ = దీనవాక్యముగల, మహితనయను = సీతను, ఆతనివలనఁ = ఆవిరాధునివలన, ముక్తిఁ = విడుచుటను, కనఁ = పొందునట్లు, అమరవినుతులు=దేవతాస్తవములు, కడుఁబెక్కులుగాఁ=విస్తారమగునట్లుగా, చేసెఁ.

తా. విరాధునిబాణపరంపరచేఁ గొట్టి సీతను విడిపించెను. దేవతలు స్తుతించిరి.

లక్ష్మ.—అని, మఱి, తగు, గోనికరముఁ = నేత్రసముదాయమును, మహిత = పూజ్యములగు, నయను = నేత్రములుగల, అతనిఁ = ఆగోపాలస్వామిని, అంటఁ = తగులునట్లు, చేయుంచుఁ, దీనోక్తిఁ = దీనవాక్యముచేత, అతనివలనఁ = స్వామివలన, ముక్తిఁ = మోక్షమును, కనఁ = చూచునట్లు, అమరఁ, వినుతులు=స్తోత్రములు, కడుఁ, పెక్కులుగాఁ జేసెన్.

తా. ఆగోపాలస్వామిని జూచి ముక్తినొందుటకై స్తుతించెను.

వ. తదనంతరంబ. 158

గీ. అమ్మహావని మండలాగ్రాంచితస్థి
తిం గరమ్ముల్లసల్లీలఁ దేల భ్రాతృ
పేతుఁడై కరము లొగి నొప్పించి యతని
దండమును దగఁ గావించి తత్క్షణమున. 159

రాఘ.—అమ్మహావనిఁ = ఆదండకారణ్యమున, కరమ్ము= మిక్కిలి, మండలాగ్రాంచితస్థితిఁ - మండలాగ్ర = ఖడ్గముయొక్క, అంచిత = ఒప్పుచున్న, స్థితిఁ = స్థితిచేతను, ఉల్లసల్లీలఁ = ప్రకాశించుచున్న విలాసముచే, తేలఁ, భ్రాతృపేతుఁడై = తమ్మునితోఁగూడి, కరములు = విరాధునిహస్తములు, ఒగిఁ, నొప్పించి = పీడపెట్టి, అతనిఁ = వానిని, దండమును = శిక్షను, తగఁ, కావించి = చేసి, తత్క్షణమున = ఆసమయమున.

తా. రాముఁడు లక్ష్మణయుక్తుఁడై విరాధునిహస్తములు ఖండించి దండించి చంపెను.

లక్ష్మి.—కరమ్ములు = హస్తములు, అమ్మ...స్థితిన్ - అ = అట్టి, మహాత్ = గొప్పదియగు, అవనిమండల = భూమండలముయొక్క, అగ్ర = ఉపరిభాగమున, అంచిత = ప్రకాశించుచున్న, స్థితిన్ = స్థితిచే, ఉల్లసల్లీలన్, తేలన్ (రెండుహస్తములును భూమిపై మోపినవై యుండఁగా), భ్రాతృసే తుఁడై = తమ్ములతోఁగూడి, కరములు = కానుకలు, ఒగిన్ = మిక్కిలి, క్రమముగా, ఒప్పించి = అర్పించి, అతనిన్ = ఆగోపాలస్వామిని, దండమును = నమస్కారమును, తగఁగావించి, తత్క్షణమున.

తా. రామకృష్ణమ్మ రెండుచేతులు నేలమోపి నమస్కరించి భక్తిపూర్వకముగా నైవేద్యాలు పెట్టి పూజించె నరుట.

క. ముం దతఁడు దివ్యలోకము
నం దుంబురుఁ డెన్నరానిన్యాయస్థితి నుం
డెం దగు కారణమున ధర
యం దచ్చోట్టులుండె నని వినుకతనన్. 160

రాఘు.—ముందు = పూర్వము, అతఁడు = విరాధుఁడు, దివ్యలోకమునన్ = స్వర్గమున, తుంబురుఁడు = ఈపేరుగలగంధర్వుఁడు, ఎన్నరాని న్యాయస్థితిన్, ఉండెన్, తగుకారణమునన్ = ఒకమునిశాపముచే, ధరయందున్, అచ్చోటన్, అట్లు, ఉండెన్, అని, వినుకతనన్ = వినుటవలన.

తా. ఈవిరాధుఁడు పూర్వము స్వర్గముననుండిన గంధర్వుఁడు, తుంబుర నామముగలవాఁడు, శాపకారణమున నీరూపమున నిచటనున్నాఁడని రాముఁడు తెలిసికొని యుండుటచేత.

లక్ష్మి.—ముందు = తొల్లి, అతఁడు = గోపాలస్వామి, దివ్యలోకము నందున్ = వైకుంఠమున, పురుషు = సాటి, ఎన్నరానిన్యాయస్థితిన్ = ఎంచశక్యముగాని న్యాయస్థితితో, ఉండెన్, తగుకారణమునన్ = భక్తరక్షణమిషపై, ధరయందున్ = భూలోకమున, అట్టులుండె నని వినుకతనన్.

తా. వైకుంఠమునఁ దొల్లి యీగోపాలస్వామి యనంతకల్యాణగుణపరిపూర్ణుఁడై యుండి భక్తలోకమును రక్షింపవలయు నని భూలోకమున శ్రీరూపమున నీకుయ్యేరులో నున్నాఁడని.

క. అమ్మేను నపుడె భృశమో
దమ్మునఁ గప్పుచు మహాద్భుత మ్మగుతద్రూ
ప మ్మొకరికొకరు చెప్పుచుఁ
గ్రమ్మఱ వర్ణించుకొనుచుఁ గణక దలిర్పన్. 161

రాఘు.—అమ్మేనున్ = విరాధునిదేహమును, అపుడె = వెంటనె, భృశమోదమ్మునన్ = నిజమైనసంతోషముతో, కప్పుచున్ = పూడ్చిపైచి, (మిగిలినవి రెండవయర్థమునఁ జూడనగును.)

లక్ష్మ.—అప్పుడె - భృశమోదమ్మునన్ = మిక్కిలిసంతసముచే, అమ్మేనున్ = ఆదివ్యమంగళవిగ్రహమును, కప్పుచున్ = కప్పివేయుచు (ధ్యానించుచు సానందపరవశమున హృదయమున నావరింపఁజేసి), మహాద్భుతంబు = మిక్కిలి యాశ్చర్యమును బుట్టించు, అగుతద్రూపంబున్ = అయినట్టి యాయాకారమును (గూర్చి), ఒకరికొకరు చెప్పుచున్ = ఒకరితోనొకరు చెప్పుకొనుచు, క్రమ్మఱన్ = మరలమరల, వర్ణించుకొనుచున్, కణక = ఆదరము, తలిర్పన్ = ప్రకాశింపఁగా.

తా. రాఘవార్థమున విరాధునిమేను భూమిలోఁ బాతిపెట్టి యాయాకారమును గుఱించి రామలక్ష్మణులు ప్రసంగించికొనిరి. లక్ష్మణార్థమున గోపాలస్వామిని హృదయమున నిల్పి ధ్యానించి యొకరితోనొక రాయన్నదమ్ములు ముచ్చటించుచు తనివితీఱక మరలమరల వర్ణించి రనుట.

ఉ. ఆతని నాకలోకనిలయాగ్రణిగాఁగ నెఱింగి యుంటచే
నాతఁడె సర్వకృత్యకరుఁడై యటఁ బోసి మనోదృఢంబుతో
నాతతవేగయానులగు చక్కడి కవ్వల దక్షిణంబుగా
నేతెరువొంది వార లటు లేగి యొకానొకసుస్థలంబునన్.

రాఘ.—ఆతనిన్ = ఆవిరాధుని, నాకలోకనిలయాగ్రణిగాఁగన్ = గంధర్వరూపముతో స్వర్గమునకుఁబోయినవానింగా, ఎఱింగియుంటచేన్ = అప్పుడే తెలిసికొనిన వారగుటచే, ఆతఱిన్ = ఆసమయమున, అర్హాకృత్యకరులై = అర్హమైనపనులంగావించి, అటఁబాసి = అచ్చోటువిడచి, మనోదృఢంబుతోన్ = మనోధైర్యంబుతో, ఆతతవేగయానులు = మిక్కిలివడిగలగమనము గలవారు, అగుచున్, అక్కడికిన్, అవ్వలన్, దక్షిణంబుగాన్ = దక్షిణదిశగా, ఏగి, ఒకానొకసుస్థలంబునన్ = ఒకపుణ్యస్థానమున.

తా. తోడనే విరాధుఁడు గంధర్వుఁడై యాకాశమార్గమున బోవుటఁ దెలిసి రామలక్ష్మణులు దక్షిణదిశగా నడచి వెళ్ళిరి.

లక్ష్మ.—ఆతనిన్ = ఆగోపాలస్వామిని, నాకలోకనిలయాగ్రణిగాఁగన్ - నాకలోక = స్వర్గము, నిలయ = స్థానముగాఁ గలదేవతలకు అగ్రణిగాఁగన్ = శ్రేష్ఠునిగా, ఎఱింగియుంటచే = తెలిసినవారగుటచే. మిగిలినది పైదానివలెనే.

సీ. ఆశరభంగుని నార్యాంతరంగుఁ జ
టాభిశోభితుని భూర్యచలధర్మ
ధృతమృగాజిను వినిర్జితకాముని సుతీక్ష్ణు
భసితాంగరాగుని భద్రగమన
శరజాతగురు రూప్యగిరిపతిమల్లికా
ర్జునసమాఖ్యుని బరిశుద్ధమూర్తి
నఖిలలోకైకవిద్యానిధిఁ గుంభజ
న్ముని భగవంతుని బుధవరేణ్యుఁ
గీ. గాంచి వినయము భక్తి యొక్కటను మదిని
బర్వుచుండఁ బ్రదక్షిణపూర్వకముగ
నమరుసాష్టాంగదండంబులాచరించి
వినుతిచేసిరి కేల్మోడ్చి వివిధగతుల. 163

రాఘ.—ఆశరభంగునిన్ = శరభంగుఁడనుయోగిని, ఆర్యాంతరంగున్ - ఆర్య = పూజ్యులకు, అంతరంగున్ = మనస్సువలెనిష్టుఁడయిన, జటాభిశోభితున్ = జటలచేఁ బ్రకాశించువానిని, భూర్యచలధర్మున్ = విస్తారమైనచలింపని యాచారముగలిగినవానిని, ధృతమృగాజినున్ = కృష్ణమృగచర్మముగలిగినవానిని, వినిర్జితకామున్ = జయింపఁబడిన యిచ్ఛగలవానిని, "ఇచ్ఛామనోభవౌ కామౌ" అనినిఘంటు. సుతీక్ష్ణున్ = సుతీక్ష్ణుఁడను మునిని, భసితాంగరాగున్ = భస్మమైనదేహాభిమానముగలవానిని, భద్రగమనున్ - భద్ర = రామభద్రుని, గ = పొందిన, మనున్ = మంత్రముగలిగినట్టియు, శరజాతగురున్ - శరజాత = కుమారస్వామికి, గురున్ = గురువుగాఁ గలిగినట్టియు ప్ర. "కుంభజాయమునీంద్రాయ ప్రణవార్థం ప్రకాశయన్, ఆస్తేమలయశైలస్యశిఖరేకృత్తికాసుతః" అని. రూప్య...మాఖ్యున్ - రూప్యగిరిపతి = కైలాసమువలె, మల్లిక = మల్లికాపుష్పమువలె, అర్జున = తెల్లనైన, సమాఖ్యున్ = కీర్తిగలిగినట్టియు, పరిశుద్ధమూర్తిన్ - పరిశుద్ధ = యోగాంతర్యాత్రాదులచే శోధింపఁబడిన, మూర్తిన్ = శరీరముగలిగినట్టియు, అఖిలలోకైకవిద్యావధిన్ - అఖిలలోక = సమస్తలోకములయందున్న, ఏక విద్యా = ముఖ్యవిద్యలకు, అవధిన్ = సీమయగునట్టియు, భగవంతునిన్ = భగవంతుఁడను పేరుగలయట్టియు, ప్ర. "ఉత్పత్తించ వినాశంచ భూతానామాగతింగతిం, వేత్తివిద్యామవిద్యాంచ సవాచ్యోభగవానితి." విబుధవరేణ్యున్ = విద్వాంసులలోశ్రేష్ఠుని, కుంభజన్మునిన్ = అగస్త్యమునిని, కాంచి = చూచి, వినయము, భక్తి, ఒక్కటను, మదిని = మనస్సున, పర్వఁగన్ = ప్రసరించుచుండ, ప్రదక్షిణపూర్వకముగ-సాష్టాంగదండంబులాచరించి, కేల్మోడ్చి వివిధగతుల వినుతి చేసిరి.

తా. శరభంగుని, సుతీక్ష్ణుని, అగస్త్యుని దర్శించి నమస్కరించి రామలక్ష్మణులు వినుతించిరి.

లక్ష్మ.—ఈశ్వరునిదర్శించి వర్ణించుచున్నారు. ఆశరభంగునిన్ = రాక్షసనాశకరుని, ఆర్యాంతరంగున్ = పార్వతికిఁ బ్రియుని, జటాభిశోభితున్, భూర్యచలధర్మున్ = మేరుపర్వతము ధనుస్సుగాఁ గలవానిని, ధృతమృగాజినున్ = ధరింపఁబడిన, లేడియు, గజచర్మమునుగలవాని, వినిర్జితకామునిన్ =

మన్మథుని జయించినవాని, సుతీక్ష్ణుఁన్ = మిక్కిలి తీక్ష్ణగుణము గలవానిని, భసితాంగరాగునిన్ = భస్మలేపనము గలవానిని, భద్రగమనున్ = వృషభవాహనము గలవాని, "ఉక్షా భద్రో బలీవర్దః" అమరము. శరజాతగురున్ = కుమారస్వామికిఁ దండ్రియైనవాని, రూప్యగిరిపతిన్ = కైలాసనాథుని, మల్లికార్జునాఖ్యుని = మల్లికార్జునస్వామిని, పరిశుద్ధమూర్తిన్ = శుద్ధసత్త్వస్వరూపుఁడైనవానిని, అఖిలలోకైక విద్యావధిగున్ - అఖిలలోక = సమస్తజనులకు, ఏక = ముఖ్యముఁగు, విద్యావధిగున్ = ఉపనిషత్తులచే దెలియఁదగినవాని, భజన్మునిన్ = సేవించుచున్న మునీంద్రులు కలిగినవానిని, భగవంతున్ = ఐశ్వర్యాదిషట్కము గలవాని, ప్ర. "ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసశ్శ్రియః, జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరితః." విబుధవరేణ్యున్ = దేవతాశ్రేష్ఠుని, కాంచి = దర్శించి, ప్రదక్షిణపూర్వకము నమస్కరించిరనుట.

తా. రామకృష్ణమ్మ తమ్ములుం దాను శివాలయమున కేగి యందీశ్వరుని భజించిరి.

వ. అప్పుడు మఱియును. 164

గీ. సురుచిరాగస్తిమితవచస్తోత్రపూర్వ
కాచలపరధర్మశుభదాస్యాదు లొప్పఁ
గాంచి వెండియు లక్ష్మణాగ్రజుఁ డఘజల
రాశితరి నామునీశ్వరుఁ బ్రస్తుతించె. 165

టీక.—సురుచిర = మిక్కిలి యిష్టమగు, అగస్తిన్ = అగస్త్యుని, మితవచస్తోత్రపూర్వకముగన్ = మితమైన వాక్యములుగల స్తుతిమొందుఁ గలుగునట్లుగా, అచలపర = ఇంద్రుని, ధర్మ = ధనుస్సు, శుభద = శుభప్రదమగు, అస్యాదులు - అసి+ఆదులు = ఖడ్గము మొదలగునవి, ఒప్పన్, కాంచి = పొంది, వెండియున్ - పర్యాయ, లక్ష్మణాగ్రజుఁడు = రాముఁడు అఘజలరాశితరిన్ = పాపసముద్రము దాటించు నావయైన, ఆమునీశ్వరున్ = ఆమునిశ్రేష్ఠుని, ప్రస్తుతించెన్ = స్తోత్ర మొనరించెను.

తా. అగస్త్యుఁడు రామునకు ఇంద్రధనుస్సు ఖడ్గము మొదలైనవాని నిచ్చెను. (మితవచస్తోత్రపూర్వకముగ) దీని ప్రభావ మిట్టిదియని తెల్పియనుట.

లక్ష్మ.—సు=యోగ్యమైన, రుచి= మాధుర్యముగలిగినట్టియు, రాగ= ప్రేమచేత, స్తిమిత=మందమైన, వచః= వాక్యములయొక్క, స్తోత్రపూర్వక= స్తోత్రముతోఁగూడిన, అచల = చలింపని, పర = ఉత్కృష్టమైన, ధర్మ = ఆచారమును, శుభ= శుభకరమగు, దాస్యాదులు=సేవ మొదలగునవి, ఒప్పన్, కాంచి, వెండియున్ = మరల, లక్ష్మణాగ్రజుండు= రామకృష్ణమ్మ, అఘజల రాశితరినామున్ - అఘ = పాపములనెడు, జలరాశి = సముద్రమునకు, తరినామున్ = ఓడయను పేరుగల, ఈశ్వరున్ = శివుని, ప్రస్తుతించెన్ = కొనియాడెను.

తా. శివున కుపచారాదులొనర్చి రామకృష్ణమ్మ మరల నీక్రిందిరీతిని స్తుతించెను.

క. దీపితనిరుపమసుగుణా, లోపాముద్రాత్మనాథలోకవినుతశీ
లా పరమధర్మదిగ్వా, సాపండితసార్వభౌమ జగదుపకారీ.166

రాఘ.—దీపితనిరుపమసుగుణా = ప్రకాశించెడు, సామ్యములేని, సద్గుణములుగలవాఁడా, లోపాముద్రాత్మనాథ = లోపాముద్రయనెడు పతివ్రతకు భర్తయగువాఁడా, లోకవినుతశీలా = లోకములెల్ల స్తుతింపనర్హములైన సముద్రపానము, వింధ్యదమనము మొదలగు విలాసములు గలవాఁడా, పరమధర్మ=ఉత్కృష్టధర్మముల చేత, దిగ్వాసా=శివునితో సమానుఁడా, పండిత సార్వభౌమ, జగదుపకారీ.

తా. జగదుపకారీ యనుటచే కొంతయాయర్థమిమిడినది. జగత్తున కుపకారముచేసినవాఁడని. ఎట్లు, సూర్యచంద్రమార్గనిరోధకమైనవింధ్యపర్వతమును కూలఁద్రొక్కుట, వాతాపిని జీర్ణముచేసికొనుట, సముద్రములో దాఁగియుండు జగద్ద్రోహులగువారిని సంహరించుటకై సముద్రపానము చేయుంట మొదలయినకార్యములు చేయుంటవలన. ఇట్లని రాముఁడు అగస్త్యుని స్తుతించెను.

లక్ష్మ.—దీపిత = ప్రకాశింపఁజేయఁబడిన, నిరుపమ = సాటిలేని, సుగుణ = సుగుణములయొక్క, ఆలోపా = సమగ్రతకలవాఁడా (సమస్తగుణపరిపూర్ణుఁడనుట), ముద్రాత్మ - ముత్ = సంతోషమును, ర=గ్రహించు

నట్టి, ఆత్మ = మనస్సుకలవాఁడా, నాథా = ప్రభువా, లోకవినుతలీలా, పరమధర్మ = ఉత్కృష్టధర్మము గలవాఁడా, దిగ్వాసా = దిగంబరా, పండితసార్వభౌమ = పండితశ్రేష్ఠుఁడా, జగదుపకారీ = దుష్టశిక్షణాదులచే లోకోపకారముచేయువాఁడా. అని రామకృష్ణమ్మ శివుని స్తుతించుట.

సీ. జయచంద్రధరధీర సర్వజ్ఞ శుభకర
 వినమితాభ్రంకషావనిధరేంద్ర
తతకిల్బిషఘనవాతాపినాకివిరోధి
 పురహార నిస్తులాంభోధిజాత
విషపానసుచతుర వీతిహోత్రాలోక
 యఖిలకళాదక్ష యజ్ఞదూర
సతతసంశ్రితజనసంతానకుట భవ
 తాపసముద్ధరణా పవిత్ర
గీ. యని నుతించి యొక్కటి వేఁడెద నీక విను మ
 ఖండమోదాప్తి బలియ నే నుండ శుభస
 మున్నతి వహించునగ దేశ మున్నతి నిర్ణ
 యించి చెప్పుము నాకు దయాంచితాత్మ. 167

రాఘు.—చంద్రధర = ఈశ్వరునిసతె, ధీర = ధైర్యముగలవాఁడా, సర్వజ్ఞ = సర్వమును తెలిసినవాఁడా, శుభకర = శుభప్రదమగు, హస్త = హస్తముచేత, వినమిత = వంపఁబడిన, అభ్రంకష = ఆకాశమునకుఁదగులునట్లు పెరిఁగిన, అవనిధరేంద్ర = వింధ్యపర్వతముగలవాఁడా, తత = వ్యాప్తమైన, కిల్బిష = పాపములచేత, ఘన = అధికుఁడగు, వాతాపి = వాతాపియను, నాకివిరోధి=రాక్షసునియొక్క, పుర= దేహమును, హార = హరించినవాఁడా, నిస్తుల = సాటిలేని, అంభోధిజాత= సముద్రసముదాయముయొక్క, విష = ఉదకమును, పాన = త్రావుటయందు, సుచతుర = నేర్పుగలవాఁడా, వీతిహోత్రాలోక = అగ్నిహోత్ర కాంతివంటి కాంతిగలవాఁడా. "ఆలోకో దర్శనేద్యుతౌ" అనుటవలన, ఆలోకమన-ద్యుతి (కాంతి), అఖిలకళాదక్ష=

సర్వవిద్యాసమర్థుఁడా, అజ్ఞదూర = మూర్ఖులకుదూరమైనవాఁడా, సతతసంశ్రితజనసంతానకుట - సతత = ఎల్లప్పుడును, సంశ్రిత = ఆశ్రయించిన, జన = జనులకు, సంతానకుట = కల్పవృక్షమువంటివాఁడా, భవతాపసముద్ధరణా-భవ = సంసారమందున్న, సంతాప = పరితాపమువలన, సముద్ధరణా = ఉద్ధరించువాఁడా, (దేహవిలక్షణ ప్రత్యగభిన్న బ్రహ్మోపదేశముచేతననుట) పవిత్ర, దయాంచితాత్మ = దయాకలితహృదయుఁడా, అని, నుతించి = స్తోత్రముగావించి, ఒక్కటి వేఁడెదన్ = ఒకవరమడిగెదను. ఇంక, వినుము. అఖండమోదాప్తి = పూర్ణహర్షప్రాప్తి, బలిమిన్ = వృద్ధిపొందఁగా, నేన్ = నేను, ఉండుటకు, శుభసమున్నతివహించు = శుభాతిశయమునువహించునట్టి, వరదేశము = శ్రేష్ఠస్థలమును, ఉక్తిన్ = వాక్యములచేత, నిర్ణయించి, నాకున్, చెప్పుము.

తా. రాముఁ డగస్త్యుని పొగడి నేనుసుఖముగా నుండుటకై యేతావు మంచిదో చెప్పు మనియెను.

లక్ష్మ.—చంద్రధర = చంద్రశేఖరా, ధీర = ధైర్యవంతుఁడా, సర్వజ్ఞ = ఇదిశివునికొకపేరు, శుభకర = శంకరా, వినమితాభ్రంకషావనిధరేంద్ర - వినమిత = వంపఁబడిన, అభ్రంకష = ఆకాశవ్యాపినియగు, అవనిధరేంద్ర = మేరువుకలవాఁడా, శత+శిబ్బిష+ఘన+వాతా = వ్యాప్తములైన, పాపములను, మేఘములకు, వాయువువంటివాఁడా, పినాకి = పినాకమనుధనుస్సుకలవాఁడా, విరోధిపురహర - విరోధి = శత్రువులగు, పుర = త్రిపురములను, హర = హరించినవాఁడా, నిస్తు...చతుర - నిస్తుల = సాటిలేని, అంభోధిజాత = సముద్రమునంబుట్టిన, విష = హాలాహలమును, పాన = త్రావుటయందు. సుచతుర = నేర్పుకలవాఁడా, వీతిహోత్రాలోక = అగ్నినేత్రముగలవాఁడా, అఖిలకళా = సమస్తవిద్యలుగలవాఁడా, దక్షయజ్ఞదూర = దక్షుఁడొనర్చు యజ్ఞమునకు దూరమైనవాఁడా, సంతత...కుట = ఆశ్రితకల్పవృక్షమా, భవ = ఈశ్వరుఁడా, తాపసముద్ధరణా - తాప = ఆధ్యాత్మికాదితాపములను, సముద్ధరణా = ఉద్ధరించువాఁడా, పవిత్ర = పవిత్రుఁడా, అనినుతించి, ఒక్కటి వేఁడెద = నిన్నొకటి కోరెదను. వినుమ = ఆకర్ణింపుమా, ఖండమోదాప్తిన్ -

ఖండ = అఖండము కాని, మోద = విమలానందములయొక్క, ఆప్తిన్ = పొందుటచేతను, బలియన్ = వృద్ధిపొందఁగా, నేను, ఉండన్, శుభసమున్నతిన్, ఇంతకంటె శుభాతిశయమును, వహించు = వహింపుము, వరద = కోర్కెలనిచ్చువాఁడా, ఈశ = ప్రభువా, దయాంచితాత్మా = దయతోఁ గూడినమనసుగలవాఁడా, ముక్తిన్ = మోక్షమును, నిర్ణయించి చెప్పుము.

తా. నీవు జయప్రదుఁడవై యుండుము. నాకు ముక్తిం గటాక్షింపు మనుట.

వ. అని ప్రార్థించి. 168

సీ. అతనిని యోగపద్ధతిన పర్ణావాస
 భృశయోగ్యవనభవాభీష్టసూన
దీప్రపంచవటసుస్థితివాంఛ మిక్కిలి
 యొనర నేగంగా ధరోత్తమాంగుఁ
డవు శ్రీజటాయుతుండవలనిర్జితవైరి
 వీర్యరుం డవు నన నెన్నఁ బడుచుఁ
గ్రాలురూపంబుతోఁ గనుపింపఁ దగురీతి
 మన్నింపు మన నతనిమ హితనుతులు
గీ. గాంచుచును గూడి యొక్కచోఁ గలసియుండఁ
గోరినాఁడ ననిచిన మక్కువపలుకులె
యాడుచును జని తమనివాసార్హశాల
యందు సప్రియానుజుఁడౌచు నతఁడు నిలిచె. 169

రాఘ.—అతని=అగస్త్యుని, నియోగపద్ధతిన= ఆజ్ఞాప్రకారముగానే, పర్ణావాస = పర్ణశాలలకు, భృశ= అత్యంతము, యోగ్య=ఉచితమగు, వన= వనమందు, భవ = పుట్టిన, అభీష్ట = సుందరములగు, సూన=పుష్పములచే, దీప్ర = ప్రకాశించు, పంచవట = పంచవటమను (అయిదుమఱ్ఱిచెట్లుగల)

క్షేత్రమందు, సుస్థితివాంఛన్ = నివాసేచ్ఛచేతను, మిక్కిలి, ఒనరన్ = ఒప్పునట్లు, ఏగంగాన్ = వెళ్లఁగా, ధరోత్తమాంగుఁడు - ధర = పర్వతము వంటి, ఉత్తమాంగుఁడు = శిరస్సుకలవాఁడు, తుండవలనిర్జితవైరి-తుండ = చంచువు (ముక్కు)యొక్క, వల = బలముచే, నిర్జిత=జయింపఁబడిన, వైరి=శత్రువులుగలవాఁడును, అవు=అగునట్టి, శ్రీ+జటాయుః = జటాయువనుపక్షిరాజు, వీశ్వరుండు - వీ+ఈశ్వరుండు = పక్షులకు రాజైనగరుత్మంతుఁడు, అవునన్ = అగునని, ఎన్నఁబడుచు = ఎంచఁబడుచు, క్రాలురూపంబులోన్ = ప్రకాశించునాకారములో, కనుపింపన్ = కనఁబడఁగా, తగురీతిన్ = తగినట్లు, మన్నింపుమనన్, ఆతనిమ = గౌరవముచేతను, హిత=ఇష్టములగు, నుతులు = స్తుతులు, కాంచుచున్ = పొందుచున్, అనిచినన్=పంపఁగా, ఒక్కచోఁ గలసియుండఁగోరినాఁడన్, అనిమక్కువకలుకలై, ఆడుచును, చని, తమ నివాసార్హశాలయందు=నివసింపఁదగిన పర్ణశాలయందు, సప్రియానుజుఁడు= సీతాలక్ష్మణులతోఁగూడిన, అతఁడు = రాముఁడు, నిలిచెన్ = ఉండెను.

తా. అగస్త్యుని యానతిపైఁ బంచవటియందుఁ బర్ణశాలకట్టుకొనఁ బోయెను. జటాయువుకనఁబడి స్తుతించెను. వానిని గౌరవించెను. భార్యయుం దాఁ దమ్ముఁడును నచ్చట నివసించియుండెను.

లక్ష్మ.—అతనినియోగపద్ధతిన్ - అతని = ఆసాంబమూర్తియొక్క, నియోగపద్ధతిన్ = ప్రేరణముచేతనే(అతఁడునిలిచెననుక్రియతో నన్వయము) అపర్ణావాస-అపర్ణా=పార్వతికి, వాస=నివాసమగువాఁడా! భృశయోగ్యవన-భృశ=మిక్కిలి, యోగి = యోగులను, అవన = రక్షించువాఁడా! భవా=ఈశ్వరుఁడా! భీష్మసూ=గంగయను, "త్రిస్రోతా భీష్మసూరపి" అమరము. నదీ = నదియొక్క, ప్రపంచ=వైపుల్యమునకు (విపులభావమునకు), వట = మఱ్ఱిచెట్టువంటివాఁడా! వటవృక్షము అనేకశాఖలు ధరించినట్లు నీవును గంగయొక్కయనేకశాఖలనుధరించితివనుట. సుస్థితివాంఛన్=చక్కఁగా నుండుటయందు వాంఛచేత, ఒనరనే=ఒప్పఁగా, గంగాధరోత్తమాంగుండవు = గంగనుదలయందుఁదాల్చినవాఁడవు, శ్రీజటాయుంతుండవు = శోభతోఁగూడిన జడలుగలవాఁడవు, అలనిర్జితవైరివి = జయింపఁబడిన విరోధులుగలవాఁడవు, ఈశ్వరుండు =

జగదీశ్వరుఁడు, అఘనన్, ఎన్నఁబడుచున్ = వర్ణింపఁబడుచు, క్రాలురూపంబుతోన్ = ప్రకాశించుచున్నరూపముతో, కనుపింపన్ = కనుపించుటకు, తగురీతిన్ = తగినప్రకారముగా, మన్నింపుము = శ్లాఘింపుము. అనన్ = అనఁగా, అతనిహితనుతులు = ఆయీశ్వరునిపూజ్యములగు స్తోత్రములను, కాంచుచున్ = చేయుచు, ఒక్కచోటన్ = ఒక్కచోట, కలసి = కూడి, ఉండఁగోరినాఁడన్ = ఉండుటను గోరినవాఁడను; అని, చినముక్కవపలుకుచే = చిన్నవగునిట్టి వాక్యములై, ఆడుచున్ = పలుకుచు, చని = వెళ్ళి, తమనివాసార్హశాలయందుఁ = తమయింట, సప్రియానుజుఁడు = ప్రియులైన తమ్ములతోఁగూడినవాఁడు, ఔచున్, అతఁడు = రామకృష్ణమ్మ, నిలిచెన్ = ఉండెను.

తా. రామకృష్ణయ్యగారు ఈశ్వరస్తోత్రముగావించి తమ్ములుం దాను స్వగృహమునకుఁ జని.

క. అలగౌతమిజేరువయగు
నెలవున నివ్విధి వసించి నిచ్చలునుసము
జ్జ్వలధర్మగుణకదంబం
బులు తనకు సహాయములయి పొసఁగఁగ ఘనతన్. 170

రాఘ.—ఇవ్విధిన్ = ఈరీతిని, అలగౌతమిచేరువయగు నెలవునన్ = గోదావరీతీరభూమిని, వసించి = నివసించి, నిచ్చలును = ఎల్లపుడు, తనకు, సము... బులు—సముజ్జ్వల = తీక్ష్ణములైన, ధర్మ = ధనువు, గుణ = నారి, కదంబంబులు = బాణములు, సహాయములై = తోడై, పొసఁగన్ = ఉండఁగా, ఘనతన్ = గౌరవముగా.

తా. గౌతమీతీరమున ధనుర్బాణము సహాయముగా రాముఁ డుండెను

లక్ష్మ.—అలగౌతమిచేరువయగు నెలవునన్ = ఆత్రేయియను గౌతమి పాయయొక్కసమీపమున, ఇవ్విధిన్ = ఈచొప్పున, వసించి = నివాసము చేసి, నిచ్చలును, సముజ్జ్వల = ప్రకాశించుచున్న, ధర్మ = ఆచారము, గుణ = గుణములు, కదంబంబులు = (వీనియొక్క) సముదాయము, ఘనతన్ = గొప్పగా తనకు, సహాయమై = హితమై, పొసఁగఁగన్.

తా. రామకృష్ణమ్మ యాచారమును దాక్షిణ్యాదిగుణములును దనకు సహాయముగాఁ దననివాసమున నుండుచు.

క. సకలతపస్విసమూహము
లకు నిజశక్తిఁ దగుహితమెలర్పఁగ రక్షో
పకృతులు సేయం బూని య
ధికముదమున నుండఁ గొన్ని దినములు జరిగెన్. 171

రాఘ.—సకలతపస్విసమూహములకున్ = సమస్తమునీంద్రకోటికిని, నిజశక్తిన్ = తనసామర్థ్యముచేతను, హితమెలర్పఁగన్ - హితమున్ = ఇష్టమును, ఎలర్పఁగన్ = అతిశయింపఁ జేయుటకై, రక్షోపకృతులు = రాక్షసుల యొక్క యపకారములను (రక్షః+అపకృతి) పేయంబూని, అధికముదమునన్ = మిక్కిలి యానందముతో, ఉండన్ = వర్తిల్లఁగా, కొన్ని దినములు = కతిపయవాసరములు, జరిగెన్ = కడచెను.

తా. మునులకు మేలుచేయువలయు నని రాక్షసబాధానివారణ మొనర్చుచుండఁ గొన్నినాళ్లు చెల్లినవి.

లక్ష్మ.—సకల = సమస్తమైన, తపస్విసమూహములకున్ = దీనకోటికి, "మునిదీనౌతపస్వినౌ" అని నిఘంటు. నిజశక్తిన్ = తనశక్తికొలందిని, తగుహితమున్ = ఉచితమైనమేలును, ఎలర్పఁగన్ = వినరించుటకు, రక్షోపకృతులు— రక్ష = సంగక్షణము, ఉపకృతులు = ఉపకారములును, చేయన్ = చేయుంటకును, పూని = ప్రతినపట్టి, అధికముదమునన్, ఉండన్, కొన్నిదినములు = కొన్నినాళ్లు, జరిగెన్ = ప్రవర్తిల్లెను.

తా. తనశక్తినిబట్టి దీనులను బోషించుట యుపకారముచేయుంటయు వ్రతముగాఁ గొన్నిదినములు గడిపినాఁడు. (రామకృష్ణమ్మ)

క. జానుగ దిఙ్మండలము
న్నానాకృతినొప్పుసుప్పనక ధృతి నరయుం

బూని యొకప్పుడు వార
చ్చో నుండఁగ లక్ష్మణాగ్రజుని కట్టెదురన్. 172

రాఘు.—జానుగన్ = బాగుగ, నానాకృతిన్ = అనేకమాయాకారములచేత, ఒప్పు=సమర్థురాలై యున్న, సుప్పనక=శూర్పణఖ, దిఙ్మండలమున్ = అష్టదిక్కులను,ధృతిన్ = ధైర్యములో, అరయంబూని = వెదకుటకై వెడలి (చూడఁదలఁచి), ఒకప్పుడు=ఒకనాఁడు, వారు = ఆరాముఁడును లక్ష్మణుఁడు సీతయు, ఆచ్చోన్ = ఆపర్ణశాలయొద్ద (పంచవటియందు), ఉండఁగన్ = ఉన్నప్పుడు, లక్ష్మణాగ్రజునికిన్ = రామునకు, అట్టు, ఎదురన్ = ముందు భాగమున (ఎదుట).

తా. నానారూపములం బూననేర్చినచుప్పనాతి యన్నిత్రోవుల నిర్భయముగ విహారించుచు నొకప్పుడు పంచవటిలో రామున కెదురయ్యెను.

లక్ష్మ.—జానుగన్ = క్రమముగ, తిఙ్మండలమున్ = తిఙంతసమూహమును (భవతి, యాతి యనుక్రియాపదములనుట), నానాకృతిన్=అనేకరూపములచేత, ఒప్పు=ఒప్పునట్టి, సుప్పు=సుబంతపదములను (రామః, కృష్ణః, మొదలైనవి), అనక, ధృతిన్, అరయంబూని = విచారించుట ప్రారంభించి, వారు అచ్చోనుండఁగన్ =ఉయ్యూరుగ్రామములో నున్నసమయమున, లక్ష్మణాగ్రజునికిన్ = రామకృష్ణమ్మయొక్క, కట్టెదురన్ = అగ్రభాగమున.

తా. వారు సుబంతతిఙంతములతోఁ గూడినవ్యాకరణశాస్త్రవ్యాసంగముచేయుచుండఁగా రామకృష్ణమంత్రి యెదుట.

క. నిలిచి మహాభా రతి న
న్నేలమిం గైకొనుచు నీ కభీష్టార్థంబుల్
నెలకొనఁ జేసెద నేపద
ములయం దార్తాభిలాషమున నీ వున్నన్. 173

రాఘు.—(శూర్పణఖ) నిలిచి = నిలువంబడి, మహాభా=విశేషకాంతిగలవాఁడా (రాముఁడా)! రతిన్=క్రీడయందు,నన్నుం గైకొనుము. ఎలమిన్ =

ఉత్సాహముతో, నీవు, ఏపదములయందున్ = ఏయేస్థానములయందు, ఆత్మాభిలాషమునన్ = నీయిచ్చచొప్పున, ఉన్నన్ = ఉండినను, నీకున్ = నీకు, అభీష్టార్థంబుల్ = కోరినవానిని, సెలవొనంజేసెదన్ = కూర్చెదననుట.

తా. రామునియెదుట శూర్పణఖ నిలిచి నన్ను వరించితివా నేను గామరూపనుగాన నెక్కడికిఁ గొనిపొమ్మన్నను గొనిపోయెదను. నీకేమి కావలసిన వానినెల్ల సమకూర్చెదను. అని పలికినది.

లక్ష్మ.—మహాభారతి నిలిచి = సరస్వతినిలువంబడి, నన్నున్, ఎలమిన్ = ఇష్టముతో, పైకొనుము = స్వీకరింపుము. నీవు, ఏపదములయందున్ = సంస్కృతాంధ్రపదములలో నేనియందు, ఆత్మాభిలాషమునన్, ఉన్నన్, నీకున్, అభీష్టార్థంబుల్ = కావలసినవాక్యములయర్థమును, సెలవొనంజేసెదన్ = ఒదవునట్లు చేయుందానను.

తా. సరస్వతి, యెదుట నిలిచి నన్నంగీకరింపుము, నీకుఁ గావలసిన రీతిని పదములు వాక్యార్థములు సంస్కృతమునఁగాని తెనుఁగునఁగాని నీయిష్ట ప్రకారము పొందుపఱచెద నని రామకృష్ణమ్మను గోరెను.

వ. అనిన నతండు భ్రాతృవృత్తాంతం బంతయుం జెప్పి యద్దె
సయుం జూపి. 174

రాఘ.—అనన్ = రాక్షసస్త్రీయిట్లుపలుకఁగా, అతండు = రాముఁడు, భ్రాతృవృత్తాంతంబంతయుం జెప్పి = (నాకుభార్యయున్నది) లక్ష్మణుఁడొంటిగానున్నాఁడు; వానియొద్దకుఁబోయి వరింపుమని పలికి, అద్దెసయుంజూపి = ఆ లక్ష్మణుఁడున్నవైపునుఁ గనఁబఱిచి.

లక్ష్మ.— అనినన్ = సరస్వతికోరఁగా, అతండు = రామకృష్ణమంత్రి, భ్రాతృవృత్తాంతంబంతయుంజెప్పి = తనతమ్ముఁడగు లక్ష్మణుఁడు కవీశ్వరుఁడు, వానిం జేరుమని, అద్దెసయుం జూపి = ఆదిక్కు కనఁబఱిచి.

గీ. తమ్ము వరియింపు మనిపల్క దానవి హిత
సరణి గనమి నయ్యతివ లక్ష్మణుఁడు చేరి

యాదితత్త్వంబు నొందించె నపుడు శ్రుతులు
నాసికయుఁ బట్టి యర్థంబు వాసికెక్క. 175

రాఘు.—తమ్మున్ = తనతమ్ముఁడు లక్ష్మణుని, వరియింపుము = కోరుము, అనిపల్కన్ = చెప్పఁగా, దానవిన్ = రాక్షసస్త్రీని, హితసరణిన్ = అనుకూలరీతిని, చూడకపోవుటచేత, లక్ష్మణుఁడు, అయ్యతివన్ = ఆశూర్పణఖను, చేరి = సమీపించి, శ్రుతులు = చెవులును, నాసికన్ = ముక్కును, పట్టి = గ్రహించి, అర్థంబు = కార్యము, (దుష్టశిక్షణరూపకార్యమును), వాసికెక్కన్ = ప్రసిద్ధికెక్కునట్లు, ఆదితత్వంబున్ - ఆ = (మొదలంటయని) దితత్వంబున్ = ఖండింపబడుటను "దితం వృంతం వృక్ణం" అమరము. ఒందించెన్ = పొందించెను.

తా. లక్ష్మణునిపయి నిష్టముచూపక శూర్పణఖ యుండెను. లక్ష్మణుఁడు వచ్చి దానిముక్కును, చెవులును గోసివైచెను.

లక్ష్మ.—తమ్మున్ = తముఁడగు లక్ష్మణకవిని, వరియింపుమనిపల్కన్, తాన = తానే, విహితసరణిన్ = శాస్త్రోక్తప్రకారమార్గమును, కనమిన్ = ఎఱుఁగకపోవుటచే, లక్ష్మణుండు = లక్ష్మణకవి, అయ్యతివన్ = సరస్వతిని, చేరి = సేవించి, శ్రుతులున్ = వేదములను, ఆసికన్ = ఆవేదములకు శిఖయగు నుపనిషత్తును, పట్టి = అనుసరించి, అర్థంబు, వాసికెక్కన్ = వన్నెకెక్కునట్లుగ ఆదితత్త్వంబున్ = బ్రహ్మతత్త్వమును, పొందించెన్.

తా. మొదట నెఱుఁగకపోయినను, సరస్వతీప్రసాదమున శ్రుత్యర్థముఁ నారసి, వేదవేదాంతముల కన్నింటికిని బ్రత్యగభిన్నబ్రహ్మయందుఁ దాత్పర్యమని గ్రహించెను.

వ. మఱియు సత్కృతిరచనావిచక్షణుం డగునాలక్ష్మణాగ్రజుండు విబుధాభినందితాత్మీయ శ్లోకానసహిష్ణువు లై యిది మహాక్రియ యనక సుప్పనక వాక్యంబు లన్నిటి దుర్బోధం బొందినకతంబున నాగ్రహించి యెదిర్చినఖరదూషణ

ముఖ్యులగువిరోధులం దనశాస్త్రబలసంపత్తిచేత జయించి
నిజసామర్థ్యంబు ప్రకటంబుగ నెఱపుచున్నంత. 176

రాఘ.—మఱియు, (ఇంతియకాక) సత్కృతి...జుండు-సత్కృతి=సాధుసత్కారమును, రచనా=కల్పించుటయందు, విచక్షణుండు=జాణ, అగులక్ష్మణాగ్రజుండు=అయినరాముఁడు, విబుధ=దేవతలచే, అభినందిత=శ్లాఘింపఁబడిన, ఆత్మీయ=తనసంబంధమైన, శ్లోక=యశస్సునకు, "పద్యేయశసిచశ్లోకః" అనినిఘంటువు. అసహిష్ణువులై=సహింపనివారై, ఇది, మహాక్రియ=గొప్పపని, అనక=అనితలంపక, సుప్పనకవాక్యంబులు=శూర్పణఖచెప్పినమాటలు, అన్నిటన్=అన్నింటియందున్, దుర్బోధన్=తప్పుటర్థమును, (రాముఁడు మనుష్యమాత్రుఁడను నజ్ఞానమును) చెందినకతంబునన్=చెందియుండుటచే, ఆగ్రహించి=కోపించి, ఎదిర్చినఖరదూషణముఖ్యులు=ఎదుర్కొనిన, ఖరుఁడు, దూషణుఁడు మొదలుగా, అగువిరోధులన్=అయినశత్రువులను, తనశాస్త్రబలసంపత్తిచేన్-తన, శాస్త్ర=శస్త్రసంబంధమైన, బల=బలముయొక్క, సంపత్తిచేతన్=సహాయముచే, జయించి=గెలిచి, నిజసామర్థ్యంబు=తనశక్తి, ప్రకటింపన్=ప్రసిద్ధమగునట్లు, నెఱపుచున్నంతన్=వ్యాపింపఁజేయుచుండఁగా.

తా. దేవహిత మొనర్చు రామునిచర్యను సహింపఁజాలక శూర్పణఖ చెప్పినమాటలనుబట్టి యజ్ఞానులై రాము నెదుర్చుట కష్టమని తలంపక ఖరదూషణాదు లెదిరించిన రాముఁడు వారినందఱ జయించెననుట.

లక్ష్మ.—మఱియుం, సత్కృతి...జుండు-సత్కృతి=మంచిగ్రంథములను, రచనా=చేయుటలో, విచక్షణుండు=నేర్పరి, అగులక్ష్మణాగ్రజుండు=అగునట్టి లక్ష్మణుఁ డనుబ్రాహ్మణుఁడు, "బ్రాహ్మణస్తు ద్విజాత్యగ్రజన్మభూదేవబాడబాః" అమరము. విబుధ=విద్వాంసులచే, అభినందిత=కొనియాడఁబడిన, ఆత్మీయ=తానురచించిన, శ్లోక=పద్యములకు, అసహిష్ణువులై=ఓర్వలేనివారై, ఇది=ఈపదము, మహాక్రియ=గొప్పక్రియా

పదము, అనఁగ, ఇది, సుప్పు=సుబంతము, అనఁగ, వాక్యంబులన్నిటన్ = అన్ని వాక్యములయందు, దురర్థతన్ = అజ్ఞానమును, చెందినఁ దనన్, ఆగ్రహించి=కినుకఁ జెంది, ఎదిర్చిన ఖరదూషణముఖ్యులన్-ఎదిర్చిన=ఎదిరించిన, 'ఖర=తీక్ష్ణమైన, దూషణ = దూషణమే, ముఖ్యులన్ = ముఖ్యముగాఁ గలవారు, అగువిరోధులన్=అయిన కిట్టనివారిని (ఇతరకవులను), తనశాస్త్రబలసంపత్తిచేన్=తనవ్యాకరణాదిశాస్త్ర) జన్యజ్ఞాన సహాయముచే, జయించి నిజసామర్థ్యంబు, ప్రకటంబుగ, నెఱపుచున్నంతన్=ప్రకాశింపఁజేయుచుండఁగా.

తా. లక్ష్మణకవి రచించినపద్యములలోని యభిప్రాయము తెలియక దుర్వాదములు చేసినకవులను దాను తన శాస్త్రజ్ఞానముచే నోడించుచుండెను.

గీ. శ్రీ లెసఁగులంక నా జగడాలగోతి
చే న్మొదటినుండి విని యంత జేత పుణ్య
జనపతి సుబాహు నగ్రజు శంబరపర
శోభనాకృతి గోపాలసూనుఁ జేర్చె. 177

రాఘు.—శ్రీ లెసఁగులంకన్ = శోభాయుక్తమైన లంకాపట్టణమున, ఆజగడాలగోతిచేన్=ఆకయ్యాలమారియైనశూర్పణఖయను స్త్రీచే, మొదటినుండివిని=ఆద్యంతమువిని, అంతన్=అనంతరము, జేత=జయస్వభావముగల, పుణ్యజనపతి=రాక్షసరాజు (రావణుఁడు), సుబాహునగ్రజున్=సుబాహుని యన్నయగుమారీచుని, శంబర=లేడియొక్క, "కృష్ణసారరురున్యంకురంకుశంబరరౌహిషాః." అమరము. పర=అధికమైన, శోభనాకృతిన్=సుందరమయినయాకారముచేతను, గోపాలసూనున్=రాజపుత్రుఁడగు రాముని, చేర్చన్=సమీపమునకుఁ బంపెను.

తా. జగడాలజంత యగుశూర్పణఖ చెప్పిన సీతావర్ణనరూపకమైనవాక్యములచే రావణుఁడు మారీచుని మాయలేడిని గావించి రాముని యెదుటకుఁ బంపెను.

లక్ష్మ.—శ్రీలు = సంపదలు, ఎసఁగు = ఒప్పుచున్నట్లు, లంకన్ = లంకనేలను, గోతిచేన్ = గోతిచేనును, మొదటిచుండివిని, అంతన్, జేత = జయస్వభావముగల దమ్మన్న, పుణ్య = పుణ్యాత్ములగు, జన = జనులకు, పతిన్ = నాథుఁడైనట్టియుఁ, సుబాహున్ = దీర్ఘబాహుఁడైనట్టియుఁ, శంబరవర = శంబరాసురుని శత్రువైనమన్మథునివలె, శోభన = సుందరమైన, ఆకృతిన్ = రూపముగల, అగ్రజున్ = బ్రాహ్మణుఁడైన, గోపాలసూనున్ = గోపాలమంత్రితనయుఁడగు లక్ష్మణకవిని, జగడాలన్ = కయ్యములలోనికి, చేర్చెన్ = (వివాదములోనికి దింపెననుట).

తా. లక్ష్మణకవికిఁ గలలంక, గోతిచేను నను మాన్యములసంగతి విని దమ్మన్న వానింగుఱించి తగవులు పెట్టసాగెను.

వ. అట్లు చేర్చినం జూచి తత్కృష్ణసారపృథ్వీడితాకృతి కచ్చెరు
వంది దాని మాటిమాటికి శ్లాఘించుచు. 178

రాఘ.—ఇట్లు = ఆరీతిని, చేర్చినన్ = సమీపమునకుఁ బంపఁగా, తత్...కృతికిన్-తత్ = ఆ, కృష్ణసార = ఇఱ్ఱియొక్క, పృథు = విస్తారము, ఈడిత = స్తుతింపఁబడిన, ఆకృతికిన్ = రూపమునకు, అచ్చెరువంది = ఆశ్చర్యపడి, మాటిమాటికిన్, దానిన్ = ఆలేడిని, శ్లాఘించుచున్ = కొనియాడుచు.

తా. ఆలేడిని పలుమాఱు మెచ్చుచు.

లక్ష్మ.—అట్లు, చేర్చినన్ = తగవునకుదింపఁగా, తత్కృష్ణసార = ఆనల్లనిదియుఁ బలముగలదియునగు, పృథ్వీ = లంకనేలయొక్క, ఈడిత = శ్రేష్ఠమైన, ఆకృతిన్ = రూపమునుగుఱించి, (ఈట్ = అధికారముచేత, ఇత = పొందఁబడిన, ఆకృతిన్ = ఆకారముచే) అధికారబలమున ననుట, అచ్చెరువంది = వింతపడి, దానిన్ = లంకనేలను, మాటిమాటికిన్ = పెక్కుసారులు, = శ్లాఘింపుచున్ = పొగడుచు.

తా. నల్లరేవడమయిన బలముకల యాభూమిపైఁ గన్నువైచి దమ్మన్న దాని నపహరింపఁ దలఁచె ననుట.

క. ఆభూమిజ యామోదను
శోభిల్ల వరు లసమానసుస్థితిఁ దేఱం

దా భావన ననిచిన స
చ్ఛోభ దనర లక్ష్మణాగ్రజుఁడు ధృతి గనుచున్. 179

రాఘ.—ఆభూమిజ = ఆసీత, ఆమోదముశోభిల్లన్ = సంతోష మెక్కుడుకాఁగా, తాన్ = తాను, భావనన్ = కావలయుననుకోర్కచే, వరున్ = పెనిమిటిని, లసమానసుస్థితిన్ = దానియాకారము చెడకుండ, తేరన్ = తెచ్చుటకు, అనిచినన్ = పంపఁగా, సచ్ఛోభన్ = చక్కని శోభతో, తనరన్, లక్ష్మణాగ్రజుఁడు = రాముఁడు, ధృతిగనుచున్ = ధైర్యమును బూని.

తా. ఆలేడిం దెమ్మని సీత కోరెను, రాముఁడు పయన మయ్యెను.

లక్ష్మ.—ఆభూమి = లంకనేల యొక్క, జయామోదము = గెలుచుటయందలి యానందము, శోభిల్లన్ = ప్రకాశింపఁగా, వరులు = ధాన్యవిశేషములు, అసమాన = సాటిలేని, సుస్థితిన్ = అనుకూలమైన, తేలన్ = ఒప్పఁగా, తాన్ = ధర్మారావు, భావన = భావన్నయను తమ్ముని, అనిచినన్ = అధికారియొద్దకుఁబంపఁగా, సచ్ఛోభ = మంచికాంతి, తనరన్ = ఒప్పఁగా, లక్ష్మణాగ్రజుఁడు = లక్ష్మణకవి, ధృతిన్, గనుచున్ = ధైర్యము వహించి.

తా. దమ్మన్న లంకమాన్యము చక్కనిపంటపండు నని యెంచి దానికై తనతమ్ముఁడు భావన్నను, అధికారియొద్దకుఁ బంపెను. లక్ష్మణకవి ధైర్యము వహించియుండెను.

వ. తదనుసారివర్తనంబులం బ్రవర్తిల్లుచుండె. 180

రాఘ.—తత్ = ఆలేడిని, అనుసారి=అనుసరించిన, వర్తనంబులన్ = నడకలచే, ప్రవర్తిల్లుచుండెన్ = దానివెంట నేగుచుండెను.

లక్ష్మ.—తత్ = ఆభావన్నను, అనుసారి = అనుసరించిన, వర్తనంబులన్ = వ్యాపారముచే, ప్రవర్తిల్లుచుండెన్ = సాహాయ్యము నడపుచు లక్ష్మణకవి యుండెను.

ఆశ్వాసాంతపద్యములు.

## స్రగ్ధరావృత్తము - నాగబంధము.

వృత్రారాత్యేకప్రపూజ్యా విలసదుదధిదర్వీకరాంకప్రశయ్యా
పత్త్రీశస్యందనా దర్పకజనక నవాభా సువిభ్రాజిలోక
స్థత్రాణా శక్తిశాలీ శమవదవనతర్షా దయాపూర్ణభావా
సత్రాజిజ్జాకళత్రా క్షమి శమితపలాశా సదబ్జాతనేత్రా. 181

టీ.—వృత్రారి = ఇంద్రునిచే, ఏక = ముఖ్యముగా, ప్రపూజ్యా = మిక్కిలి పూజింపఁబడఁదగినవాఁడా, విలసత్ = ప్రకాశించుచున్న, ఉదధి = క్షీరసాగరమున, దర్వీకర = శేషుని, అంక = మీఁదను, ప్రశయ్యా = శయనము గలవాఁడా, పత్త్రీశస్యందనా = గరుడవాహనుఁడా, దర్పకజనక = మన్మథునకుఁ దండ్రీ, నవాభా = నూత్నశోభగలవాఁడా, సువిభ్రాజి = చక్కఁగ వెలుంగుచున్న, లోక = లోకములయందు, స్థ = ఉన్నవారలను, త్రాణా = రక్షించువాఁడా, శక్తిశాలీ = బలవంతుఁడా, శమవదవనతర్షా - శమవత్ = శాంతిగలవారిని, అవన = రక్షించుటయందు, తర్షా = కోరికగలవాఁడా, దయాపూర్ణభావా = దయతో నిండినహృదయముకలవాఁడా, సత్రాజిజ్జా = సత్యభామ, కళత్రా = భార్యగాఁగలవాఁడా, క్షమి = ఓర్పుగలవాఁడా, శమితపలాశా = రాక్షసనాశనమొనర్చినవాఁడా, సదబ్జాతనేత్రా = పద్మాక్షుఁడా, గోపాలస్వామి సంబోధనములు.

కందమణిగణనికరము.

క. మురనరకదనుజముఖమద
హారణా హరిహయనుతపద హరివరసుగుణా
కర పరదరకర కరధృత
దర శ్రీధర లలితజలజదళనిభనయనా. 182

టీ. ముర = మురాసురుఁడు, నరక = నరకాసురుఁడు, ముఖ = మొదలుగాఁగల, దనుజ = రాక్షసులయొక్క, మద = మదమును, హారణా = హరించు

వాఁడా, హరిహయనుత = ఇంద్రునిచేనుతింపఁబడిన, పద = పాదములుగల వాఁడా, హరి ! వరసుగుణాకర = శ్రేష్ఠములగు కల్యాణగుణముల ప్రోవా, పరదరకర = శత్రుభయంకరుఁడా, కరధృతదర = చక్రహస్తుఁడా, శ్రీధరా = లక్ష్మీపతీ, లలితజలజదళనిభనయనా = తామరసాక్షా.

చతుర్విధకందము.

శ్రీరమణ భక్తజనమం
దారా కరుణాలవాల దానవహరణా
సూరిహిత సద్విహారా
శౌరీ పరమేష్ఠిముఖ్యసన్నుతచరితా. 183

టీ. శ్రీరమణ = లక్ష్మీపతీ, భక్తజనమందారా = భక్తకల్పద్రుమా, కరుణాలవాల = కరుణానిలయుఁడా, దానవహరణా = రాక్షసాంతకా, సూరిహితసద్విహారా = పండితశ్లాఘ్యమైన విహారముకలవాఁడా, శౌరీ, పరమేష్ఠిముఖ్య = బ్రహ్మాదులచే, సన్నుతచరితా = కొనియాడఁబడిన చరిత్రము కలవాఁడా.

గద్య. ఇది శ్రీమత్కుక్కుటేశ్వరగోపాలలీలాకటాక్షవీక్షణసంప్రాప్త దీప్తసాహిత్య సుకవిజనస్తుత్య శుభాపస్తంబసూత్ర భారద్వాజగోత్రపవిత్ర పిండిప్రోలిగోపాలామాత్యపుత్ర సరస కవితాలక్షణవిచక్షణ లక్ష్మణకవిప్రణీతంబైన లంకావిజయం బను ద్వ్యర్థిప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

# ద్వితీయాశ్వాసము.

శ్రీమత్కుర్యేటిపురీ
ధామా మార్తాండకోటిధామా తులసీ
దామా ప్రావృడ్జలద
శ్యామా గోపాలనామ జగదభిరామా. 1

టీ.—శ్రీమత్ = సంపదలతోనిండిన, కుర్యేటిపురీధామా = కుర్యేటిపురను నగరమున నివసించువాఁడా! మార్తాండకోటిధామా = కోటిసూర్యప్రభావంతుఁడా! తులసీదామా=తులసిమాలనుధరించినవాఁడా! ప్రావృడ్జలదశ్యామా=వర్షాకాలమేఘమువలె నల్లని కాంతిగలవాఁడా! జగదభిరామా=త్రిలోకసుందరుఁడా! గోపాలనామా=గోపాలమూర్తీ!

వ. అవధరింపు మల్లక్ష్మణాగ్రజుండు. 2

రాఘు.—అవధరింపుము = చిత్తగింపుము. అల్లక్ష్మణాగ్రజుండు = లక్ష్మణుని యన్న రాముఁడు.

లక్ష్మ.—లక్ష్మణాగ్రజుండు=బ్రాహ్మశ్రేష్ఠుఁడగు లక్ష్మణకవి.

గీ. మఱియు లంకాక్షితివిభూతి మాన్యముగ వ
రించి యసముమిగుల సద్ధరిణమగుచును
సాగ దానవు భళియనుశక్తి దాన
పత్రికాయత్తదళ నొందఁ బరఁగఁ జేసె. 3

రాఘు.—మఱియుం, లంకాక్షితివిభు = రావణుని, ఉక్తిన్ = వాక్యమును, మాన్యముగన్ = పూజ్యమగురీతిని, వరించి = సమ్మతించి, యసము = కీర్తి, మిగులన్ = అతిశయింపగ, సద్ధరిణము = చక్కని లేడి, అగుచును = అవుచు, సాగన్ = పోఁగా, దానవున్ = మారీచుఁడను రాక్షసుని, భళి యనుశక్తిన్ = పొగడఁదగిన బలముచే, తాన = తానే, పత్రికిన్ = శరమునకు, ఆయత్తదశన్ = అధీనమగు స్థితిని, ఒందన్ = పొందునట్లు, చేసెన్ = కావించెను.

తా. రావణుని యాజ్ఞ శిరసావహించి మాయలేడియై మారీచుఁడు వచ్చెను. రాముఁడు వానిని తనబాణముపాలు చేసెను.

లక్ష్మ.—మఱియుం = పిమ్మట, విభూక్తిన్ = రాజు చెప్పిన మాటవలన, లంకాక్షితిన్ = లంక నేలను, మాన్యముగన్ = మాన్యమగునట్లు, వరించి = కోరి, యసము = యశస్సు, మిగులసద్ధరిణము = మిగుల + సత్ + హరిణము = మిగులఁ దెల్లనిది, "హరిణః పాండురః పాండుః" అమరము, అగుచు, సాగన్ = వృద్ధి పొందఁగా, తాన్ = లక్ష్మణకవి, అవున్ = అగును, బళి = మేలు, అనుశక్తిచేతన్ = సామర్థ్యముచే, దానపత్రికా = దానశాసనమునకు, ఆయత్తదశన్ = స్వాధీనదశను, ఒందన్ = పొందునట్లు, పసఁగన్ = ప్రకాశముగ, చేసెను.

తా. ప్రభువువలనఁ దనకు వాగ్దత్తమైన భూమికి వానివలన పట్టా వ్రాయించి పుచ్చుకొనియెను.

వ. అప్పుడు.

సీ. వరమహైశ్వర్యప్రదరసాధనంబుచే
నహహ ము న్నాలక్ష్మణాగ్రజన్ము
విడువ కెల్లెడలఁ బర్విడుచును హరిణాక్ష
తిండంబు మీఱుచునుండినయస
మాశరకేసరి హారహార శైలసా
మ్యంబుమీఱినయట్టి స్వాకృతియును
స్మృతినిలఁబడుచు సద్ధృదయశత్రుఘ్నాగ్ర
జన్మసమాఖ్యాగ్రసరము నగుచు

గీ. నొనర శ్రీరామభారతియో యనంగఁ
దనరు కుయ్యేటిజేని నాదమ్మున వెఱఁ
గందఁ జేయఁగ విని యోర్వ కధికరూఢ
మన్యు వాన రసాపత్యమణియు నంత. 5

రాఘు.—వరమహాశ్చర్యప్రదరసాధనంబుచే=శ్రేష్ఠము నాశ్చర్యకరము నైనబాణ మనుసాధనముచే, అహహా = వింత, మున్ను=ఎదుట, ఆలక్ష్మణాగ్రజన్మున్=ఆరాముని, విడువక=విడిచిపెట్టక, ఎల్లెడలన్ = అన్నితావులను, పర్విడుచున్=పరుగుపెట్టుచు, హరిణాకృతిన్ = మృగరూపమునను, డంబు మీఱుచున్=ప్రకాశించుచు, ఉండిన=ఉన్నయట్టి, అసమాశరకేసరి–అసమ=సమానరహితుఁడైన, ఆశరకేసరి = రాక్షసశ్రేష్ఠుఁడగు మారీచుఁడు, (ఇచ్చట కేసరశబ్దము సింహపరముగాదు, శ్రేష్ఠవాచకము) హహహ = ఎంతకష్టము! శైలసామ్యంబు = పర్వతముపోలికను, మీఱినయట్టి = అతిక్రమించిన, స్వాకృతి=తనరాక్షసరూపముయొక్క, అనుసృతిన్=అనుసరించుటచేత, ఇలన్ = భూమియందు, పడుచున్ = పడుచున్నసమయమునను, సద్హృదయ=మంచి మనసుగల, శత్రుఘ్నాగ్రజన్మ=లక్ష్మణుని, సమాఖ్యా=పేరు, అగ్రసరము=చివరకలది, అగుచునొనర= ఐయొప్పి, శ్రీరామభారతియో = రామునియొక్క మాటయేమో, అనంగన్=అని యెంచుటకనువగునట్లు, తనరు = ఒప్పునట్టి, కుయ్యి=ధ్వని, ఏటిజేనినాదమ్ము = సముద్రధ్వని, అనన్=అనునట్లు (ఏటి? జేని నాదము = భర్తయొక్కనాదము, అనియుం) వెఱఁగంద=భయమందునట్టులు, చేయన్=ఒనర్పఁగా, విని=ఆలించి, ఓర్వక=సహింపలేక, అధికరూఢమన్యువు–అధిక=విస్తారము, రూఢ=దృఢమునైన, మన్యువు=దుఃఖము, ఆనన్=పొందఁగా, రసాపత్యమణియుం = భూమిపుత్రియగుసీత (ఆన = శపదముచే) అంతన్=అంతట.

తా. రామునియెదుటఁ బర్విడినమారీచుఁడు రామబాణముచేఁ బర్వత సమానదేహముతో నేలఁగూలుచు లక్ష్మణాయని రామునికంఠస్వరము ననుసరించి సముద్రధ్వనివలె నఱచెను. ఆకేకవిని దుఃఖించి సీతభయపడి.

లక్ష్మీ.—వర...ధనంబుచే-వర-శ్రేష్ఠమైన, మహైశ్వర్యప్రద=మిక్కిలి యైశ్వర్యకరమగు, రసాధనంబుచేన్=భూమియనుధనముచేత, అహాహా=ఎంత వింత! మున్ను=ముందు, ఆలక్ష్మణాగ్రజన్మున్ = లక్ష్మణకవిని, విడువక=వదలక, యసము=కీర్తి, ఎల్లెడలన్=ఎప్పుడును, పర్విడుచున్=పరుగులెత్తుచు, హారినాకృతిన్=తెల్లనిరూపముతో,డంబుమీఱుచున్, ఉండినన్, అశర...సామ్యంబు-అ=అట్టి, శర తెల్లుపువ్వు, కేసరి=సింహము, హర=శివుఁడు, హరశైల=కైలాసము (వీనితో), సామ్యంబు=సాటిని, మీఱినయట్టి = అతిక్రమించిన, స్వాకృతిన్=తనయాకారముయొక్క, అనుస్మృతిన్=అనుసరించుటచేత, నిలఁబడుచున్=నిలువంబడుచు, సద్ధృదయ=మంచిమనసుగలవియై, శత్రుఘ్నాగ్రజన్మ=లక్ష్మణునితో, సమ=సమానమగు, ఆఖ్యా=పేరు, అగ్రసరము=తుదనుండునది, అగుచున్, శ్రీరామ=శోభాకలితస్త్రీయగు, భారతి=సరస్వతి, ఓయనంగన్=ఓలక్ష్మణా యని పలుకుచుండ, తనరు = ఒప్పునట్టి, కుయ్యేటికోటన్=కుయ్యేరు గ్రామమునకుఁ బ్రభువగు, ఆదమ్మనన్=ఆధర్మారాయని, వెఱఁగందఁగన్=భయముచెందునట్లు, చేయఁగన్=ఒనర్పఁగా, విని=ఆవృత్తాంతము తెలిసికొని, ఓర్వక=చూపోపక, అధికరూఢమన్యువు=మిగులఁ గోపమెత్తిన, ఆనరసాపత్యమణి - ఆ+నరసా=నరసయ్యమ్మ యనుపురంధ్రికి, అపత్య = కుమారులలో, మణి=శ్రేష్ఠుఁడగుదమ్మన్న (పెద్దవాఁడని చెప్పవచ్చును.)

తా. ఇట్లుండ లక్ష్మణకవి యాభూమికిఁ బ్రభువు వాగ్దానముచేసియున్న ప్రకారము పట్టా వ్రాయించి పుచ్చుకొనియెను. లక్ష్మణకవి మంచిపేరు పొంది యున్నాఁడు. సరస్వతీదేవి పిలిచిన నోయని పలుకుచున్నది. దీనింగాంచి ధర్మారాయఁడు సహింపక కోపమెత్తి.

గీ. వడిగ నాలక్ష్మణుని రఘువంశమణినిఁ
గనదురూహాంచితమతి నకారణంబ
తనకు ముందట యగు విపద్గతి యొకింత
యరయ కబ్భూమి కెడసేయ నపుడు తలఁచి. 6

రాఘు.—రఘువంశమణిని=రాముని, కనన్ = చూచివచ్చుటకు, వడిగన్=వేగముగ, అలక్ష్మణున్=లక్ష్మణస్వామిని, అబ్జాఖిమికిన్=తానున్న చోటునుండి, ఎడసేయన్ = దూరముగాఁ బంపఁగానే, దురూహాంచితమతిన్ = దుష్టస్వభావముతో, అకారణంబ = నిష్కారణము, తనకు (రావణునకున్) ముందటన్ = భవిష్యత్కాలమున, అగువిపద్గతి = కాఁబోవుదుర్గతిని, ఒకింతయరయక=కొంచెమైన విచారింపక, అపుడు = ఆసమయమున, తలఁచి (రావణుఁడు) ఊహించి.

తా. సీత, రాముని చూచిరమ్మని పంపివేయఁగానే వెనుక ముందులరయక దుర్బుద్ధి యగు రావణుఁ డిదియే సమయమని.

లక్ష్మ.—వడిగన్=వేగముగ, నిరఘున్—నిః+అఘున్=దోషరహితుఁడును, వంశమణిన్ = (పిండిప్రోలు) కులశ్రేష్ఠుఁడును (అగు), అలక్ష్మణున్ = లక్ష్మణకవిని, ఇఁగను = ఇఁకనే (ఇప్పుడే),దురుహాంచితమతిన్, అకారణంబ, తనకు (దమ్మన్నకు), ముందటనగు విపద్గతి యొకింతయరయక, అబ్జాఖిమికిన్= లంకమాన్యమునకు, ఎడసేయన్ = ఎడఁబాపుటకు, అపుడు=ఆసమయంబున, తలఁచి = (దమ్మన్న) తలపోసి.

తా. తనకు ముందు రాఁబోవునాపద విచారింపక దురూహతో నిర్దోషియగు లక్ష్మణకవిని లంకమాన్యమునుండి తొలఁగింపవలయునని యెంచుకొని.

సీ. అవసరం బెఱిఁగి మున్న న్యమాన్య క్షేత్ర
సంచయాకర్షణాసక్తుఁ డగుచుఁ
గ్రాలు టంద మ్మన్న రావణాఖ్యైకసూ
త్రామాదివిద్వేషి తా మనమున
ననుచితత్వమున కయ్యారె వెట్టమునుబల్
కడఁక వెడలి నీరుగలసియున్న
నిప్పవోలె నొనర నిజకల్మషవిచార
మించుకంతయును నోరు లెఱుఁగకుండ

గీ. నేర్పు మెఱసి యతిగ్రామణీత్వ మమరఁ
గరకమలముఖ్యదండమాసరణి రాక
కూఁతగా వచ్చి తా మాయ నుఱక లక్ష్మ
ణాగ్రజన్మమాన్యక్షేత్ర మపహరించె. 7

రాఘు.—అవసరంబు=అందితరులులేని సమయమును, ఎఱిఁగి=గ్రహించి, మున్ను=ఇంతకుఁబూర్వము, అన్య...డగుచు-అన్య = పరులయొక్క, మాన్య=పూజ్యలైన, క్షేత్ర=భార్యల, సంచయ=సమూహమును, ఆకర్షణ=బలాత్కరించుటయందు, ఆసక్తుఁడు=ఇచ్ఛగలవాఁడు (అగుచున్), క్రాలుట=సంచరించుట, అందమ్ము=మంచిది, అన్న=అనినట్లి, రావణాఖ్యైకసూత్రామాదివిద్వేషి =రావణుఁడనునామముగల దైత్యుఁడు, తాన్=తాను, మనమునన్ = భావమున, అనుచితత్వము=తగనిది, అనక=అనియెంచక, అయ్యారె = ఆశ్చర్యము, వెట్ట=వేఁడియగు, మున్=మునుపటి, బల్ కడఁకన్=అధికక్రోధముతో, వెడలి =బైలుదేఱి, యతిగ్రామణీత్వము = మునీంద్రవేషమును (సన్యాసులలో మేటి) “గ్రామణీర్నాపితే పుంసి శ్రేష్ఠగ్రామాధిపే త్రిషు” నిఘంటు. అమరన్=అమర్చుకొనియనుట. నీరుగలసియున్న నిప్పువోలె = (‘నీఱుగలిసియున్న’ అనుచో ‘బూదిగప్పియున్న’ యన్నబాగు) ఒనరన్, నిజకల్మష విచారము = తనదుశ్చింత, ఇంచుకంతయు=కొంచెమైనను, ఒరులెఱుఁగకుండన్=పరులకుఁ దెలియరానీక, నేర్పు మెఱసి, నిపుణుండై, కరకము=కమండలువు “కరకస్తుకమండలుః” అని ని. అల = ప్రసిద్ధమైన, ముఖ్యదండము = ముఖ్యముగా సన్యాసికుండఁదగిన దండము, ఆసరణిరాకకున్=తానువచ్చునావేషమునకు, ఊఁతగాన్ = ఆధారముగా, వచ్చి, తాన్, మాయన్=మాయచే, ఉఱక=ఊరక, లక్ష్మణాగ్రజన్ము = రాముని, మాన్యక్షేత్రమున్ = పూజ్యురాలగు భార్యను, అపహరించెన్ = ఎత్తుకొనిపోయెను.

తా. సీత యొంటిగానుండుటఁ దెలిసికొని పరదారాపహరణనిపుణుఁడైన రావణుఁడు సన్యాసివేషమున వచ్చి యెత్తుకొని పోయెను.

టీ.—అవసరము = తగుసమయము, ఎఱిఁగి = తెలిసికొని, మున్న = మునుపు, అన్య...సక్తుఁడు—అన్య = ఇతరుల, మాన్య = పన్నులేకుండ ననుభవించు భూములయొక్క, క్షేత్ర = పన్నుగలవానియొక్క, సంచయ = సంఘమును (పెక్కింటిని), ఆకర్షణ = స్వాధీనపఱచు కొనుటయందు, ఆసక్తుఁడు = అభిలాషముగలవాఁడు, అగుచున్ = అయినవాఁడై, అణాఖ్య = అణాదులగు సంజ్ఞలకు, ఏక = ముఖ్యములగు, సూత్ర = మాహేశ్వర సూత్రములయందలి, అమాది = అమ్, మొదలైనవానిని, విత్ = తెలిసినవారికి, ద్వేషి = విరోధి (వ్యాకరణాది శాస్త్రములు తెలిసిన పండితులకు విరోధి) అయిన, ధర్మన్నరావు = ధర్మారావు, తాన్, మనమున, అనుచితత్వము = కూడనిది, అనక, అయ్యారిపెట్టమున్ = అయ్యారిపెట్టమను పేరుగల గ్రామమున, బల్ కడఁకన్ = మిగుల వేగముతో, వెడలి = వెలువడి, నీరుగలసియున్న నిప్పువోలెన్ = నీళ్లలోఁ గలసియున్న నిప్పువలెనే, నిజకల్మషవిచారమ్ము = తనపాపపుఁదలంపును, ఇంచుకంతయుం, ఒరులెఱుఁగకుండన్ = రెండవవానికింతయైన నెఱుఁగరాకుండ, నేర్పు మెఱసి = కుశలుఁడై, అతిగ్రామణీత్వము = గొప్పగ్రామాధికారము, అమరన్ = ఒప్పునట్లు, కరకమల ముఖ్యదండము—కర = హస్తమునందుఁగల, క = చెమ్మటనీటిచే, మల = మాలిన్యము నొందిన, ముఖ్యదండము = చేపాటికఱ్ఱ (చేకట్టుకఱ్ఱ), ఆసరణిన్ = ఆదారియందు, రాకకున్ = వచ్చుటకు, ఊఁతగాన్ = పట్టుగా, వచ్చి = ఏతెంచి, తాన్, మాయన్ = నశించుటకు, ఊరకన్ = ఒక్కయుఱుకున, (ఉఱుకు ధాతువునుండి యుఱుకయగును, శ్లేషలలో లఘువులఘు రేఫముల భేదము పట్టుదలకాదు) లక్ష్మణాగ్రజన్ము = లక్ష్మణకవియొక్క, మాన్యక్షేత్రము = మాన్యపుభూమిని (లంక నేలను), అపహరించెన్ = హరించెను. రామకృష్ణమ్మ లక్ష్మణకవు లవిభక్తభ్రాతలు కావునఁ బూర్వోత్తర విరోధము లేదు.

తా. ఇతరుల భూముల నెన్నింటినేని తనవశపఱచుకొనిన ధర్మారావు తనతలం పొరులకుఁ దెలియకుండఁ (గోదావరి మండలములోనివారి కలవాటగునట్లు) చేపాటికఱ్ఱ చేఁబట్టుకొని యావైపునకువచ్చి లంకనేలను దన వశముచేసి కొనియెను.

వ. అవ్విధంబున దురుక్తి పురస్సరంబుగా నపహరించిన. 8

రాఘ.—అవ్విధంబునన్ = అరీతిగా, దురుక్తి పురస్సరంబుగాన్ = నీవలెమనుష్యుఁడు, నేను దేవతలం జయించితిని, లంకాధిపతిని, నన్ను వరింపుము. ఈ మొదలైన దుష్టవాక్యములు మొదలుపెట్టి, అపహరించిన=కొనిపోఁగా.

లక్ష్మ.—అవ్విధంబునన్ = అట్లు (వైరీతిని), దురుక్తి పురస్సరంబుగాన్=బాఁపఁడు నేనుండఁగా మరల నీభూమిలో నడుగు పెట్టుచూ, ఏలాగునఁ బుచ్చుకొనునో చూచెదను. పట్టాలు పత్రములేమి చేయును, నాలుక గీచి కొనవలయు ననురీతిగా సంభాషించి, అపహరించిన.

క. చిత్రం బజకులమాన్య
క్షేత్ర మపహరించె నింకఁ జెడు నీదుశ్చా
రిత్రుండు పుత్రమిత్రక
ళత్రాదులతోడ విగత లక్ష్మీకుండై. 9

రాఘ.—చిత్రము=అద్దిర ! అజకులమాన్యక్షేత్రము– అజ=అజమహారాజుయొక్క, కుల=వంశమందు, మాన్య=పూజ్యుఁడైనరాముని, క్షేత్రము = భార్యను, అపహరించెన్ = హరించినాఁడు. ఇఁకన్ =ఇకముందు ఇంతటికారణముననసుట, ఈదుశ్చారిత్రుఁడు = ఈదుష్టచరిత్రుఁడు, పుత్రమిత్రకళత్రాదులతోడన్ = బిడ్డలు, చెలికాండ్రు, భార్యతోఁగూడ, విగతలక్ష్మీకుండై=సిరిచెడి, చెడున్ = నశించును.

తా. సీతాపహరణదోషమున నీరావణుఁడు, దారాపుత్రాదులతో నశించిపోవును.

లక్ష్మ.—అజకులమాన్యక్షేత్రము, అజకుల=బ్రాహ్మణుని, మాన్యక్షేత్రము=మాన్యపుఁజేను (అజకులమాన్య = బ్రాహ్మణులలోఁ బూజ్యుఁడైన లక్ష్మణకవి యొక్క, క్షేత్రము = పొలము), అపహరించెన్. తక్కినది స్పష్టము.

వ. అనుచుం జూప అనేకప్రకారంబులఁ దమలో నాడుకొనుచుండి రంత. 10

తా. (చూపఱు = చూచుచున్నవారు) ఈవృత్తాంత మంతయుఁ గాంచుచున్న వారనేకరీతుల నిందించిరి. (స్పష్టము)

సీ. పోసఁగు నాగతి మాన్యభూమికన్య భయంబు
        వొడమినమానసంబునను లక్ష్మ
ణాగ్రజాతుం డాశ్రితావన కృష్ణమే
        ఘశ్యాము దుష్టనిగ్రహధురీణ
యెచ్చటనున్నా విదేమి నన్నుఁ బరాభ
        వించి యీదుర్ణయోదంచితుండు
చనుచున్నవాఁ డిదె సమయం బనుచు రావు
        ధర్మమా యావిదితయశుఁ డాత
గీ. తానుకంపైకచిత్తుఁడ వగుచు వీని
    శిక్షసేయు మనుచుఁ జేర్చు చింతమరలఁ
    బెట్టెఁ గుయ్యోరు దయితునభ్రివలె విడువ
    కాధ్యుఁడై యేలుగోపాలునటు దలంచి. 11

రాఘు.—అగతిన్ = అట్లు, పోసఁగు (రావణునిచేతఁబడినట్టి), మాన్య = పూజ్యురాలగు, భూమికన్య = సీత, భయంబు = భయము, పొడమినమానసంబునన్ = పుట్టినహృదయముతో, లక్ష్మణాగ్రజుండ, ఆశ్రితావన = ఆశ్రయించినవారిని రక్షించువాఁడా, కృష్ణమేఘశ్యామ = నల్లమబ్బువంటి వర్ణముగలవాఁడా, దుష్టనిగ్రహధురీణ = దుష్టశిక్షణమున నేర్పుగలవాఁడా, ఎచ్చట నున్నావు, ఇదేమి ? నన్ను = నన్ను, పరాభవించి = అవమానము చేసి, ఈదుర్ణయోదంచితుండు = ఈదుష్టుఁడగు రావణుఁడు, చనుచున్న వాఁడు = పోవుచున్నవాఁడు, ఇదేసమయము = వీని సంహారించుటకు వేళ యిది, అనుచున్, రావు = రావేమి ? ధర్మమా = న్యాయమా. అవిదితయశుఁడు = అంతటను ప్రసిద్ధికెక్కిన యశస్సుగల నీవు, అతతానుకంపైకచిత్తుఁడవు = దయాపరిపూర్ణుఁడవు, అగుచున్, వీనిన్ = ఈదుష్టుని, శిక్షసేయుము = శిక్షింపుము, అనుచున్, కుయ్యోరు = ధ్వనిచేయునట్టియోఱు, దయితున్ =

ప్రియుండైన, అబ్ధిక్ = సముద్రమును చిలిచినట్లు, విడువక = ఎడతెంపు లేకుండ, ఆర్ద్యుండై = రాజై, ఏలుగోపాలుక్ = పాలించురాముని, అటు తలంచి = పేర్కొని, చేర్చుచింతక్ = చేరుచునట్టి దుఃఖముచేత, మరలం బెట్టెక్ = మరల మరల నేడ్చెననుట.

తా. సీత, రావణునిచేతులలోఁబడి యాకాశమార్గమునఁ బోవుచు రాముని బేర్కొని నన్ను రావణుఁ డెత్తుకొనిపోవుచున్నాఁడు. నీవు దుష్ట శిక్షణ ప్రతుఁడవు రావేమి? వీనిం గొట్టి నన్ను విడిపింపవే మని మిక్కిలి దుఃఖించెను.

లక్ష్మ.—అగలి = చూచుచున్నవారు పలికినట్లు, పోనఁగుక్ = పుత్ర మిత్రకళత్రనాశనమగును. మాన్యభూమికిక్ = లంకపాలమునకు, అన్య భయంబు = పరులచేబాధ, పొడమినక్ = కలుగఁగా, మానసంబునక్ = హృదయమున, లక్ష్మణాగ్రజాతుండు = లక్ష్మణకవి, ఆశ్రితావన, కృష్ణ, మేఘశ్యామ, దుష్టనిగ్రహాధురీణ, ఎచ్చటనున్నావు, ఇదేమి, నన్ను, పరా భవించి, ఈదుర్ణయోదంచితుఁడు, దితయశుఁడు = ఖండింపఁబడినయశస్సు గల, రావుధర్మమాయావి = రావుధర్మారావనుమాయకాఁడు, ఇదే సమయ మనుచుక్ = మంచిసమయముదొరకినదని, చనుచున్నవాఁడు, ఆతతానుకం పైకచిత్తుఁడవు = దయామతివి, అనుచుక్, వీనిక్ = ధర్మారావును, శిక్ష సేయుఁడు = దండింపుము. అనుచుక్, చేర్చుచింతక్=ధ్యానమును, మరలఁ బెట్టెక్ = మరల మరల ధ్యానించెను. (కృష్ణుని లేక గోపాలస్వామిని), కుయ్యేరుక్ = కుయ్యేరుగ్రామమున, దయితుక్=ఇష్టుఁడయిన, అబ్ధివలెక్= సముద్రమునువలె, విడువక, ఆర్ద్యుండై, ఏలుగోపాలుక్= గోపాలస్వామిని, అటు = ఆవిధమున, తలంచి = ధ్యానించి.

తా. ఓ గోపాలస్వామీ, ఈదమ్మన్న నామాన్యమును హరించినాఁడు నీవు చూచుచు నూరకుందువా యాశ్రితావనా యనిస్తోత్రము జేసెను.

క. అప్పు డలదుర్మదాంధుం
డొప్పుగఁ దనసేయుకార్య మొక్కింతయు లోఁ

దప్పని తలఁపఁడు బ్రదికెడు
చొప్పెఱుఁగం డకట కాలచోదితుఁ డగుచున్. 12

టీ.—అప్పుడు = ఆసమయమున, అలదుర్మదాంధుఁడు = ఆదుర్గర్వముచేఁ గన్నుగానకయున్న (రావణుఁడు - దమ్మన్న) వాఁడు, తన సేయుకార్యము = తాను చేయుచున్నపని, ఒప్పుగన్ = చక్కఁగా, ఒక్కింతయున్ = కొంచెమైనను, లోన్ = మనస్సులో, తప్పని, తలఁపఁడు = సీతను హరించుట తప్పని రావణుఁడును, బ్రాహ్మణమాన్యము నాక్రమించుకొనుట తప్పని దమ్మన్నయు, తగ దని యనుకొనఁడు. కాలచోదితుఁడగుటన్ = మృత్యువుచేతఁ బ్రేరేపింపఁబడినవాఁడగుటవలన, బ్రదికెడుచొప్పు = ఎట్లు కావించినఁ దానుజీవించునో, ఎఱుఁగఁడు. అకట! = అయ్యయో!

వ. అంత. 13

చ. తన కటు తేఱిచూడను స్వతంత్రత చెల్లనిమాన్యభూమినం
దన బలునిట్ట ప్రానికొన దార్కొనుపంటికి నాససేయుపం
గుని క్రియఁ జెందబల్మిఁ గయికొన్న సహుంకృతి రావు వారిద
మ్మన ఘనవీథి నేగ విబుధావళి గన్గొనె దానవార్యునిన్.

టీ.—తనకున్, అటు = ఆమెవైపునకు, తేఱిచూడను = కన్నెత్తిచూచుటకైనను, స్వతంత్రతచెల్లని = స్వాతంత్ర్యములేని, మాన్యభూమినందనన్ = పవిత్రమైనసీతను, బలునిట్టప్రానికొనన్ = పెద్దపొడవైనచెట్టుచివరను, దార్కొనుపంటికిన్ = వ్రేలాడుచున్నఫలమునకై, ఆససేయు = కోరునట్టి, ఆశపడునట్టి, పంగుని క్రియన్ = కుంటివానివలె, చెందన్ = పొందుటకు, బల్మిన్ = బలవంతముగా, కైకొన్నన్ = పట్టుకొనిన, సహుంకృతిన్ = హుంకారము చేయువానిని, రావున్ = రావము (ధ్వని) చేయుచున్నవాని (సహుంకృతిరావున్ = హుంకారధ్వనిచేయువానిని) వారిదమ్ము = మేఘము, అనన్ = అనురీతిని, ఘనవీథిన్ = గగనమార్గమున, ఏగన్ = పోవుచుండఁగా దానవార్యునిన్ = దానవశ్రేష్ఠుని, విబుధావళి = దేవతాసమూహము, కన్గొనెన్ = చూచెను.

తా. కంటితోఁ జూచుటకైన నధికారములేనిసీతను రావణుఁడు దుర్బుద్ధియై యాకాశమార్గమునఁ గొనిపోవుచుండ దేవతలు చూచిరి.

లక్ష్మ.—కనన్, అటు=ఆభూమివంక, తేఱిచూడను= చక్కఁగాఁ గనుఁగొనుటకైనను, స్వతంత్రత = అధికారము, చెల్లనిమాన్యభూమిన్ = లేనిలంకామాన్యమును, అందనిబలునిట్టమ్రానికొనన్ =దొరకని పొడుగైనచెట్టుకొనను, దార్కొనుపంటికిన్, ఆససేయుపంగునిక్రియన్ = ఆశపడుకుంటివానిరీతి, చెందన్ = తానాభూమిననుభవించుటకు, బల్మిన్ = బలమును, కైకొన్న = పుచ్చుకొనిన, హుంకృతి = హుమ్మనిరోషఘూర్ణితుఁడైన, రావువారిదమ్మన = రావువారియింటివాఁడైన ధర్మరావు, ఘనవీధిన్ = రాజమార్గమున, ఏగన్ = వెళ్లుచుండఁగా, అవార్యగన్ = అడ్డుపెట్టశక్యముగాని వానిని, (దమ్మన్నను) విబుధావళి = వీధిగానున్న పెద్దమనుష్యులగుంపు, కాన్ = కన్గొనెన్.

తా. లక్ష్మణకవిమాన్యమువైపునకుఁ జూచుటకైనను స్వతంత్రత లేకపోయినను, పొడవైనచెట్టుచివర నున్న పండునకై పొట్టివాఁడు ప్రయత్నించినట్లు తా నాభూమిని హరింపవలయు నని బలోద్రేకముచే హుంకారము చేయుచు వెంట నరుగు ధర్మారావును పదిమందిపెద్దలు జూచిరి. అధికారబలముకలవాఁడు కావున వాని నేమియనుటకును జాలరైరి.

సీ. అట్లజసంతతి యైనగోపాలుని
యాత్మజుం డగులక్ష్మణాగ్రజన్ము
క్షేత్రంబు నపహరించి యధర్మ రావణా
ఖ్యయమాదివిద్వేషి కలుషబుద్ధి
యాలంక యాలక్ష్మణాగ్రజు క్షేత్రంబు
నేను బండెదులీల నిఁక నొనర్తు
నని యట కేగి ద్విజాగ్రయాయి జటాయు
గురుమహాధ్యయనుఁ డొక్కరుఁడు దారి
గీ. నెదురుకొనఁ దచ్ఛకునము భయద మగు నని
సరకుసేయక వడి నడిచి రహిఁ లంక

చొచ్చి యొకెడ సీతాస్థితి నచ్చుపఱిచి
యచటఁ గాపుంచి తనదుగేహమున కేగె. 15

రాఘ.—అట్లు, అజసంతతి=అజునికొడుకు, అయిన గోపాలుని యాత్మజుండు=అయినట్టి దశరథునికొడుకు, అగు లక్ష్మణాగ్రజన్మక్షేత్రంబున్=అయిన శ్రీరాముని భార్యను, అపహరించి=కొనిపోయి, అధర్మ...ద్వేషి-అధర్మ=ధర్మహీనుఁడును, రావణాఖ్య=రావణుఁడను పేరుగల, యమాదివిద్వేషి=రాక్షసుఁడు(యమ=యముఁడు-ఆది=మొదలగువారికి, విద్వేషి=విరోధి యమ=యమము, ఆది=మొదలైన యోగములను, విత్=ఎఱిఁగినవారికి విద్వేషి), కలుషబుద్ధిన్=దుష్టభావముతో, ఆలంకన్=ఆలంకయనుద్వీపమునందు, లక్ష్మణాగ్రజక్షేత్రంబున్=సీతను, సేను, పండెడువలన్=క్రీడ కెసకొనురీతిని, (పండెడువల=పండుకొనులాగున=గ్రామ్యార్థము) అని, అటకున్=అలంకకు, ఏగన్=వెళ్లుచుండఁగా, ద్విజాగ్రయాయి=పక్షివర్యుఁడును, ''పక్షిసర్పాండజాద్విజాః'' అని. జటాయుః=జటాయువను పేరుగలవాఁడును, గురుమహాధ్యయనుఁడు-గురు=(గొప్పదియగు) సహింపరాని, మహా=అధికమైన, ఆధి=మనోవ్యథకు, అయనుఁడు=స్థానమైనవాఁడు, ఒక్కరుఁడు=ఒక్కఁడు, దారిన్=మార్గమున, ఎదురుకొనన్=మార్కొనఁగా, తచ్ఛకునమున్=ఆపక్షిని, భయదము=భయంకరము, అగు=అయినట్టి, అనిన్=యుద్ధమున, సరకుసేయక=లక్ష్యముపెట్టక, పడిన్=ఆపిట్టయొక్క వేగమును, అడిచి=కొట్టి, పడిన్=వేగముగ, లంకఁజొచ్చి=లంకలోఁ బ్రవేశించి, ఒకెడన్=ఒక్కచోట, సీతాస్థితిన్=సీతయుండుటకు, అచ్చుపఱిచి=నిర్ణయించి, అచటన్=ఆసీత యుండుతావున, కాపుంచి=కావలియుంచి, తనదుగేహమునకున్=తనమందిరమునకు, ఏగెన్=వెళ్లెను.

తా. సీతను లంకకుఁ గొనిపోయి యచటఁ దనతో రమించున ట్లొడఁబడఁ జేసెదనని తలంచి పోవుచుండ మార్గమధ్యమున జటాయుం వెదుర్కొని యుద్ధముచేయ వానిం జంపి పోయి సీత నొక్కచోట నుంచి యిచట కాపుంచి తనయింటిలోనికి రావణుండు చనియెను.

లక్ష్మ.—అట్లు, అజసంతతి=బ్రహ్మవంశస్థుఁడు, అయిన గోపాలుని=గోపాలమంత్రికి, ఆత్మజుండు=పుత్రుఁడు, అగులక్ష్మణాగ్రజన్మక్షేత్రంబున్=లక్ష్మణకవిభూమిని, అపహరించియు=హరియించియే, అనాఖ్యాయమాదివిద్వేషి=వ్యాకరణశాస్త్రము (మొదలగుశాస్త్రములు) తెలిసినపండితులకు విరోధి, ధర్మరావు=దమ్మన్న, కలుషబుద్ధిన్=దుష్టబుద్ధిచే, లక్ష్మణాగ్రజక్షేత్రంబున్, అలంకన్, నేను, పండెదులీలన్=ఇంతకంటెఁ జక్కఁగాఫలించునట్లు, ఇఁకన్, ఒనర్తున్=బాగుచేసెదను, అని, అటకేగన్=అక్కడకుఁబోఁగా, జటాయుక్=జటలతోఁగూడిన, ఉరు=విస్తారమగు, మహా, అధ్యయనుఁడు=వేదముచదివిన, ద్విజాగ్రయాయి=బ్రాహ్మణోత్తముఁడు, ఒక్కరుఁడు, దారిన్=అతఁడు వెళ్లుమార్గములలో, ఎదురుకొనన్=ఎదురుగావచ్చినను, తచ్ఛకునమున్=ఆయపశకునమును (ప్రయాణముచేయువారి కొంటిబ్రాహ్మణుఁ డెదురుపడినది దుశ్శకునము), భయదమగున్=భయంకరమైనది (చెడ్డది), అని, సరకుసేయక=నిర్లక్ష్యముచేసి, వడినడిచి=శీఘ్రముగా నేగి, లంకఁజొచ్చి, ఒక్కెడన్, సీతాస్థితిన్=నాఁగటిచాలును, అచ్చుపఱచి=తోలించి, (సీతాంగలపద్ధతిః) ఆచట కాపుంచి=కాపుపెట్టి, తనదుగేహమున కేగన్.

తా. దమ్మన్నగారు లక్ష్మణకవిగారి లంకలో నెక్కుడుపంటపండించెదనని యెంచుచు దున్నించుటకై బైలుదేఱఁగానే యొంటిబాపఁ డెదురైనను దుశ్శకునమని లెక్కింపక పొలమునకేగి దున్నించి లక్ష్మణకవి వంకవారెవ్వరు నందడుగుపెట్టకుండఁ గాపుపెట్టెను.

ఉ. అమ్మెయి నాతఁ డేగ నిట నప్పుడ యాతనితోడఁబుట్టు వం
తమ్మిహికాంశుఁ *డాతపకతంబున వాఁడినరీతి దోవ వ
క్త్రమ్మవికాసభావదశఁ గైకొనఁ జేరఁగ డాసి యూరుపుల్
గ్రమ్మఁగ లక్ష్మణాగ్రజుఁడు కాతరతం గడు నిర్విచేష్టుఁడై.

రాఘ.—అమ్మెయిన్=ఆప్రకారము, అతఁడేగన్=రావణుఁడు నిజగృహమునకువెళ్లిన, ఇటన్=ఇక్కడ (పంచవటియొద్ద), ఆతనితోడఁబుట్టువు=

* ఆతపకతంబున ననుసమాసము చక్కఁగా లేదు.

లక్ష్మణుఁడు, అంతన్, మిహికాంశుఁడు = చంద్రుఁడు, ఆతపకతంబునన్ = ఎండచేత, వాడినరీతిన్ = మ్లానమైనట్లు, వక్త్రమ్ము = ముఖము, అవికాసభావదశఁగైకొనన్ = వికాసహీనమై, చేరఁగన్ = రామునియొద్దకుఁబోఁగా, ఊరు, పుల్గ్రమ్మఁగ = నిట్టూర్పులతో, కాతరతన్ = భయముతో, నిశ్చేష్టుఁడై = చేష్టలుడిగి, లక్ష్మణాగ్రజుండు = శ్రీరాముఁడు, డాసి = తమ్మునియొద్దకువచ్చి.

తా. లక్ష్మణుఁడు దీనవదనముతో, లేడిని వెంటాడినరాముని యొద్దకేగెను. రాముఁడు లక్ష్మణునిఁ గాంచి భయమందె.

లక్ష్మ.—అప్పుడయిన్ = అపుడు, అతఁడు = ధర్మారావు, ఏగన్ = వెళ్లఁగా, ఇటన్ = ఇచ్చట, తన్వీద = తత్క్షణమే, అతనితోడన్ = దమ్మన్నతో, పుట్టువంతన్ = కలుగుచున్నదుగముతో, మిహికాంశుఁ డాతపకతమ్మున వాడినరీతిఁ, దోఁపన్, వక్త్రమ్ము, అవికాసభావదశఁగైకొనన్, ఊరుపుల్ గ్రమ్మఁగ కాతరతన్, కడునిర్విచేష్టుఁడై, చేరఁగడాసి = దమ్మన్నకడకేగి, లక్ష్మణాగ్రజుఁడు = లక్ష్మణకవి.

తా. లక్ష్మణకవి ధర్మారావునొద్ద కేగి క్రిందిరీతినిఁ బల్కుచున్నాఁడు.

వ. అతని నుద్దేశించి. 17

రాఘు.—రాముఁడు లక్ష్మణునిగాంచి. లక్ష్మ.—లక్ష్మణకవి దమ్మన్నతో.

గీ. అగ్రజుఁడ నైననామది వ్యథఁగలంగ
నవనిజాతను విమలవృత్తి విడిచి యిట
రాఁ దగునె నీకుఁ జేరఁ గారణములేని
యట్టియిబ్భూమి కొనరఁ దమ్మన్న యనుచు. 18

రాఘు.—అగ్రజుఁడనైననామది = అన్ననగునాహృదయము, వ్యథన్ = బాధచే, కలంగన్ = చెదరిపోవునట్లు, విమలవృత్తిన్ = స్వచ్ఛవర్తనముగల, అవనిజాతన్ = సీతను, విడిచి = వదలి, తమ్మన్న = తమ్ముఁడా, చేరకారణములేని యిబ్భూమికిన్ = నీవు రావలసిన యవసరము కనఁబడనియిక్కడికి, రాఁదగునె = రావచ్చునా.

తా. నామనస్సు కలఁతపడుచున్నది. సీతను విడిచి యేల వచ్చితివి. నీ కిక్కడకు రావలసినంత తొందర యేమి వచ్చినది. లేడికై నేను వచ్చితిని. నీ వేల వచ్చితివి.

లక్ష్మ.—అగ్రజుఁడను=బ్రాహ్మణుఁడను, ఐననామది = అయినట్టినామనస్సు, వ్యథఁగలంగఁ=దుఃఖపడునట్లు, నవ=నూతనమగు, నిజ = నీయొక్క, అతను=ఎక్కుఁడైన, విమల=తేటయైన, వృత్తిని=నడతను, విడిచి=పోఁద్రోలి, దమ్మన్న=ధర్మారాయా, నీకుఁజేరఁ గారణములేని యిబ్భూమికి=నీకుఁ బ్రవేశింప నధికారములేని యీలంకచేనులోనికి, రాఁదగునె = వచ్చుట న్యాయమా,

తా. బ్రాహ్మణునకు బాధకలిగించుట తగదు. నీన్యాయవర్తనము వీడి నాలంకమాన్యములో నన్యాయముగాఁ బ్రవేశింప వచ్చునా.

వ. బహుప్రకారంబుల విచారించుచు మఱియును. 19

తా. రెండుపక్షముల సుగమము.

సీ. ఆలక్ష్మణాగ్రజుం డంత నబ్భూమిజ
నారిగన్గొని మేలునేర మాట
లాడు టెం కెప్పుడో యంచు మున్నున్న ప
ట్టావలనొప్ప వేవే వెదకియుఁ
బత్రి కదనభూమిఁ బడియుండఁ జేరి య
ట్లతఁడు సేయుట విని భృతధృతి యయి
తన్ముఖోక్తుల దారి తగఁబట్టి యవు డింకఁ
దనకు క్షేత్రం బబ్బ ననుచు శ్రమము
గీ. గదుర నిటు నటు చని చింత గలఁగి యంత
నొప్పుమీఱఁ గబంధుముఖోపదేశ
మొంది యాశబర్యాప్తమైయున్న యాశ్ర
మమును బంపఁ గాంచె నొకసన్మార్గమునను. 20

రాఘు:—ఆలక్ష్మణాగ్రజుండు = రాముఁడు, అంతన్, అబ్భూమిజ నారిన్ = పుడమికానుపుగు వయ్యగుసీతాదేవిని, కన్గొని = చూచి, మేలుసేరన్ మాటలాడుటింకెప్పుడో = అనురాగముతోఁ బల్కరించుటయెన్నఁడు గల్గునో, అంచున్ = అనివిచారించుచు, ఒప్పన్ = చక్కఁగా, ఉన్నచట్టు = ఉన్న తావునను, అవల = అవతల, వేవే = శీఘ్రముగ, వెదకియుం = కనుఁగొని, పత్రి = (పక్షియగు) జటాయువు, కదనభూమిన్ = యుద్ధరంగమున, పడియుండన్ = నేలఁబడియుండఁగ, చేరి = సమీపించి, అట్లు = ఆరీతిని దానుగ్రిందఁబడునట్లు, అతఁడు = రావణుఁడు, చేయుంట = వధించుట (సీతను గొనిపోవుట), విని = ఆపక్షిరాజువలననే విని, ధృతధృతియై = ధైర్యమవలంబించి, తన్ముఖోక్తులన్ = ఆజటాయువునోట వెలువడిన మాటలనుబట్టి, దారిఁబట్టి = లంకామార్గము తెలిసి కొని, ఇఁకన్ = ఇంక, తనకు, క్షేత్రంబబ్బునను చున్ = సీతలభించునని, శ్రమ ముగదుర = ఆయాసముదోఁప, ఇటునటు చని = అక్కడక్కడఁదిరిగి, చింతన్ = విచారమువలన, కలఁగి = కలఁతపడి, అంతన్, ఒప్పమీఱన్, కబంధు ముఖ్యోపదేశము = కబంధునియొక్క ముఖ్యమైన యుపదేశము (సుగ్రీవునితో సఖ్యము చేసిన సీతలభించునని యుపదేశించెననుట), ఒంది = పొంది, ఆశబర్యాప్తము = ఆశబరయను చెంచువనితచేఁబొందఁబడినది, అయియున్న యాశ్రమమును, పంపన్ = పంపాసరోవరమును, ఒకసన్మార్గమునను = ఒక్క మంచిదారిని, కాంచెన్ = చూచెను.

తా. అయ్యో సీత యేమైనదో యని తొందరపడి యక్కడక్కడ వెదకి జటాయువును గనుంగొని వానివలన సీతను రావణుఁ డెత్తుకొనిపోయి నట్లు విని కబంధుని యుపదేశప్రకారముగాఁ జని శబరియాశ్రమమును పంపాసరోవరమును జూచిరి.

లక్ష్మ.—ఆలక్ష్మణాగ్రజన్ముఁడు = లక్ష్మణకవి, అంతన్ = అంతట, అబ్భూమిజనారిన్ = భూమిలోఁగల ప్రజలకందఱకును వైరియైన ధర్మారావును, కన్గొని = చూచి, మేలు = శుభము, చేరన్ = చేరునట్లు, మాటలు, ఆడుట = ఇంకన్, ఎప్పు డో కో = ఎప్పుడుకల్గునో, అంచున్, మున్నున్నచట్టున్ =

మునుపున్న దానపత్రమును, వలనొప్పన్ = బాగుఁగా, వే=శీఘ్రముగ, పెద్ద
పత్రికన్ = ఆదానపత్రమునందు, తనభూమి = లంక, పడియుండన్,
వ్రాయఁబడియుండఁగా, అతఁడు = దమ్మన్న, చేరి, అట్లు నేయుట = అట్లు
గాఁ జేయుట, విని, ధృతధృతి = ధైర్యముగలవాఁడు, అయి, (తనకుఁ బట్టా
యిచ్చినారు కనుక భూమి తనకుఁ దక్కుననుధైర్యమూఁది) తన్ముఖోక్త
దారిన్ = ఆదమ్మన్న పలికినపలుకులను, పట్టి = అనుసరించి, అపుడు, ఇంకన్,
క్షేత్రంబు = లంకమాన్యము, అబ్బుననుచున్ = లభించునని, శ్రమము
ఆయాసము, కదురన్ = కలుగఁగా, ఇటునటుచని = అటునిటు నడయాడి,
చింతన్ = ఆలోచనచేత, కలఁగి = కలఁతపడి, అంత, ఒప్పమీఱఁగన్, బంధు
ముఖ్యోపదేశము = చుట్టములమంచియాలోచనము, ఒంది=పొంది, ఆశ
ఆస, పర్యాప్తమై=చాలినదియై, ఉన్నన్, ఆశ్రమమును=ఆయాయాసమును
ఒకసన్మార్గమునన్ = ఒకమంచిమార్గమున, పంపఁగాంచెన్ = పంపుటకు
జూచెను.

తా. అయ్యో! మాన్యము పోయెనే యెట్లోగదా యని వగచి తనకు ప్రభువు వ్రాసియిచ్చినపట్టాను దీసి చక్కఁగఁ జదివి భూమి తనకు మర వచ్చునను ధైర్యముతో, బంధువులందఱును, నీవుపోయి యడిగితివా దమ్మన యిచ్చివేయు నని హితము చెప్పఁగా మొదట సామమార్గముననే చూతమని యట్లు చేయ నెంచెను.

వ. తదనంతరంబ. 21

తరల. చెలువుమీఱఁగ మిత్రసంతతిచేతఁ బ్రేరితుఁ డౌచు ను
జ్జ్వలతరాత్మముతోడఁ దద్వరమంత్రి కేసరిపుత్త్రుఁ డి
మ్ముల భజించెను గోపబాలకమూర్తిదారి హరి న్నుతో
జ్జ్వలగుణున్ శుభలక్షణాంచితు శాంతు రామమహావిభున్.

రాఘు.—చెలువుమీఱఁగన్ = బాగుగాననుట, మిత్రసంతతిచేతన్ = సూర్యతనయుఁడగుసుగ్రీవునిచేత, ప్రేరితుఁడు = ప్రేరేపింపఁబడినవాఁడు, ఔ

చుఁడ్ = అగుచు, ఉజ్జ్వలతరాత్మముతోడన్ = ప్రకాశమానమైనహృదయముతో, కేసరిపుత్త్రుఁడు = కేసరియనుపేరుగలవానికొడుకు, తద్వరమంత్రి = ఆ సుగ్రీవునిశ్రేష్ఠమంత్రి (హనుమంతుఁడు), గోపబాలకమూర్తిధారిన్ = రాజపుత్త్రవేషమును ధరియించిన, హరిన్ = విష్ణువును, సుతోజ్జ్వలగుణున్ = స్తుతింపఁబడినసద్గుణములగలవానిని, శుభలక్ష్మణాంచితున్ = శుభకరుఁడైన లక్ష్మణునితోఁ గూడినవానిని, శాంతున్ = శాంతస్వభావముగలవానిని, రామమహావిభున్ = రాముఁడనుదొడ్డరాజును, ఇమ్ములన్ = లెస్సగా, భజించెను = సేవించెను.

తా. సుగ్రీవుఁడు పంపఁగా హనుమంతుఁడు లక్ష్మణస్వామితోఁ గూడి వచ్చిన విష్ణుమూర్తియొక్కనరావతార మైన శ్రీరాముని యొద్దికి వచ్చెను.

లక్ష్మ.—చెలువు = స్నేహము, మీఱఁగన్ = ఎక్కుడగునట్లు, మిత్త్రసంతతిచేతన్ = స్నేహబృందమువలన, ప్రేరితుఁడౌచున్ = పురికొల్పఁబడినవాఁడై, ఉజ్జ్వలతరాత్మముతోడన్, తద్వరమంత్రి కేసరిపుత్త్రుఁడు - తత్ = ఆగోపాలుఁడను, మంత్రి కేసరి = అమాత్యశ్రేష్ఠుని, పుత్త్రుఁడు = లక్ష్మణకవి, ఇమ్ములన్ = రహస్యముగా, గోపబాలకమూర్తిధారిన్ = గోపాలబాలవేషమును, ధారిన్ = దాల్చినవానిని, హరిన్, సుతోజ్జ్వలగుణున్, శాంతున్, శుభలక్ష్మణాంచితున్ = శుభచిహ్నములు గలవానిని, రామమహావిభున్ - రామ = మనోహరమైన, మహా = విస్తారమైన, విభున్ = కాంతిగలవానిని, భజించెను = ప్రార్థించెను.

తా. లక్ష్మణకవి, అన్నిటికిని గోపాలస్వామియే యున్నాఁడని యాతనిని ధ్యానించె ననుట.

వ. అవ్విధంబున గోపాలబాలుం డగునమ్మహామూర్తి నాశ్రయించి తద్దివ్యనామధేయగుణవ్యాపారంబులు సుమిత్రసంతతిచేత వినినవాఁ డగుటం జేసి యచ్చెరువందుచు సురుచిరవిభవుం డగుహరికి శ్రీరామావనిపతికి నత్యంతహితత్వంబు నెఱప మద్భృత్యంబు ప్రకటం బగునట్లు చేసెదం గాక యను

చుఁ దత్కార్యంబునకుం దగినసంభాషణంబులు పలుకుచు
న్నంత నాలక్ష్మణాగ్రజున కమ్మరుద్వరప్రేరణంబు సేసి నిజ
మాన్యక్షేత్రంబునందలి తలంపు గాఢం బైనఁ దద్వియో
గంబు సహింపక. 23

రాఘ.—అవ్విధంబునన్ = అట్లు, గోపాలబాలుం డగునమ్మహామూర్తిన్ = రాజకుమారరూపముధరించిన యావిరాట్స్వరూపమును (రాముని) ఆశ్రయించి = కొలిచి, తద్దివ్యనామధేయగుణంబులు = ఆరాముని పేరును చేసినఘనకార్యములును, సుమిత్రాసంతతిచేతన్ = లక్ష్మణునిచేత, వినినవాఁడగుటం జేసి = వినియుండినకారణమున, అచ్చెరువందుచు = వింతపడుచు, సురుచిరవిభవుఁడు-సురుచి = మంచికాంతిగల, రవి = సూర్యునివలన, భవుఁడు = పుట్టినవాఁడు, అగువానికిన్ = అయినవానరుఁడగు సుగ్రీవునకు, శ్రీరామావనిపతికిన్ = శ్రీరామరాజునకును, అత్యంతహితత్వంబు = మిక్కిలియగుచెలిమి, సలుపన్ = కావింప, మద్భృత్యంబు = నాపనివానితనము, ప్రకటంబగునట్లు = ప్రసిద్ధమగురీతిని, చేసెదంగాక = ఒనర్పవలయును, అనుచున్, తత్కార్యంబునకున్ = వారిద్దఱికిఁ జెలిమిసమకూర్చుటకు, తగినసంభాషణములు = ఉచితవాక్యములను, పలుకుచున్నంతన్ = ఆడుచుండఁగా, ఆలక్ష్మణాగ్రజునకున్ = రామునకు, మరుద్వర = (చల్ల) గాలియొక్క, ప్రేరణంబునన్ జేసి = వీచుటచేత, నిజమాన్యక్షేత్రంబునందలి = పూజ్యయగుస్వభార్యయందలి, తలంపు = కోరిక, గాఢంబైనన్ = ఎక్కుడు కాఁగా, తద్వియోగంబు = ఆవిరహమును, సహింపక.

తా. హనుమంతుఁడు వారియొద్దకేగి లక్ష్మణస్వామి చెప్పఁగా రాముని వృత్తాంతమువిని సుగ్రీవునితో రామునకు సఖ్యము చేయవలయునని యత్నించుచుండఁగా రామునకు మలయవాయుప్రేరణమున సీతావిరహదుఃఖము భరింప శక్యముగాని దయ్యెను.

లక్ష్మ.—అవ్విధంబునన్ = పైఁజెప్పినట్లు, గోపాలబాలకుండు = గోపబాలవేషధారి, అగునమ్మహామూర్తిన్ = అయినయాగోపాలస్వామిని, ఆశ్ర

యించి, తత్ = ఆదేవుని, నామధేయము = పేరులను (సహస్రనామములను), గుణ = దయాదాక్షిణ్యములు, దుష్టనిగ్రహపాపనాశనాదులు, సుమిత్రసంతతి చేతన్ = స్నేహితులవలన, వినినవాఁడగుటంజేసి, అచ్చెరువంది, సురుచిరవిభవుండు = ప్రకటమైనయనేకవిభవములు కలవాఁడును, శ్రీరామావనిపతికిన్ = శ్రీ = లక్ష్మీవనితకును, అవని = భూమికిని, పతికిన్ = భర్తయగు, హరికిన్ = విష్ణునకు, అత్యంతహితత్వంబుతోడఁ బరన్ = మిక్కిలి ప్రియుఁడగుటకై, మద్భృత్యత్వంబు = నాదాస్యము, ప్రకటంబగునట్లు చేసెదంగాక, అనుచున్, తత్కార్యంబునకున్ = అట్లు చేయుటకు, తగినసంభాషణంబులు = అనుకూల వాక్యములు, పలుకుచున్నంతకున్ = మాటలాడుచుండఁగా, లక్ష్మణాగ్రజునకున్ = లక్ష్మణునన్నకు, అమరుద్వహప్రేరణంబునం జేసి = ఆగోపాలదేవుని ప్రేరేపణ వలన (మరుత్ + వహ = దేవతాశ్రేష్ఠుఁడు), నిజమాన్యక్షేత్రంబునందలి = తన మాన్యపుఁ బొలమునైఁగల, తలంపు = అభిలాషము, గాఢంబైనన్ = ఎక్కుడు కాఁగా, తద్వియోగంబున్ = ఆచేను తననుండి తొలఁగిపోవుటకు, సహింపక = ధరింపలేక.

తా. విష్ణుమహిమ మిత్రులుచెప్పఁగా విని యాదేవుని సేవింపెద నని తత్కార్యంబు చేయుచుండ మాన్య మన్యాక్రాంత మైనవిచారము మనస్సున వృద్ధి పొందెను.

మ. భాసురవాసనాన్వితము భవ్య ముదారము నౌచు నీద పం
పాసరసీజజాతముఖమైత్రి జగంబును జల్లగా దళం [ముం
బౌసుఖ మందఁ జేయుచును హా నను క్షేత్రము వాయఁ దాప
జేసి యలంచు నం చనియు శ్రీయజసంతతి గోపరత్నమున్.

రాఘు.— భాసురవాసనాన్వితము = సుగంధయుక్తమును, భవ్యము = శ్రేష్ఠము, ఉదారము = మహత్తరమునైనది, ఔచున్ = అగుచు, ఈద = చల్లనిగాలి, పంపాసరసీజజాత = పంపాసరస్సులోని పద్మములసముదాయము యొక్క, ముఖ = అగ్రమునందలి, మైత్రిన్ = కూడికవలన, జగంబును = తక్కినజీవకోటిని, చల్లఁగా, దళంబౌ = సాంద్రమైన, సుఖమున్ = సౌఖ్యమును, అందఁజేయుచున్ = పొందునట్లొనర్చుచు, ననున్ = నన్నుమాత్రము,

హా = అయ్యో, క్షేత్రమువాయన్ = భార్యనుబోఁగొట్టుకొన్నకతనన్, తాప ముం జేసి = తాపముకలిగినందున, అలంచున్ = బాధించుచున్నది, అంచున్, గోపరత్నము = రాజశ్రేష్ఠుఁడు, శ్రీయజసంతతి = అజవంశమునఁబుట్టిన శ్రీ రాములు, అనియెన్ = పలికెను.

తా. సుగంధముగల యీచల్లగాలి యెల్లజగంబును సుఖపెట్టునదియైనను సీతావియోగమున నున్ననన్ను బాధించుచున్న దని రాముఁడు తలంచెను.

లక్ష్మ.—నీద=నీదియే, ఘైన, పంపు = ఆజ్ఞ, భాసుర = ప్రకాశించుచున్న, వాసనాన్వితము = పూర్వజన్మవాసనాయుతమును, భవ్యము = శుభప్రదమును, ఉదారము = గొప్పదియు, ఔచున్, ఆసరసిజజాతముఖమై = బ్రహ్మదేవుఁడుమొదలుకొని, త్రిజగంబును = మూఁడులోకములను, చల్లగాన్, హాయిగా, దళంబౌసుఖమున్ = ఎక్కుడగుసుఖమును, అందఁజేయుచును, హా, ననున్ = నన్ను, క్షేత్రమువాయన్ = భూమిపోఁగా, తాపముంజేసి యలంచుచున్ = దుఃఖమున శ్రమపెట్టుచున్నది, అంచున్=ఇట్లుపలుకుచు, గోపరత్నమున్ = గోపాలమంత్రికిరత్నము వంటివాఁడును, అజసంతతి = బ్రహ్మవంశస్థుఁడునగు లక్ష్మణకవి, అనియెన్.

తా. ఓస్వామీ నీదయ యెల్లలోకమును పిపీలికాదిబ్రహ్మపర్యంతమును సుఖపెట్టునదియె కాని, మాన్యమును బోఁగొట్టుకొని తపించునన్ను బాధించుచున్నది యని లక్ష్మణకవి గోపాలదేవప్రార్థనము చేయుచు ననియెను.

వ. అట్లు పలుకుచు 25

క. పొందమరఁగ ససుమిత్రా
నందనవాతతనయుం డనఘుఁడు నగుచుఁ బెం
పొందెడు నయ్యజవంశ్యుఁ డ
మందత నిజకార్యసిద్ధి మదిని దలఁచుచున్. 26

రాఘ.—పొందమరఁగన్ = సుగ్రీవునితో సఖ్యమైనపిమ్మట, ససుమిత్రానందనవాతతనయుండు = లక్ష్మణుఁడు హనుమంతులతోఁగూడినవాఁడు, అనఘుఁడు = పాపరహితుఁడు, అగుచున్, పెంపొందెడు = అతిశయించెడు, అయ్యజవంశ్యుఁడు = అజునివంశమందగు రాముఁడు, అమందతన్ = శీఘ్రముగ, నిజకార్యసిద్ధిన్ = తనయొక్కపని సిద్ధియగుటను, మదిని = ఆత్మలో, తలఁచుచున్ = యోచించుచు.

తా. సుగ్రీవునితో స్నేహము కలిగినపిమ్మట రాముఁడు సీతను మరలఁ బొందుటకై శీఘ్రప్రయత్నము చేయ యోచించెను.

లక్ష్మ.—పొందమరఁగన్ = స్నేహమొప్ప, సు+మిత్ర+ఆనంద-సు = యోగ్యులగు, మిత్ర = మిత్రులను, ఆనంద = సంతోషపఱచునట్టి, నవ+ఆతత+నయుండు-నవ = క్రొత్తదియగు, ఆతత = విశేషమగు, నయుండు = నీతిమార్గము గలవాఁడు, అనఘుఁడు, అగుచున్, పెంపొందెడు, అయ్యజవంశ్యుఁడు = బ్రాహ్మణుఁడు, (లక్ష్మణకవి) అమందతన్ = వేగముగ, నిజకార్యసిద్ధిన్ = భూమిని మరలఁబొందుటను, మదిని, తలఁచుచున్ = తలంచుకొనుచు.

తా. లక్ష్మణకవి తనమాన్యము తనకు శీఘ్రకాలములో వచ్చు నుపాయము నాలోచించుచుండెను.

సీ. నియతి దప్పక వేడ్క నెరయంగ వనచారి
　　వరమంత్రి గురుమంత్రసరణి నొంది
తనక్షేత్ర మపహరించినవాని గెలిచి క్షే
　　త్రము వెండియుఁ గొనఁ జిత్తమునఁ దలఁచి
యింపుమీఱ మది లోహితవసుదేవజ
　　నిజధ్యానగతిఁ బూని నెమ్మి నెంత
నలమిత్రసంతతి కలసి మన్ననసేసి
　　సముచితసద్గోష్ఠి జరుపఁ దొడఁగె

గీ. దాన వాలి యాదిత్యసంతతిని మున్ను
స్వప్రియాభోగ రాజ్యలక్ష్మీప్రముఖవి
ముఖత నొందించుటఁ దలంచి భూరికరుణ
హృదయుఁ డగుచు శ్రీరామావనీశ్వరుండు. 27

రాఘు.— నియతిన్ = వనవాసనియమమును, తప్పక = విడువక, వేడ్కన్ = సంతసము, నెరయంగన్ = వృద్ధినొందునట్లు, వనచారి=వనచరులైన కోఁతులందు, వర = అగ్రగణ్యుఁడగు, సుగ్రీవుని, మంత్రి = శ్రేష్ఠుఁడయగు హనుమంతుని, గురు = గొప్పదియగు, మంత్రసరణిన్ = ఆలోచనను, ఒంది= పొంది, తనక్షేత్రమున్ =తనభార్యను, అపహరించినవానిన్ =ఎత్తుకొనిపోయిన రాక్షసుని, గెలిచి = ఓడించి, క్షేత్రమున్ = పత్నిని, వెండియును = మరల, కొనఁగన్ = తీసికొనివచ్చుటకు, చిత్తమునఁదలఁచి = ఎంచి, ఇంపుమీఱన్, మదిన్, లోహిత = ఎఱ్ఱని, వసు = కిరణములుగల, దేవ=దేవుఁడగుసూర్యుని వలన, జ=పుట్టిన సుగ్రీవుని, ధ్యానగతిన్ =ధ్యానమార్గమున, పూని, నెమ్మిన్= మైత్రితో, అంతన్, అలసుమిత్రసంతతిన్ = ఆసూర్యసుతుని, కలసి=చేరి, మన్ననసేసి = మన్నించి, సముచితసంభాషన్ = ఉచితసంభాషణము, జరుపఁ బోడఁగెన్ = చేయసాగెను. తాన = తానే, మున్ను = మునుపు, వాలి = వాలియనువానరుఁడు, ఆదిత్యసంతతిన్ = సుగ్రీవుని, స్వప్రియా = వాని ప్రియురాలిని, భోగ=ఐశ్వర్యమును, రాజ్యలక్ష్మి=రాజ్యసంపదను, ప్రముఖ= మొదలగువానిని, విముఖతనొందించుటన్ = లేకుండఁజేయుటను, తలఁచి = ఎంచెంచి, శ్రీరామావనీశ్వరుండు = శ్రీరామరాజు, భూరికరుణహృదయుఁ డగుచున్ = జాలింబొంది.

తా. హనుమంతునివాక్యములపై సుగ్రీవునిసహాయమున సీత నపహరించి రావణుం గొట్టి సీతను మరలఁ దేఁదలఁచి సుగ్రీవునితోఁ బ్రసంగించుచు వాలి సుగ్రీవున కొనర్చిన యపకారముం దెలిసికొని జాలిచే.

లక్ష్మ.—నియతి దప్పక=తాను జేయుచున్న కరణీకము విడువకయే, వేడుక నెరయన్ = సంతోషము మీఱునట్లు, కపనచార= కవనము చెప్పుటలో

మెలఁగుకవులలో, వర=మిన్నయగు, మంత్రి=లక్ష్మణకవి, గురు=గురువుచెప్పిన, మంత్రసరణినొంది = ఆలోచనననుసరించి, తనక్షేత్రము= తనభూమిని, అపహరించినవానిన్ = ధర్మారావును, గెల్చి = జయించి, క్షేత్రమున్, కొనన్, చిత్తమునఁదలఁచి = భూమినిమరలఁ బుచ్చుకొనవలయు నని యెంచి, ఇంపు మీఱన్, మదిలో= తలంపులో, వసుదేవజని= వాసుదేవునియొక్క (గోపాలస్వామియొక్క), ధ్యానగతిన్ = ధ్యానమార్గమును, పూని = గ్రహించి, నెమ్మిన్, అంతన్, అలమిత్రసంతతిన్ = తనస్నేహితులందఱను, కలసి = కూడి, మన్ననసేసి, సముచితసద్గోష్ఠిన్ = ఇష్టాలాపములను, జరుపన్ = నడపుటకు, తొడఁగెన్ = ప్రారంభించెను, దానవాళి = రాక్షససమూహము, మున్ను = పూర్వము, ఆదిత్యసంతతిన్ = దేవతలను, స్వశ్రీయాభోగరాజ్యలక్ష్మీప్రముఖవిముఖతన్ ఒందించుట = భాగ్యలను భోగముల నధికారములను దొలఁగించివైచుటన్న, తలఁచి= ఊహించి, శ్రీరామావనీశ్వరుండు = విష్ణువు, భూరికరుణాహృదయుండు = మిగులదయగలవాఁడు, అగుచున్.

తా. తనకరణీకమును జేయుచునే కవిత్వవిశారదుం డైనలక్ష్మణకవి దమ్మన యపహరించిన మాన్యమును మరలఁ గొనవలయునని విష్ణుధ్యానము చేయుచుండెను. దేవతలనందఱను రాక్షసులు కకావికలు చేసినపుడు విష్ణుమూర్తి దయగలవాఁడై.

సీ. అహరిశత్రుసంహారంబు గావించి
యాదిత్యసంతతి కపుడు మగుడ
రాజ్యభోగాదిసర్వవిభూతుల నొసంగె
ద నని రూఢవరోక్తి దనర వాలి
మహానీయసాధ్వసమరణసంధానక
దుందుభిదారకతం దనర్చె
నమితఖలోగ్రమాయావిరాత్రించర
ప్రాణనాశము చేసి ఖ్యాతి వడసె

గీ. నతని తేజఃప్రతాపశౌర్యజవకీర్తి
బలమతిస్థితి ముఖ్యముల్ ప్రస్తుతింప
నలవియే లక్ష్మణాగ్రజ యనుచు నట్లు
మిత్రసంతతి వల్కఁ నర్మిలి నతండు. 28

రాఘ.—ఆహారిశత్రుసంహారంబుగావించి = ఆసుగ్రీవుని శత్రువును వధించి, ఆదిత్యసంతతికిన్ = సుగ్రీవునకు, అపుడు=ఆసమయమున, మగుడన్ = మరల, రాజ్యభోగాదిసర్వవిభూతులన్ = పోయినరాజ్యము మొదలైన యైశ్వర్యములను, ఒసఁగెదనని = ఇచ్చెదనని, రూఢవరోక్తినదరన్ = అగ్నిసాక్షిగాఁ బ్రమాణముచేసి, వాలి, మహనీయ = పెద్దదియగు, సాధు = యోగ్యమైన, అసమ = సాటిలేని, రణ=యుద్ధమును, సంధానక = కూరుచునట్టి, దుందుభి= దుందుభియను రాక్షసుని, దారకతన్ = ఖండించుటను, తనర్చెన్ = ఒప్పెను, అమితఖలోగ్రమాయావి-అమిత = విస్తారమైన, ఖల = దుర్మార్గుఁడైన, ఉగ్రమాయావి = పెద్దమాయకాఁడు, (అగు) రాత్రించరప్రాణనాశముచేసి = రాక్షసునిజంపి, ఖ్యాతివడసెన్ = ప్రఖ్యాతిని సంపాదించెను, లక్ష్మణాగ్రజ = శ్రీరామా, అతని = మాయన్నయైన వాలియొక్క, తేజఃప్రతాప...ముఖ్యముల్ = శౌర్యవీర్యబలగుణబుద్ధివిశేషములను, ప్రస్తుతింపన్ = పొగడుటకు, అలవియె = శక్యమా, అనుచు= ఇట్లని, మిత్రసంతతి=సుగ్రీవుఁడు, పల్కన్ = చెప్పఁగా, అర్మిలిన్ = ప్రేమతో, అతండు = శ్రీరాముఁడు.

తా. రాముఁడు సుగ్రీవునితో "వాలింజంపి నీకు రాజ్యము మొదలైన యైశ్వర్యముల నిచ్చెద" నని ప్రమాణము చేసెను. దుందుభికాయమును మీటెను. ఆవాలి బలపరాక్రమాదుల నెంచ శక్యముగా దని సుగ్రీవుఁడు రామునితోఁ జెప్పెను. రామునకుఁ బ్రేమగలిగెను.

లక్ష్మ.—ఆహారి = విష్ణుదేవుఁడు, శత్రునాశనము గావించి, రాక్షసులనుజంపి, ఆదిత్యసంతతికిన్ = దేవతలకు, అపుడు, మగుడన్, రాజ్యభోగాది సర్వవిభూతుల, నొసంగెదనని, రూఢవరోక్తిన్ = నిశ్చయమైనవరము

నిచ్చుటచే, తనరన్, వాలి = ప్రవేశించి, మహనీయ = పెద్ద, సాధ్వస= భీతిని, మరణ = చావును, సంధ = కూర్చునట్టి, ఆనకదుందుభి = వసుదేవునికి, తారకతన్ = కుమారుఁడగు గోపబాలుఁడగుటను, తనర్చున్ = ఒనరించెను. అమిత = మిక్కుటమగు, ఖల = దుష్టులను, మాయావి = మోసగాండ్రను, (అయిన) రాత్రించర = రాక్షసుల, ప్రాణనాశముచేసి = వధయొనర్చి, ఖ్యాతివడసెన్ = ప్రసిద్ధుఁడయ్యెను. లక్ష్మణాగ్రణి=లక్ష్మణకవీ! ఆతనితేజఃప్రతాప...ముఖ్యముల్ = బలపరాక్రమాదులు, ప్రస్తుతింపనలవియె = పొగడఁదరమా, అనుచున్ = అట్లు, మిత్రసంతతి=స్నేహబృందము, పల్కన్ = చెప్పఁగా, అర్మిలిన్ = మక్కువచేత, అతఁడు = లక్ష్మణకవి.

తా. లక్ష్మణకవితో నతనిస్నేహితులు, "దేవతలకు విరోధు లగురాక్షసులను జంపి దేవతలను రక్షించుకొఱకు వసుదేవునకుఁ గృష్ణుఁడనునామమునఁ జనించిన గోపాలదేవుని పొగడుట శక్యమా?" యని చెప్పిరి. అతఁడు ప్రీతుఁడయ్యెను.

క. అతని మనస్స్థితసంశయ
   స్మృతి తనుభావం బెలర్పఁ జేయుచు లరుమా
   పతి మెచ్చఁగఁ దత్ప్రత్యయ
   మతివిశదమ్ముగ నెఱప సమాహితుఁ డగుచున్. 29

రాఘ.—అతని=సుగ్రీవుని, మనస్స్థిత=మనస్సులోనున్న, సంశయ = సందేహము, స్మృతి = జాఱిపోవుట, తనుభావం బెలర్పన్ = సన్నగిలునట్లు, చేయుచున్, అల+రుమాపతి = ఆరుమయనుదాని పెనిమిటి (సుగ్రీవుఁడు), మెచ్చఁగన్ = మెచ్చునట్టులు, తత్ప్రత్యయము = ఆతనినమ్మకము, అతివిశదమ్ముగన్ = మిగులస్పష్టముగ నుండునటుల, నెఱపన్ = ప్రసరింపఁజేయుటకు, సమాహితుఁ డగుచున్ = అంగీకరించినవాఁడై.

తా. రాజపుత్రుఁడైనయీరాముఁడు వాలియంతవాని నెట్లుజయించునా యనిసందేహించు సుగ్రీవునకు నమ్మకము కలుగునట్లుగ నాతఁడు చెప్పినపనిఁ జేయుటకు రాముఁడు సంసిద్ధుఁ డయ్యెను.

లక్ష్మ.—ఆతనిమనస్స్థిత సంశయస్ఫృతి = లక్ష్మణకవియొక్క సందేహము, తనుభావం బెలర్పఁ జేయుచున్ = స్వల్పమగునట్లు ప్రకటనచేయుచు, అలరు + మాపతి = ఒప్పునట్టి లక్ష్మీపతి (విష్ణువు), మెచ్చఁగన్ = మెచ్చునట్లు, తత్ప్రత్యయము = అజ్ఞానము, అతివిశదమ్ముగన్ = ఎక్కుడు నిర్మలముగా, నెరపన్ = ప్రకటనచేయుంటకు, సమాహితుఁడు = సమాధానముగలవాఁడు, అగుచున్.

తా. విష్ణుదేవుఁ డింతమహాత్తరుఁడా యనుసంశయములేక లక్ష్మణకవి మెచ్చునట్లుగా నతనికి గోపాలస్వామి జ్ఞానాభివృద్ధిని గలిగించుటకై సమాహితుఁ డయ్యెను.

క. వాలిహారి మున్నమర హిత
లీలలు వర్తిల్లఁ గడుబలిమిఁ గూల్చినది
వ్యాళిరిపుని కాయము మురి
వీలఁగఁ బడియె న్నగంబువిధమునఁ దనరన్. 30

రాఘ.—వాలిహారి = వాలియనువానరము, మున్ను = ముందు, అమరఁగన్ = ఒప్పునట్లు, హితలీలలు = ఇష్టము లగుక్రియలు, వర్తిల్లన్ = జరుపఁగా, కడుబలిమిన్ = మిక్కిలిబలముతో, కూల్చిన = కొట్టిన, దివ్యాళిరిపుని - దివ్యాళి = దేవతాసమూహమునకు, రిపుని = విరోధియగు దుందుభియొక్క, కాయము = కళేబరము, మురివీలఁగన్ = గర్వము చితికిపోవునట్లు, నగంబువిధమునన్ = పర్వతమువలె, పడియెన్ = కూలెను.

తా. వాలి సుగ్రీవునితో నిష్టముగానున్న దినములలో దుందుభి యను రక్కసుని జంపిన నతని దేహము పర్వతసమానమై నేలఁ గూలెను.

లక్ష్మ.—వాలి - ప్రవేశించి, హారి=విష్ణువు, మున్ను = పూర్వకాలమున, అమరహితలీలలు = దేవతలకిష్టమైన విలాసములు, వర్తిల్లన్ = నడుపఁగా, కడు బలిమిన్ = మిక్కుటమైన బలముచే, కూల్చినదివ్యాళిరిపుని కాయము- కూల్చిన= పడఁగొట్టిన, దివ్యాళిరిపు కాయము = దేవతలకుశత్రువులగు రాక్షససంఘము,

నగంబువిధంబునన్ = కొండవలె, తనరన్ = ప్రకాశింపఁగా, మురి = గర్వము, వీలఁగఁబడియెన్ = ముక్కలగునట్లు పడియెను.

తా. పూర్వము దేవతలకు హితము చేయుతలంపుతో బలిమిని రాక్షసులను సంహరించిన వారిదేహములు కొండవలె గుట్టపడియెను.

వ. అప్పు డాశ్రితవాంఛితార్థకృత ప్రయత్నుం డగు శ్రీ
రామావనీవిభుండు. 31

రాఘు.—అప్పుడు = తర్వాత, ఆశ్రిత = ఆశ్రయించిన, సుగ్రీవునియొక్క, వాంఛితార్థ = కోరఁబడిన దుందుభికళేబరమును గదల్పుటయందు, కృత = చేయఁబడిన, ప్రయత్నుండగున్ = యత్నముకలవాఁడై, శ్రీరామావనీవిభుండు = శ్రీరాములు.

తా. సుగ్రీవుఁడు, పర్వతమువలె నున్నదుందుభికళేబరమును గదలింపుమని రామునిం గోరిన నందు కతండు సమ్మతించి.

లక్ష్మి.—అప్పుడు, ఆశ్రితవాంఛితార్థకృత ప్రయత్నుండు = ఆశ్రితుల కోర్కెలను దీర్చుటకై సిద్ధుఁడైయున్న, శ్రీరామావనీవిభుండు = లక్ష్మీపతి.

తా. సులభము.

క. క్రందుకొన నుహిమ మానక
దుందుభికాయంబు ధరముతో సరియై డా
లొంద ధృతి జనించి విది
ర్చెం దూరంబుగన కాలిప్రేలన్ లీలన్. 32

రాఘు.—నుహిమ = మహత్త్వ, క్రందుకొనన్ = ప్రచురపడఁగా, మానక = విడువక, దుందుభికాయంబు = దుందుభిశరీరము, ధరముతో సరియై = పర్వతోపమానమై, డాలొందన్ = అతిశయింపఁగా, ధృతి = ధైర్యము, జనించి = ఉత్పన్నమై, లీలన్ = విలాసముచేతనే, కాలిప్రేలన్ = పాదాంగుష్ఠముతో, దూరంబుగన్ = దూరముగాఁబోయి పడునట్లు, విదర్చెన్ = మీటెను.

తా. ఆరాముఁడు దుందుభికాయమును కాలిబొటనవ్రేలితో దూరముగాఁ బోయి పడునట్లు మీటెను.

లక్ష్మి.—మహిమము = సామర్థ్యము, క్రందుకొనన్ = వ్యాపింపఁగా, ఆనకదుందుభికిన్ = వసుదేవునకు, ఆయంబుధరముతో = ఆనీలమేఘముతో, సరియై=పోలిన, డాలొందన్ = కాంతియతిశయింపఁగా, ధృతిన్, జనించి = పుట్టి, లీలన్=విలాసముచేత, వ్రేలన్=గొల్లలను, దూరంబు = మిక్కిలి, కన కాలిన్ = ధనరాశిచేత, విదిర్చెన్.

తా. వసుదేవునకు నీలమేఘశ్యాముఁడైన కుమారుఁడై జన్మించి,గోప కులలో గొప్పవాఁడై ప్రసిద్ధినొందెను.

వ. మఱియును.

క. ధృతి సతతాలంబుల చి
త్రతమపలాశులను జేగ దనరినవాజిన్
దితతం జెందఁగఁ జేసెన్
శ్రితహితకారికృతి మఱియుఁ జేయఁ దలఁచుచున్. 33

రాఘ.—ధృతిన్=ధైర్యముతో, చిత్రతమపలాశులను, చిత్రతమ = మిక్కిలి చిత్రములగు, పలాశులను = ఆకులుగలవానిని, సత=సప్త, తాలంబులన్=తాళవృక్షములను (ఏడు తాటిచెట్లను), చేగన్=బలిమిచే, తనరి=ఒప్పిన, వాజిన్=బాణముచేత, దితతన్ = ఖండింపఁబడుటను, చెందఁగన్ = చెందునట్లు, చేసెను. శ్రితహితకారికృతిన్ - శ్రిత = ఆశ్రయించిన సుగ్రీవునకు, హితకారి = హితముచేయు, కృతిన్=పనిని, మఱియున్, చేయఁ దలఁచుచున్ = ఒనర్పఁ గడఁగినవాఁడై.

తా. సప్తతాళముల నొక్కబాణమునఁ గూల్చెను. మఱియు సుగ్రీవునకు హితము చేయఁదలఁచి రాముఁడు. (అనఁగా వాలిని సంహరింపఁ బూనెనని యనుట.)

లక్ష్మీ.—ధృతిన్, సతతాలంబులన్-సతత=ఎడతెగని, ఆలంబులన్=యుద్ధములందు, (ఈసతతాలంబులను సమాసము విచార్యము) చిత్రతమపలాశులను = ఆశ్చర్యకరులగు రాక్షసులను, చేగదన్ = చేతనున్నగదతోను, అరిన = చక్రముతోను, వాజిన్ = బాణముచేతన్, "వాజీఖగశరాశ్వేషు" నిఘంటువు. దితతన్ = నఱుకఁబడుటను, చెందఁగన్, చేసెన్, శ్రితహితకారికృతిన్ = ఆశ్రయించినవారి కిష్టములైనపనులను, మఱియున్=ఇంకను, చేయఁదలఁచుచున్ = ఒనర్పఁబూనినవాఁడై.

తా. ఎడతెగనియుద్ధములందు రాక్షసులను సంహరించి యాశ్రితులను రక్షించుటకై యత్నించిన విష్ణుమూర్తి.

సీ. అని కలయ బహూక్తులను మిత్రసంతతి
హాళి సాగించిన యాదిబుద్ధి
శిష్టరక్షణదుష్టశిక్షణుఁ డతఁ డని
దృష్టికి నలరుహూప్రియుఁడు వాలి
యొకరీతిఁ దోఁప మైత్రికి దండ మును బెట్టి
రతిన యమ్ము ననుప రవిభ వాళి
నడిచి నాహతికిఁ దోడగు మటంచు నొనర్చు
నతనియానతికి నాహరియుఁ బొంగి
గీ. తనబల మతనివశముగఁ దనరఁ జేయఁ
దన్మహామంత్రి కేసరితనయుఁ డప్డు
డీశునమ్మిక యుంగరం బింపుగఁ గొని
ధర్మనామకుకడ కేగఁ దలఁచి వెడలె. 34

రాఘ.— అని=యుద్ధము, కలయన్=మొగియుటకు, హాళిన్=సంతోషముచే, మిత్రసంతతి=సుగ్రీవుఁడు, బహూక్తులను = పెక్కువాక్యములను, సాగించినను = మాటలాడఁగా (పలుకఁగా), ఆదిబుద్ధిన్ = మొదటిదైన సుగ్రీ

వుని రక్షించెడు తలంపుతో, శిష్టరక్షణదుష్టశిక్షణుండు = సన్మార్గులను రక్షించుటకును, దుర్మార్గులను శిక్షించుటకును బూనినవాఁడు, అతఁడు = ఆరాముఁడు, అనిన్ = యుద్ధమున, దృష్టికిన్ = తనచూపునకు, అలరుమాపతి = సుగ్రీవుఁడును, వాలియుం = వాలియును నతఁడును, ఒకరీతిన్ = ఒక్కమాదిరిగానె, తోఁపన్ = కనఁబడఁగా, మైత్రికిన్ = మిత్రునికొడుకు మైత్రి (మిత్రుఁడు = సూర్యుఁడు, వానికొడుకు) సుగ్రీవునికి, మును = ముందుగా, దండ = పూలదండను, పెట్టి = మెడలో వైచి, రతిన = వేడుకచేతను, అస్త్రమున్ = బాణమును, అనుపన్ = పంపఁగా విడువఁగా), రవిభవాలిన్ - రవిభ = సూర్యునివలెఁ గాంతిగల, వాలిన్ = వాలిని (ఒకపక్షమున, రవిభవ = సుగ్రీవునకు, (అలిన్ = అనుదానిని) రలలకభేదము చెప్పి, అనిన్ - అనికులిక విరోధియగు వాలిని), అడిచి = కొట్టి, సంహరించి, నాపతికిన్ = నాప్రభువైన సుగ్రీవునకు, తోడు = సాయము, అగుము = కమ్ము, ఒనర్చు = చేయునట్టి, అతనియానతికిన్ - అతని = ఆహనుమంతుని, ఆనతికిన్ = ఆనమస్కారమునకు, ఆహరి = సుగ్రీవుఁడు, పొంగి, తన బలము = తనసేనను, అతనివశముగన్ = ఆహనుమంతుని వశమందుండునట్లు, చేయన్ = చేయఁగా, తన్మహామంత్రి = సుగ్రీవుని పెద్దమంత్రియగు, కేసరిపుత్రుండు = ఆంజనేయుండు, అప్పుడు = ఆసమయమున, తనునమ్మికయుంగరంబు = తననాథుని నమ్మించెడు ఉంగరమును, కొని = శ్రీరాముఁడీయఁగాఁ బుచ్చుకొని, ధర్మనాయకదిశన్ - ధర్మనాయకు = ధర్ముఁడను పేరుగల యముని, దిశన్ = దిక్కునకు (దక్షిణమునకు), ఎగఁదలఁచి = పోనెంచి, వెడలెన్ = బైలుదేఱెను.

తా. రాముఁడు సుగ్రీవుని వాలితో యుద్ధమునకుఁ బంపెను గాని వారిద్దఱిలో సుగ్రీవుఁడెవ్వఁడో వాలియెవ్వఁడో తెలిసికొనలేక సుగ్రీవుని మెడలో నొకపువ్వులదండ వైచెను. పిమ్మట వాలిని బాణమేసి కూల్చెను. హనుమంతుఁడు సుగ్రీవునిరక్షింపు మని రాముని గోరెను. సుగ్రీవుఁడు తనసేనను హనుమంతునివెంట నిచ్చెను. రాముఁడు సీత కానవాలుఁజూపు మని హనుమంతుని కొకయుంగర మిచ్చెను. అతఁడు దక్షిణదిశకు బైలుదేఱెను.

లక్ష్మ.—అని (స్నేహితులు) చెప్పి, కలయన్ = కూడఁగా, మిత్రసంతతి=స్నేహబృందము, బహూక్తులను = అనేకవాక్యములను, హర్షన్ = సంతోషముతో, సాగింపఁగన్=నడుపఁగా, ఆదిబుద్ధిన్ = మొదటిబుద్ధిచే, శిష్టరక్షణ దుష్టశిక్షణుఁడు, అతఁడని = విష్ణుమూర్తియని, దృష్టికిన్ = జ్ఞాననేత్రమునకు, అలరు = ప్రకాశించునట్టి, సుప్రియుఁడు= లక్ష్మికి హితుఁడు, వాని = హృదయమున బ్రవేశించి, ఒకరీతిఁదోఁపన్ = ఒక్కరీతిగాఁ గోచరింపఁగా, మైత్రికిన్ = స్నేహమునకొఱకు, దండమును = నమస్కారమును, పెట్టిరి = చేసిరి. అతినయమ్మునను = మిగుల నీతిచేత, పరవిభవాళిన్ = శత్రువైభవములను, అడిచి = కొట్టి, నాపతికిన్ = నాప్రభువునకు, తోడగుము= తోడ్పడుము. అటంచున్ = అనుచు, ఒనర్చునతనియానతికిన్ = చేసినవానియా నమస్కారమునకు, ఆహరి = విష్ణుదేవుఁడు, పొంగి = ఉప్పొంగి, తన బలము=తన సామర్థ్యమును, అతనివశముగఁ జేయన్ = లక్ష్మణకవికీయఁగా, తన్మహామంత్రికేసరితనయుండు=ఆయమాత్యపుత్త్రుఁడు (లక్ష్మణకవి), అపుడు= అప్పుడు, ఈశునమ్మికయున్ = ఈశ్వరుని నమ్మకమును, కరంబింపుగఁగొని = మిగుల హితముగ నవలంబించి, ధర్మనామునకడకున్ = ధర్మరావునొద్దకు, వీగఁదలఁచి వెడలెన్ = వెళ్లుటకై యెంచి పయనమయ్యెను.

తా. స్నేహితులు చెప్పిన మాటలవలన విష్ణుభక్తుఁడని నమ్మి సంతసించి తన కాదేవుఁడిచ్చిన బుద్ధిచేత పునఃపునః ప్రణామములు చేయుచుండ విష్ణువు తనయొక్క శక్తి నాతనిహృదయమునఁ బ్రవేశపెట్టెను. ఆబలముచే లక్ష్మణకవి ధర్మన్నగారియొద్దికి బైలుదేఱెను.

క. సముదితసకలశ్రీజరుచికత
కమధితనిష్కల్మషోదకవిజృంభితశా
లిసునోజ్జక్షేత్రవిశా
లమగుశరత్కాల ముజ్జ్వలంబై తోఁచెన్. 35

ఈపద్యము శరదృతువర్ణనము.

టీ. సముదిత = ఉదయించిన, కలశజ = అగస్త్యుని, రుచి = కాంతి యనెడు, కతక = చిల్లగింజచే, మథిత = మర్దింపఁబడినదియై, నిష్కల్మష = స్వచ్ఛమైన, ఉదక = నీటియందు, విజృంభిత = వ్యాపించిన, శాలి = వరిచేలచే, మనోజ్ఞ = సుందరమగు, క్షేత్ర = మడులచే, విశాలమగు = విరివియైన, శరత్కాలము = శరదృతువు (వర్షర్తువు తర్వాతి ఋతువు), ఉజ్జ్వలంబై = ప్రకాశమానమై, తోఁచెన్ = కన్పట్టెను.

తా. వర్షకాలమునందు నీరంతయుఁ గలఁగియుండును. వర్షర్తువు దాఁటునప్పటి కగస్త్యోదయమగును. ఆయగస్త్యుని కాంతి యనెడు మట్టినీరు విఱుగఁదీయు చిల్లగింజచే (ఇందుగుగింజ) వరిచేలమళ్ళలోని నీరంతయుఁ దేఱిస్వచ్ఛమైయుండె ననుట. (రెండుపక్షముల సమానము.)

వ. అట్టియెడ.

గీ. బహులహరివాహినులు నమ్రభావమునను
హత్తె నప్పతి నుత్కలికాప్తి దేర
హంససంతతి ఘనమార్గ మంతఁ దెల్పె
నయగతుల్ జూప వానరాలి యటువోవ. 36

రాఘ.—బహుల = విస్తారములగు, హరివాహినులు = మర్కటసైన్యములు, నమ్రభావమునన్ = వినయముతో, ఉత్కలికాప్తి దేరన్ = సంతోషయుక్తముగ, అప్పతిన్ = ఆయధిపుఁడగు సుగ్రీవుని, హత్తెన్ = చేరెను. హంససంతతి = సుగ్రీవుఁడు (హంస+సూర్యుని, సంతతి = సంతానము), ఘనమార్గము = గొప్పమార్గమును, అంతన్ = అపుడు, తెల్పెనయ = తెలిపినాఁడయ్యా. (తెల్పెన్+అ+అ = తెల్పెనయ" అనిచెప్పుటకంటె, అయ-అయ్య యొక్కరూపముగా గ్రహించుటుచితము.) వానరాలి = కపిసేన, అటువోవన్ = ఆవైపునకుఁ బోవుటకు, గతుల్ = మార్గములు, చూపెన్ = కనఁబఱిచెను.

తా. ఈమార్గమున నిట్టిట్టు వెళ్లుఁడని కపిసేనకు సుగ్రీవుఁడు మార్గములు తెల్పెను.

లక్ష్య.—బహు=అధికమగు, లహరి = తరంగములుగల, వాహినులు= నదులు, నమ్రభావమునను=తగ్గినపగుటచేత, ఉత్కలికాప్తి= సంతోషప్రాప్తి, తేరన్ = అతిశయింపఁగా, అప్పతిన్ = సముద్రమును, హత్తెన్=కలసెను. వాన = వర్షము, రాలి=పడి, అటువోవన్ = అట్లుపోఁగా, హంససంతతి = హంసలగుంపు, ఘనమార్గము=ఆకాశము, అంత=అంతయును, తెల్పనయన్ = తెలుపెక్కునట్లు, గతుల్ = తమనడకలను, చూపెను=చూపించెను.

తా. పెద్దతరంగములు గల నదులన్నియుఁ మెల్లగ సముద్రములోఁ బడియెను. వానలు తగ్గఁగానె హంసలు వివిధగతులతో నాకాశమునందు నిండినవి.

సీ. అలమహానీలఘనానీక మడరెన
  నంతమందున నలరారె శ్వేత
తారర్క్ష పతిసుకరోరుద్యుతుల్ పృథు
  నలకుముదస్ఫుటవిలసనములు
పటుచక్రమేఘపుష్పగవ యస్వనములు
  సుముఖగజర్షభప్రమదలీల
లున్నతోహారశరభోన్మేష లుదధిము
  ఖార్కగవాక్షవిహారకృతులు
గీ. పనసనవ్యశోభారంభభవ్యగతులు
  ప్రబలె నాసత్యధర్మజరాజరాజ
తనుభవసుబాహువిజయయాత్రలు దనర్చె
  నాశరదోద్యగ మతివిస్మయంబు మెఱయ. 37

రాఘు—అల=ఆ, మహాత్= గొప్పవాఁడైన, నీల=నీలునిచేత, ఘన= మిక్కుటమైన, అనీకము = కపిసేన, అడరెన్=ఒప్పెను. అనంతమందున్= భూమియందు, శ్వేత, తార, ఋక్షపతి=జాంబవంతుఁడు, సుకర=సుకరుఁడు, వీరియొక్క, ఉరుద్యుతుల్ = విభవములు, అలరారెన్=ఒప్పెను, పృథు = గొప్పవారైన, నల = నలుని, కుముద=కుముదుని, స్ఫుటవికసనములు=ప్రకట

వికాసములు, పటు=విస్తారమైన, చక్ర, మేఘపుష్ప, గవయుల, స్వనములు=ధ్వనులును, సుముఖ-గజ-ఋషభుల-ప్రమదలీలలు = సంతోషయుక్తములైన విలాసములును, ఉన్మనోహార = మిగులఁ జక్కనివాఁడగు, శరభ = శరభుని యొక్క, ఉన్మేషలు = వికాసములును, దధిముఖ, అగ్గ=గవాక్షుల, విహారకృతులు = విహారములును (ఆటలనుట), పనస = పనసుఁడను వానరుని, నవ్యశోభ = నూతనశోభయు, రంభ=రంభుని, భవ్యగతులు = మంచినడకలు, ప్రబలెన్=వచ్చెను. నాసత్యజ=అశ్వినీదేవతలయంశమున జన్మించిన మైందద్వివిదుల, ధర్మజ = యమపుత్త్రుఁడైన వినతుని, రాజరాజతనుభవ= కుబేరపుత్త్రుఁడగు గంధమాదనునియు, సుబాహు-విజయులయు, యాత్రలు=పయనములు, తనర్చెన్ = ఒప్పెను, ఎపుడు ! ఆశరదాగమ = ఆశరత్కాలముయొక్క సంభవము, అతివిస్మయంబుమెఱయన్=అత్యద్భుతము నొందించుచుండఁగా.

తా. శరత్కాలము రాఁగానే నీల శ్వేత తార జాంబవ త్సుశర నల కుముద శక్ర మేఘపుష్ప గవయ గంధమాదన మైంద ద్వివిద పనస సుబాహులు మఱియుంగల కపిసేనలు బైలుదేఱెను.

లక్ష్మి.——అల, మహానీల = మిగులనల్లని, ఘనానీకము=మబ్బులగుంపు, అనంతమునందున్=ఆకాశమార్గమున, అడఁగెన్ = వ్యాపించెను. వృషా=గొప్పవియగు, నల=పద్మములు, కుముద=కలువలు, వీనియొక్క, స్ఫుటవికసనములు=ప్రకాశములు, పటు=ధృఢమైన, చక్ర = చక్రవాకములు, మేఘపుష్పగ=జలములలోనుండెడునట్టి (మేఘపుష్పము = నీరు, గ=దానింబొందియుండునవి), వయః=పక్షులయొక్క, స్వనములు=కూఁతలు "ఖగ బాల్యాదినోర్వయః" నిఘంటువు. సుముఖ=మంచిముఖములుగల, గజ=ఏనుఁగుల. ఋషభ=ఎద్దులయొక్క, ప్రమదలీలలు=సంతోషాతిశయములు, ఉన్మనోహార=అత్యంతసుందరమగు, శరభ=ఎనిమిదికాళ్లమృగముల, ఉన్మేషలు=వికాసలును, దధి= సరళాదిధూపములయొక్క (సూర్యునికిరణములయొక్క), గవాక్ష = కిటికీలలోనుండి,

విహారకృతులు = విహారచేష్టలును, పనస=పనసచెట్లు, నవ్యశోభ = క్రొత్తచెలువునకయిన, ఆరంభ = ప్రారంభముయొక్క, భవ్య = చక్కని, గతులు = రీతులు, ప్రబలెను = విజృంభించెను, సత్యధర్మ = సత్యధర్మములవలన, జ = పుట్టిన, రాజ సంపదలచే, జ = జయించునట్టి, రాజతనుభవ = రాజపుత్రుల, సుబాహు = భుజములచేత, విజయయాత్రలు = విజయప్రయాణములు, తనర్చెన్ = ఒప్పెను.

తా. వర్షములవలన సకలజంతువులకు నానందము గలిగెను. కలువలు తామరలు వికసించెను. చక్రవాకము జలపక్షులు చెలరేగెను, వృక్షాదులు గుబురుకొనియెను, రాజులు యుద్ధయాత్రలకు వెడలిరి.

వ. అట్లు వెడలి. 38

క. అంగదహరిముఖ్యబలము
ముంగలయై నడువ నవ్విభునిప్రేరణ ను
ప్పొంగుచుఁ జనిరాయు నతఁడు ధృతి
సంగతి నల్లన రసాత్మసంతతిఁ జూడన్. 39

రాఘ.—అంగద = అంగదుఁడను, హరి = వానరుఁడు (అంగదుఁడు వాలికొడుకు), ముఖ్య = నాయకుఁడుగాఁగల, బలము = సేన, ముంగలయైనడువన్ = ముందునడచుచుండఁగా, అవ్విభునిప్రేరణన్ = ఆ సేనాపతి ప్రోత్సాహముచే, ఉప్పొంగుచున్ = ఉల్లాసమునొందుచు, అతఁడు = హనుమంతుఁడు, ధృతిసంగతిన్ = ధైర్యసంబంధమున, అల్లన = మెల్లఁగా, రసాత్మసంతతిన్ = భూపుత్రియైన సీతను, చూడన్ = చూచుటకు, (రసా+భూమి, సంతతి = బిడ్డ.

తా. అంగదుఁడు సేనాపతిగా ముందు నడువ బలముతో వెడలి యాంజనేయుఁడు సీతను వెదకఁ దలఁచెను.

లక్ష్మ.—అంగదన్ = అపదచేత, హరి=భగవంతునియొక్క, ముఖ్యబలము = ముఖ్యశక్తి, ముంగలయైనడువన్=తనకుముందు నడచుచుండఁగా,

అవ్విభుని ప్రేరణంబునన్ = ఆదైవప్రోత్సాహము చేతనే, ఉత్సాహంగుచున్, అతఁడు = లక్ష్మణకవి, ధృతిసంగతిన్ = ధైర్యవంతుఁడై, అల్ల = ఆ, నరసాత్మసంతతిన్ = నరసయ్యామ్మగారి కుమారుఁడైన ధర్మారావును, చూడఁగన్ = చూచుటకు.

తా. భగవంతుని ప్రేరణచే ధైర్యముగా లక్ష్మణకవి దమ్మన్నయొద్దికి బయన మయ్యెను.

చ. అరుగుచుఁ ద్రోవలో నగవనాదుల నెల్లెడ నిండుగాఁగ భా
సురరస మొప్పుచుండుసరసుల్ గలచోటుల నూళ్లఁబోళ్లస
త్వరగతి డాయుచుం జనుచుస్వాంతములోనరసాత్మసూతినే
వరుస నిఁకెప్డుగాంతు నొగి వచ్చినకార్యము వే ఫలింపఁగన్.

రాఘ.—అరుగుచున్ = పోవుచు, త్రోవలో = మార్గమధ్యమున, నగవనాదులన్ = పర్వతములును వనములు మున్నగువానిని, ఎల్లెడన్ = ప్రతిస్థలమున, నిండుగాఁగన్ = మిక్కిలిగా, భాసుర = స్వచ్ఛమైన, రసము = నీరు, ఒప్పుచుండు సరసుల్ = కలిగియుండిన కోనేరులు, గలచోటులన్ = ఉన్నతావులలో, ఊళ్లన్ = గ్రామములను, పోళ్లన్ = కొండపొదులను, పొలములను సత్వరగతిన్ = వేగముగ, డాయుచున్ = చేరుచు, చనుచు = అవలఁబోవుచు, స్వాంతములోనన్ = మనస్సునందు, రసాత్మసూతిన్ = భూపుత్రిని, ఏవరుసన్ = ఏలాగున, ఇఁక, ఎప్డు = ఎప్పుడు, ఒగిన్ = క్రమముగ, వచ్చినకార్యము = నేనేపనికై వచ్చితినో యాపని, వే = శీఘ్రముగా, ఫలింపఁగన్ = నెఱవేఱఁగా, కాంతును = చూచెదనో.

తా. మార్గమునఁ దగిలిన గ్రామములు చేలు తటాకములు మొదలైనవి చేరుచుఁ బాయుచు నడచుచు ఎట్లు సీతను గాంతును, ఎప్పుడు నాపని నెఱవేఱు నని యాంజనేయుఁడు తలపోయుచుండెను.

లక్ష్మ.—అరుగుచున్ = వెళ్లుచు, త్రోవలోనన్ = మార్గములో, కవనాదులన్ = కవిత్వము మున్నగువానియందు, ఎల్లెడన్ = అన్నితావులను, నిండుగాఁగ = సమృద్ధిగా, భాసురరసము = శృంగారాది కవిత్వరసము, ఒప్పుచుండు = కలిగియుండు, సరసుల్ = రసజ్ఞులు, కలచోటులన్ =

కలిగిన తావులందు, ఊళ్లఁబోళ్లన్ = ఊళ్లుపోళ్లనని యూఁతపదము. (ఇక్కడ, ఊళ్లన్ = గ్రామములను, బోళ్లన్ = స్త్రీలను, నని యర్థము చెప్పుచున్నారు గాని జోడియని స్త్రీపరముగానర్థము కనఁబడదు, ఊళ్లఁబోళ్లననిన, ఊళ్లు, పట్టణములునని రెండుపక్షముల బాధలేనిమార్గము సిద్ధించును. గావున నాపాఠము నిష్టమున్న వాడవచ్చును) సత్వరగతిడాయుచున్ = వేగముగఁ జేరుచు, చనుచున్ = ఆతావునుండి యేగుచు, స్వాంతములో = హృదయమున, నరసాత్మసూతిన్ = నరసయ్యమ్మగారి తనయుని (దమ్మన్నను), ఏవరుసన్ = ఎట్లు, ఇఁక, ఎప్డు, ఒగిన్ = చక్కఁగా, ఫలింపఁగన్ = వచ్చినపని శీఘ్రముగా నగునట్లు, కాంతున్ = కనుఁగొందును.

తా. (కుయ్యేరునుండి. ఆతెరువున వేగుచు = లక్ష్మణకవి మార్గమధ్యమునఁ గల గ్రామములఁ బండితులున్న వారిం గాంచుచుఁ బోయి యెట్లు దమ్మన్నను గాంతునా యెట్లు కార్యము నెఱవేఱునా యని తలంచుచుండెను.

క. అని తలఁచుచు నొకచో సువ
చనసంపాతి ద్విజవరసమ్యగ్గోష్ఠి
ఘనత బలి యంజనానం
దనుఁ డగునతఁ డమరరిపుని నగరికిఁ జనఁగన్. 41

రాఘ — అని = ఇట్లని, తలఁచుచున్ = తలపోయుచు, ఒకచోన్ = ఒక్కచోట, సువచన = మంచిమాటలుగల, సంపాతి = సంపాతియను, ద్వి = వర = పక్షిరాజుయొక్క, సమ్యక్ = లెస్సయైన, గోష్ఠి = ప్రసంగముయొక్క, ఘనతన్ = అతిశయముచేత, బలి = బలముగల, అంజనానందనుఁడు = అంజనయను మర్కటస్త్రీపుత్రుఁడు, అగునతఁడు = అయిన హనుమంతుఁడు, అమరరిపుని = రావణుని, నగరికిన్ = లంకకు, చనఁగన్ = వెళ్లుటకు.

తా. పైనఁ జెప్పఁబడినరీతిం దలపోసికొనుచు నేగి యొక్కచో సంపాతి యనుపులుగులఱేఁడు కనఁబడి చెప్పినప్రకారము లంకాపట్టణము నాంజనేయుఁడు ప్రవేశింప నెంచుచుండఁగా.

లక్ష్మ.—అని, తలఁచుచున్ = ఈరీతిననుకొనుచు, ఒకచోన్ = ఒకా నొకచోట, సువచన = మంచిమాటలను, సంపాతి = ప్రసరించునట్టి, ద్విజ వర = విప్రవరుల, సమ్యగ్గోష్ఠీ = రమ్యమగు ప్రసంగసభలయొక్క, ఘనత = పెంపు, బలియన్ = మిన్నయగుచుండఁగా, జనానందనుఁడు = లోకుల కానందమిచ్చినవాఁడు, అగునతండు = లక్ష్మణకవి, అమరన్ = తగినట్లు, రిపు నగరికిన్ = తన విరోధియగు దమ్మన్నయుండు నూరునకు, చనఁగన్ = వెళ్లఁగా.

తా. మార్గమధ్యమునఁ గ్రామములో విద్వద్గోష్ఠి యొనర్చుచు తన విరోధియున్న యాకరవెట్టమునకు లక్ష్మణకవి యేగెను.

వ. మనోమోదంబు రెట్టించుచుండె నయ్యవసరంబున. 42

టీ. మనోమోదము = హృదయానందము, రెట్టించుచుండెన్ = ఇబ్బడి యగుచుండెను. అయ్యవసరంబున = అంతట.

అర్థముఁ దాత్పర్యమును సులభము, ఉభయత్ర సమము.

సీ. విశదస్థితి సుమనోవీథ్యభిముఖములై
వడితోన భృంగాళు లడరునెలవు
విలసత్ప్రథుమహోచ్ఛవిద్రుమరత్నము
క్తానీలసుమహితం బైనతావు
బహులలహరులవెంటఁ బైకంబు లెగయుచుఁ
గలకలధ్వనిసేయఁ గ్రాలుచోటు
కచ్ఛపాళులును నాగకుమారకకదంబ
కంబులు నెడనెడఁ గలుగుపదము
గీ. సమదనక్రము కంబుపూగమిళితంబు
పరమకరకరాజీవకులరుచిరంబు
శోభితతిమిశ్రితం బురుగ్రాహి యనఁగ
నమరువనరాశి కనఁబడె నతని కెదుర. 4

రాఘ.—విశదస్థితిన్ = నిష్కలంకముతో, సుమనోవీథి = దేవమార్గమగు నాకసమునకు, అభిముఖముతై = ఎదురుగా, వడితోన = వేగముతో, భంగాళులు = తరంగములు, అడరు నెలవు = ఎగయుచున్న తావులును, విలసత్ = ప్రకాశించుచున్న, పృథు = విస్తారమైన, మహోచ్ఛ = మిగులఁ దేటయైన, విద్రుమ = పగడములు, రత్న = రత్నములు (మరకతాదులు), ముక్తా = ముత్తెములు, నీల = నీలములు (వీనిచే), సుమహితంబైన తావు = మిక్కిలి శ్లాఘింపఁదగిన స్థానములు, బహు = అనేకములైన, లహరుల వెంటన్ = తరంగములతోఁ బాటు, పైకి = మీఁదికి, అంబులు = ఉదక బిందువులు, ఎగయుచున్ = లేచుచు, కలకలధ్వని సేయన్ = గలగలమను చప్పుడు చేయఁగా, క్రాలు చోటు = ఉన్నచోటు, కచ్ఛపాళులున్ = తాఁబేళ్లును, నాగకుమారక కదంబకమున్ = పాముపిల్లల గుంపులును, ఎడనెడన్ = అందందు, కలుగు పదము = తిరుగుచున్న తావులు, సమద = మదయుక్తమైన, నక్రము = మొసళ్లు గలది, కంబుపూగ మిళితంబు—కంబు = శంఖముల, పూగ = సమూహముచే, మిళితంబు = కూడుకొన్నది, వర ... రుచిరంబు—వర = ఉత్కృష్టమైన, మకరక = మకరములు, రాజీవ = ఒకదినుసు చేఁపలు (వీని యొక్క), కుల = జాతులతో, రుచిరంబు = సాంద్రమైనది, రోహిత = ఎఱ్ఱచేఁపలు, తిమి = తిమింగిలము (నూఱుయోజనముల జలచరము), ఈరీతి జలజంతువులచే, శ్రితంబు = నివసింపఁబడినది, ఊరు = గొప్పదియగు, గ్రాహి = గ్రాహములను లతాకారమత్స్యములు గలది. (సర్పవిశేషమని కొందఱు) తంతునాగమనునది, నెగడు, ఆంధ్రపదము. (ఇది నీటిలో దిగినవారిని మబ్బువలె నాక్రమించుకొని కదలకుండఁ దిగిచికొనునఁట) అనఁగన్ = అని చెప్పుటకు, అమరు = తగిన, వనరాశి = సముద్రము (వన + రాశి = ఉదకరాశి), ఎదురన్ = ముందఱ, అతనికిన్ = హనుమంతునకు, కనఁబడెన్ = దృష్టిగోచరమయ్యెన్.

తా. ఆంజనేయునకు ముందు, అలలు పైకెగయునది, రత్నములుగలది, నీళ్లు పైకిలేచుటచేఁ గలకలధ్వనిగలది. తాఁబేళ్లు, పాములు, మొసళ్లు, గ్రాహము, పలువిధముల చేఁపలు గలది యగు సముద్రము కనఁబడియె.

లక్ష్మ.—విశదస్థితి=చక్కనియుంనికగల, సుమనః=పువ్వుల "స్త్రియఃసుమనసఃపుష్పం" ని. వీథి=చాలునకు, అభిముఖమై=ఎదురుపడినవై, వడిలోన్=త్వరలో, అభంగ=ఎడతెగని, అళులు=తుమ్మెదలు, ఆడరుసెలవు = తిరుగుచున్నతావులు, విలసత్=ప్రకాశించు, పృథు= పెద్దవియగు, మహోచ్ఛవి=అతిశయకాంతిగల, ద్రుమరత్న=మంచివృక్షములచే, ముక్త=నిడువఁబడిన, ఆనీల=తెల్లనగు, సుమ=పుష్పములచే, హితంబు=కూడిన, తావు=చోటు, బహుల=పెక్కులయిన, హారుల=చిలుకల, వెంటన్=వెంబడి, పైకంబులు=కోయిలల గుంపు, (పికము=కోయిల, పికములసముదాయమునకు, పైకమనిపేరు(ఎగయుచున్=ఎగురుచు, కలకల=మిగుల నవ్యక్తమధురమైన, ధ్వనిసేయన్=కూఁతలిడుచుండ, క్రాలు = సుందరమగు, చోటు, కచ్ఛ = పచ్చికలయొక్క, పాళులు = సమూహములు, నాగకుమార=ఏనుఁగు పిల్లలయొక్క, కదంబకంబులును=మందలును, (కదంబకము = కడిమిచెట్టనియుం) ఎడనెడన్=నడుమనడుమ, కలుగుపదము=కలిగినచోటు, సమదన=మంగచెట్లతోఁగూడిన (పిండీతకవృక్షము), క్రముకంబు = ఎఱ్ఱలొద్దుగ చెట్లుగలది, పూగ=పోఁకమ్రాఁకులచే, మిళితంబు=కలసియున్నది, పర=మేలైన, కరక = కరకకాయచెట్టుల, రాజి=వరుసలతోను, నకుల=పొగడచెట్లచే, రుచిరంబు=అందమైనది, రోహిములు మోదుగుల, తతి=సమూహముచే, మిశ్రితంబు=కూడినది, ఉరు=విస్తారమైన, గ్రాహి=వెలఁగచెట్టులు గలది, అనఁగన్ = అనునట్లు, అమరు=ఒప్పిన, వనరాశి=వనసమూహము,అతని కెదురన్=లక్ష్మణకవికి ముందు, కనఁబడెన్=పొడకట్టెను.

తా. లక్ష్మణకవికి మార్గములో వివిధవృక్షములు పక్షులు పుష్పములుగల వనము కనఁబడియెను.

వ. అట్లు కాన్పించినం జూచి యచ్చెరువందుచు నవ్వనరాశి గడచి పోనుద్యోగించి చనుసమయంబున. 44

తా. అహనుమంతుఁడు సముద్రముం దాఁటి పోవలయుననియు, లక్ష్మణకవి యీవనము గడచి పోవలయుననియుం యత్నించిపోవుచుండఁగా.

గీ. అట్టివనరాశిలోఁ గాననయ్యెఁ బృథుల
తార్హమైనాకనగము నానాయతతరు
వదియె, యతని మార్గశ్రమం బపనయింపఁ
దనసుసహాకారభావ మంతయును జూపె. 45

రాఘ.—నానాయతతరువు=అనేకములు, బొడవైన వృక్షములుగల, పృథులతా=వైశాల్యముచేత, అర్హా=తగిన, మైనాకనగము=మైనాకపర్వతము, అట్టివనరాశిలోన్ = మీఁద వర్ణింపఁబడిన సముద్రములో, కాననయ్యెన్ = కనవచ్చెను. అదియె = ఆపర్వతమే, అతనిమార్గశ్రమంబు = ఆహనుమంతుని యలసతను, అపనయింపన్ = పోఁగొట్టుటకు, తనసుసహాకారభావము=తన యొక్కమంచి చెలిమిని, అంతయునుజూపెన్ = పూర్ణముగఁ గనఁబఱచెను.

తా. సముద్రమధ్యమున మైనాకపర్వతము హనుమంతుని కగపడి తనపై నొక్కింతసేపు కూర్చుండి శ్రమతీఱిన పిదపఁ బొమ్మని స్నేహభావమును చూపించెను.

లక్ష్మి.—అట్టి వనరాశిలోన్=అవృక్షసముదాయములో (వనములో), పృథు=పెద్దపెద్ద,లతా=శాఖలచే (సమేశాఖాలతే) అర్హామై=ఒప్పి,నాకనగము నాక్=కల్పవృక్షమువలె, ఆయతతరువు=పెద్దచెట్టు, కాననయ్యెన్=చూపట్టెను. అదియె=అవృక్షమే, అతనిమార్గశ్రమంబు=ఆలక్ష్మణకవి గమనాయాసమును, అపనయింపన్=పోగ్గించుటకు, తనసుసహాకారభావము = తానొసర్చు మంచిసహాయమును (తాను తీయమామిడి చెట్టగుటను), చూపెన్ = చూపించెను.

తా. ఆవనములోఁ బడి నడచుచున్న లక్ష్మణకవికిఁ గలిగిన మార్గశ్రమముం బోఁగొట్టుటకుఁ బెద్దమామిడి చెట్టొకటి కనఁబడినది. అక్కడఁ గొంతసేపు కూర్చుండి పిమ్మట వెళ్లెననుట.

క. వెస నచ్చో గదలి చనుచు
ను సురసనానాగమాతను సకలసుమనో

విసరవిహిత సారంగగ
తి సమాదరమొప్పఁ జూచె దృఢత నతఁడొగిన్. 46

రాఘు.—అతఁడు=ఆంజనేయుఁడు, వెసన్=వేగముగా, అచ్చోన్=అచ్చోటనుండి, కదలి=పయనమై, చనుచున్=దాఁటుచు, సకలసుమనో విసర=దేవతలందఱిచే, విహితన్=పంపఁబడిన దానిని, నాగమాతను=సర్పజననియగు, సురసనా=సురసయను నామముగల, సారంగగతిన్=గజగామినిని (స్త్రీయనుట), సమాదరమొప్పన్=ఆదరపూర్వకముగా, దృఢతన్=చక్కఁగా, చూచెన్=వీక్షించెను.

తా. మైనాకపర్వతమునుండి యవలఁ జని హనుమంతుఁడు దేవతలచేఁ బంపఁబడిన సురస యను నాగమాతను చూచెను.

లక్ష్మ.—అతఁడు=లక్ష్మణకవి, వెసన్=త్వరగా, అచ్చోఁగదలి=ఆ చెట్టునువిడిచి, చనుచు=పోవుచు, సురస=మంచి పుష్పరసముగలిగిన, నానాగమ=అనేకవృక్షములయొక్క, అతను=విస్తారమగు, సకలసుమనోవిసర=సమస్త పుష్పములయందు, విహిత=చేయఁబడిన, సారంగ=తుమ్మెదల, గతిన్=సంచారమును, సమాదరమొప్పన్=ఆసక్తితో, దృఢతన్=బాగుగా, చూచెన్=కనుంగొనియెను.

తా. ఆమావిడిచెట్టు నొద్దనుండి పోవుచు ననేకవిధవృక్షములం గల పెక్కుపూవులపై వ్రాలుచున్న తుమ్మెదలను గనుఁగొని లక్ష్మణకవి సంతసించె ననుట.

వ. తదనంతరంబ తద్గర్భంబు విమర్శించి యవ్వలికిం జనుచు
న్నంత. 47

రాఘు.—తదనంతరంబ=పిమ్మట, తద్గర్భంబు=ఆసురసగర్భమును, విమర్శించి=పరిశీలించి, అవ్వలికిన్=బైటికి, చనుచున్నంతన్=వెడలుచుండఁగా, (సురసకడుపులోనుండి యావలకుఁ బోవుచుండఁగా.)

లక్ష్మ.—తద్గర్భంబు=ఆవనముయొక్క మధ్యప్రదేశమును, విమర్శించి=చక్కఁగాఁజూచి, అవ్వలికిం జనుచున్నంతన్ = వనముదాఁటి తెఱపిలోనికి వచ్చుచుండఁగా.

గీ. ప్రీతిదృఢతఁ జేరుపవనప్రియకుమారుఁ
డేపు మీఱంగ ఘనరసాలోపమాన
రహితసుపలాశనవపుష్కరమణి కల్ల
సింహికకు మారకుం డయ్యె జేరి మ్రింగ. 48

రాఘ.—ప్రీతిదృఢతన్=ప్రేమదార్ఢ్యముచే, చేరు=సమీపించుచున్న, పవనప్రియకుమారుఁడు = హనుమంతుఁడు, ఏపుమీఱఁగన్=విజృంభించుచుండఁగా, ఘనరసాల = పెద్దనాలుకగల (రసాలా . . . జిహ్వానాత్వక్షుచూతయోః) ఉపమానరహిత=సామ్యములేని, సుపలాశన=రక్కసుల, వపుష్క = శరీరముగల, రమణికిన్ = ఆఁడుదియగు, అల్లసింహికకున్=సింహికయనుదానికి, చేరి=డాసి మ్రింగన్ = పైఁబడి మ్రింగఁగా, మారకుఁడయ్యెన్ = చంపెడువాఁడయ్యెను.

తా. తన్ను మ్రింగిన సింహిక యను రాక్షసస్త్రీని హనుమంతుఁడు చంపెను.

లక్ష్మ.—ప్రీతిదృఢతన్ = ప్రేమాతిశయమును, చేరుపన్ = చేర్పుటకు వనప్రియకుమారుఁడు=కోయిలపిల్ల ('వనప్రియః పరభృతః కోకిలః పికః' అనియమరము) ఏపుమీఱంగన్=అతిశయింపఁగా, ఘనరసాల=పెద్దమామిడిచెట్టుయొక్క, ఉపమానరహిత=సాటిలేని, సుపలాశ=మంచియాకులసొదు, నవ=నూతనుఁడైన, పుష్కరమణికిన్=సూర్యునకు, (పుష్కరము=ఆకాశము-ఆకాశమునందు మణి పుష్కరమణి) బాలసూర్యునకు, చేరి=డాసి, మ్రింగన్ = మ్రింగుటకు, అల్లసింహికకుమారకుండు=రాహువు, అయ్యెన్. ఈపద్యమునందలి వనప్రియకుమారుఁడు అనుచోఁ, అమహాత్మునకు డువచ్చినను కుమారుఁడని యొత్వము రాఁగూడదు. కాని శ్రీనాథుఁడు "గమికర్మీకృత నైకనీవృతుఁడ

నై" యని హంసకు విశేషణముగాఁ బ్రయోగించి యున్నాఁడు కావున సమాధానపడవలయును.

తా. ఒకకోయిలపిల్ల యెఱ్ఱని మామిడిచివుళ్లను బట్టి మ్రింగుచుండఁగా నది బాలసూర్యుని గబళించుచున్న రాహువువలె దోఁచె ననుట.

వ. అట్లాశ్చర్యకర జంతుసంతాననిదానం బగునవ్వనరాశి నతి
క్రమించి యతండు ముందట. 49

రాఘు.—అట్లు, ఆశ్చర్యకరజంతుసంతాననిదానంబు = అద్భుతజంతువులకు నివాసమైన, అవ్వనరాశిన్ = ఆసముద్రమును, అతిక్రమించి = దాఁటి, అతండు = హనుమంతుండు, ముందట = తనకెదురుగా.

లక్ష్మ.—అట్లు, ఆశ్చర్యకరములైన పక్షులు మొదలగు ప్రాణికోటి నిలుచుటకు నాధారమైన, అవ్వనరాశిన్ = చెట్లతోఁపును, అడవిని, దాఁటి = కడచిపోయి, అతండు = లక్ష్మణకవి, ముందట = ముందు, అగ్రభాగమున.

సీ. లలి నొక్కచో మహాలంక రణవసుధా
ర్యురుసన్నుతబలభాసురజనాన్వి
తమ్ము విస్మయరుచిదమ్ము నగారిపు
రములీల నలకాపురమ్ము నట్లు
వెలయఁగ నందుఁ బ్రవేశించి యచ్చోటఁ
గలవిచిత్రత లెల్లఁ గాంచి వెఱఁగు
పడుచు గాఢగతి నక్కడ మాటలాడువా
రల పల్కులువినుచు రహిని రాదు
గీ. హితమృదూక్తి లంక ధృతిమీఱ నరయఁగఁ
దనకు నెందుఁ గనఁగ వినఁగఁ బడదు
మహితనయ సుచర్య యహితునిచేఁ జిక్కి
యడఁగిపోయెనో యటంచు నడలె. 50

రాఘ.—లలిన్=ఒప్పుగా, ఒక్కచో=ఒక్కతావున, మహాలంక=పెద్ద
లంకాద్వీపము, రణ=యుద్ధములోసంపాదించిన, వసు=ధనమును, ధారి=కలిగి
యున్నది. ఉరు=మిక్కిలిగా, సన్నుత=కొనియాడఁబడిన, బల=బలము, ఛ=
కాంతి(యునుగల), అసురజన=రక్కసులతో, అన్వితమ్ము=నిండినది. విస్మయ
రుచిదమ్ము=అద్భుతమునుగలిగించునదియే (కనుక), లీలన్=విలాసముచే, నగారి
పురము=ఇంద్రపట్టణమువలె, అలకాపురమునట్టు=కుబేరుని పట్టణమువలె, వెల
యంగన్=ప్రకాశింపఁగా, అందున్=ఆలంకలో, ప్రవేశించి=చొచ్చి,
ఆచ్చోటఁగలవిచిత్రతలెల్లఁగాంచి, అక్కడనున్నచిత్రములంగనుంగొని, వెఱఁ
గుపడుచు=వింతపడుచు, గూఢగతిన్=ఒరులకుఁగనరానివిధమున, అక్కడమా
టలాడువారల పల్కులువినుచున్ (ఎందైనసీతావృత్తాంతము వినఁబడునేమో
యని), రహిని=బాగుగ, రాజుహితమృదూక్తి-రాజుహిత=రాచకూఁతురగు సీత
యొక్క, మృదూక్తి=మృదువాక్యమును, లంకన్=లంకాపురిలో, ధృతిమీఱన్
=ధైర్యముగా, అరయంగన్=వెదకుటకు, తనకు, ఎందున్=ఎక్కడను, కనఁగ
వినఁగఁబడదు=కనఁబడదు, ఒరులుచెప్పుకొనుమాటలలో వినఁబడదు. మహిత
నయ=సీతయొక్క, సుచర్య=సాధువృత్తి, అహితునిచేఁజిక్కి=శత్రువుచేతిలోఁ
బడి, అడఁగిపోయెనో=నశించినదా? అటంచు నడరెన్=అనిభయంపడియెను.

తా. ఇంద్రపట్టణము అలకాపురముతోఁ దుల్యమైన ధనవంతమైన
లంకాపురము చొచ్చి రహస్యముగా నుండి పరులేమనుకొనుచున్నారో యని
వినుచు వెదకసాగెను. ఎక్కడను సీత కనఁబడలేదు. ఎవ్వరును చెప్పుకొనుట
లేదు. అయ్యో శత్రువుచేఁ జిక్కినకతన సీతాదేవి సాధువృత్తి యడఁగిపోయె
నేమోయని హనుమంతుఁడు విచారించెను.

లక్ష్మ.—లలిన్, ఒక్కచోన్=ఒకతావున, మహా=గొప్పదియగు, అలం
కరణ=అలంకారమును, వసు=ద్రవ్యమును, ధారి=ధరించినదియు, ఉరు=అధిక
ముగా, సన్నుత=నుతింపఁబడిన, బలభాసుర=బలముచేఁబ్రకాశించు, జన=
మనుష్యులతో, అన్వితమ్ము=చేరియున్నదియు, విస్మయరుచి-విస్మయ=ఆశ్చర్య
కరమును, రుచి=కాంతిగలదియు నగు, దమ్మనగారిపురము=ధర్మరాజుగారుండు.

ఆరెవెట్టము, అలకాపురమునట్టు=కుబేరపురమురీతి, వెలయఁగన్, అందుఁ బ్రవేశించి, అచ్చోటఁగలవిచిత్రతలెల్లఁగాంచి, వెఱగుపడుచు, గూఢగతిన్=రహస్యముగా, అక్కడమాటలాడువారలపలుకులు వినుచు, రహిని=మిగుల, లంక=లంకనేల, హితమృదూక్తిన్=హితవాక్యముల మృదువాక్యములతో, రాదు=మరలరాదు. ధృతిమీఱిన్, ఆరయన్, ఎందున్=ఎక్కడను, మహితనయసుచర్య=న్యాయమన్నమాట, కనఁగవినఁగఁబడదు=కనఁబడదు, వినఁబడదు,అహితునిచేన్=పగవానిచే, చిక్కి=క్షీణించి, అడఁగిపోయెనో యటంచు నడచెను,

తా. ఆరెవెట్టము వెళ్లి పలువురు మాటలాడుకొనుచుండ రహస్యముగా వినెను. న్యాయమార్గమునఁగాని మెత్తమెత్తని మాటలతో లంకభూమి మరల స్వాధీనము కాదని విచారించెను.

వ. అట్లు తలంచి యొక్కింతసేపు డోలాయమానమానసుండై
యంతలో దృఢబుద్ధినిశ్చయించి మున్నతిప్రయత్నంబున
నే నిచ్చోటికి వచ్చి యేన రసాసంతతిఁజూచి మాటలాడక
పోవం దగదు. అని యూహించి చనిచని పురోభాగంబున
నొక్కచోట. 51

రాఘ.—అట్లు=ఆప్రకారము, తలంచి=విచారించి, ఒక్కింతసేపు=కించిత్కాలము, డోలాయమానమానసుండై = మనస్సు ఉయ్యాలవలెనూఁగి, యంతలో, దృఢబుద్ధినిశ్చయించి=ధైర్యముగా నిశ్చయము చేసికొని, మున్ను=ఇంతకుముందు, అతిప్రయత్నంబున=ఎంతోకష్టమైనయత్నము చేసి, ఏన్=నేను, ఇచ్చోటికివచ్చి, ఏన=నేనే, రసాసంతతిన్=సీతను, చూచి, మాటలాడక, పోవందగదు, అని, ఊహించి, చనిచని, పురోభాగంబున = ఎదుట, ఒక్కచోట, (హనుమంతుఁడు.)

లక్ష్మ.—అంతయు సమమే-నరసాసంతతిన్ = దమ్మన్నగారిని, చూచి మాటలాడకపోవఁదగదని విచారించి (లక్ష్మణకవి) ఎదుట నొక్కస్థానమున.

గీ. ప్రబలపదవి నాశుభవనమం దున్నర
సాత్మసూతిఁ గాంచి యాతఁ డటకుఁ
జని తదాశ్రయం బయినసాల మతిధృతి
యొదవఁ జేరి యొకెడ నొదిఁగి యుండె. 52

రాఘు.— ప్రబలపదవిన్ = అత్యంతమైన సద్వృత్తితో, అశుభవనమందున్ = ఆయశోకవనములో, ఉన్నరసాత్మసూతిన్ = ఉండినసీతను, కాంచి = కనుఁగొని, అతఁడు = హనుమంతుఁడు, అటకున్, జని = సీతయున్నతావునకేగి, తదాశ్రయంబయినసాలము = ఆమె కూర్చుండుట కాధారమైనచెట్టును, అతిధృతియొదవన్ = మిక్కిలి ధైర్యముగా, చేరి = ఎక్కి, ఒకెడన్ = ఒకక్ర-మూల, ఒదిఁగియుండెన్ = డాఁగెను.

తా. అశోకవనములో నొకచెట్టుక్రిందఁ గూరుచున్న పవిత్రురాలగు సీతను గాంచి యాచెట్టుమీఁద గూఢముగా హనుమంతుఁ డొదిఁగి యుండెను.

లక్ష్మ.— ప్రబలపదవినాశున్ = ప్రకృష్టమైన ధర్మమార్గమునుఁ జెడఁగొట్టునట్టి, నరసాత్మసూతిన్ = దమ్మన్నను, భవనమందున్ = ఇంటిలో, కాంచి = చూచి, అతఁడు = కవీంద్రుఁడు, అటకున్ — చని, తదాశ్రయంబు = ఆదమ్మన్నకాధారము, అయినసాలమున్ = అయినట్టిప్రాకారమును, అతిధృతి = మిక్కిలి ధైర్యము, ఒదవన్ = కలుగఁగా, చేరి = చొచ్చి, ఒకెడ నొదిగియుండెను.

తా. అన్యాయవర్తనుఁ డైనదమ్మన్న గృహములోని కేగి యొకచో గూఢముగా నుండెను.

వ. అట్లతండు గూఢభావంబున నచ్చట నుండె. అంతకుము
న్న రసాసంతతిచుట్టునుం బరివేష్టించి యున్న దుర్మానవా
దులు కొన్ని దురాలాపంబులు ప్రేలి ప్రేలి యూరకున్న తద
నంతరంబున. 53

రాఘు.—అట్లతండు, గూఢభావంబునన్ = ప్రచ్ఛన్నముగ, అచ్చట నుండెను. అంతకుమున్న=హనుమంతుఁడా చెట్టుమీఁది కెక్క-కముందే, రసా సంతతిచుట్టును = సీతకన్ని ప్రక్కలను, బరివేష్టించి=చుట్టుకొని, ఉన్న దుర్మాన వాదులు=ఉన్నట్టి దుష్టులగు రాక్షసులు, కొన్ని దురాలాపంబులు = కొన్ని యను చితవాక్యంబులను, ప్రేలిప్రేలి=సీతకిష్టములేనిరీతి వాఁగివాఁగి, ఊఁకున్నన్ = పలుకకున్నంత, తదనంతరంబున = తర్వాత.

లక్ష్మ.—అట్లు, అతండు, గూఢభావంబునన్ = రహస్యముగ, అచ్చటన్ ఉండెను. అంతకుమున్ =లక్ష్మణకవి వచ్చుటకుఁ బూర్వమె, నరసాసంత తిచుట్టును బరివేష్టించియున్న = దమ్మన్న యొద్దనున్నట్టి, దుర్మానవాదులు=దుర భిమానవాదము చేయువారు, కొన్ని దురాలాపంబులు = లక్ష్మణకవింగూర్చి యొకకొన్ని చెడుపలుకులు, ప్రేలిప్రేలి యూరకున్నంతన్ = మరల బ్రాహ్మణున కీయవలదను మొదలైన సంభాషణము చేసిచేసి మిన్నకున్నంతట.

క. ధృతమతితోన రసాసం
  తతితోఁ దనమాటలాడుతలఁపున లంకా
  పతి యగువరకవిశిష్య
  ప్రతతినియంత దరిఁ జేరి పల్కఁ దొడంగెన్. 54

రాఘు.—ధృతమతితోన = స్థైర్యముగా, రసాసంతతితోన్ = సీత తోడ, తనమాటలాడుతలఁపునన్ =తన యభిప్రాయవాక్యములను బల్కనిచ్ఛ తో, లంకాపతి = లంకకుఁ బ్రభువు, అగువరకవిశిష్యప్రతతినియంత-అగు = అయినట్టి, వర=శ్రేష్ఠుఁడైన, కవి=శుక్రునకు, శిష్యప్రతతి = శిష్యులైనరాక్ష సులకు, నియంత = నాయకుఁడైనరావణుఁడు, దరిఁజేరి = సీతయొద్దికివచ్చి, పల్కఁదొడంగెన్ = మాటలాడసాగెను.

తా. సీతతోఁ దనయభిప్రాయము చెప్పవలయు నని రావణుఁడామె కడకు వచ్చి యిట్లు పల్క మొదలుపెట్టెను.

కవి యర్థములో "ఇఁక" లోని యరసున్నను బ్రోచివైచి, ఒద్దికయనుదానిని "వద్దిక" యని పూర్వ ముద్రిత ప్రతిలో వ్రాయుట మఱియుం విరుద్ధము. అంతవిపరీతార్థముచెప్పకున్న నిచ్చటఁ జెడునదిలేదు.) మాని=ఆమత్సరమును మాని(విడిచి), దమ్మన=దమ్మన్నా! నిర్దోషసత్కృపను = నిశ్చయమైనదయను, ఇమ్ముమీఱఁగన్ = రహస్యమతిశయించునట్లుగా, మన్పుము = వృద్ధిఁబొందింపుము. తాత్పర్యము సులభము.

క. నగుమొగముతోడ నను దయ
యిగురొత్తఁగఁ జూచి తాల్మి నెద వేడుక మీఱఁ
అఁగ లంకవిడచి యానం
దగరిమ మానఁ దగ దీవ నను బొందఁగదే. 56

రాఘ.—నగుమొగముతోడన్ = నవ్వుచున్నముఖముతో, దయ యిగురొత్తన్ = కరుణయంకురింపఁగా, ననున్, జూచి, తాల్మిన్ = శాంతముగా, ఎదన్ = హృదయమున, వేడుకమీఱఁగన్ = సంతోషముప్పతిల్లగా, లంకవిడిచి = లంకాద్వీపమునుదాఁటిపోయి, ఆనందగరిమము = సంతోషమును, ఆనఁదగదు=పొందరాదు. ఈవ=నీవే, ననుఁబొందఁగదే.

తా. నవ్వుచు నన్నుఁ జూడుము. దయఁ జూపుము. లంకలో లేని యానందము వేఱుతావున లేదు. నీవే నన్నుఁ బొందుము, నిన్ను నేను బలాత్కారము చేయననుట.

లక్ష్మ.—నగుమొగముతోడన్, దయయిగురొత్తఁగఁజూచి, తాల్మి= ఓరిమితో, ఎదన్=మనస్సున, వేడుక=కుతూహలము, మీఱఁగన్=లంకపాలమును, విడిచి=వదలి, ఆనందగరిమము = సంతోషాతిశయమును, ఆనన్=పొందుటకు, తగన్=తగిన, దీవనను=ఆశీర్వాదమును, పొందఁగదే=పొందవయ్యా.

తా. నన్ను దయతోఁ జూచి సంతోషముగా నాలంకమాన్యమును నాకు విడిచి నావలన నాశీర్వాదమును బొందు మయ్యా యని లక్ష్మణకవి కోరుచున్నాఁడు (ధర్మారావుకు).

క. విను నీవు నాదు క్షేత్రం
బనఁగా నుండఁ దగు లంక ననయంబున న
మ్మనుసంతతి లీలం గై
కొని భోగింపఁ దలపోయఁ గూడదు సుమ్మీ. 57

రాఘు.—విను = వినుము, నీవు, నాదు క్షేత్రంబనఁగాన్ = నా భార్యవయి, లంకన్ = లంకాపట్టణమునందు, ఉండఁదగున్ = ఉండవలయును, అనయంబునన్ = నీతిమాలి, అమ్మనుసంతతిలీలం గైకొని = ఆమానవజాతియైన రాముని విలాసంబుల ననుసరించి (అతనితో), భోగింపన్ = రమించుటకు, తలపోయఁగూడదుసుమ్మీ = రామునితో విహరింపవలయునను తలంపును మానుము. (రావణుఁడు సీతతో నను వాక్యము.)

లక్ష్మ.—విను = ఆకర్ణింపుము, అమ్మనుసంతతి-ఆ+మను+సంతతి = అట్టి వృద్ధిపొందుచున్న సంతానముగల నీవు, నాదు క్షేత్రంబున్ = నా భూమి, అనఁగాన్ = ప్రసిద్ధికెక్క, ఉండఁదగు లంకన్ = ఉండవలసిన లంకభూమిని, అనయంబునన్ = అన్యాయముచే, లీలం గైకొని = తేలికగ హరించి, భోగింపన్ = అనుభవించుటకు, తలపోయఁగూడదుసుమ్మీ.

తా. పిల్లలుగలవాఁడవు. బ్రాహ్మణమాన్యమును నీ వన్యాయముగా హరించి యనుభవింపవలయు నని తలంపకుము. (లక్ష్మణకవి దమ్మన్నతో ననిన మాట.)

వ. అని పలికి నిజసామర్థ్యంబు ప్రకటించువాఁడై యిట్లనియె.

రాఘు.—రావణుఁడు తనశక్తిని దెలియఁజేయుటకై క్రిందిరీతిని సీతతోఁ బల్కుచున్నాఁడు.

లక్ష్మ.—లక్ష్మణుఁడు తాను గవీశ్వరుఁడ నని తన ప్రభావము ప్రకటింపనెవో కొన్నిమాటలు చెప్పుచున్నాఁడు.

గీ. ఒనరుమద్వాక్కులం దెలుంగునకు బద్ధుఁ
డగును వాగనుశాసనుఁ డైన నన్ను

మలఘుమద్దివ్యగోచయంబులకు బద్ధుం
డగును శ్రీమనోవసుచోరుఁడైన నిజము. 59

రా-ఘు.—ఓనరుమద్వాక్కులందున్ = సరిగా నేను మాటలాడితినా వానియందలి, ఎలుంగునకున్ = ధ్వనికి, వాగనుశాసనుండైనన్ = బ్రహ్మదేవుఁడయినను, బద్ధుఁడగును = కట్టుపడిపోవును. భయపడుననుట, నమ్ముము = విశ్వసింపుము. ఇందేమియు నసత్యము లేదనుట. అలఘు = గొప్పవియగు, మద్దివ్యగోచయంబులకున్ = నాదివ్యబాణములకు, శ్రీమనోవసుచోరుఁడైనను = లక్ష్మీమనోధనమును హరించెడు విష్ణుదేవుఁడైనను, బద్ధుఁడగును = ఓడును, నిజము = సత్యము.

తా. నే నెలుఁగెత్తి మాటాడితినేని బ్రహ్మ భయమందును, నేను బాణమును వదలితినేని నారాయణమూర్తి కట్టువడి పోవలయును.

లక్ష్మ.—ఓనరు = ఒప్పునట్టి, మద్వాక్కులన్ = నామాటలలో, తెలుంగునకున్ = ఆంధ్రభాషాపదములకు, వాగనుశాసనుండైనన్ = నన్నయభట్టారకుఁడైనను, బద్ధుఁడగును = మాఱుమాటయాడఁజాలఁడు. అలఘు = విస్తారమైన, మత్ = నాయొక్క, దివ్య = దేవతాసంబంధమైన, గోచయంబునకున్ = వాక్యజాలమునకు, (అనఁగా సంస్కృతపదములకనుట) శ్రీమనోవసుచోరుఁడైనన్ - శ్రీ = శోభాయుంతమైన, మనః = మనస్సను, వసు = ధనముగల, చోరుఁడైనన్ = చోరుఁడనుకవియైనను, నిజము = నిశ్చయము, బద్ధుఁడగును.

తా. నేను తెనుఁగుకవిత్వము చెప్పితినా, ఆంధ్రవ్యాకరణకర్త, భారతాంధ్రీకరణము చేసినవాఁడు నైన నన్నయభట్టంతటివాఁడు సమ్మతించును. సంస్కృతపదప్రయోగము గావించితినా దానికి మహాకవిచోరుఁడంతటివాఁడు మాటాడఁ జాలఁడు. తప్పుపట్టఁ జాలఁ డనుట.

వ. అని మఱియు ని ట్లనిరి. 60

తా. ఉభయత్ర స్పష్టము.

క. తెలియ విను రామ కవ్యా
దులు సూరకవిప్రముఖపృథుప్రతిభావం

తులు భీమశ్రీనాథులు
వెలయఁగ నాకరణి దిట్టలే రూఢధృతిన్. 61

రాఘ.—రామ = ఓ కాంతా! తెలియవిను = స్పష్టముగా వినుము. కవ్యాదులు = హవ్యకవ్యములలోఁ గవ్యమును దినువారు (అనఁగా) పితృదేవతలును, సూర = సూర్యుఁడు, కవి = శుక్రుఁడు, ప్రముఖ = మొదలైన, పృథుప్రతిభావంతులు = గొప్ప తేజశ్శాలులును (సూర్యుఁడు శుక్రుఁడు నాకసమున కాంతిల్లుట ప్రసిద్ధము), భీమశ్రీనాథులు-భీమ = శివుఁడు, శ్రీనాథులు = విష్ణుదేవుఁడు) హరిహరులైనను), రూఢధృతిన్ = నిర్భరధైర్యమున, వెలయఁగన్ = ప్రసిద్ధముగ, నాకరణిన్ = నావలె, దిట్టలే = దార్ఢ్యముగలవారా, దిట్టతనము లేనివారనుట.

తా. పితృదేవతలు, సూర్యుఁడు శుక్రుఁడు మొదలగువారు శివకేశవులు నాయంతటిదంటలు కారు సుమీ.

లక్ష్మ.—తెలియు, వినుము = బాగుగవినుము. రామకవ్యాదులు = తురగా రామకవి మొదలైనవారు, సూరకవి = అడిదము సూరకవియు, ప్రముఖ = ఆదిగాఁగల, పృథుప్రతిభావంతులు = అధికబుద్ధిశాలులు, భీమశ్రీనాథులు = వేములవాడ భీమకవి, శ్రీనాథకవియును, రూఢధృతిన్ = సాహసించియనుట, నాకరణిన్ = నావలె (నేను దిట్టినట్లు), దిట్టలేరు = దిట్టుపద్యములం జెప్పలేరు.

తా. తురగా రామకవి అడిదము సూరకవి భీమకవి తిట్టుకవులు. "ఉంగుటూరిండ్ల రాకాసులుండవచ్చు" నని చెప్పినది రామకవియే యందురు. "రామకవి బొబ్బ పెద్దపిరంగిదెబ్బ" యని ప్రసిద్ధిగలదు. అడిదము సూరక "కదలుమిటమాని దివిజగంగాధవాని" యని చెఱువుగట్టు తెగునట్లు పద్యములు చెప్పినవాఁడు. "సూరకవితిట్టు కమసాలి సుత్తిపెట్టు" అని ప్రసిద్ధము. వేములవాడ భీమన రాజకళింగగంగును జోగిని జేసినవాఁడు. పైవారెవ్వరును నారీతిగా శపింపఁజాల రనుట. అనఁగా వారికంటెఁ బద్యములలో నింద్యాక్షరములుంచి పద్యములు టక్కునఁ దగులునట్లు చెప్పెద ననుట.

వ. అని సామభేదోక్తు లాడినం గణింపక తృణీకరించుచు నత
నితోన రసాసంతతి యిట్లనియె. 62

రాఘ.—అని=ఇట్లని, సామ=సాంత్వనవాక్యములు "ఘనిను సాశ్రయించి" యనుపద్యములోఁ జెప్పినట్లు, భేదోక్తులు=భేదకారణమైనమాటలు, "ఒనరుమద్వాక్కులందు" ఆనుపద్యములోఁ జెప్పినట్లు, ఆడినన్ = పలికిన, గణింపక = లక్ష్యముచేయక (రావణుని), తృణీకరించుచున్ = తేలికగాఁ జూచుచు (గడ్డిపఱకచేతఁ బట్టుకొని), అతనితోన = రావణునితో, రసాసంతతి = భూమికన్య, ఇట్లనియెన్ = క్రిందిరీతిం బల్కెను.

తా. మెల్లఁగాఁ జెప్పినను గట్టిగాఁ జెప్పినను సీత రావణుని లక్ష్యము చేయక యిట్లనుచున్నది.

లక్ష్మ. అని, సామభేదోక్తులాడినను = సామమున, భేదమున (నయభయములతో) మాటలాడినను, గణింపక=లెక్కింపక, అతనితోన్=అలక్ష్మణకవితో, నరసాసంతతి = ధర్మారాఘ, తృణీకరించుచున్ = ఆదరింపక, ఇట్లనియెన్ = ఇట్లు పలికెను.

చ. అజకులకాంతనన్న యయో యారసి చోరుఁడొనాఁగ గాఢవృ
త్తిఁ జెలఁగి పట్టి యాత్మవసతిం గృతిచే నరికట్టినాఁడ నం
* చు జడిమ రజ్జువిప్పగిది నాడెద వోకవిశిష్య లక్ష్మణా
గ్రజపటుగోజ్ఞతం బ్రబలుఁగా కవినేనియుఁ బోల నేర్తువే.

రాఘ.—అజకులకాంత = బ్రహ్మకులాంతకుఁడా! (లేక) అజకుల కాంతన్=అజానికులములోనికాంతను, నన్నున్=నన్ను, అయ్యయో! ఆరసి=సమయము వేచి, చోరుఁడొనాఁగ = దొంగయనునట్లు, గాఢవృత్తిన్=పరహాస్యముగ, చెలఁగిపట్టి = సంతోషముగాఁబట్టుకొని, ఆత్మవసతిన్=నీయిం

* ఈచరణమున యతిభంగము కనఁబడుచున్నది. కవియభిప్రాయము తెలియలేదు.

టిలో, కృతిచేతన్ = నేర్పుగా, అరికట్టినాఁడన్ = నిర్బంధించితి, అంచున్ = అనికొనుచు, లక్ష్మణాగ్రజపటుగోజ్ఞతన్ = రామునియొక్కదృఢమైన బాణములసంగతి తెలియనివాఁడవై, ప్రబలుగాన్ = అధికుఁడవుగా, ఇప్పగిదిన్ = ఇట్లు, జడిమన్ = బుద్ధిమాంద్యముచే, రజ్జులు = తప్పులు, ఆడెదవు=పలుకుచున్నావు. ఓకవిశిష్య = ఓశుక్రశిష్యుఁడా! (రాక్షసుఁడా) కవి నేనియుం బోలనేర్తువే= శుక్రునియొద్దశిక్షా)పచేసినను వానిసుగుణము నీకబ్బలేదనుట.

తా. నీవు కులకాంతను నన్ను దొంగతనమున దెచ్చి యింటఁ బెట్టుకొని గర్వించి కారులు ప్రేలుచున్నావు. నీవు రాముని బాణములశక్తి యెఱుంగవు. ఓరావణా! శుక్రశిష్యుఁడవై నందుకు గురువుగారిసుగుణములు నీ కేమియుఁ బట్టుపడలేదే. యనిసీత నిందించుచున్నది.

లక్ష్మ.——ఆజకుల కాంత-అజకులక=బ్రాహ్మణకులమునకు, అంత=కడపటివాఁడా! నికృష్టబ్రాహ్మణుఁడా! నన్నయయొు = నన్నయభట్టూ, చోరుఁడో = చోరకవియో, నాఁగన్ = అనునట్లు, గూఢవృత్తిన్ = ప్రచ్ఛన్నవేషమును చెలఁగి=ఒప్పి, పట్టి=పట్టుకొని, ఆత్మవసతిన్=తనమాన్యమును, కృతిచేన్= గ్రంథముచే, అరికట్టినాఁడన్ = పోకుండఁ బట్టినాను, అని, జడిమన్=జడత్వముచే, ఓకవిశిష్య=కవులకుశిష్యుఁడా, పటుగోజ్ఞతన్-పటు=మంచి, గో= పదములను, అజ్ఞతన్=తెలియకపోవుటచేత, ప్రబలుగాన్=గొప్పవానినిగా, లక్ష్మణాగ్రజ=లక్ష్మణుఁడను బ్రాహ్మణుఁడా! రజ్జులు = ప్రగల్భవాక్యములను, ఇప్పగిదిన్=ఈరీతిని, ఆడెదవు=బల్కెదవు. కవి నేనియుం=కవీశ్వరునొకనిసేని, బోలనేర్తువే=పోలఁగలవా.

తా. ఓబ్రాహ్మణాధమ! నన్నయ్యయో మఱియెవ్వరో పెద్దకవివలె మాటలాడెదవు. నీమాన్యమును బుచ్చుకొన్నాఁడ నని పద్దెములు చెప్పినంతనె యైనదా. నీవు కవివిగావు. కవులకు శిష్యుఁడవు. తిన్నఁగా మాటలు నేరని కారణమున నధికుఁడ నని రజ్జులాడుచున్నావు. తొల్లింటికవులలో నీ వెవ్వరిని బోలుదువు.

క. ఖరదూషణముఖ్యులు కవి
గురులు నడచినట్టిత్రోవ గోరి నడువ ను
ద్ధురుఁడ వగునీదువాక్యవి
సరపరుషత్వమున కేను జంకుదునె మదిన్. 64

రాఘ.—ఖరదూషణముఖ్యులు = ఖరుఁడు, దూషణుఁడు మొదలగు, కవిగురులు = శుక్రుఁడుగురువుగాఁగలవారు, నడచినట్టిత్రోవన్ = వెళ్లినమార్గముననే, కోరి = ఆసించి, నడువన్ = నడచుటకు, ఉద్ధురుఁడవు = తొందరపడుచున్నవాఁడవు, అగునీదువాక్యవిసరపరుషత్వమునకున్ = అయిననీయొక్క పరుషవాక్యములకు, ఏను, మదిని, జంకుదునె; ఎంతమాత్రమును జంకను.

తా. రామబాణములచే ఖరదూషణాదులు యమలోకమార్గముం బట్టిరి. వారు నడచినత్రోవనే నీవును నడచుటకు (చచ్చుటకు) సిద్ధమైయున్న నీపరుషవాక్యములకు నేను భయపడుదానను గాను.

లక్ష్మ.—ఖర = (ఖల) దుష్టమైనట్టియుం, దూషణముఖ్యులు = దూషణమే ముఖ్యముగాఁ గలట్టియుం, కవిగురులు = కవిశ్రేష్ఠులు, నడచినట్టిత్రోవన్ = వర్తించినమార్గముననె, కోరి, నడువ, ఉద్ధురుఁడవు, పెద్దపెద్ద కవీశ్వరులవలె నడువఁ జూచెదవనుట. నీదువాక్యవిసర = నీమాటయొక్క, పరుషత్వమునకున్ = కాఠిన్యమునకు, మదిన్ - ఏను, జంకుదునె = భయపడువాఁడనా.

తా. నీ వెన్నిపరుషవాక్యములం బలికినను నాకు భయములేదు. నెమిలి పిట్టంజూచి విఱ్ఱవీఁగిన పిచ్చుకవలె నీవు నడచినంతనే యేమయ్యె నని దమ్మన్న లక్ష్మణకవిని దిరస్కరించెను.

వ. వేయు నేటికిం జెప్పెద. 65

తా. పెక్కుమాట లేమి పని. ఒక్కటియే చెప్పెదను. రెండుపక్షముల సమము.

గీ. విన్ము లక్ష్మణాగ్రజన్మ మాన్యక్షేత్ర
మేను విడువ నెపుడు మానగుణము
మద్వరోగ్రశక్తి మఱి యింక లంక నే
లఁగలవాఁడ వగుచు నెగడ వీవు. 66

రాఘ.—విన్ము=వినుము. ఏను=నేను,లక్ష్మణాగ్రజన్ము=రామునియొక్క, మాన్యక్షేత్రము=భార్యను, ఎపుడున్=ఎన్నఁడును, మానగుణము=అభిమానమనుగుణము, పాతివ్రత్యము, విడువన్=వదలను. ఈవు=నీవు, మద్వరోగ్ర శక్తిన్=నాభర్తయొక్క తీవ్రశక్తిచేతను, మఱి=ఇంక, లంకన్=లంకాద్వీపమును, ఏలఁగలవాఁడవు = ఏలఁజాలినవాఁడవు, అగుచున్, నెగడవు=ప్రసిద్ధికెక్కవు.

తా. నేను రాముభార్యను; పాతివ్రత్యమును వీడను. నా పెనిమిటి ప్రాణశక్తిచే నింకమీఁద నీవు లంకారాజ్యాధిపత్యమును బోఁగొట్టుకొందువు. అనఁగా జత్తువనుట.

లక్ష్మ.—లక్ష్మణాగ్రజన్మ=లక్ష్మణకవీ, విన్ము=వినుము, ఏను=నేను,మాన్యక్షేత్రము=నీమాన్యపుభూమిని, ఎపుడు = ఎప్పుడును, విడువను. గుణమున్=నాపుట్టినుబుట్టిన గుణమును, మాన=వదలను. మద్వరోగ్రశక్తిన్=నాయొక్క భయంకర సామర్థ్యముచే, మఱి-ఇంకన్=ఇంకమీఁద, లంక నేలన్=లంకచేను, కలవాఁడవు=పొందినవాఁడవు, అగుచున్=నెగడవు.

తా. నేను నాగుణమును విడువను. నీమాన్యమును వదలను. నే నేసామర్థ్యము గలవాఁడ నేని యింక నీకు లంక నేల దొరకదు. నీకీయ ననుట.

వ. అని పెంపుమీఱం బలికిన విని యతం డత్యంతకుపితస్వాంతుండై యప్పుడ నిజనాయకవనాగ్ని చేత నరసాసంతతిం దహింతు నంచు నుద్యోగించుటయు నంతలో నతని స్వజనంబులు ప్రార్థింప నప్పటికిఁ గోపోద్ధతి మరలిపోయె నంత. 67

రా॥ఘు.—అని, పెంపుమీఱన్ = నిర్భయముగ ననుట, పలికినన్ = చెప్పఁగా, విని=ఆలించి, అతండు=రావణుఁడు, అత్యంత కుపితస్వాంతుండై= మిగులఁ గోపించి, అప్పుడ=తత్క్షణమే, నిజసాయక = తనబాణముల వలనఁ బుట్టిన, వనాగ్ని చేతన = దవానలమూలముగ, రసాసంతతిన్=సీతను, దహింతున్=కాల్చివైచెదను. అంచు నుద్యోగించుటయుం=అనియత్నించుట తోన, అంతలోన్=తత్కాలముగా, అతనిస్వజనంబులు=రావణుపరిజనము, ప్రార్థింపన్= వలదని బతిమాలఁగా, అప్పటికిన్=ఆసమయమునకు, కోపోద్ధతి=కోపవేగము, మరలిపోయెన్ = తిరిగిపోయెను—తగ్గెననుట కోపోద్ధతిమరలి, పోయెన్= ఇంటికిఁబోయెను. (అనికూడ.)

తా. సీత తన్ను నిర్లక్ష్యభావమునఁ జూచిన సీతను రావణుఁడు చంపఁబోయి తనవారు వారింపఁగాఁ గోప ముడిగి యక్కడనుండి యేగెను.

లక్ష్మ.—అని, ఇట్లని, పెంపుమీఱన్=గర్వముతో ననుట, పలికినన్= తిరస్కరింపఁగా, విని, ఆకర్ణించి, అతండు = లక్ష్మణకవి, అత్యంతకుపితస్వాంతుండై=మిగుల మనసునొచ్చి, అప్పుడ = అప్పుడే, నిజ+సాయ+కవన+అగ్ని చేత-నిజ=తన, సాయ=శుభావహావిధితోఁగూడిన (ఆయః=శుభావహోవిధిః), కవన=కవిత్వమనెడు, అగ్ని చేత=నిప్పుతో, నరసాసంతతిన్=దమ్మన్నను, దహింతునంచున్=తగులఁబెట్టెదనని, ఉద్యోగించుటయుంన్ = ప్రయత్నింపఁగా, అంతలోన్=లిట్టిపద్యములు మొదలు పెట్టులోపుననె, అతనిస్వజనంబులు= దమ్మన్నగారివంకవారు, ప్రార్థింపన్ = వేఁడుకొనఁగా, అప్పటికిన్=తత్కాలమునకు, కోపోద్ధతి మరలిపోయెన్ = ఆకవీశ్వరునకు శాంతముకలిగెను.

తా. దమ్మన్న తన్ను దూషించినం గోపించి పద్యములుచెప్పి వాని దోషగణముచేతనే వానిం జంపఁ జూచియుం లక్ష్మణకవి పరులు వలదని ప్రార్థించుటచేఁ గోపమును దగ్గించుకొని శాంతచిత్తుఁ డయ్యెను.

గీ. చెలఁగి యంతకము న్నధిష్ఠించి యాఘు
నతరువాకులలోన సూక్ష్మత వహించి

యున్న యాహరి సాక్షియై యుండె లక్ష్మ
ణాగ్రజక్షేత్రమూర్తి మౌర్ఖ్యంబునకును. 68

రాఘ.—చెలఁగి = సంతసించి, అంతకమున్న = రావణుఁడు వచ్చుటకుఁబూర్వమే, అఘనతరువుఁ = ఆపెద్ద (దట్టమైన) చెట్టును, అధిష్ఠించి= ఆకులలోన = పత్రములనడుమ, సూక్ష్మతఁ = సూక్ష్మరూపమును, వహించి= పొంది, ఉన్నయాహరి = డాఁగియున్న యావానరశ్రేష్ఠము, లక్ష్మణాగ్రజ = రాముని, క్షేత్రహర్త = భార్యనుహరించిన రావణుని, మౌర్ఖ్యంబునకుఁ = మూర్ఖకృత్యమునకు, సాక్షియైయుండెఁ = సాక్షిగానుండెను.

తా. చెట్టుమీఁదఁ జిన్నయాకారమున డాఁగి యున్నహనుమంతుఁడు సీతతో రావణుఁడు చేయు దుస్సంభాషణమును ఆమెను జంపఁబోవుటకు సాక్షియై యుండెను. అనఁగా, ఆమాటలు వినియెను. ఆకృత్యమునుజూచెను.

లక్ష్మ.—చెలఁగి, అంతకుమఁ = ఇతఁడు (కవి) యత్నింపకమున్నె, ఘనతరు = గొప్పవాఁడైన లక్ష్మణకవియొక్క, (ఘన = గొప్పవాఁడు, ఘనతరుఁడు = అంతకంటె (గొప్పవానికంటె) గొప్పవాఁడు. ఘనతముఁడు = అందఱికంటె గొప్పవాఁడు) వాకులలోఁ = వాక్కులయందు, అధిష్ఠించి= ఆవేశించి, సూక్ష్మతవహించి = కనఁబడకుండడాఁగి, ఉన్నయాహరి= ఉన్నట్టి యా విష్ణుదేవుఁడు, లక్ష్మణాగ్రజ = లక్ష్మణకవి, క్షేత్ర = భూమిని, హర్త = అపహరించినదమ్మన్న, మౌర్ఖ్యమునకుఁ = మోటుఁదనమునకు, సాక్షియై యుండెఁ = చూచుచుండె ననుట.

తా. దమ్మన మూర్ఖత్వమునకు లక్ష్మణకవివాక్కులలో లీనమై యున్న భగవంతుఁడే సాక్షియనుట.

వ. తదనంతరంబ హరిప్రసాదలబ్ధ విద్యాధురంధరుం డగునా
నిర్భీకవనచారి తనయున్నచోటు గదలి యల్లన రసాసం
తతిం జేరి సాధువాక్యంబుల ని ట్లనియె. 69

రాఘు.—తదనంతరంబ = పిమ్మట, హరిప్రసాద = సూర్యునియనుగ్రహమున, లబ్ధవిద్యాధురంధరుండు = పొందఁబడిన విద్యలుగలవాఁడు (అగు) అనిర్భీక = అభయరహితుఁడగు, వనచారి = వనచరుఁడు (హనుమంతుఁడు), తనయున్నచోటుగదలి = ఆకులలోనుండి వైటికివచ్చి; అల్లనన్ = మెల్లగా, రసాసంతతింజేరి = సీతకడకువచ్చి, సాధువాక్యంబులన్ = చక్కని మాటలతో, ఇట్లనియెన్ = ఇట్లుచెప్పెను.

తా. రావణుఁ డేగినపిమ్మట హనుమంతుఁడు సీతయొద్దికి వచ్చి మెల్లదిగా నిట్లనుచున్నాఁడు. (సూర్యునియొద్ద హనుమంతుఁడు విద్యాభ్యాసము చేసినాఁడు, అను విషయ మిందు సూచించినాఁడు.)

లక్ష్మ.—తదనంతరంబ = తర్వాత, హరిప్రసాదలబ్ధవిద్యాధురంధరుండగు = భగవత్ప్రసాదముచే సమస్తవిద్యలును నేర్చినవాఁడైన, అనిర్భీకవనచారి—అ, నిర్భీ = నిర్భయుఁడైన, కవనచారి = కవిత్వమార్గమునం దిరుగువాఁడు (అనఁగా నిరాఘాట కవిత్వముం జెప్పు కవీశ్వరుఁడనుట), తనయున్నచోటుగదలి = కూరుచుండిన తావునుండిలేచి, అల్ల = ఆ, నరసాసంతతిన్ = ధర్మారావును, చేరి = సమీపించి, సాధువాక్యంబుల నిట్లనియె.

తా. కోపముడిగినపిదప లక్ష్మణకవి దమ్మన్నయొద్దికేగి సాధువాక్యములతో నిట్లనుచున్నాఁడు.

గీ. అలకింపు లక్ష్మణాగ్రజన్ముఁ డనుప
శమము గూర్ప వచ్చితి మిముఁ జేరఁ
గా వడి నిట నేను బావని సూర్యాద
రాప్తవిద్యగలదు హరిగురుండు. 70

రాఘు.—అలకింపు = సీతా! వినుము. లక్ష్మణాగ్రజన్ముఁడు = శ్రీరాముఁడు, అనుపన్ = పంపఁగా, శమముఁగూర్పన్ = నీకు శోక మునక మిల్లఁజేయుటకై, ఇటకున్ = ఇక్కడకు, మిముఁజేరన్ = మీయొద్దికి, వచ్చితి = వచ్చినవాఁడను. నేను = నేను, పావనిన్ = వాయుపుత్రుఁడను;

సూర్యాదరాప్త విద్యగలదు = సూర్యునియొద్దఁ జదువుకొంటిని (సూర్యశిష్యుఁడను.) హరి = సుగ్రీవుఁడు, గురుండు = నాకుఁ బ్రభువు.

తా. నేను వాయుపుత్రుఁ డగుహనుమంతుఁడను. రాముఁడు నీచిత్తశాంతికై నన్ను నీవున్నతావునకుఁ బంపినాఁడు. నేను సూర్యశిష్యుఁడను. సుగ్రీవుఁడు మాకు రాజు. అని నమ్మకమునకై పలుకుచున్నాఁడు.

లక్ష్మ.—ఆలకింపుము = వినుము, లక్ష్మణాగ్రజన్ముండు = నాయన్నయగు రామకృష్ణయ్య, అనుపన్ = పంపఁగా, శమమున్ = ఓర్పును, కూర్పన్ = కూర్చుటకు, మిముఁ జేరన్, ఇటకు, వచ్చితి = వచ్చితిని. ఏను = నేను, పావని = పవిత్రయగు, సూర్యాదరాప్త విద్యగలదు-సూరి = పండితుల, ఆదరాప్త = దయవలనఁగలిగిన, విద్య= చదువు, కలదు= నాయొద్దనున్నది. హరిగురుండు = ఈశ్వరుఁడే నాకుపదేశించువాఁడు.

తా. నేను మాయన్న పంపిన కారణమున మీకోపము తగ్గించుటకై వచ్చితిని. నేను బెద్దలదయవలన భగవంతుఁడే గురువుగా సమస్తవిద్యలు నేర్చినవాఁడను. అని లక్ష్మణకవి దమ్మన్నతో ననియెను.

వ. అని యనేక ప్రకారంబుల వినయపూర్వకంబుగాఁ బలుకుచున్న వినుచున్న రసాసంతతి యతని హితభావంబున నిరీక్షింపక యిట్లను. లంకాపతి యైననీవు నను భంగింతునని యొకవనచారివేషంబున నిట్లు కపటంబుతో మెల్లన మాటలాడవచ్చినాఁడవు దీన నయ్యెడుపురుషార్థం బేది? నీకు సత్ఫలకారణమేది ? నీవాంఛ కొఱగాదు దుస్సహ ప్రకారంబునను గష్టదశంబొందింపక విపత్తిం గుందింపక యేఁ జెప్పెద నూరకపొమ్మని విస్పష్టంబుగా నాడిన విని యాపటుశేముషీకవనౌకసుండు తదింగితం బుపలక్షించి సముచితంబుగా నిట్లనియె.

రాఘ.—అని, అనేకప్రకారంబులన్ = పలువిధములు, వినయపూర్వకంబుగాన్ = మిగుల నడఁకువతో, పలుకుచున్నన్ = చెప్పుచుండఁగా, వినుచున్న + రసాసంతతి = ఆలకించుచున్న సీత, అతనిన్ = అట్లు పలుకుచున్న హనుమంతుని, హితభావంబునన్ = స్నేహభావమున, నిరీక్షించి = చూచి, ఇట్లనున్ = ఇట్లు చెప్పుచున్నది. లంకాపతివైన నీవు = నీవే రావణుఁడవు అనుట. ననున్ = నన్ను, భంగింతునని = = మోసపుచ్చుటకై, ఒక వనచారివేషంబున = ఒక కోఁతిరూపుదాల్చి, ఇట్లు = ఈప్రకారము, కపటంబుతోన్ = మిషపెట్టి, మెల్లన, మాటలాడవచ్చినాఁడవు. దీనన్ = ఈ మోసకృత్యమున, అయ్యెడుపురుషార్థంబు = కాఁబోయెడు ప్రయోజనము, ఏది = ఏమున్నది. నీకు, సత్ఫలకారణమేది = కృతార్థుఁడవగుటకేమి కారణమున్నది. నీవాంఛ = నీకోరిక, కొఱగాదు = తగినది కాదు. దుస్సహప్రకారంబునన్ = నాకు సహింపరానిగతి. కష్టదశం బొందింపక = నన్నుఁ గష్టముల పాలుసేయక, విపత్తిం గుందింపక = దుఃఖముచే వందురనీక, ఊరక పొమ్ము. (అని) ఏఁ జెప్పెదన్ = నేను చెప్పుచున్నదానను. అని, నిస్పష్టంబుగాన్ = ప్రకాశముగా, ఆడినన్ = పలుకఁగా, విని = ఆంజనేయుండు విని, ఆ, పటుశేముషీక = మిక్కిలి బుద్ధిమంతుఁడైన, వనౌకసుండు = వానరశ్రేష్ఠుఁడు (వన+ఓకసుఁడు = అడవి యిల్లుగాఁగలవాఁడు) హనుమంతుఁడు, తదింగితంబున్ = ఆమెయభిప్రాయమును, ఉపలక్షించి = తెలిసికొని, సముచితంబుగన్ = దానికిఁదగినట్లు, ఇట్లనియెన్ = ఈక్రిందిరీతిని పలుకుచున్నాఁడు.

తా. సీత యాంజనేయుని నమ్మక రావణచేష్టితమనియును, దీనివలన నీకేమికోరిక తీఱినది?, మోసముచేసినందున నీకేమైనలాభము కలుగునా పొమ్మనియెను. ఆమెమనస్సు కనిపెట్టి బుద్ధిశాలియగుటచే నాంజనేయుఁడామెకు హితవగునట్లు పల్కుచున్నాఁడు.

లక్ష్మ.—అని యనేకప్రకారంబుల, వినయపూర్వకంబుగాఁ బలుకుచున్నన్ = లక్ష్మణకపిమాటలాడుచుండ, నరసాసంతతి = దమ్మన్న, లంకాపతివైననీవు = లంకనేలకధికారివైననీవు, ననుభంగింతునని యు = నన్ను భంగపెట్టఁదలఁచియా, కవనచారివేషంబునన్ = కపివేషముఁదాల్చి, ఇట్లు కపటంబుతో మెల్లన

మాటలాడ వచ్చినాఁడవు...ఆపటుశేముషీ = ఆవిస్తారమైనబుద్ధిచే, కవనౌకసుండు=కవిత్వమునకు నివాసస్థానమయిన లక్ష్మణకవి, తదింగితంబుపలక్షించి = వానియూహ తెలిసికొని, సముచితంబుగా నిట్లనియెను.

క. ధర శ్రీరామేడ్భక్తుఁడ
గరిమ న్నమ్ము విని నాదుకతన రసాజా
ని రయంబున నినుఁ జేర్చుఁ
దురిత మణఁచి నెమ్మి రాదు దొసఁగొంద నిఁకన్. 72

రాఘ.—ధరన్ = ఈభూమియందు, శ్రీ రామ+ఈట్+భక్తుఁడన్ = రాముఁడను, రాజునకు, సేవకుఁడను, గరిమన్ = గౌరవమున, నమ్ము=నన్ను విశ్వసింపుము. నాదుకతన్ = నామూలమున, విని = నీవిక్కడనున్నట్లు తెలిసికొని, రసాజాని=రాముఁడు (భూపతియనుట), దురితమణఁచి = రావణరూపమైన పాపమునుబోఁగొట్టి, నినున్=నిన్ను, రయంబునన్ = శీఘ్రముగా, నెమ్మిన్, చేర్చున్=సుఖమును బొందించును. ఇఁకన్=ఇంక, దొసఁగొందన్= కష్టపడుటను, రాదు=నీకులేదు. నీకేమియు హానిరాదు.

తా. నేను రామభక్తుఁడను. నేను నీవృత్తాంతము చెప్పఁగనే రాముఁడు రావణుని సంహరించి నిన్ను గొనిపోవును. ఇఁక నీకు భయములేదు.

లక్ష్మ—ధరన్, (నేను) శ్రీ రామేడ్భక్తుఁడన్ = విష్ణుభక్తుఁడను, గరిమన్, నాదుకతన్ = నాచరిత్రమును, విని, నమ్ము. నరసాజా=పద్మనాభా, దురితము = ఈమాన్యముహరించినపాపము, నినున్=నిన్ను, అణఁచి = చంపి, నిరయంబునన్ = నరకములో, చేర్చున్=ప్రవేశపెట్టును. దొసఁగున్ = ఆపదను, ఒందన్=పొందుటచే, నెమ్మి=ఇష్టము, ఇఁకన్, రాదు.

తా. నేను భగవద్భక్తుఁడను, నాభూమిని హరించితివి. నీకు నరకము తప్పదు. "స్వదత్తాం పరదత్తాం వా యో హరేత వసుంధరామ్, షష్టిర్వర్ష సహస్రాణి విష్ఠాయాం జాయతే క్రిమిః" అను న్యాయముచొప్పున నీ కాపదయేకాని సౌఖ్యము రాదు. అని లక్ష్మణకవి చెప్పుచున్నాఁడు.

క. లే దమ్మా కష్టము నీ
కేదమ్మా సేగి భీతి ఘృణ నీ వొందన్
రాదమ్మా యిఁక మిన్నక
పోదమ్మ మదుక్తి నిజము పొలుపు గదమ్మా. 73

రాఘ.—అమ్మా=ఓతల్లీ! నీకున్, కష్టము, లేదు=ఇంకమీఁద నీకుఁ గష్టమురాదనుట. సేగి=కీడును, భీతి = భయమును, ఏదమ్మా = ఎక్కడమ్మా! ఎక్కడను లేదు. నీవు, ఘృణనొందన్, రాదమ్మా = నీకునిందరాఁగూడదు. ఇఁకన్, మదుక్తి = నామాట, నిజముపొలుపుగదమ్మా = సత్యస్వరూపమైనదిగదమ్మా, మిన్నకపోదమ్మా = సత్యవాక్యము నిష్ఫలము కాదమ్మా.

తా. స్పష్టము.

లక్ష్మి.—దమ్మా=దమ్మన్నా, లే=లెమ్ము. నీకేకష్టము; దమ్మా? సేగి=అనుభవము, భీతి=భయము, నీకే = నీకేవచ్చును. నీవు, ఘృణన్ = జుగుప్సను "ఘృణాజుగుప్సాకృపయోః" అని నిఘంటువు. ఒందన్ = అనుభవించుటకు, దమ్మా=దమ్మన్నా, రా=రమ్ము. ఇఁకన్, మిన్నక=ఊరక, పో=పొమ్ము. మదుక్తి = నామాట, నిజము=నిశ్చయము. పొలుపుగన్=చక్కఁగా.

తా. నామాటలు సత్యముగలవి కాఁబట్టి, నీకుఁ గష్టము వచ్చును. కీడు, భయము నీకుఁ గలుగును. నింద నీకుఁ గలుగును. అని యొకరీతి తాత్పర్య మిచ్చెవనుట.

క. అని యి ట్లనేకములు పెం
పెనయంగాఁ బలికి జీవితేశునికడకుం
జనుసమయము నీ కిదె వ
చ్చెను వేగిరపడకు మనుచుఁ జెప్పెచు మఱియున్. 74

రాఘ.—అని, ఇట్లు, అనేకములు = పెక్కులు, పెంపెనయంగాఁ బలికి = ఆమెకు సంతోషము కలుగునట్లుచెప్పి, నీకున్, నీకు, జీవితేశునికడ

ఘన్ = భ ర్తయొద్దకు, చనుసమయమువచ్చెను = వెళ్లు కాలము సమీపించినది. ఇదె=ఇదిగో (అతిశీఘ్రముగాననుట), వేగిరపడకుము=నీవుతొందరపడి ప్రాణా పాయ ప్రయత్నములు చేసికొనకుము, అనుచున్, చెప్పుచున్, మఱియున్.

తా. అమ్మా నీ పెనిమిటియొద్దికి నీవు త్వరలోనె వెళ్లఁ గలవు. నీవు శాంతము వహించి యుండుము.

లక్ష్మ.—అని, యిట్లు, అనేకములు=ఎన్నో వాక్యములు, పెంపెనయం గాఁబలికి, చక్కఁగాఁజెప్పి (తనయతిశయము కొలఁది నిందించి) నీకు, జీవి తేశునికడకున్ = యమసన్నిధానమును. "జీవితేశో యమప్రియా" నిఘం టు. జీవితేశుఁడన యముఁడు, భర్తయనర్థమే. చనుసమయము = పోయెడు కాలము, ఇదెవచ్చెన్=మిక్కిలి సమీపించెను. వేగిరపడకుము=నీకేల? తొం దరపడకుము. అనుచున్, చెప్పుచు, మఱియున్.

తా. నీవు యమలోకమునకుం బోవుదినములు సమీపించినవి. కొంచె మోపిక పట్టుము.

క. నీపతితత్త్వం బంతయు
వ్యాపకతం జెందునట్లు వర్ణించెద నే
నోపికవాణీ రచనా
నైపుణి నీమదికి నొప్పి నాటుకొనంగన్. 75

రాఘు.—ఓపికవాణీ=సీతమ్మా! నేను, రచనానైపుణిన్ = కల్పనాచమ త్కారము. నీమదికిన్ = నీహృదయమునకు, ఒప్పి=ఇష్టమై, నాటుకొనంగన్ = చక్కఁగా మనస్సునకెక్కునట్లు, నీపతితత్త్వంబు = నీభర్తయైన రాముని వాస్తవ చరిత్రమంతయును, వ్యాపకతం జెందునట్లు = ప్రకటమగునట్లు, వర్ణించెదన్ = నీయెదుట నిపుడు చెప్పుచున్నవాఁడను.

తా. అమ్మా, నావాక్యచమత్కారమున శ్రీరామునిగుణములు నీమన స్సున కెక్కునట్లు కొన్ని వర్ణించెదను. అప్పుడైనను నన్ను నమ్మెదవా యనుట.

లక్ష్మ.—నీపతితత్వంబంతయున్ = నీ పాపకృత్యముల ననుట, నేను, ఓపికన్ = శ్రద్ధతో, వాణీరచనానైపుణిన్ = మాటలపొందిక చేత, నీమదిన్ = నీయుల్లమునకు, నొప్పిపాటుగానంగన్ = బాధతగులునట్లు, వ్యాపకతం జెందునట్లు, నీవు పాపాత్ముఁడ వని యెల్లవారికిఁ దెలియునట్లు వర్ణించెదను.

తా. నీపాపకృత్యము లోకులకందఱకు విశదమగునట్లును దానివలన నీమనస్సు నొచ్చునట్లును నావాక్యచమత్కారముచే వర్ణించుచున్నాఁడ నని దమ్మన్నతో లక్ష్మణుఁడు పలుకును.

వ. అని తద్గుణంబులు కొన్ని యుగ్గడించు చుంగరంబు మహా
దరస్ఫూర్తిఁ జూపినం జూచి తలయూఁచి యప్పు డయ్యు
మ రాట్సన్నిధి యబ్బినట్లు పరవశీత్వంబునొంది తనతోఁ
బల్కినపల్కులకుం దగుమాటలాడె. మఱియు నతండు ము
న్నేలంగై కొన్న యన్న రసమాజవరునకుఁ దనయందు
హితవిశ్వాసంబుపుట్టుటకై ప్రార్థనాపూర్వకంబుగాఁ దద్భ
రుశిరోమణి దక్షిణసాణి నవలంబించి హితవచనంబులు
చెప్పి కొంత నిజశక్తి తేటపఱుపక పోరా దనుచు నూ
హించి పూనిక వనంబు బయలుచేసిన నవ్విబుధవిరోధి
ముందే జంబుమాలిముఖ్యభటులం బిలిచి మీర లిప్పుడ
వని మరుత్కుమారు నవ్వలికిం ద్రోచి రం డని పంచినం
బెచ్చుపెరిఁగి వచ్చినవారలం జీరికిఁగొనక హుంకరించి యె
దిర్చినఁ దత్సామర్థ్యంబున నిశ్చేష్టులై యందఱు నాథ
స్థాఖ్యు నాశ్రయించి రంత నతండు తదీయాజ్ఞయాతు ల
సత్సమాఖ్య యణంచి యెదురులేక కొంతవడినిలిచి వెండి
యుం దల్లంకాస్థలంబునం దాశముఖ్యాయత్తవృత్తియై చే
రుటకతన నాలంకాపతి సభాస్థానంబు గదిసి కూర్చుండి త
దభిముఖంబుగా నిట్లనియె.

రాఘ.—అని, తద్గుణంబులు=రామగుణములను, కొన్ని=కొన్నింటిని, ఉగ్గడించుచున్=కొనియాడుచు, (ఉదాహరణరూపమునఁ జెప్పుచు) ఉంగరంబు=రాముఁడిచ్చిన యుంగరమును, మహాదరస్ఫూర్తిన్ = మిక్కిలి యాదరాతిశయమున, చూపినన్=కనఁబఱుపఁగా, చూచి=వీక్షించి, తలయూఁచి=ఇదినిజముగ రాముని యుంగరమె రాక్షసకృత్యము కా దని యెంచి, అప్పుడు=ఆసమయమునందే, అయ్యమ=ఆయమ్మ, సీత, రాట్సన్నిధి = పెనిమిటిదగ్గఱ తావు, అబ్బినట్లు=దొరకినట్లు, పరవశత్వంబునొంది=సంతోషముచే నొడలు తెలియక, తనతోఁ బల్కినపల్కులకున్=తనతో నాడినమాటలకు. తగుమాటలాడెన్ = ప్రత్యుత్తర మిచ్చెను. మఱియుం, అతండు=హనుమంతుఁడు, మున్ను=పూర్వము, ఏలన్=రక్షించుటకై, కైకొన్న=పూనిన, అన్నరసమాజవరునకున్=ఆమనుష్యశ్రేష్ఠుఁడైన రామునకు, తనయందున్=తనవిషయమై, హితవిశ్వాసంబుపుట్టుటకై = ఇష్టమగు నమ్మిక కలుగుటకై, ప్రార్థనాపూర్వకంబుగాన్=ప్రార్థించుచు, తద్భీరుశిరోమణి.=ఆ స్త్రీరత్నము, దక్షిణపాణిన్=కుడిచేయి, అవలంబించి=పట్టుకొని (బతిమాలుచుఁ జేయిపట్టుకొని), హితవచనంబులుచెప్పి = ఆమెకిష్టమైనమాటలు పలికి, కొంత, నిజశక్తి = తనసామర్థ్యము, తేటపఱుపక=బైలుచేయక (తెల్పక), పోరాదనుచున్ = పోఁగూడదని, ఊహించి=ఎంచి, పూనికన్=ప్రజ్ఞచే, వనంబున్ = అశోకవనమును, బయలుచేసినన్ = చెట్టుచేమలు విఱుగఁగొట్టివేయఁగా, అవ్విబుధవిరోధి = రావణుఁడు, ముందే=ప్రథమమునందు, జంబుమాలిముఖ్య = జంబుమాలి మొదలైన, భటులన్=పరివారమును, పిలిచి=రప్పించి, మీరలు=మీరు, ఇప్పుడు, వనిన్ = వనములోనుండి, మరుత్కుమారున్=హనుమంతుని, అవ్వలికిం ద్రోచి రండు = అవతలకు గెంటిరండు, అని, పంచినన్=పంపఁగా, పెచ్చుపెరిఁగి = విజృంభించి, వచ్చినవారలన్ = అక్కడకరుదెంచిన జంబుమాలి మున్నగువారిని, చీరికిఁగొనక=లక్ష్యముసేయక, హుంకరించి = గద్దించి, ఎదిర్చినన్=తిరుగఁబడఁగా, (హనుమంతుఁడు) తత్సామర్థ్యంబునన్=హనుమంతుని శక్తిచేత, నిశ్చేష్టులై = ఏమియుం జేయఁజాలక, ధర్మాఖ్యునిన్ = యమధర్మరాజును,

ఆశ్రయించిరి = శరణుచొచ్చిరి (చచ్చిరియనుట). అంతన్ = తర్వాత, అతండు = వానరవీరుఁడు, తదీయ = రావణునియొక్క, అక్ష = అక్షుఁడను, యాతు = రాక్షసుని, లసత్సమాఖ్యయణఁచి = పెద్దపేరు నీరుచేసి (అక్షునిఁజంపి), ఎదురులేక = ఎవ్వరును దనకడ్డు వచ్చువారు లేనికారణమున, తల్లంకాస్థలంబునందున్ = లంకలో, కొంతవడినిలిచి = ఒక్కింతసేపువిశ్రమించి, ఆశముఖ్యాయత్తవృత్తియై = (చూడవలయునను) ఆశముఖ్యముగాఁ గలవాఁడగుటచే, లంకాపతిసభాస్థానంబుగదిసి = రావణుని కొల్వుకూటమునకేగి, కూర్చుండి తదభిముఖంబుగాన్ = ఆరావణునికెదురుగా (నిలిచి) ఇట్లనియె.

తా. సీతను నమ్మించి యుంగరము జూపి యామె సంతసించిన పిమ్మటఁ దన ప్రభావము కొంత జూపఁ దలఁచి తోఁటలోనిచెట్టులన్నియుం విఱిచివైచెను. రావణప్రేరితులై జంబుమాలి అక్షుఁడు మొదలగువారు హనుమంతునిపైఁ గడిసి యేమియుం జేయఁ జాలక మడిసిరి. పిమ్మట నాతఁడు చూడవలె నని యిచ్చపడి రావణునియెదుట కేగి యిట్లనియె.

లక్ష్మ.—అని - తద్గుణంబులు = దమ్మన్నగుణములు, ఉగ్గడించుచున్ = నిందాపూర్వకముగఁ బ్రకటించుచు, కరంబు = మిగుల, మహా = విస్తారమగు, దర = భయముయొక్క, స్ఫూర్తిన్ = స్ఫురణను, చూపించినన్ = కనఁబడునట్లు చేయఁగా, చూచి = దమ్మన్నచూచి, తలయూఁచి, అప్పుడు, అయ్యమరాట్సన్నిధియబ్బినట్లు = ఆయమధర్మరాజును సమీపించినట్లు (వచ్చినట్లు) పరవశత్వంబునొంది = పరవశమైనశరీరముతో, తనతోఁబలికినపలుకులకుఁ దగుమాటలాడెను. (లక్ష్మణకవికి సమాధానముచెప్పెను.) మఱియున్ - అతండు = లక్ష్మణకవి, మున్ = మునుపు, నేలన్ = భూమిని, కైకొన్న = పుచ్చుకొనిన, అన్నరసమాజవరునకున్ = నరసయ్యమ్మపుత్త్రులలో జ్యేష్ఠుఁడైన దమ్మన్నకు, తనయందు, హితవిశ్వాసంబు = ఇష్టమగునమ్మకము, పుట్టుటకై = కలుగుటకు, ప్రార్థనాపూర్వకంబుగన్ = వేఁడుకొనుచు, తద్భీరుశిరోమణి = భయశీలుఁడైన దమ్మన్నయొక్క, దక్షిణహస్తంబు = కుడిచేయి, అవలంబించి = పట్టుకొని, హితవచనంబులుచెప్పి = నీకునాకువాదమెందుకు, విరోధమువలన ఫలములేదని పలికి, కొంత = కొంచెము, నిజశక్తిన్ = తనసామర్థ్యమును, తేటపఱుపక పోరా

పని = ప్రకటింపకుండ వెళ్లుట తగదని, ఊహించి=ఆలోచించి, పూని=యత్నించి, కవనంబు బయలు చేసినన్ = తనకవిత్వమును బైటఁబెట్టఁగా, నవ్వి = హాసించి, (అంతకోపించినవాఁడు చేయిపట్టిబతిమాలుటయేమని) బుధవిరోధి= పండితద్వేషి (దమ్మన్న), మున్ందేజంబు=మున్నుగల ప్రకాశమును, మాలి=తగ్గి, ముఖ్యభటులఁబిలిచి = సేవకులంబిలిచి, మీరలు = మీరందఱును, ఇప్పుడు = ఇప్పుడే, అవనిమరుత్కుమారున్-అవని=భూమిలోనున్న, మరుత్=దేవతలగు బ్రాహ్మణులు, అవనిమరుత్తులు, భూదేవులు. అవనిమరుత్కుమారున్ = లక్ష్మణకవిని, అవ్వలికిం ద్రోచిరండని పనిచినన్ = బైటికిఁ దఱిమివేయుఁడని, పలికినన్=ఆజ్ఞ పెట్టఁగా, పెచ్చుపెరిఁగి = ఆభటులు గర్వించి, వచ్చినన్, వారలన్ = వారిని, చీరికింగొనక = గణింపక, హుంకరించి = ఉహ్హాని, ఎదిర్చినన్ = ఎదుర్కొనఁగా, తత్సామర్థ్యంబునన్=ఆలక్ష్మణకవిశక్తికి, నిశ్చేష్టులై = చేష్టలుడిగి, అందఱున్=భటులు, ఆధర్మాఖ్యున్=ధర్మారాయని, ఆశ్రయించిరి = అనుసరించిరి. ఎదురులేక అంతన్, అతండు = లక్ష్మణకవి, తదీయ = దమ్మన్నయొక్క, అక్షయ=నిస్సారమైన, అతుల=సామ్యములేని, సత్ప్రమాఖ్యనడంచి = ప్రఖ్యాతిని క్షీణింపఁజేసి, కొంతవడినిలిచి = కొంచెము సేపూరకుండి, (కొంతవడిన్=కొంతత్వరగా) వెండియున్ = మఱియును, తల్లంకాస్థలంబునందున్ = లంకమాన్యమునందు, ఆశముఖ్యాయత్తవృత్తియై-ఆశ=ఆసక్తి, ముఖ్య=ముఖ్యముగా, ఆయత్త = అధీనమైన, వృత్తియై = వ్యాపారముకలదియై, చేరుటకతనన్=చేరినందున, ఆలంకాపతి=లక్ష్మణకవి, సభాస్థానంబుగదిసి = సభలోనికి వచ్చి, కూర్చుండి-తదభిముఖంబుగాన్ = ఆదమ్మనకుఁ బ్రత్యక్షముగా, ఇట్లనియెన్ = ఈరీతిం బలికెను.

తా. లక్ష్మణకవి భయపెట్టియుం బతిమాలియుం దమ్మన్నతోఁ జెప్ప లక్ష్యపెట్టలేదు. మఱియు నవ్వెను. హితవచనంబులు పలికిన మనస్సున కెక్కలేదు. లక్ష్మణకవి కొన్ని పద్యములు చదివినఁ గోపించి సేవకులం బిలిచి వీనిని బైటికిఁ దఱుముఁడని యాజ్ఞాపించెను. కాని యాభటు లాతని నేమిచేయుటకును జాలరైరి. కొల్వులోనికి వచ్చి దమ్మన యెదురుగా నిలిచి కవీశ్వరుఁడు మఱియు నేమో చెప్పుచున్నాఁడు.

ఆ. చలము వలదు బాలిశ మనుష్యధర్మావ
ర జన రాశిదూష్యవృజినచరిత
చెడనిబుద్ధి యేను జెప్పెద నావచ
నములు హితవుగాఁగ నమ్మి మనుము. 77

రాఘ.—చలమువలదు = పట్టుదలమానుము. బాలిశ=మూర్ఖుఁడ! మనుష్యధర్మావర = కుబేరునితమ్ముఁడా, జనరాశిదూష్యవృజినచరిత = జనులచేదూషింపఁదగినపాపచరిత్రముగలవాఁడా! చెడనిబుద్ధి = నాశనముకలుగనిమార్గమును, ఏనుచెప్పెదన్ = నేనుచెప్పుచున్నాఁడను. నావచనములు = నాపలుకులు, హితవుగాఁగ=హితముగ, నమ్మి=విశ్వసించి, మనుము = బ్రతుకుము.

తా. రావణా నీకు నేనుజెప్పెడుహితబోధవలన మేలు కలుగును. నా మాటలు విని యట్లు చేయుము.

లక్ష్మ.—బాలిశమనుష్య=మూర్ఖుఁడా! ధర్మా=ధర్మారామా! చలము వలదు=మత్సరింపకుము. వరజనరాశి=మంచివారలచేత, దూష్య=దూషింపఁదగినవాఁడా! వృజినచరిత=పాపచరిత్రము కలవాఁడా! చెడనిబుద్ధి = నీవుచెడిపోకుండునుపాయము, ఏనుజెప్పెదన్=చెప్పుదును. నావచనములు = నాబుద్ధులు, హితవుగాఁగ=ఇష్టముగా, నమ్మి, మనుము=జీవింపుము.

తా. నాబుద్ధులు వింటివా నీకుఁ జెడుగు వాటిల్లదు.విన వేని చెడెదవని దమ్మన్నతో కవీశ్వరుఁ డనియెను.

క. సతతము రావుల సద్వం
శతిలకరాజుల వనిం గుశలతరులను సు
స్థితి వడి దిరుగఁగ వనచరు
నితరునివలె ననుఁ జులుకఁగ నెంచి చెడకుమీ. 78

రాఘ.—సతతము = ఎప్పుడును, రావుల=రావిచెట్లలో, సద్వంశ=వెదురుపొదలలో, తిలకరాజులన్=బొట్టుగచెట్లులుమొదలగు, వనిన్=వనము

లలోనుండు, కుశలన్ = పర్వులలో, తరులన్ = వృక్షములలో, సుస్థితిన్ = సుఖముగా పడిన్ = వేగముగా, తిరుగఁగన్ = తిరుగువాఁడని, ననున్ = నన్ను, వనచరుని = వానరుని, ఇతరునివలె = నీచునివలె, చులుకఁగ నెంచి, చెడకుమీ = నిరాదరించి చెడి పోకుము. (కుశలతరులన్ = సౌఖ్యముగలిగించు వృక్షములలో ననినను లెస్స.)

తా. నన్ను సామాన్యవానరమువలె నెంచి చెట్లు చేమలలోఁ దిరుగు నీక్రోఁతిమాటల కేమి యని నిర్లక్ష్యముగాఁ జూడకుము.

లక్ష్మ.—సతతము = నిచ్చలు, రావులసద్వంశతిలకరాజులు = రావువారి వంశస్థులగుభూపతులు, (రావు + లసద్వంశతిలక) అవనిన్ = లోకములో, కుశలతరులు = నేర్పరులు, అనుసుస్థితిన్ = అనునట్టిమంచిస్థితినే, పడిన్, తిరుగన్ = తిరుగువాఁడను, కవనచరుని = కవిత్వవృత్తియందుఁ జరించువానిని, ననున్, ఇతరునివలె = పెఱవానినిగా, చులుకఁగనెంచి = తేలికచేసి, చెడకుమీ = చెడవలదు. "ఇతరస్త్వన్యనీచయోః" అని నిఘంటువు.

తా. నేను రావువంశస్థులగు ప్రభువుల ప్రఖ్యాతి ప్రకటించుచుఁ దిరుగుకవీశ్వరుఁడను. నన్నుఁ బరునిగా నెంచవలదు.

క. తివిరి మును లంక కరమై
దువరా లటుగాకయుండఁ దుదికీ విపుడ
య్యవనిజ ననింద్య దుర్గా
ని వగుచుఁ గైకొనుట హానినిం జెందుఁ జుమీ. 79

రాఘ.—తివిరి = కుతూహలమున, మును = మునుపు, లంక = ఈలంకాద్వీపము, కరము = మిక్కిలి, ఐదువరాలు = ముత్తైదువ, అటుగాకయుండఁగన్ = ముత్తైదువ ముండయగుటకే, తుదికిన్ = నీయంత్యకాలమునకు, ఈవు = నీవు, ఇపుడు, అనింద్యన్ = పూజ్యురాలైన, అయ్యవనిజన్ = సీతను, కైకొనుట = గ్రహించుట, హానిని = మోసమును, చెందుఁజుమీ = లంకకు మోసమువచ్చును సుమా.

తా. నీవు లంకాపతివగుటచే లంక యిపుడు పుణ్యస్త్రీవలెఁ గలకలలాడుచున్నది. నీవు సీతను దెచ్చుటచే నీకు మరణము తప్పదు. అపుడు లంక వైధవ్యముం జెందును.

లక్ష్మ.—తివిరి=యత్నము చేసి, మును = పూర్వము, లంకకరము=లంక నేలపన్ను, ఏదువరాలు=ఇరువదిరూపాయలు, (గోదావరీమండలమున వరా నాల్గురూపాయలు) అటు కాకయుండఁగ = అట్లు కాకుండునట్లు, జననింద్య= జనులచే నిందింపఁబడఁదగినవాఁడా! దుర్మానివగుచుఁ =దురభిమానముం బూని, తుదికిఁ =నీ అంతమునకు, ఈవు = నీవు, ఇపుడు=ఇప్పుడు, అయ్యవనిఁ=ఆ భూమినే, కైకొనుటఁ=పుచ్చుకొనుటవలన, హాని=కీడు, నిందఁ బొందుఁజుమీ= నిన్నుఁ బొందును.

తా. ఎంతయత్నము చేయఁగాఁ జేయఁగా లంక నేలకు అయిదువరాల పన్ను పెరిఁగినది. ఇప్పు డదియును రాకుండ నీవు భూమినే హరించితివి. నీకేదో ముందు కీడు రాఁగలదు.

గీ. ఏడు పందు ముల్లోకంబు లెఱుఁగ లంక
నేలకొల పరక్షేత్రాప్తి మేలుగాదు
పేర్మి నాభూమిజాత సంప్రీతితోడ
వీడు మదియె సౌఖ్యము లిచ్చు వేయునేల. 80

రాఘ.—లంకనేల=ఈలంకాద్వీపము, కొలఁ=హింసచేత, ముల్లోకము లెఱుఁగఁ=స్వర్గమర్త్యపాతాళములకువినఁబడునట్లు, ఏడుపుఁ=రోదనధ్వనిని, అందుఁ=పొందును, పరక్షేత్రాప్తి= పరభార్యలనుహరించుట, మేలు గాదు=మంచిదికాదు. ఆభూమిజాతఁ = సీతాదేవిని, సంప్రీతితోడవీడుము= ప్రియముగా విడిచిపెట్టుము, పేర్మిఁ=గౌరవమున, అదియె = ఆసీతనువిడుచుటయే, సౌఖ్యములిచ్చుఁ= మేలుకలిగించును, వేయునేల=పలుమాటలతో నేమిలాభము.

తా. సీతను నీవు దెచ్చితివి కావున గొప్ప యుద్ధము జరగును. అపుడు లంకాద్వీపముయొక్క యేడుపు మూఁడులోకములకు వ్యాపించును. పరదారను హరింపఁ గూడదు. వేయిమాటలేల సీతను విడిచిపెట్టుము. నీకు మేలు కలుగును.

లక్ష్మి.—లంకనేలకొలఁది=నాభూమికొలఁది, లోకంబులెఱుఁగన్ = అందఱు నెఱిఁగినంతవఱకు, (ప్రసిద్ధముగ) ఏడుపందుములన్=మూఁడుపుట్ల పండుము; పరక్షేత్రాప్తి=ఇతరులభూములను స్వీకరించుట, మేలుగాదు. నాభూమి=నాలంకను, జాతసంప్రీతితోడన్ = పుట్టుచున్నయానందముతో, వీడుము=నాకువదలివేయుము. పేర్మిన్=అతిశయముచే, అదియె=నాదినాకిచ్చుటయే, వేయంనేల, సౌఖ్యములిచ్చున్=సుఖమును గలిగించును.

తా. ఏడుపందులకొలఁది గలనాభూమిని నీవు హరింపఁ దలఁచుట లగ్గుగాదు. మాది మాకిచ్చిన మడిమాన్యము లిచ్చునంతటి ఫలము గలుగును. లేదేని యొగ్గును బొందెదవు.

ఉ. ఏకత లోకగర్హితపుఁగృత్యము లన్నియు మాని ధర్మరా
యాకర మర్థకామమున కాస్పదమైన సువృత్తి నెమ్మియిం
గైకొను టొప్పుఁగాక భుజగర్వమునం బరక్షేత్రమీఁగతిం
జేకొనినన్ యశంబు విలసిల్లునె సద్గతి కేగవచ్చునే. 81

రాఘ.—ఏకతన్=ముఖ్యముగా, లోకగర్హితపుఁగృత్యములు=లోకముచే నిందింపఁబడుపనులు, అన్నియున్=అన్నింటిని, మాని=ఉజ్జగించి,ధర్మ=ధర్మమునకు, రై=సంపదకు, ఆకరము = నివాసమును, అర్థకామమునకున్=ఉచితకామమునకు, ఆస్పదము = ఆధారమును, ఐనసువృత్తిన్ = అయినట్టి మంచివృత్తిని, కైకొనుట = అవలంబించుట, ఎమ్మెయిన్=ఎట్లయినను (అన్ని విధములు), ఒప్పుఁగాని=తగునుగాని, భుజగర్వమునన్ = బాహుబలగర్వముచే, పరక్షేత్రమున్=ఇతరులకాంతను, ఈఁగతిన్=ఈరీతిగా, చేకొనినన్=గ్రహించినంతనె, యశంబు విలసిల్లునె = కీర్తివ్యాపించునా? సద్గతి కేగవచ్చునా= పుణ్యలోకములు కలుగునా?

తా. పరులు నిందించుకార్యములను విడిచి న్యాయముగా సత్కార్యములం జేయవలయును. గాని గర్వముచే నితరకాంతలను దెచ్చి పొందినంత నేమిలాభము అని యాంజనేయుని వాక్యము.

లక్ష్మ.—ధర్మరాయా=ధర్మన్నా, ఏకతఁ=ఒక్కఁడవై, లోకగర్హితపుఁ గృత్యములు=జనులునిందించు కార్యములను, ఎల్లనుమాని=అన్నిటినివదలి, కరము=మిక్కిలిగా, అర్హకామమునకుఁ = తగినవాంఛకు, ఆస్పదము=స్థానము, ఐనసువృత్తిఁ=అయినట్టి సద్వర్తనమును, కైకొనుట = అంగీకరించుట, ఒప్పుఁగాక=యోగ్యలక్షణముగాని, భుజగర్వమునఁ = బాహుబలమునం గలిగిన యహంకారముచే, పరక్షేత్రముఁ = ఇతరులభూములను, ఈగతిఁ= నీవలె, చేకొనినఁ = పట్టుకొనినంతనె, యశంబువిలసిల్లునె = కీర్తికలుగునా, సద్గతి కేగవచ్చునా=స్వర్గము దొరకునా.

తా. సద్వృత్తి విడిచి బాహుబలముచే గర్వించి యితరులమాన్యముం గొనినంతనె పుణ్యమా పురుషార్థమా. బొందతోఁ గైలాసమున కేగెదవా యని కవీంద్రుఁడు పల్కెను.

ఉ. తమ్ములు సద్గృహమ్ములు సుతప్రకరమ్ములు సొమ్ము లిష్టవ
ర్గమ్ములు వైభవమ్ములు జగమ్ములు గ్రమ్మఁగ నెమ్మి నుండి పా
పమ్మనిశ మ్మొనర్చుట నెపమ్ముగఁ గీడగు నాదుపల్కు వే
దమ్మని రూఢి నమ్ము విహితమ్ము కులమ్ము బలమ్ము నిమ్మగున్.

రాఘ.—తమ్ములు=సోదరులు, సద్గృహమ్ములు = మంచియిండ్లు, సుతప్రకరమ్ములు=గంపెఁడుబిడ్డలు, సొమ్ములు=ధనము, నగలు మొ॥ వైభవమ్ములు=భోగములు, (ఇవియన్నియుం) జగమ్ములు గ్రమ్మఁగఁ = జగద్వ్యాప్తమగునట్లు, నెమ్మినుండి=హాయిగానుండి, పాపమ్ము = పాపకార్యము, అనిశమ్ముఁ=ఎల్లపుడును, ఒనర్చుట నెపముగఁ = చేయుటయనుమిషచే, కీడగుఁ = హానికలుగును. నాదుపల్కు=నామాట, వేదమ్మని=వేదవాక్యమని, రూఢిఁ=నిశ్చయముగ, నమ్ము=నమ్ముము. (నమ్మితివేని) కులమ్ము=వంశము, బలమ్ము = బలమును, ఇమ్మగుఁ=కుదురుపడును. విహితమ్ము=నిశ్చయము.

తా. ఇండ్లు, బిడ్డలు, తమ్ములు, ధనము, పశ్వాదులు, భోగములు గలిగిన నీవు పాపకార్యములు చేయుచున్నందునఁ జెడెదవు. నామాట వేదవాక్యముగ నమ్ముము. నామాట వింటివా నీకు కులము బలము వృద్ధియగును.

లక్ష్మి.—ఈయర్థమునను సర్వము సమానమ కాని - నాదుపలుక=నావాక్యమును, వే=వేగము దమ్మ=దమ్మన్నా, నిరూఢినమ్ము = నిశ్చయముగా నమ్ముము. అని పదవిభాగము నర్థమును జెప్పవలయును.

ఉ. గాసిగ నెల్లలోకములఁ గాఱియవెట్టుట నీతిగాదు రా
కాసులబల్మి ధర్మహితకార్యము లొప్పఁగఁ జేసి నీ వనం
తాసురకోటిఁ బ్రోచుచును దారమహావిభవం బెలర్ప నెం
తేసుఖలీల నుండుటయె నీతియుఖ్యాతియుభూతిహేతువుల్.

రాఘు.—రాకాసులబల్మిన్ = రాక్షసబలముచే, ఎల్లలోకములన్ = ప్రపంచమునంతను, గాసిగ=కష్టపడునట్లు, కాఱియవెట్టుట = యాతననొందించుట, నీతిగాదు=న్యాయముగాదు. ధర్మహిత కార్యములు=పుణ్యకార్య హిత కార్యములను, ఒప్పుగన్=బాగుగ, చేసి=ఒనర్చి, నీవు, అనంత=అంతములేని (లెక్కలేని), అసురకోటిన్=రాక్షసబలమును, ప్రోచుచును=రక్షించుచు, దార మహావిభవంబెలర్పన్ = భార్యవలన లభించిన మంచిభోగముతో, ఎంతేసుఖలీలన్=మిక్కిలిసుఖమును బొందుచును, ఉండుటయె=వర్తించుటయె, నీతియుం=నీతి. ఖ్యాతియుం=ఖ్యాతి. భూతిహేతువుల్=ఐశ్వర్య సాధనమార్గమును.

తా. రాక్షసుఁడనుగదా యని లోకములను బాధింప రాదు. దానిని నీతి యనరు. ధర్మకార్యము లొనర్చుచు నీవారిని రక్షించుకొనుము. నీభార్యతో నీవు చరింపుము. ఇదియె నీతి. నీతివలన ఖ్యాతి గలుగును.

లక్ష్మి.—గాసిగన్=కష్టముగ, ఎల్లలోకముల, ఏలోకమునందును, కాఱియవెట్టుట=బాధపెట్టుట, నీతికాదురా=న్యాయముకాదుచుమా. ధర్మ=ధర్మరాయా, కాసులబల్మిన్ = ధనబలమువలన, హితకార్యములు = ఇష్టములైన పనులను, ఒప్పఁగఁజేసి=తగునట్లొనరించి, నీవు, అనంతాసురకోటిన్ = భూదేవతలైనబ్రాహ్మణులను, ప్రోచుచున్ = పోషించుచు, ఉదార=దాతల, మహా=గొప్పదియగు, విభవంబెలర్పన్=వైభవము విశదమగురీతిని, ఎంతేసుఖలీలన్=మిగులసౌఖ్యముగా, ఉండుటయె, నీతియుం, ఖ్యాతియుం, భూతిహేతువుల్=

ఐశ్వర్యమునకు గారణమును. (భూరిహేతువు అనుపాఠమున, భూరి=బం గారు అని చెప్పుకొనవలయును.)

తా. అందఱిని బాధించుట నీతిగాదు. ధనమున్నందుకు మంచిపను లొనర్చి బ్రాహ్మణులను బోషించుట వైభమున దానధర్మము లాచరించుట నీతి అదియే సమస్తమునకుఁ గుదురు.

మ. రతి నెవ్వారలు నిట్టికార్యము లధర్మా చేయరా రావుసం
తతి శార్దూలమువోలె నీ వొకఁడ వుద్యత్ప్రక్రియం లంకనా
క్షితిసంతానము దివ్యధేను వనసంసేవా పర స్వాశ్రితే
ష్టతరాంచత్ఫల మిచ్చు దాని నరికట్టం జూచి తజ్ఝుండవై.

రాఘు.—రతిన్=ఆసక్తితో, ఎవ్వారలున్ = ఎవ్వరును, ఇట్టికార్య ములు=ఈరీతిపనులు, అధర్మా = ధర్మబాహ్యుఁడా (రావణా), చేయరాదు= చేయఁగడఁగరు. ఆవుసంతతిన్ = ఆవుకూడలు, శార్దూలమువోలె=పులివలె, నీవు, ఒకఁడవు, ఉద్యత్ప్రక్రియన్=మిగులఁగాఢ్యమున, లంకన్=లంకా పట్టణమున, ఆక్షితిసంతానమున్=సీతను, దివ్య...దానిని-దివ్యధేను=కామధే నువు, వన=కల్పవృక్షములు (వీనియొక్క), సంసేవా=సేవించుటవలనె, పర= అత్యంతము, స్వాశ్రిత=తన్నుశరణుపొందినవారికి, ఇష్టతర=ఇష్టములైన, అం చత్=తగిన, ఫలమున్=కోరకను, ఇచ్చుదానిని=ఒసంగునట్టిదానిని (సీతకువిశే షణము),అజ్ఝుండవై=బుద్ధిమాలి,అరికట్టంజూచితి=నిర్బంధింప నెంచుచున్నావు.

తా. ఇట్టి దుష్కార్యము లెవ్వరును చేయరు, ఆవుదూడను బెద్దపులి వలె నెత్తుకొనివచ్చి కామధేనుకల్పవృక్షములం బోలిన సీతను లంకలోఁ బెట్టుకొనఁ జూచుచున్నావు.

లక్ష్మ.—ధర్మా=ధర్మారాయా, రతిన్=కోరికతో, ఎవ్వారలును=ఎట్టి వారును, ఇట్టికార్యములన్=ఇటువంటి చేతను, చేయరు, ఒనర్పరు. ఆరావు సంతతిన్=ఆరావువారివంశమున, శార్దూలమువోలెన్=పెద్దపులిరీతిని, నీవొకఁ డవు=నీవుమాత్రము, ఉద్యత్ప్రక్రియన్ = పుట్టుచున్న ప్రక్రియగుణముకలవాఁ

నీవయి, నాయుర్వరన్=నాభూమిని, మానక=విడువక, ఇట్లుసంపదున్నతివిహీనత్వంబు=ఐశ్వర్యనాశనము, నిందొందుచుంటవునై=నీకుఁగలుగుటకై, కైకొంటివి=గ్రహించితి. నానాదుర్గుణగ్రామణీ=సమస్తదుర్గుణములను గుత్తకుఁగొన్నవాఁడా, (నానాదుర్గుణ గ్రామణీ=గ్రామములను గుత్తగొన్నవాఁడా), ఏమనంగలదు.

తా. నీవంశములో నెవ్వరు నీవంటి ధర్మబాహ్యులు లేరు. నీవు నాభూమిని హరించుటకై జన్మించితివి. నిన్నేమనినఁ బ్రయోజనము గలదు-లేదనుట.

క. సచ్చర్య లుడిగి యఘములు
గ్రచ్చుక గావించునిన్నుఁ గాంచినకతనన్
హెచ్చణఁగియు నీగోత్రం
బుచ్చయశోభారహితసమున్నతి నొందున్. 86

రాఘ.—సచ్చర్యలు=సత్కర్మములు, ఉడిగి=మాని, అఘములు=పాపకార్యములు, గ్రచ్చుక=చుట్టుకొని, గావించు=చేయునట్టి, నిన్ను, గాంచినకతనన్ = చూచుటచేత, నీగోత్రము=నీవంశస్థులు, హెచ్చణఁగి=ఔన్నత్యము తగ్గి, ఉచ్చ=ఉన్నతమైన, యశః=కీర్తిచేతను, భా=కాంతిచేతను, రహితసమున్నతిన్ = అతిశయముతగ్గుటను, ఒందున్=పొందును.

తా. నీవు పాపకార్యములు మెండుగఁ జేయుచున్నకతన నిన్నుఁ గాంచి నీవంశమువారు కళకాంతులు తఱిగియున్నారని యాంజనేయుఁడు రావణునితోఁ బల్కెను.

లక్ష్మ.—సచ్చర్యలు = మంచిపనులు, ఉడిగి=విడిచి, అఘములు=పాపములు, గ్రచ్చుక=ఆవరించుకొని, గావించునిన్నున్=ఒనర్చునట్టినిన్ను, గాంచినకతనన్=చూచినందున, బుచ్చయ = బుచ్చయగారనునీతండ్రి, హెచ్చు, అణఁగి=మంచిపుత్రులు గల రను నతిశయమును వదలి, ఈగోత్రన్ = ఈజగత్తులో, శోభా=కాంతి, రహిత=శూన్యమగు, సమున్నతిన్ = గొప్పదనమును, ఒందున్=చెందును.

తా. నీపలుకులకు నిన్నుం గాంచి నీతండ్రి విన్నఁదనము నొందుచున్నవాఁడని దమ్మన్నతో లక్ష్మణకవి పలుకుచున్నాఁడు.

ఉ. ప్రాజ్ఞత నెవ్విధంబునను రామునకుం దగుసాటిరావు స
ర్వజ్ఞనృసింహుఁ డాయన సువంశమునన్ జనియించి చెడ్డదు
ష్ప్రజ్ఞుఁడవీవు కానఁ గువిచారము లన్నియు మాని ధర్మగో
ష్ఠిజ్ఞులు మెచ్చుచొప్పుగని సీతనువే విడు మంత మే లగున్.

రాఘు.—ప్రాజ్ఞతన్=జ్ఞానమున, ఎవ్విధంబునను = ఏరీతింజూచినను, రామునకున్ = శ్రీరామునకు, తగుసాటిరావు = నీవుసామ్యమునకుఁ దగవు. ఆయన = ఆరాముఁడు, సర్వజ్ఞనృసింహుఁడు = సర్వముందెలిసిన నరసింహస్వామియే. (తొల్లి నిన్ను హిరణ్యకశిపునిం జంపినవాఁడు) ఈవు=నీవు, సువంశమునన్ = బ్రహ్మవంశమునందనుట, జనించి=పుట్టి, చెడ్డ=చెడిన, దుష్ప్రజ్ఞుఁడవు = దుష్పాండిత్యముగలవాఁడవు, కానన్=కాఁబట్టి, కువిచారముమాని = దురాలోచనలనువదలి, ధర్మగోష్ఠిజ్ఞులు = ధర్మవేత్తలు, మెచ్చుచొప్పుగని = పొగడురీతినాలోచించి, సీతను = జానకిని, వే=వేగముగ, విడువుము = విడిచిపెట్టుము, అంతన్ = అంతటితోన్, మేలగున్=లాభమగును.

తా. రామునకు నీవు సాటియే లేదు. నీవు మంచివంశమునం బుట్టి చెడుపాండిత్యములు నేర్చితివి. ఇట్టిపనులు మాని సీతను రామున కిచ్చివేయుము.

లక్ష్మ.—ప్రాజ్ఞతన్ = పాండిత్యమున, ఎవ్విధంబునను, రావు సర్వజ్ఞనృసింహుఁడు = రావుసర్వజ్ఞసింగమనీఁడు, రామునకున్=రామునకుజోడు, తగున్=ఒప్పును. ఈవు=నీవు, ఆయనసువంశమునన్ = ఆసర్వజ్ఞసింగమనీఁడుగారిమంచివంశమున, జనియించి=పొడమియు, చెడ్డదుష్ప్రజ్ఞుఁడవు = చెడ్డబుద్ధిగలవాఁడవు, కానన్=కాఁబట్టి, కువిచారము = కుత్సితాలోచనము, మాని, ధర్మ=ధర్మాత్ములారా, గోష్ఠిజ్ఞులు=సజ్జనసల్లాపములు తెలిసినవారు, మెచ్చుచొప్పనన్ = మెచ్చుకొనులాగున, కని=కనుఁగొని, సీ=ఛీ, తనువే = దేహమే, విడుము=వదలివేయుము, అంతన్=అనంతరము, మేలగున్=లగ్గుగల్గును.

తా. రావుసర్వజ్ఞసింగమనీనివంశమునం దుద్భవించి చెడుపనులు కావించుచుంటివి. నీ విట్టిపనులను మానుము. ఇంతకంటె నీకు మరణముమేలు.

డవై, లంక=లంకభూమిని, సంతాన...త్ఫలము=చక్కఁ బండించి నేద్యము చేసికొను వారికి కల్పవృక్షాదులవలె మంచిపంటను, ఇచ్చుదానిని, నాత్మీతిన్ = నామాన్యము; అజ్ఞుండవై = తెలియనితనంబున, ఆరికట్టంజూచితి = నీపుస్వాధీనము చేసికొనఁ దలంచితివి.

తా. రావువారివంశములో నీవంటివాఁ డెవ్వఁడును లేఁడు. ఇట్టిపని నీవే చేయుచున్నాఁడవు.

మ. అకటా లంకకుఁ గీడుసేయ జననంబై యొప్పు శ్రీపద్మ నా
యక గోత్రోద్భవ ధర్మదూష్యమతివై యిట్లుగైకొంటివా
నక నాయుర్వరసంపదున్నతి విహీనత్వంబు నిం జెందుచుం
టకునై నిన్నిఁక నేమనం గలదు నానాదుర్గుణగ్రామణీ. 85

రాఘ.—అకటా=అయ్యయో, నానాదుర్గుణగ్రామణీ = అనేకదుర్గుణముల్గలవాఁడా, నాయక=లంకాపతీ, లంకకున్ = లంకాద్వీపమునకు, కీడుచేయన్ = హానిచేయుటకు, జననంబై=పుట్టి, ఒప్పు=తగియున్న, గోత్రోద్భవన్=పుడమియందుదయించిన, శ్రీపద్మను = శోభాయుక్తురాలైనలక్ష్మిని, జానకిని, ధర్మదూష్యమతివై = అధర్మహృదయుఁడవై, ఈవు = నీవు, ఇట్లు=ఈవిధమున, గైకొంటి=పుచ్చుకొంటివి. (ఏలగైకొంటివనఁగా) మానక= ఉడుగక, ఆయుః=ఆయువు, వరసంపదున్నతి - వర=శ్రేష్ఠమైన, సంపత్= ఐశ్వర్యముయొక్క, ఉన్నతి=అతిశయము, విహీనత్వంబు=లేకపోవుట, నిం జెందుచుంటకునై = నీకాయుస్సంపదలు చెడుటకై, నిన్ను, ఇఁకన్, ఏమనం గలదు = ఏమనవలసినది. ఈపద్యములో మానకయనువ్యతిరేకక్త్వార్థకము ద్రుతాంతముగ వాడఁబడినది.

తా. నీయాయురైశ్వర్యంబులు నశించుటకై లంకకుఁ కీడుచేయఁ బుట్టినసీతను హరించితివి. ని న్నేమనువాఁడను.

లక్ష్మ.—అకటా, లంకకు=లంకభూమికి, కీడుసేయన్=హానిం దెచ్చుటకై, జననంబై=ఉద్భవించి, ఒప్పు శ్రీపద్మనాయకగోత్రోద్భవ=శ్రీకరంబైన పద్మనాయకవంశంబునంబుట్టిన, ధర్మదూష్యమతివి=ధర్మబాహ్యుఁడవు, ఈవై =

చ. అమరుపితామహుండజుఁడు హంసకులప్రభు వాజియప్పయో
జము జగదేకవర్ణ్యము లసచ్ఛుభపీఠ ముదారవాణియై
సమధికలీల భాసిలు ప్రజాపతి నిన్నిఁక మన్న కుండఁ జే
యమదికి నాదుపల్కొకటియైన రుచింపదిఁ కేమిసేయుదున్.

రాఘ.—అజుఁడు = అజమహారాజు, అమరు=తగిన, పితామహుండు = తండ్రితండ్రి, హంసకులప్రభువు = సూర్యవంశమువాఁడైన, ఆజి=దశరథుఁడు, అప్ప=తండ్రి, ఓజము=ప్రభావము, జగదేకవర్ణ్యము = జనులచేముఖ్యముగాఁ గొనియాడఁబడఁదగినది. (అసచ్ఛుభపీఠము = మంచిమూలముగలది.) ఉదారవాణియై=గంభీరవాక్కులుగలవాఁడుగా, సమధికలీలన్ = అధికవిలాసముతో, భాసిలు = ప్రకాశించు, ప్రజాపతి = ప్రజానాథుఁడగు రాముఁడు, నిన్నిఁకమన్నకుండఁ జేయన్ = నిన్ను బ్రదుకనందాశలేనివానిం జేయుచుండఁగా, నాదుపల్కు = నాహితవాక్యము, మదికిన్ = నీమనస్సునకు, ఒకటియైరుచింపదు = నీకిష్టముగాదు. ఏమిసేయుదున్.

తా. అజుని మనుమఁడు దశరథుని పుత్త్రుఁడు ప్రతాపశాలి యగు రామునిచే నీవు నాశనముం బొందఁబోవుచున్నకారణమున నీకు నాహితవాక్యమొక్కటియైయు నచ్చుటలేదు.

లక్ష్మ.—అజుఁడు = విష్ణుపుత్త్రుఁడు, హంసకులప్రభువాజి=రాజహంస గుఱ్ఱముగాఁగలవాఁడు, పితామహుండు=బ్రహ్మ, అమరున్=పిమ్మను. జగదేకవర్ణ్యము, అప్పయోజము=ఆపద్మము, లసచ్ఛుభపీఠము = ఆబ్రహ్మకు మంచియాసనము, వాణి = సరస్వతి, దార = భార్యయై, సమధికలీలన్, భాసిలు, ప్రజాపతి = బ్రహ్మ, ఇఁక, నిన్ను మన్నకుండఁజేయ మదికిన్, నాదుపలుకు, ఒకటెయైనను రుచింపదు. ఏమిసేయుదును.

మ. ధృతి నీ కబ్బినయవ్వరాలు లసదుత్కృష్టప్రభావాప్తి మే
ల్గతి గావించుటచే నయో పరమహేలం జేరి తీరితి నా
శ్రుతికన్యాయతకోపవాక్పటిమ నిన్ శీఘ్రంబె నిశ్శ్రీకుఁగా
మృతునింగా నొనరించుటల్ నిజముసుమ్మీ మాటలిం కేటికిన్.

రా॰ఘు.—ధృతిన్ = ధైర్యముగ, నీకబ్బినయవ్వరాలు = నీకు బ్రహ్మాదులిచ్చినవరములు, లసదుత్కృష్టప్రభావాప్తిన్=ఎక్కుడు ప్రతాపప్రాప్తిని, మేల్గతిన్=బాగుగ, గావించుటచేన్ = చేయుటచే, అహో=అయ్యయ్యో, ఈరీతిన్=ఈవిధమున, పరమహేలన్-పర=ఇతరుని, మహేలన్=భార్యను, చేరితివి. ఆక్షితికన్యా=ఆసీతయొక్క, ఆయతకోప = అధికకోపముతోఁగూడిన, వాక్పటిమ=వాక్యపటుత్వము, నిన్=నిన్ను, శీఘ్రంబె=వెంటనే, నిశ్శ్రీకుఁగాన్=దరిద్రునిగా, మృతునింగా=చచ్చినవానింగా, ఒనరించుటల్=చేయుంట, నిజముసుమ్మీ=సత్యముసుమీ, మాటలింకేటికిన్=పలుమాటలతోఁ బనిలేదు.

తా. బ్రహ్మాదులిచ్చిన వరముల ధైర్యమున గర్వించి పరదారాపహరణము గావించితివి. సీతయొక్క కోపము చేత నీవు మృతినొందెదవు. ఇది నిశ్చయము.

లక్ష్మ.—ధృతిన్=నీకు, అబ్బిన=దొరకిన, అవ్వరాలు = (అయిదువరాలు) ఇరువదిరూపాయలు, లసదుత్కృష్టప్రభావాప్తిమేల్గతి గావించుటచేన్=నీకుఁబెద్దయైశ్వర్యమును మేడలు మిద్దెలు కలిగించుటచే, అహో, ఈరీతిన్, నాక్షితికిన్ = నాలంకకొఱకు, పరమహేలంజేరితివి = మిక్కిలివిలాసముతో వచ్చితివి, అన్యా...పటిమ-అన్య = ఇతరులకంటెం, ఆయత=ఎక్కుడైన, కోప=కోపమువలనఁబుట్టిన, వాక్పటిమ = నావాక్యదార్ఢ్యముచే, నిన్=నిన్ను, శీఘ్రంబె, నిశ్శ్రీకున్=పేదవానిని, మృతునిన్ = మరణించినవానిని, కాన్ = అగునట్లు, ఒనరించుటలు, నిజము. మాటలింకేటికిన్.

తా. నాభూమిమీఁద వచ్చిన యైదువరాలు నిన్నుఁబెద్దకాఁపురము చేయనిచ్చునా. ఏల నాభూమినిగొంటివి. నాకోపమువలన నీవు చెడిపోదువు.

మ. పగనాభూమిజనాతినిందితచరిత్రత్వంబు దోఁపన్ హరిం
చి గుణాఢ్యుండనుబోలెఁ గ్రొవ్వెదవు రాజీవాక్షులోకేశ్వరున్
జగతీస్తుత్యు సులక్ష్మణున్ సుజనరక్షాదక్షు నాయాశు నే
మిగ భావించితివో దురాత్మ సరి మేల్మే లేవిచారస్థితుల్.

రాఘ.—దురాత్మ, తగన్=ఒప్పునట్లు, ఆభూమిజన్=జానకిని, నాతి నిందితచరిత్రత్వంబు=మిగులనిందింపఁబడని చారిత్రముకలుగుట, తోఁపన్= కనఁబడఁగా (నాతి=స్త్రీని, నిందితచరిత్రత్వంబుదోఁపన్, నాతినిన్=స్త్రీని, దిత = ఖండింపఁబడిన,) హరించి = అపహరించి, గుణాఢ్యుంబునుబోలెన్ = గుణవంతునివలెనే, క్రాలెదవు = వర్తించుచున్నాఁడవు, రాజీవాక్షున్ = పద్మనయనుని, లోకేశ్వరున్ = లోకనాథుని, జగతీస్తుత్యు = విశ్వముచేస్తుతింపఁబడదగినవానిని, సులక్షణున్ = మంచిచిహ్నములు గలవానిని, సుజనరక్షాదక్షున్=సుజనపరిపాలకుని, అయ్యాశున్=ఆరాముని, ఏమిగభావించితివో = ఎవ్వఁడనుకొనుచున్నావో సరి, మేలుమేలు, విచారస్థితుల్ = నీతలంపులు చక్కఁగానున్నవి.

తా. సీత నపహరించి బుద్ధిమంతునివలెఁ దిరుగుచున్నావు. ఆరాముఁడనఁగా నీవు, సామాన్యమానవుఁడని తలఁచుచున్నట్లున్నది. సరిసరి.

లక్ష్మ.—జన=జనులచే, అతినిందిత = మిక్కిలినిందింపఁబడి, చరిత్రత్వంబు=నీచరిత్రగలుగుట, తోఁపన్=తోఁచుటవలన, సాభూమిన్=సామాన్యమును, తగ, హరించి, గుణాఢ్యుండునుంబోలెన్=గుణముగలవానివలె, క్రాలెదవు = నటించుచున్నాఁడవు, రాజీవాక్షున్, లోకేశ్వరున్, జగతీస్తుత్యున్, సులక్షణున్ = లక్ష్మీవంతుని, సుజనరక్షాదక్షున్, నాయీశ్వరున్ = నాదేవుండగుభగవంతుని, ఏమిగభావించితివో = ఏమని యెంచుచున్నావో. దురాత్మ, సరి, మేల్మేలు. విచారస్థితుల్.

తా. సాభూమిని జనులెల్ల నిందించురీతిని హరించి యెఱుఁగని వానివలెఁ దిరుగుచున్నావా? నాయిష్టదైవమగు శ్రీవిష్ణువును నీ వెఱుఁగవా?

మ. ఘృణమేల్ చెప్పితిధర్మసూక్తుల పరక్షేత్రాపహార్యత్వాదికా
రణాన్మృత్యుర్భవేత్ యఁడ వౌట మద్విభుఁడు శ్రీరామావనీజానిప్రే
రణసేయంగనెనీదుప్రాణములు జాఱన్ మీటుదుం గోటరా
వణ సర్పంబులఁ దార్క్ష్యుఁడుం బలెను నవ్యశ్లోకసంపాదినై.

రాఘ.—రావణ, ఘృణ = దయచేత, ధర్మసూక్తులన్ = న్యాయమైనమాటలతో, మేల్ = నీకు మేలుమాటను, చెప్పితిని = పల్కినాను. పరక్షేత్ర = పరభార్యలను, అపహృతి=హరించుట, ఆది= మొదలైన, కారణ= హేతువులచే (ఆదికారణ=మొదటిహేతువగుటచే), మృత్యర్హుఁడవౌటన్ = చచ్చుటకుఁ దగినవాఁడ వగుటచేత, మద్విభుఁడు=నాయేలికయైన, శ్రీరామావనీజాని = శ్రీరామరాజు, ప్రేరణచేయంగనె= పురికొల్పఁగానె, నీదుప్రాణములు = నీయొక్కఅసువులను, గోటన్=గోరుతో, నవ్యశ్లోకసంపాదినై = క్రొత్తకీర్తిని సంపాదించినవాఁడనై, తార్క్ష్యుండు = గరుత్మంతుఁడు, సర్పంబులం బలెను = పాములనుజంపినట్లు, జాఱన్ మీటుదున్ = జాఱిపోవునట్లు చిమ్మెదను.

తా. నీమీఁదిదయచేఁ గొన్నిధర్మవాక్యములు చెప్పితిని. పరస్త్రీలను హరించినకారణమున నీకుఁ జావు నిక్కము. మాయేలిక యైనరాముని సెలవు పొంది నీప్రాణములను నేనే గరుడుఁడు సర్పములఁ గొనినట్లు కొందును.

లక్ష్మ—ధర్మ= ధర్మాత్మా, ఘృణన్ = జాలివొడమి, సూక్తులన్ = మంచిమాటలను, చెప్పితిన్ = చెప్పి బోధించినాఁడను. పరక్షేత్రాపహృతి = ఇతరులభూములను గైకొనుటయే, ఆదికారణ=ముఖ్యమైన హేతువుగాఁగల, మృతి = మృతినొందుటకు, అర్హుఁడవు = తగినవాఁడవు; ఔటన్ = అగుటచేత, మద్విభుఁడు = నాస్వామియైన, శ్రీరామావనీజాని = విష్ణుదేవుఁడు, (శ్రీరామా = లక్ష్మికిని, అవనీజాని = భూమికిని భర్త.) ప్రేరణచేయంగనె= ప్రోత్సాహము చేయఁగనోడనె, రావణ = రోదనముచేయించునట్టి, సర్పంబులన్ = పాములను, తార్క్ష్యుండుబలె = గరుత్మంతుఁడురీతిని, నవ్యశ్లోకసంపాదినై = క్రొత్తపద్యములను రచించి, గోటన్ = నఖాగ్రమున, నీదుప్రాణములన్, జాఱమీటుదున్ = మీటెంతు.

తా. నీవు చెడిపోకుండ హితబోధ చేసితిని. నీవు కావించినపరమాన్యాపహారణమునకుఁ జావు శిక్ష. ఎప్పుడు నాభగవంతుఁడు నన్నుఁ బురికొల్పునో యపుడు నీమీఁదఁ గ్రొత్తగాఁ దిట్టుపద్యములు చెప్పి నిన్నుఁ జంపెదను.

వ. అని ముట్టునాడినం గోపించి. 92

తా. రెండుపక్షములను సుగమము. ముట్టనాడినన్ = మనస్సునొచ్చునట్లు పలికినకారణమున.

క. అంతం గ్రూరతతో హను
మంతుమహావాల మతఁ డమరుతీక్ష్ణత బ
ల్వింతగను జూపుశిఖిశిఖ
లెంతయు నుప్పతిలునట్టు లెసఁగం జేసెన్. 93

రాఘ.—అంతన్ = కోపించినపిమ్మట, క్రూరతతో = క్రూరత్వముచే, హనుమంతు= ఆంజనేయుని, మహావాలము= పెద్దతోఁకను, అమరుతీక్ష్ణతన్ = మిగులవేఁడిని, బల్వింతగనుజూపు = మిక్కిలి వింతగాఁ గనఁబడుచు, శిఖిశిఖలు= అగ్నిజ్వాలలు, ఎంతయున్=మిక్కిలి, ఉప్పతిలునట్టులు = పొడమునట్లు, ఎసఁగంజేసెన్ = చక్కఁగా నొనర్చెను.

తా. కోపించి రావణుఁడు హనుమంతునితోఁకకు నిప్పుముట్టింపించెను.

లక్ష్మ.—అంతన్ = తర్వాత, మంతు = అపరాధములకు, మహా+ఆవాలము = పెద్దయాధారమైన, అతఁడు = ధర్మారావు, క్రూర+తత + ఊహను = క్రూరమగు, విస్తారమైన, యాలోచనతో, బల్వింతగన్ = మిగుల నచ్చెరువుగ, చూపుశిఖి = నేత్రాగ్నియొక్క, శిఖలు=మంటలు, ఎంతయున్, ఉప్పతిలునట్టులు = పుట్టునట్లు, అమరుతీక్ష్ణతన్ = అమరినవేఁడిమి, ఎసఁగన్, చేసెన్.

తా. లక్ష్మణకవిపై ధర్మారావునకుఁ గోపమువచ్చి కన్ను లెఱ్ఱఁజేసెననుట.

గీ. అప్పు డయ్యారె వెట్ట మాయావి చిత్ర
గతి గనుచునుండ నాకవిమతమతిభయ
జనకముగ నొప్పె లంకదెసను గణంగి
తగులుకొనుచింత నంత నెంతయు ఘనముగ. 94

రాఘ.—అప్పుడు= ఆసమయమున, అయ్యారె = అద్దిరా, కణంగి= ప్రయత్నమొనర్చి, లంకదెసను = లంకవైపున, తగులుకొనుచింతన్ = లగ్న

చుగు విచారములతో, అంత = అంతట, ఎంతయుఁ = మిక్కిలి, ఘనముగ = గొప్పదిగా, మాయావి = మాయలుగల రావణుఁడు, చిత్రగతిఁ = బొమ్మరీతిని, కనుఁగొనుచుండఁగ = చూచుచుండఁగా, వెట్ట = వేఁడి, నాక = స్వర్గమునకు, విమత = విరోధులయిన, రాక్షసుల, మతి = మనస్సునకు, భయజనకముగ = భయముం గల్గించునదియై, ఒప్పెఁ = కనఁబడియెను.

తా. లంకాపట్టణము తోఁకనుండి వెడలినమంటచేఁ గాలుచుండ రావణుఁడు నిశ్చేష్టుఁడై బొమ్మవలెఁ గాంచుచుండెను. తక్కినరాక్షసు లందఱును భయపడిరి.

లక్ష్మ.—అప్పుడు = దమ్మన్నగారు కోపింపఁగా, అయ్యారెవెట్టను = ఆర్యవటము, ఆరెవెట్టము, ఆరాటము నను పేరులుగల యాగ్రామము, ఆయా విచిత్రగతిఁ = ఆవిచిత్రమైనవిధమును, కనుచుండఁగ = చూచుచుండఁగా, ఆకవిమతము = ఆలక్ష్మణకవి యభిప్రాయము, లంక దెసఁ = లంకమాన్యము పంకకే, కణంగి = కడఁగి, తగులుకొనుచింతఁ = చిక్కుకొనిన విచారముచే, ఎంతయుం ఘనముగ, అతిభయజనకముగ = మిక్కిలి భయోత్పాతకారణమై, ఒప్పెఁ.

తా. ధర్మారాయునికోపమును ఆర్యవటగ్రామవాసు లందఱుం గనుచుండిరి. లక్ష్మణకవికి లంకమీఁదితలంపు విడువలేదు.

వ. తదనంతరంబ.

క. కోమరొప్ప నపుడు విబుధజ
నము లచ్చెరువొంది కనుఁగొనఁగ హేలన వి
క్రమసుస్థితి నవ్వానర
సమాజమణి యందు వెడలె స్వజనమ్ము గనన్. 95

రాఘ.—కొమరు+ఒప్పన్ = తగినట్లు (బాగుగ), అపుడు = అప్పుడు, విబుధజనములు = దేవతలు, అచ్చెరువొంది = వింతపడి, కనుఁగొనఁ = చూచుచుండఁగా, హేలన = విలాసముగానే, విక్రమసుస్థితిఁ = మంచిపరాక్రమస్థితిచే, అవ్వానరసమాజమణి = ఆవానరసమూహశ్రేష్ఠుఁడైన హనుమంతుఁ

తుఁడు, అందుక్ = ఆయగ్నిలోనుండి అలంకలోనుండి, స్వజనమ్ముగనక్ = రావణునిజనులందఱుఁ జూచుచుండఁగా, వెడలెక్ = వెలువడెను.

తా. దేవతల కాశ్చర్యము కలుగునట్లు లంకలోనుండి హనుమంతుఁడు వెలికి వచ్చెను.

లక్ష్మ.—కొమరు = అందము, ఒప్పక్ = ఒప్పునట్లు, అపుడు, విబుధజనము లు = విద్వాంసులు, అచ్చెరువొందికనుఁగొనక్ = ఆశ్చర్యముతోఁ గాంచుచునుండఁగా, హేలన = హేళనముగ, విక్రమస్థితిక్ = పరాక్రమముతో, నవ్వి = పరిహసించి, అనరసమాజమణి = అనరసాంబాపుత్రులలో శ్రేష్ఠుఁడు, దమ్మన్న, స్వజనమ్ము=తనవారు,కనక్=చూచుచుండఁగా, అందుక్= ఆకొలువుసావడిలోనుండి, వెడలెక్ = వెలువడెను.

తా. దమ్మన్న లక్ష్మణకవిం గాంచి పరిహసించి కొలువులోనుండి లేచెను. ఈపద్యములో నీరెండవయర్థమున, నవ్వి+అనరసమాజమణి యనుతావున, నవ్వానరసమాజమణి యని స్వార్థకకారమునకు సంధిగలదు. 96

వ. అవ్విధంబున.

క. తను నాద మ్మనయాహిత
ఘననికృతిం జేయుచును సగర్వోక్తుల బ
ల్మిని మీఱఁగఁ గణఁగి వడిగ
వననిధియు త్తరమునకు నవారణఁ జొచ్చెక్. 97

రాఘ.—తనునాదమ్ము = శరీరధ్వని, అనయ = నయరహితమై, ఆహిత = కూర్పఁబడిన, ఘన = మేఘముల, నికృతిక్ = తిరస్కారమును, చేయుంచును, సగర్వోక్తులబల్మిని = గర్వయుక్తవాక్యములతో, మీఱఁగక్= అతిశయించునట్లు, కణఁగి = పూని, వడిగక్=శీఘ్రముగ, వననిధియుత్తరమునకు=సముద్రపుటుత్తరదిశకు, అవారణక్ = నిరాటంకముగా,చొచ్చెక్= ప్రవేశించెను.

తా. మేఘగంభీరమై తిరస్కారముం గావించువేగముతో హనుమంతుఁడు గర్వోక్తు లాడుచు సముద్రముయొక్క ఉత్తరభాగమునకుఁ బోయెను.

లక్ష్మ.—ఆదమ్మున = ఆధర్మారావు, తనను (లక్ష్మణకవిని,) ఆహిత = చేయఁబడిన, ఘన = అధికమైన, నికృతిన్ = పరాభవముగలవానింగా, చేయుచును (అనఁగాఁ దిరస్కరించుచు), సగర్వోక్తులన్ = అహంకార వాక్యములచే, బల్మిని = బలముతో, మీఱఁగన్, కణఁగి = యత్నించి, వడిన్ = త్వరగా, కవననిధిన్ = కవిత్వమునకు నిధానమైనలక్ష్మణకవితో, ఉత్తరమునకున్ = ప్రతివాదమునకు, చొచ్చెన్ = ఆరంభించెను.

తా. లక్ష్మణకవిని దిరస్కారభావమునం జూచుచు సగర్వముగ నాతనికిఁ బ్రత్యుత్తర మిచ్చుటకు మొదలిడెను.

వ. అప్పు డానిర్భీకవనచారితో మున్న చ్చటఁ గొలువు దీర్చి
యున్న సమీపస్థితబంధువానరసమాజవరుం డబ్భూమినం
దినీనిరూఢప్రసంగంబు సేయుచుండ నంత నక్కొలువువా
రందఱు నొక్కుమ్మడి వివిధవాక్యమ్ములు పల్కుచుండి రంతఁ
గొంతతడవునకు మఱియును. 98

రాఘ.—అప్పుడు, ఆనిర్భీక = నిర్భయుఁడైన, వనచారితోన్ = వానరునితో, మున్ను = తొల్లి, కొలువుదీర్చియున్న = కొలువున్న, సమీపస్థితబంధువానర సమాజవరుండు-సమీప = తనయొద్ద, స్థిత = ఉండిన, బంధువానర = బందుగులయిన క్రోఁతుల, సమాజ = సంఘములో, వరుండు = మిన్నయైనయంగదుఁడు, అబ్భూమినందినీ = ఆసీతాదేవింగూర్చిన, నిరూఢ = నిశ్చయమైన, ప్రసంగంబు=ప్రస్తావన, చేయుచుండన్ = చేయుచునుండఁగా, అంతన్ = అంతట, అక్కొలువువారందఱును, ఒక్కుమ్మడిన్ = ఉవ్వెత్తుగ, వివిధవాక్యమ్ములు = పలుమాటలు, పల్కుచుండిరి = ఆడుచుండిరి, అంతన్, కొంతతడవునకున్ = మఱికొంతసేపునకు, తాత్పర్యము సులభము.

లక్ష్మ.—అప్పుడు = ఆసమయమున, నిర్భీ = భయరహితుఁడైన, కవన చారితోన్ = లక్ష్మణకవితో, మున్ను = ముందు, అచ్చటన్ = అక్కడ కొలువుదీర్చియున్న, సమీపస్థిత = దాపునఁగూర్చుండిన, బంధువు = చుట్టాలు

గల, ఆనరసమాజవరుండు = దమ్మన్న, అభ్యాఖమిన్ = అలంకనేలను, అంద నీనిఁదొరకుండఁజేయునట్టి, రూఢప్రసంగంబు = రూఢియైన ప్రసంగమును, చేయుచుండన్, అంతన్, అక్కల్వవారందఱున్, ఒక్కుమ్మడిన్ = ఒక్కసారిగా, వివిధవాక్యములు = అనేకవిధములగుపలుకులను, పల్కుచుండిరి = వచించుచుండిరి, అంతన్ = అంతట, కొంతతడవునకున్ = మఱికొంతజాగు చేయుటకు, మఱియున్ = ఇంకను.

క. వారకలంకాపేక్షో
దారత రా జాంబవత్సమాహితబుద్ధి
ప్రేరణ మెఱయఁగఁ బావని
తారాసంతతి సుకీర్తి దనుముందటికిన్. 99

రాఘు.—వారు = ఆవానరులు, అకలంక = స్వచ్ఛమైన, అపేక్షా = చూడవలెననుకోరికయొక్క, ఉదారతన్ = అతిశయముచే, రాన్ = రాఁగా, జాంబవ... ప్రేరణ-జాంబవత్ = జాంబవంతుని, సమాహిత = సమాధానము గల, బుద్ధి = తెలివియొక్క, ప్రేరణ = ప్రేరేపణ, మెఱయన్ = ప్రకాశింపఁగా, పావని= ఆంజనేయుఁడు, సుకీర్తి = మంచికీర్తిగల, తారాసంతతి = అంగదుఁడు, నుందటికిన్ = ఎదుటికి.

తా. వానరులందఱును జూడవలె నని కోరుచుండఁగా, జాంబవంతుఁడును అంగదుఁడు ముందటికిఁ జనుమని సాగించుచుండఁగా నని తాత్పర్యము.

లక్ష్మ.—మాహితబుద్ధిప్రేరణన్ - మాహిత = లక్ష్మీప్రియుఁడైన దేవుని, బుద్ధిప్రేరణన్ = తనబుద్ధిని ప్రేరేపించుటచే, లంకా = లంకభూమి యందలి, అపేక్షా = ఆశయొక్క, ఉదారతన్ = మిక్కుటమగుటచే, రాజాంబవత్స = లక్ష్మణకవి, వారక = మానక, మెఱయన్ = ప్రకాశింపఁగా, పావని = పవిత్రమైన, తారాసంతతి = నక్షత్రములవంటి, సుకీర్తి= సుయశస్సు, తనున్ = తన్ను, ముందటికిన్ = ముందునకు.

తా. ఈశ్వరుఁడు తనభూమిపై యాశయొక్కుడు సేయఁగా లక్ష్మణకవి (క్రియ క్రిందిపద్యములో నున్నది.)

గీ. సాగనిచ్చుచుండ నరిగెఁ జాయమిపుల
సొంపుమీఱుచునాలోకరాజు లసమాన
దృఢతరస్థితి నెరయ దర్శింప నంత
నమర నరసమ్మతనయుండు నతని జూచె. 100

రాఘు.—సాగనిచ్చుచుండఁగ్ = సాగించుచుండఁగా, అరిగెన్ = ఆంజనేయుఁడెదుటికి వెళ్లెను. (సుగ్రీవునియెదుటికి), చాయమిపుల్ = కాంతియతిశయించునట్లు, సొంపుమీఱు, ఆలోకరాజు=దర్శనప్రధానుఁడగు సుగ్రీవుఁడు, లసమాన = ప్రకాశించునట్టి, దృఢతరస్థితి = దార్ఢ్యము, నెరయన్ = వ్యాపించునట్లు, దర్శింపన్ = చూపింపఁగా, అంతన్, అమరన్, నరసమ్మతనయుండు - నరసమ్మత = జనులకిష్టమైన, నయుండు = న్యాయము గలవాఁడు (రాముఁడు), అతనిన్ = ఆహనుమంతుని, చూచెన్ = కనుఁగొనియెను.

తా. జాంబవంతుఁడును, అంగదుఁడును, ఆంజనేయుని, సుగ్రీవుని యెదుటం బెట్టిరి. సుగ్రీవుఁ డాతని రామునిసన్నిధికిం గొనిపోయెను.

లక్ష్మ.—సాగనిచ్చుచుండఁగ్ = (సుకీర్తితన్ను) ముందటికిఁ ద్రోయుచుండఁగా, అరిగెన్ = వెళ్లెను. చాయమిపుల్, సొంపుమీఱు, ఆలోకరాజులు = ఆవెలమదొరలు, అసమాన= సాటిలేని, దృఢతరస్థితి, నెరయన్ = ప్రకాశింపఁగా, దర్శింపఁగా = దర్శనముచేయింపఁగా, అంతన్, అమరన్, నరసమ్మతనయుండు = నరసాంబగారిపుత్రుఁడు (ధర్మారావు), అతనిన్ = ఆలక్ష్మణకవిని, చూచెన్.

వ. అప్పు డానిర్భీకవనచారి యన్నరసమాజవర్యున కిట్లనియె.

రాఘు.—అప్పుడు = ఆసమయమున, ఆనిర్భీకవనచారి = భయములేనియావానరుఁడు, అన్నరసమాజవర్యునకున్ = ఆజనులకురాజైనరామునకు, ఇట్లనియెన్.

లక్ష్మ.—అప్పుడు - ఆనిర్భీకవనచారి = భయరహితుఁడైనకవీంద్రుఁడు (లక్ష్మణకవి), అన్నరసమాజవర్యునకున్ = దమ్మన్నగారికి, ఇట్లనియెన్.

క. కనుఁగొంటిని సీతారమ
ణిని భవిశదకీర్తి వాసి నెరయ ననయ మా
త్మ నిను వదలకున్నది లం
కను బ్రాణముతోడ నీని కామమహిమచేన్. 102

రాఘ.—భ = నక్షత్రములవలె, విశద = స్వచ్ఛమైన, కీర్తిన్=యశస్సుగలిగిన, సీతారమణిని = సీతాదేవిని, కనుఁగొంటిని=దర్శించితిని. వాసి = ప్రసిద్ధి, నెరయన్ = అతిశయింపఁగా, ఆత్మన్ - హృదయములో, అనయమ్మున్ = ఎల్లపుడును, నినువదలక = నిన్నేస్మరించుచుననుట, లంకన్ = లంకాద్వీపములో, నీనికామ మహిమచేన్ = ఎల్లపుడునిన్నుస్మరించుచున్న కారణమున నీయతిశయప్రభావమున, ప్రాణముతోడనున్నది = బ్రదికియున్నది.

తా. సీతను జూచితిని రాక్షసులనడుమ నీస్మరణమాత్రముచేతఁ బ్రాణములు నిల్పుకొని యున్నది గాని లేకున్న జీవింప నేరదు.

లక్ష్మ.—కనుఁగొంటిన్ = జూచితిని; సీ = ఇస్సిరో, తార= స్వచ్ఛమైనముత్తెములలో, మణి = వజ్రములలో, నిభ = సమానమైన, శరద = ప్రకాశమానమైన, కీర్తిన్ = కీర్తిని, వాసి = పోఁగొట్టుకొని, నెరయన్, అనయము = అన్యాయవృత్తి, నిన్నున్, ఆత్మన్ వదలకున్నది = నిన్నువిడుచుటలేదు. ఏల ? లంకను = సామాన్యమును, ప్రాణముతోడన్ = నీకంఠములోఁ బ్రాణముండఁగా, ఈని = ఈయనట్టి, కామ = దురాశయొక్క, మహిమచేన్ = ప్రభావమువలన.

తా. నాభూమి నాకిచ్చుట కిచ్చవోడమని కారణమున నిన్ను అన్యాయదేవత యాశ్రయించినది. నీకీర్తిని ధ్వంసముచేయును. ఇది నేను దెలిసికొంటిని.

గీ. అని నయము నొందుధర్మసమాఖ్యుఁడు హరి
కరుణ నొప్పారు లక్ష్మణాగ్రజునితోడఁ
జెప్పఁగలమాట లన్నియుఁ జెప్ప నతఁడు
సేన నడిపించె లంకపై చిత్తము నిడి. 103

రాఘ.—అని = ఇట్లుచెప్పి, నయమున్ = మంచిని, ఒందు=పొందునట్టి, ధర్మముచేతనైన, సమాఖ్యుఁడు = యశస్సుగల, హరి=వానరశ్రేష్ఠుఁడైన హనుమంతుఁడు, కరుణన్=దయతో, ఒప్పారు=కూడుకొనిన, లక్ష్మణాగ్రజునితోడన్ = రామునితో, చెప్పఁగలమాటలన్నియుఁజెప్పన్, అతఁడు = ఆరాముఁడు, లంకపై, చిత్తమునిడి = లంకాద్వీపమునకుఁ బోవలయునని, సేననడిపించెన్ = కపిసైన్యమును గదలించెను.

తా. హనుమంతుఁడు లంకలోని కెట్లుపోవలయునో మొదలైన సంగతులు తెల్పఁగా నట్లే రాముఁడు సేనతో లంకకై ప్రయాణమును సాగించెను.

లక్ష్.—అనినన్ = అనఁగా, యమునొందు = యమునిఁజేరనున్న, ధర్మసమాఖ్యుఁడు = ధర్మారావు, హరికరుణన్ = ఈశ్వరునికటాక్షముతో, ఒప్పారు, లక్ష్మణాగ్రజునితోడన్=లక్ష్మణకవితో,చెప్పఁగలమాటలన్నియున్, చెప్పన్, అతఁడు = ఆలక్ష్మణకవి, లంకపైచిత్తమునిడి = లంకభూమిపై మనస్సుంచి, సేననడిపించెన్ = చాలసంవాదమును (ప్రసంగమును) జరిగించెను. (సేనయనునది చాలననునర్థమిచ్చునది )

తా. చెప్పఁగలమాటలన్నియుఁ గాలముసమీపించిన దమ్మన్న యీశ్వరానుగ్రహముగల లక్ష్మణకవితోఁ జెప్పెను. ఆకవియుఁ దనభూమివిషయమై చాల సంభాషించెను.

క. వడి నటు నడిపించియుఁ ద
జ్జడధిం దగ దాఁటఁజేయుసదుపాయం బే
ర్పడఁ గోరుచుఁ గడు సద్విధి
నుడుగక యచ్చోట నాతఁడుండెం బేర్మిన్. 104

రాఘ.—వడిన్=వేగముగా, అటు=ఆలంకవైపునకు, నడిపించియుఁ=కపిసేనను దరలించియుఁ, తజ్జడనిధిన్ = ఆ నిక్కడనున్న సముద్రమును, తగన్ దాఁటఁజేయునుపాయంబున్ = తేలికగానవతలియొడ్డునకుఁ బోవుమార్గమును ఏర్పడన్ = కనఁబడుచునట్లు, గోరుచున్ = ప్రార్థించుచు, సద్విధిన్ = మంచినియమప్రకారము, ఉడుగక = నిశ్చలుఁడై, అతఁడు = రాముఁడు,

అచ్ఛోటక్ = ఆకడలియొద్దున, పేర్మిక్ = గంభీరముగా, ఉండెక్ = సముద్రునింబ్రార్థించుచు నిష్ఠతోనుండెను.

తా. నేనను సముద్రసమీపమునకుఁ గొనిపోయి సముద్రము దాఁటుటకై యుపాయముం దెల్పుమని శ్రీరాముఁడు సముద్రునిం గోరుచుండెను.

లక్ష్మ.—అతఁడు = లక్ష్మణకవి, వడిక్ = వడిగా, నడిపించియుక్ = చాలప్రసంగముజరగించి, తత్+జడ+ధిక్ = ఆ మందబుద్ధిని (దమ్మన్నను), తగక్ = బాగుగ, దాఁటఁజేయునుపాయంబు = అతిక్రమించుటకైన యుపాయమును, ఏర్పడఁగోరుచుక్ = చక్కఁగ వేఁడుచు, సద్విధిక్ = సదాచారమును, ఉడుగక = విడువక, అచ్ఛోటక్ = అధర్మాచారాయనివాసమున, పేర్మిక్, ఉండెక్.

తా. కొంత ప్రసంగము చేసి దమ్మన్నగారిను క్షిప్రత్యుక్తులతో నతిక్రమింపవలె నని యెంచుచుండెను.

వ. అంత నచ్చటఁ దద్వృత్తాంతం బంతయు వినినవాఁ డగుటం
జేసి. 105

తా. ఈసంగతియంతయుం వినియున్నవాఁడు కావున. (కెంటికిసమము)

క. లోకాహితు భ్రాతృ బుధా
నీకభయదచరితు ధర్మనిధనాసక్తుక్
వే కనుఁగొని భద్రసమా
ఖ్యాకారి విభీషణుండు కడఁకం బలికెక్. 106

రాఘ.—భద్ర = శుభప్రదమగు, సమాఖ్యా = కీర్తిని, కారి = చేసెడు, విభీషణుఁడు, లోకాహితుభ్రాతృ = లోకకంటకుఁడైనవాని (రావణుని) తమ్ముఁడు, బుధానీకభయదచరితుక్ = దేవతలకు భయముగలిగించుచరిత్రముగలవానిని, ధర్మనిధనాసక్తుక్ = ధర్మనాశనపరుని (అన్నను), వేకనుఁగొని = వేగముగ వచ్చిచూచి, కడఁకక్ = పట్టుదలతో, పలికెక్ = ఈక్రిందిరీతిం బలికెను.

తా. హనుమంతునిచరిత్రము విని విభీషణుఁడు తనయన్నయొద్దికి వచ్చియీక్రిందిరీతిగా బుద్ధులు చెప్పెను.

లక్ష్మ.—విభీషణుండు (వి+భీషణుండు) నిర్భయుండును, భద్రసమా ఖ్యా+ఆకారి = భద్రయ్యయని, పిలువఁబడుచున్నవాఁడును, (దమ్మన్న తమ్ముఁడు) లోకాహితుఁ = అందఱకును విరోధియైన దమ్మన్నను, బుధానీక భయదచరితుఁ=పెద్దలకు బెదరుపుట్టించు స్వభావముగలవానిని, ధనాసక్తుఁ = ధనాపేక్షకలవానిని, ధర్మనిఁ = దమ్మన్నను (ధర్మునిఁ అని యుండవలెను. కాని, ఎల్లఁడు, పుల్లఁడునను తెనుఁగుపదములనువలె నిప్పటిపండితులు కొందఱు గరుడఁడు, ఇత్యాదుల ప్రయోగించుచున్నందునను, శ్లేషలోవచ్చుట చేతను, నిందయందుఁగొందఱు సమ్మతించుటచేతను వ్యుత్పత్తిసంస్కార దోషమన రాదు) భ్రాతఁ=తనయన్నను, వేకనుఁగొని=తొందరగాఁజూచి, కదఁకఁ = ధైర్యముగా, పలికెఁ = ఇట్లు హితముచెప్పెను.

తా. దమ్మన్నతమ్ముఁడు భద్రయ్య యనువాయన యన్నతో నిట్లు హిత వచనములు ముచ్చటించెను. ఈయర్థములో "ధర్మనిఁ" అని యెట్లొ సాధిం చుటకంటె, "ధర్మనిధనాసక్తుఁ" అనియేచెప్పినమేలు.

గీ. జ్యేష్ఠుఁడా లక్ష్మణాగ్రజక్షేత్ర మీవు
వదలకుండిన మోసంబు వచ్చు నింకఁ
జండనిర్భీకవనచారి పిండి ప్రోలి
కవికులవరుతో రిపుత ముఖ్యముగ వలదు. 107

రాఘ.—జ్యేష్ఠుఁడా= ఓయన్నా ! లక్ష్మణాగ్రజక్షేత్రము= రాముని భార్యను, ఈవు = నీవు, వదలకుండుటఁ = విడిచిపెట్టని కారణమున, మోసంబు = హాని, (వచ్చును) ఇంకఁ = ఇంకమీఁద, చండ=యమభటుల వంటి, నిర్భీక = భయములేని, వనచారిపిండి = కోఁతిమూఁక, ప్రోలికిఁ = లంకాపట్టణమునకు, వచ్చుఁ=రానైయున్నది. (కావున)అవికులవరులోఁ = సూర్యకులశ్రేష్ఠుఁడైన రామునితో, "అవిశ్రై క్లేరవామేషే" యని. రిపుత = విరోధము, ముఖ్యముగ = నిశ్చయముగ, వలదు = మానుమనుట.

తా. రావణా ! సీతను నీవు రామున కీయకుంటివా మోస మగును. కపిసేన లంకాపట్టణముమీఁదికి వచ్చును. నీవు రామునితో వైరమును బెట్టు కొనవలదు. (అని విభీషణోక్తి.)

లక్ష్మ.—జ్యేష్ఠుఁడా = ఓయన్నయ్యా! లక్ష్మణాగ్రజక్షేత్రము = లక్ష్మణకవి మాన్యమును, ఈవు, వదలకుండినన్ = ఆకవి కిచ్చివేయవేని, మోసంబువచ్చున్ = కీడు వాటిల్లును. ఇంకన్, చండ = అత్యంతకోపముఁ గలైన, (ని. 'చండో౽త్యంతకోపనః' అని.) నిర్భీ = జంకులేని, కవనచారి = కవియైన, పిండిప్రోలికవికులవరుతోన్ = పిండిప్రోలియను నింటిపేరుగల కవిశ్రేష్ఠునితో, రిపుత = వైరము, ముఖ్యముగ వలదు = ముమ్మాటికి నీకుఁ దగదు.

తా. పిండిప్రోలిలక్ష్మణకవితో నీకు విరోధము కూడదు. ఆయన లంక మాన్యము నాయన కిచ్చివేయకుంటివా నీకు హాని వచ్చును.

వ. ఏమంటేని. 108

సీ. లలి భూతలంబునం దెలుఁగులరా జాంబ
        వత్సమాఖ్య ప్రసిద్ధి వఱలెడునిపు
ణుండు వాగనుశాసనుఁడు తిమ్మఁడోకఁడు ధూ
        ర్జటి రామలింగసంజ్ఞాప్రథితుఁడు
బుధవరుల్ భాస్కరపోతనలాదిక
        వనచారులు మఱియు ననుపమాన
కృతి రామభద్రుండు శ్రీనాథుఁడు గణింపఁ
        దత్సముల్ తదధికుల్ ధరణి లేరు
తే. కళలసోముండు పెద్దన్నకరణి వెలయు
చుండు రెండవవీరుఁ డనూనమతి ని
రూపణముసేయఁ గుండలీంద్రుండు సుమ్ము
లక్ష్మణాఖ్యుఁడు గానఁ జలంబు విడుము. 109

రాఘ.—లలిన్, భూతలమునందున్ = ఈభూలోకమున, ఎలుంగుల రా=ఎలుఁగుబంట్లకురాజైన, జాంబవత్సమాఖ్యప్రసిద్ధిన్ = జాంబవంతుఁడను పేరుప్రసిద్ధిగా, వఱలెడునిపుణుండు=నన్నెకెక్కినవాఁడు, వాగనుశాసనుఁడు=

బ్రహ్మయే (బ్రహ్మయొక్క యంశచే నీయుద్ధము నిమిత్తము పుట్టెననుట), తిమ్మఁడొకఁడు = ఒక వానరుఁడు (హనుమంతుఁడనుట), ధూర్జటి = శివుని యంశమునఁ బుట్టినవాఁడు. ('పురారాతికిఁ గోఁతిపుట్టె రఘురామునికై వడి సీతకైవడిన్' అని ప్రసిద్ధి) కావున, రామలింగసంజ్ఞాప్రథితుఁడు = రామలింగేశ్వరుఁడే యనుట, రామ=శ్రీరాముఁ డిచ్చిన, లింగ=చిహ్నమైన యుంగరమను, సంజ్ఞా=సన్నతో, ప్రథితుఁడు=ప్రసిద్ధికెక్కినవాఁడు, భాస్కరపోత= సూర్యపుత్త్రుఁడైన సుగ్రీవుఁడు, నల = నలుఁడు, ఆదిక = మొదలైన, వనచారులు= వానరులు, బుధుల్=దేవతాంశములనఁ బుట్టినవారు, మఱియున్= వీరుగాక, అనుపమానకృతి = ఉపమానరహితుఁడైన కుశలుఁడు (నేర్పరి). రామభద్రుండు = శ్రీరాముఁడు, శ్రీనాథుఁడు= విష్ణుదేవుఁడే, తత్సముల్= ఆతనితో సమానులు, తదధికుల్ = వానికంటెఁ గొప్పవారు, గణింపన్ = వెదుకఁగా, ధరణిన్ లేరు = భూలోకమున లేరు. రెండవవీరుఁడు=ఆ రాముని తోనున్న రెండవశూరుఁడు, కళలసోముండు=షోడశకలాపూర్ణుఁడైన చంద్రుని వంటివాఁడు, లక్ష్మణాఖ్యుఁడు = లక్ష్మణుఁడు, పెద్దన్నకరణిన్ = తన పెద్దయన్నయైన రామునివలెనే, వెలయుచుండున్, అనూనమతిన్ = విశేషబుద్ధిచేతను, నిరూపణముసేయన్ = ఆలోచింపఁగా, కుండలీంద్రుండుసుమ్ము = ఈలక్ష్మణుఁ డాదిశేషావతారము సుమా, కానన్ = కాఁబట్టి, చలంబు విడుము= పట్టుదల వదలుము.

తా. రామునికి సహాయము చేయుటకై బ్రహ్మ జాంబవంతుఁడుగ, శంకరుఁ డాంజనేయుఁడుగ, దేవతలు తక్కిన కోఁతులుగ, ఆదిశేషుఁడు లక్ష్మణుఁడుగఁ బుట్టిరి. రాముఁడు కేవల విష్ణువే. కావున నీవు వారితో వైరముం గొనుట తగదని హితోపదేశము.

లక్ష్మ.—లలిన్=క్రమముగా, భూతలమునన్=భూమిలో, రాజాంబవత్స = లక్ష్మణకవి, తెలుఁగునన్=ఆంధ్రభాషయందు, మాఖ్య = మల్లెపువ్వులవలె స్వచ్ఛమైన, ప్రసిద్ధిన్=యశస్సుచే, వఱలెడు నిపుణుండు, (ఇచ్చట మాఖ్యయనునది మాఘ్యయని యుండవలెను. "మాఘ్యంకుందం రక్తకస్తు" అని కలదు. రాఘవార్థములో శ్లేషలో "జాంబవత్సమాఖ్య" యని "సమాఖ్య"

యనునర్థము గనుక "ఖ్య" యుండి తీఱవలయును.) వాగనుశాసనుండు = నన్నయభట్టారకుఁడును, తిమ్మఁడు = ముక్కుతిమ్మన్న (ఒకఁడు), ధూర్జటి = ధూర్జటికవి, రామలింగసంజ్ఞాప్రథితుఁడు = రామలింగకవియును, భాస్కర = అళక్కి (వాళక్కి) భాస్కరకవియు, పోతనలు = బమ్మెరపోతరాజకవియు, ఆదికవనచారులు = తొల్లింటికవీంద్రులు, అనుపమానకృతి= సాటిలేని గ్రంథముగల, రామభద్రుఁడు = అయ్యలరాజురామభద్రుఁడును, శ్రీనాథుఁడు = శ్రీనాథకవియుం, గణింపన్, బుధవరుల్ = పండితులు, తత్సముల్ = వారిం బోలినవారు, తదధికుల్ = వారిని మించినవారు, ధరణిలేరు, కళలన్ = విద్యలచే, సోముండు = నాచనసోముఁడు, పెద్దన్నకరణిన్ = అల్లసాని పెద్దనవలె, వెలయుచుండున్, రెండవవీరుండు= ఇద్దఱువీరన్నలలో రెండవవాఁడు (పిల్లలమఱ్ఱిపినవీరన్నకవి), అనూనమతి = మంచిజ్ఞానముకలవాఁడు. నిరూపణము సేయన్ = నిశ్చయింపఁగా, లక్ష్మణాఖ్యుఁడు=ఈలక్ష్మణకవి, కుండలీంద్రుండు సుమ్ము = తిక్కనసోమయాజియే. (అనఁగా సోమయాజికిఁ దుల్యుఁడనుట) కానన్ = ఈకారణములచే, చలంబువిడుము=వానితోఁ బంతము మానుము.

తా. నన్నయభట్టు, తిక్కనసోమయాజి మొదలగు పైనఁ జెప్పఁబడిన గొప్పగొప్ప కవీశ్వరులు పూర్వముండిరి. ఇపుడాంధ్రమున నీలక్ష్మణకవిని మించినవారులేరు. మఱియు నీతఁడు తొల్లింటి కవీంద్రులం బోలినవాఁడు. కాఁబట్టి వీనితో నీవు మత్సరించుట తగదు.

వ. అదియునుంగాక. 110

తా. ఇంతియకాదు. మఱియును విశేషము వినుము. (రెండుపక్షముల సమము).

సీ. సకలగోత్రాపకారకత వర్తిలువాని
    నర్హతనూనపాదాఖ్యవాని
ధర్మనామమ్మునఁ దనరెడువానిఁ బు
    ణ్యజనాధికారినా నమరువాని

శ్రీమత్సముద్రభూరిపరిపాలనదక్షు
గంధవహుండనఁ గ్రాలువానిఁ
బ్రకటమహాకిన్నరసమాజవినియంతఁ
నంధకారాత్యభిఖ్య గలవాని
గీ. ఇనుఁ గలంకిని జీరికిఁ గొననివాఁడ
వును విబుధహితచరితుండు ఘనుఁడు లక్ష్మ
ణాగ్రజుఁడు ధర్మసంప్రయుక్తాత్యమోఘ
గోవితతిఁ గూల్చు క్షేత్రంబుఁ గొనునెపమున. 111

రాఘ.— సకల...వాని-సకల=సమస్తమైన, గోత్ర=పర్వతములకు, అపకారకతఁ = అపకారముచేయుటయందు, వర్తిలువానిఁ= ప్రవర్తించువాఁడైన యింద్రుని, అర్హాతనూనపాదాఖ్యవాని = (తగిన) తనూనపాత్తని బిలువఁబడునగ్నిని, ధర్మనామమ్మునఁ దనరెడువానిఁ = ధర్ముఁడనుపేరుచే నొప్పుయముని, పుణ్యజనాధికారినాఁ = రాక్షసులకురాజని, అమరువానిఁ = ప్రసిద్ధుఁడైన నిర్ఋతిని, శ్రీమత్సముద్ర భూరిపరిపాలనదక్షుఁ = సముద్రములపైనధికారము నడిపించుచున్న వరుణుని, గంధవహుండు = పరిమళమును వహించినవాఁడు, అనఁగ్రాలువాని=అని ప్రసిద్ధుఁడైన వాయువును, ప్రకటమహాకిన్నరసమాజ వినియంతఁ = సమస్తకిన్నరులకు నియామకుఁడైన కుబేరుని. అంధకారాత్యభిఖ్యగలవానిఁ = అంధకాసురునిజంపినవాఁడని పేరుగలశివుని, ఇనుఁ = సూర్యుని, కళంకిని = మచ్చగలచంద్రుని, చీరికింగొననివాఁడవును= లక్ష్యముచేయనివాఁడవును, విబుధహితచరితుండు = దేవహితమైన చారిత్రము గలవాఁడు, ఘనుఁడు = అధికుఁడు, లక్ష్మణాగ్రజుఁడు = రాముఁడు, ధర్మసంప్రయుక్త = ధనుస్సు ప్రయోగింపఁబడిన, అత్యమోఘ=మిక్కిలి నిశ్చయములైన (తిరుగులేని), గోవితతిఁ = బాణపరంపరచే, క్షేత్రంబుఁగొను నెపమున = సీతనుహరించినాఁడవనుమిషచే, కూల్చుఁ = చంపును.

తా. దిక్పాలకులను సూర్యచంద్రులను గణింపఁడు. అమోఘబాణములుగలవాఁడు కావున రాముఁడు తనభార్యను హరించిననిన్నుఁ దప్పక చంపును.

లక్ష్మ — సకల = పెక్కు, గోత్ర = భూములకు, అపకారకతన్ = అపకృతిచేయుటలో, వర్తిలువానిన్ = ప్రవర్తిల్లునట్టివానిని, అర్హతన్ = యోగ్యతచే, ఊన = తక్కువయైన, పాద = చరణములుగలవాఁడు, (అను) ఆఖ్యవానిన్ = పేరుపొందినవానిని (కుంటికాలివాఁడనుట), ధర్మనామమ్మునన్ = దమ్మన్నయను నామమున, తనరెడువానిన్, పుణ్యజనాధికారినాన్ - పుణ్యజన = సత్పురుషులకు, అధిక = అధికమైన, అరినాన్ = విరోధియనునట్లు, అమరువానిన్, శ్రీమత్సముద్రభూరి పరిపాలనదక్షున్ = శ్రీమంతమైన, ముద్రలతోఁ గూడిన, బంగారును రక్షించుటయందుసమర్థుని, గంధవహుండనఁగ్రాలువానిన్ =గర్వమువహించినవాఁడని ప్రసిద్ధికెక్కినవాని, ప్రకట, మహా = విశేషమైన, అఘిన్ = పాపముగలవానిని, నరసమాజ=నరసాంబకుమాళ్లకు, వినియంతన్ = నియామకుఁడైనవానిని, అంధకార=చీఁకటియట్టి, అతి మిక్కుటమైన, అభిఖ్యగలవానిన్ = కీర్తిగలవానిని, కళంకిన్ = కళంకముగలవానిని, నినున్ = నిన్ను, చీరికింగొననివాఁడు= సరకుసేయఁడు, అవును. విబుధ=విద్వాంసులకు, హిత=హితమైన, చరితుండు=నడవడికలవాఁడు, ఘనుఁడు, లక్ష్మణాగ్రజుండు = లక్ష్మణకవి, ధర్మ= దమ్మన్నా, సంప్రయుక్త= చక్కఁగాఁగూర్పఁబడిన, అతి = విస్తారమైన, అమోఘ = అడ్డులేని, గో = మాటలయొక్క, వితతిన్ =సంఘముచే, క్షేత్రంబున్ =లంకభూమిని,కొనుసెపమునన్ = హరించినకారణమున, కూల్చున్ = తిట్టుపద్యములుచెప్పి నశింపఁజేయును.

లక్ష్మ.— లక్ష్మణకవి నిన్ను సరకుసేయఁడు. అతని భూమిహరించితివి. కవీశ్వరుఁడుగావున నిందావాక్యములతోఁ బద్యములం జెప్పి నిన్నుఁ జంపును

చ. అరయఁగలక్ష్మణాగ్రజుఁడుదారుఁడు తద్వరశక్తియొన్నఁగాఁ
దరమె యతండు పాణిని హితంబగునట్టిసుదర్శనంబుచేఁ
బరుల జయించుప్రౌఢహరిభక్తహితుం డరిభీకరుండు నై
ధరణినియోగవృత్తియునుధర్మసువిద్యయునొప్పఁద్రిమ్మరున్.

రాఘ.—అరయఁగన్ = ఆలోచింపఁగా, లక్ష్మణాగ్రజుఁడు = రాముఁడు, ఉదారుఁడు = ఔదార్యముగలవాఁడు, తద్వరశక్తిన్ = అతని బలము, ఎన్నఁగాఁదరమె = చెప్పఁదరమా ! అతండు = ఆశ్రీరాముఁడు, పాణినిహితంబు = చేతనున్నది, అగునట్టిసుదర్శనంబుచే = ఐనచక్రముతో, పరులన్ = వైరులను, జయించుప్రోఁడ= ఓడించునట్టిప్రౌఢుఁడు (అయిన), హరి = విష్ణువు, భక్తహితుండు = భక్తులకుఁ బ్రియామైనవాఁడు, అరిభీకరుండు = శత్రుభయంకరుఁడును ఐ, ధరణిని = భూమిలో, యోగవృత్తియును = యోగీశ్వరవ్యాపారమును, ధర్మసువిద్యయును = ధనుర్విద్యయును, ఒప్పన్ = అతిశయింపఁగా, త్రిమ్మరున్ = సంచరించును.

తా. రాముఁడు కేవలవిష్ణుదేవుఁడే. భూలోకమున యోగవృత్తి గలిగి ధనుర్విద్యావిలాసము గలిగి తిరుగుచున్నాఁడు.

లక్ష్మ.—అరయఁగన్, లక్ష్మణాగ్రజుఁడు = లక్ష్మణకవి, ఉదారుఁడు, తద్వరశక్తి = అతనికవిత్వశక్తి, ఎన్నఁగాఁదరమె = గణింపవలనుపడునా ! అతండు, పాణిని = పాణినివ్యాచార్యునకు, హితం = ప్రియము, అగునట్టి సుదర్శనంబుచేన్ = ఐనవ్యాకరణశాస్త్రముచే, పరులన్ = ఇతరపండితులను, జయించునట్టివాఁడు, హరిభక్తిహితుండు = హరిభక్తులకుహితుఁడు, అరిభీకరుండు= విరోధులకు భీకరమైనవాఁడునై, ధరణిన్, నియోగవృత్తియును= కరణికమును, ధర్మసువిద్యయున్ = ధర్మశాస్త్రమును (ధర్మ= ధర్మారాధయా! సువిద్యయున్ = మంచిచదువును), ఒప్పన్ = కలిగి, త్రిమ్మరున్ = పర్యటనము చేయుచున్నాఁడు.

తా. లక్ష్మణాగ్రజుఁడు వ్యాకరణశాస్త్రములో వాక్యార్థమున నితరులం జయింపంగలశక్తి గలవాఁడు. విష్ణుభక్తుఁడు. నియోగవృత్తియును, గవిత్వ వ్యాపారమునుగూడఁ గలిగినవాఁడు.

సీ. దృఢధామధృతి వినిర్జితసహస్రకరార్జు
నమహీభృన్ముఖ్యుఁ డైనగురుబుద్ధి
బలశాలి గోపాలకులదారకుం డైన
బ్రాహ్మణరాజవర్తను బరశుచి

తానఘశ్రీకరు మానుగ ధర్మసు
జ్యాకర్షణము చేసి యపుడు పరిభ
వించినవాఁ డవు విమలు నాలక్ష్మణా
గ్రజు నిప్పుడేనియుఁ గలసి ప్రణతి
గీ. యొసఁగ నీ వలంకారసహితముగాఁగఁ
నొప్పు కానుక ల్మున్నుగ నొసఁగుము మహి
తనయ సద్బుద్ధి జనులు స్తోత్రంబు సేయఁ
బటిమ నామాట వింటేని బ్రదుకు దన్ను. 113

రాఘ.—దృఢధామ=దృఢమైన తేజమును, ధృతి=ధైర్యమును గలవాఁడును, వినిర్జిత = నిర్జింపఁబడిన, సహస్రకర=వేయి చేతులుగల, అర్జున=కార్తవీర్యార్జునుఁడను, మహీభృన్ముఖ్యుఁడు=రాజవరుఁడుగలవాఁడు, అయిన=అయినట్టి, గురుబుద్ధిబలశాలి=అధిక బుద్ధిబలముచే శోభిల్లువాఁడును, గోపాలకులకున్=భూపతులకు, దారకుండు = ఖండించువాఁడును, బ్రాహ్మణరాజవర్తనుఁడును = బ్రాహ్మణుఁడయ్యు రాజులనడవడిగలవాఁడును, పరశు= గండగొడ్డలిచే, చిత= వ్యాప్తమైన, అనఘ = శ్రేష్ఠమైన, శ్రీ = శోభను, కరుఁన్ = ఒనర్చునట్టి వానిని (పరశురాముని), మానుగన్ = ఒప్పునట్లు, ధర్మ = ధనస్సునందు, సు= బలమైన, జ్యా = నారియొక్క, ఆకర్షణముచేసి = లాగి (ఎక్కుపెట్టి), అపుడు = జనకునిపురినుండివివాహమై వచ్చునపుడు, పరిభవించినవాఁడు = పరాభవముఁ జేసినవాఁడు, అవు=అగునట్టియు, విమలున్ = స్వచ్ఛమైనవానిని, లక్ష్మణాగ్రజున్=రాముని, ఇప్పుడేనియున్ = ఇప్పుడైనను (ఇంకనుమించలేదనుట.), కలసి=కూడి, ప్రణతియొసఁగన్ = నమస్కరించుచు, నీవు, అలంకారసహితముగాఁగన్ = భూషణములతో నిండి, ఒప్పు, కానుకలు=కట్నములు, మున్నుగన్=మొదలైనవానితో, సద్బుద్ధిన్=మంచిబుద్ధితో, జనులు, స్తోత్రంబు సేయన్=నిన్నుఁ బొగడునట్లు, పటిమన్ = పటుత్వముతో, మహితనయన్

=సీతను, ఒసఁగుము = రామునకిమ్ము. నామాటవింటేని=నాహితమునువింటివా, అన్న=అన్నయ్యా, బ్రదుకుదు = జీవింతువు.

తా. సహస్రబాహువులుగల యర్జునుం జయించినపరశురాముని బరిభవించినవాఁడీశ్రీరాముఁడు; నామాట విని ఇప్పుడైనను సీతను భూషణాదులతోఁ గొనిపోయి యీరామున కర్పింపుము.

లక్ష్మ.—దృఢ=దార్ఢ్యముగల, ధామ = కాంతిచేతను, ధృతిన్ = ధీరత్వముచేతను, వినిర్జిత = జయింపఁబడిన, సహస్రకర = సూర్యుఁడును, అర్జున = తెల్లనైన, మహీభృన్ముఖ్యుఁడు = పర్వతశ్రేష్ఠమును (కైలాసము), కలవాఁడు, ఐన = అయిన, గురు = బృహస్పతివంటి, బుద్ధిబలశాలి = బుద్ధిబలముగలవాఁడును, గోపాలకుల = గోపాలమంత్రివలనఁ జనించినవారికి, తారకుండు = తరింపఁజేయువాఁడు, అయిన, బ్రాహ్మణరాజవర్తనున్ = బ్రాహ్మణోత్తముల వ్యాపారముగలట్టియు, పర = శ్రేష్ఠమైన, శుచితా = పరిశుభ్రముచే, అనఘు = దోషరహితమైన, శ్రీకరున్ = శోభాయుంతుని, మానున్ = చక్కఁగ, ధర్మ = ధర్మారాయా! సు = మంచి, జ్యా = భూమిని, ఆకర్షణముచేసి = అపహరించి, అపుడు = ఆనాఁడు, పరిభవించినవాఁడవు = పరాభవముగావించితివి. ఇప్పుడేనియున్ = ఇంకనైన, విమలున్ = పవిత్రుఁడగు, లక్ష్మణాగ్రజున్ = లక్ష్మణకవిని, కలసి = కూడి (స్నేహముచేసి), ప్రణతియొసఁగన్ = దండముపెట్టుచు, నీవ = నీవే, లంకారసన్ = లంకయనుపేరుగలభూమిని, హితముగాన్ = హితమగురీతిని, ఒప్పుకానుకలు = తగినబహుమానములు, మున్నుఁగన్ = మొదలైనవి, ఒసఁగుము = ఇమ్ము. మహిత = కొనియాడఁదగిన, నయ = న్యాయముగల, అన్న = అన్నా, సద్బుద్ధి = మంచిబుద్ధిగలవాఁడ, జనులు, స్తోత్రంబుసేయన్ = పొగడునట్లు పటిమన్ = గట్టిగా, నామాటవింటేని = నాబుద్ధిని పాటించితివా, బ్రదికెదు = బ్రతికియుందువు.

తా. గోపాలమంత్రికుమారుఁడైన లక్ష్మణుని మాన్యమును హరించి మున్ను పరాభవించితివి. ఇప్పుడైనను బహుమానపూర్వకముగ నాతనికి భూమిని యీతని కిచ్చి స్నేహముచేసికొంటివా నీకు మేలు. నామాట వినుము.

వ. అని మఱియు నిట్లనియె. 114

ఉ. బాణుని భారవిన్ ఘనసుబంధుని నాభవభూతి సర్వగీ
ర్వాణపదంబులం గొనినవారిఁ దదన్యుల విందుమే కదా
క్షోణిని వారికన్న మతిసూక్ష్ముఁడవారణవిద్య నిన్ను ని
ష్ప్రాణునిఁ జేయునాతఁడరయంబురుషోత్తముఁడౌ కతంబునన్.

రాఘ.—భారవిన్ = కాంతికి సూర్యునివంటివానిని, ఘనసుబంధుని= గొప్పవారగు మంచిచుట్టములు గలుగువానిని, ఆభవభూతిన్ = ఆయీశ్వరుని దయచేఁగల్గిన యైశ్వర్యముగలవాని, బాణుని = బాణాసురుని, సర్వగీర్వాణపదంబులన్ = సమస్తదేవతానిలయములను (అధికారములను), కొనినవారిన్ = అపహరించినవారిని, తదన్యులన్ = వారికంటె నితరులను, విందుమేకదా = వినుచున్నారముగదా. క్షోణిన్ = భూమియందు, వారికిన్ = వారికంటెను, మతిసూక్ష్ముఁడవా = సూక్ష్మబుద్ధిగలవాఁడవా! అతఁడు = ఆరాముఁడు, అరయన్, పురుషోత్తముఁడౌ కతంబునన్ = విష్ణుదేవుఁడే యగుటచే, రణవిద్యన్ = రణసంబంధమైన కళచేత, నిన్ను, నిష్ప్రాణునిఁ జేయున్ = చంపును.

తా. ఈశ్వరవరముంబడసిన బాణాసురుని, దేవతలయధికారములం గొనిన హిరణ్యాక్ష హిరణ్యకశిపులు మొదలైనరాక్షసులను మనము వినుచున్నాముగదా! వారు హరియెదుట నేమైరి. వారికంటె నీవు బలశాలివా! నిన్నుయుద్ధములో నీరాముఁడు సాక్షాన్నారాయణావతారుఁడే గనుక చంపును.

లక్ష్మ.—సర్వగీర్వాణపదంబులన్ = అన్నిసంస్కృతపదములను, కొనినవారిన్ = ప్రయోగించినవారిని (లేక నేర్చినవారిని), బాణ = బాణకవి, భారవిన్ = భారవికవిని, సుబంధుని= సుబంధుఁడను కవిని, ఆభవభూతిన్ = ఆభవభూతియను కవీశ్వరుని, తదన్యులన్ = మఱియితరులను, విందుమేకదా= తెలిసికొని యున్నాముగాదా! క్షోణిని, వారికన్నన్ = వారికంటెను, మతిసూక్ష్ముఁడు = సుబుద్ధి, (ఎందు?) అవారణవిద్యన్ = నిరాటంకమైన కవిత్వమందు, అతఁడు, పురుషోత్తముఁడు =పురుషశ్రేష్ఠుఁడు, ఔ కతంబునన్ =అగు

టుచే, అరయన్ = చక్కఁగా నాలోచింపఁగా, నిన్ను, నిష్ప్రాణునిఁ జేయుండ్ = ప్రాణరహితుంగా నొనర్చును.

తా. పూర్వసంస్కృతకవుల నెందఱినో మనము చెప్పుకొనుచున్నాము. కవిత్వవిద్యలో నీలక్ష్మణకవి వారికంటె గట్టివాఁడు; నిన్నితఁడు పద్దెములతో నిందించి చంపును.

ఉ. వేయును జెప్ప నేమిటికి వి న్నొకవాక్యము నీవు క్రొత్తగా
నాయనకాలిదాసుఁడవు నౌటను లోననుమాన మొంద కా
ధీయుతుక్షేత్ర మాతనికిఁ దెల్వి నొసంగెదవేని నిత్యభూ
త్యాయురుదారకీర్తు లలరారఁగ నుందువు భోగసంపదన్.

రాఘ.—వేయును జెప్ప నేమిటికిన్ = వేయుమాటలతోఁ బనిలేదు, ఒకవాక్యము = ఒక్కమాటనుమాత్రమే, నీవు, వినుము. క్రొత్తగా = నూతనముగా, ఆయన కాలిదాసుఁడవు = ఆరాముని పాదభక్తుఁడవు, ఔటను = అగుటను, లోన్ = మనస్సులో, అనుమానమొందకు = సందేహపడకుము ఆధీయుతుక్షేత్రము=ఆబుద్ధిశాలియగు రామునిభార్యను, ఆతనికిన్, తెల్విన్ = బుద్ధితెచ్చికొని, ఒసంగెదవేని=సమర్పించితివా, నిత్యభూతి= నిత్యైశ్వర్యము, ఆయుః = దీర్ఘాయువు, ఉదారకీర్తులు = గొప్పయశస్సును, అలరారఁగన్ = ప్రకాశించునట్లు, భోగసంపదన్, ఉందువు = ఉండఁగలవు.

తా. పదిమాటలు పనిలేదు. నీవు రామునికిఁ బాదసేవకుఁడవై సీతను సమర్పించితివా నీకు దీర్ఘాయువు గలుగును.

లక్ష్మ.—వేయును జెప్ప నేమిటికిన్ = పెక్కేల, ఒక్కమాట, విన్ము= వినుము. నీవు, క్రొత్తగా, ఆయన కాలిదాసుఁడవున్ = ఆలక్ష్మణకవి నూతన కాళిదాస కవివంటివాఁడు, ఔటను = కాళిదాసు నంతవాఁడగుననుటకు, లో ననుమానమొందకు=నీకు సంశయముతోఁ బనిలేదు. ఆధీయుతుక్షేత్రము= ఆపండితుని మాన్యమును, ఆతనికిన్, తెల్వి = పూర్వాపరజ్ఞానము కలవాఁ

డవై, ఒసంగెదవేని = ఇచ్చితివా! నిత్యభూత్యాయురుదారకీర్తు లలరారఁగ నుందువు = ఐశ్వర్యముగలిగి కలకాలము బ్రదికెదవు.

తా. ఆలక్ష్మణకవిని గాళిదాసునితో సమానునిఁగా నెన్నుము. అట్టి వాని కపకారము చేయరాదు. తెలివితెచ్చుకొని యాతనిభూమి నిచ్చితివేని నీకు దీర్ఘాయువు, నైశ్వర్యముఁ గీర్తియుఁ గలుగు.

వ. అని యనేకప్రకారంబుల సామాద్యుపాయపూర్వకంబుగా హితవచనంబు లుపదేశించినతమ్మునిపల్కు లాదరింపక ద్రవిణమదాంధుం డగుటం జేసి గర్వోద్రేకంబున నతం డిట్లనియె. 117

రాఘు.—అని = పైరీతిగా, అనేకప్రకారంబులన్ = పెక్కువిధములుగా, సామాద్యుపాయపూర్వకంబుగా = మంచిమాటలతో నేర్పుమీఱ, హిత వచనంబులు=ఇష్టమైనవాక్యములు, ఉపదేశించిన= తెల్పిన, తమ్మునిపల్కులు= విభీషణునివాక్యములు, ఆదరింపక = కైకొనక, ద్రవిణమదాంధుండగుట జేసి= పరాక్రమవంతుఁడ ననుగర్వాంధకారము కప్పినవాఁడు కావున, గర్వోద్రేకంబునన్ = అహంభావమున, అతండు = రావణుఁడు, ఇట్లనియెన్.

లక్ష్మ.—తమ్మునిపల్కులు = భద్రయ్యగారిమాటలను, ఆదరింపక = అంగీకరింపక, ద్రవిణమదాంధుండగుటం జేసి= ధనమువలనఁ గలిగిన గర్వాంధకారమావరించినవాఁడగుటచే, అతండు = ధర్మారావు, గర్వోద్రేకంబునన్ = అహంకారాతిశయముతో, నిట్లనియెన్. ద్రవిణశబ్దమునకు - బలమనియుం, ధనమనియు నర్థముకలదు. 'ద్రవిణం గేహే విత్తే స్వర్ణే పరాక్రమే' అని. తక్కినది పైదానివలెనే.

మ. పొలుపొ నొక్కొకచోటులం దమరగోపుచ్ఛంబులం దత్స
మం, బుల వేఱొక్కపదంబులం దెలుఁగులన్ ముఖ్యంబు
గాఁ గూర్చును, జ్జ్వలచాతుర్యగ మాట నేనదృఢతన్

సర్వార్థము ల్సేయ భా,సిలుచున్నంతనె లక్ష్మణాగ్రజునకున్
క్షేత్రంబు నేనిత్తునే. 118

రాఘ.—పోలుపో = సుందరమగు, గోపుచ్ఛంబులన్ = (నల్లమ తెల్లయుం నావులతోఁకవంటితోఁకయుంగల)కోఁతులను, ఒకొ్కకచోటులన్ = ఒకొ్కక్క తావునను,అమరన్ = తగినట్లు, తత్సమంబులన్ = ఆకోఁతులకుసమాన మైన వేఱొకజాతివానరములను, వేఱొక్కపదంబునన్ = ఇంకొకతావునను, ఎలుంగులన్ = భల్లూకములను, ముఖ్యముగా=ముఖభాగమునందును, కూర్చు = నిలుపునట్టి, ఉజ్జ్వలచాతుర్యగము, ప్రకాశమానమై నేర్పుతోఁగూడినది, ఔటన్ = ఐనంతనే, సేనదృఢతన్ = సేనయొక్కవిస్తారముచే, సర్వార్థము ల్సేయన్ = యుద్ధాదిసర్వకార్యములను జేయఁదగి, భాసిలుచున్నంతనె=ఒప్పుచు న్నంతనె,లక్ష్మణాగ్రజునకున్ = రామునకు, నేను, క్షేత్రంబున్ = భార్యను (సీతను),ఇత్తునే = ఇచ్చువాఁడనుగాను.

తా. కోఁతులు, కొండముచ్చులు, నెలుఁగులం గూర్చుకొని మనుష్యు లచేఁ జేయింపఁదగిన యుద్ధాదికము వానిచేఁ జేయింప సమర్థుఁడైనంత నే భయపడి రామునకు నేను సీత నిచ్చెద ననుకొంటివా. (రావణవాక్యము.)

లక్ష్మ.—పోలుపో=ఇష్టములయిన, ఒకొ్కకచోటులన్ = కొన్నికొన్ని తావులలో, అమరగో = గీర్వాణవాక్యముల, పుచ్ఛంబులన్ = వెనుకభాగ మున, తత్సమంబులన్ = తత్సమశబ్దములను (సంస్కృతప్రాకృతములవలనం బొడమినపదములను) వేఱొక్కపదంబులన్ =సంస్కృతమును, దత్సమమును గాని పదములను, (తద్భవములననుట.) తెలుఁగులన్ = దేశ్యశబ్దములను, ముఖ్యముగా = విశేషముగా, కూర్చున్ = కవిత్వమందుఁగూర్చును (కావున) ఉజ్జ్వల = స్ఫుటమైన, చాతుర్యగ = చమత్కారమునొందినని, ఔటన్ = అయినంతనే, సేన = ఎక్కుడుగ, దృఢతన్ = బలముగా, సర్వార్థముల్ = అనేకార్థములు (వాచ్యలక్ష్యవ్యంగ్యార్థములను), చేయన్ = చేయుటకు (ఇచ్చు టకు), భాసిలుచున్నంతనె=ఆకవిత్వమట్లు చిత్రముగానుండినకారణముచేతనే, లక్ష్మణాగ్రజునకున్ = లక్ష్మణకవికి, క్షేత్రంబున్ = మాన్యమును, నేనిత్తునే= నేనీయను.

తా. సంస్కృతపదములతోఁగూడ, తత్సమతద్భవదేశ్యపదములం గూర్చి చిత్రచిత్రముగఁ బలువితము లగునర్థములిచ్చునట్టిపద్యము లల్లినంతనే లక్ష్మణకవికి నేను లంకనేల నిచ్చువాఁడను గాను.

వ. అని దురాగ్రహంబున మఱియు నిట్లనియె. 119

తా. ఈమాటలేకాక, చెడుకోపమును వహించి యింకను బల్కుచున్నాఁడు. రెండుపక్షముల సమానమే.

క. అనుజ కళానిధిసూరన
యనమూర్తియనన్ బ్రసిద్ధుఁ డగు సాయకవి
త్వనిపుణుఁడు లక్ష్మణాగ్రజుఁ
డు నిజం బట్లైన నేవిడుతునె చలంబున్. 120

రాఘ.—అనుజ = తమ్ముఁడా! లక్ష్మణాగ్రజుఁడు= రాముఁడు, కళానిధి = చంద్రుఁడు, సూర=సూర్యుఁడు, నయన= నేత్రములు గాఁగల, మూర్తి యనన్ = విష్ణుమూర్తియొక్కయవతారమని, ప్రసిద్ధుఁడగున్ = ప్రసిద్ధికెక్కినవాఁడే, సాయకవిత్వ = బాణవిద్యను దెలిసికొనుటలో, నిపుణుఁడు= నేర్పరియే, నిజము = యథార్థమే, అట్లైనన్ = అంతటివాఁడైనంతనే, నేన్ = నేను, చలంబున్ =మత్సరమును, విడుతునే=విడుచువాఁడనా! (కాను.)

తా. రాముఁడుసూర్యచంద్రనేత్రములుగల భగవంతునియవతారమే, ధనుర్వేదము చక్కఁగా నెఱిఁగినవాఁడే, అయినంతనే నేను వానిపైఁ బంతమును విడుచువాఁడనా!

లక్ష్మ.—అనుజ=తమ్ముఁడా!(భద్రయ్య,)లక్ష్మణాగ్రజుఁడు=లక్ష్మణకవి, కళానిధి=విద్యలకునికిపట్టు, సూరనయనన్ =పింగళిసూరన్న యనఁగా, మూర్తి యనన్ =బట్టుమూర్తియనునట్లు,(ఇక్కడహరిశ్చంద్రనలోపాఖ్యానమును రెండర్థముల కావ్యమును జెప్పిన రామరాజభూషణుఁడే మూర్తికవి యనునభిప్రాయము లక్ష్మణకవికిఁ గలదని తెలియవచ్చుచున్నది. తొల్లిటివారు రామరాజభూ

మణుఁడే బట్టుమూర్తియను తలంపుగలవారు మూర్తికవి ద్వ్యర్థికావ్యముం జెప్ప లేదు కావున రామరాజభూషణకవి యని మనముచెప్పుకొందము.) ప్రసిద్ధుఁడగుక్ = పెయిద్దఱు ద్వ్యర్థికావ్యకవులంబోలినవాఁడే. సాయ= శుభావహమైన (దైవవేరణనితమైన), కవిత్వ = కవిత్వమునందు, నిపుణుఁడు=సమర్థుఁడే. నిజంబు=నిజమే, అటులైనక్ = అట్లయినంతనే, నేను, చలంబు విడువవలసిన పనియేమి?

తా. లక్ష్మణకవి ద్వ్యర్థికావ్యములం జెప్పిన (రాఘవపాండవీయకృతికర్త)సూరకవివలె, రామరాజభూషణుని (వసుచరిత్రము, హరిశ్చంద్రనలోపాఖ్యానములం జెప్పినకవి)వలె దైవబలముచే సంగ్రహించిన కవిత్వపటుత్వము కలవాఁడే కావచ్చును. ఇట్లయినంతనే నేను వానికి భూమి యేల యీావల యును. రెండుతావులయందునుగూడ వారివారి సామర్థ్యము నే నెఱుంగుదును. ఎఱిఁగి చేసిన పనికిఁ బౌరుషముమాలి మరల నేల యిందమని చేరికం దీయవలయుని మత్సరముం జూపుచున్నాఁడు.

వ. అట్లుంగాక. 121

ఉ. దండి ధనంజయుండనునతండును రా జితమూర్తియై నభో
జుండుఁ గవిప్రధానగురు శుభ్రగుఁడౌనమరార్యుఁడుం బ్రచే
తుం డలశంకరుండుఁ బ్రథితుండు మురారియులక్ష్మణాగ్రజ
న్మండననొక్కరూపయిననుక్ భయమందుదునే మనంబునక్.

రాఘ.—దండి=యముఁడు,ధనంజయుండనునతండును=అగ్ని దేవుఁడు, రాజు=కుబేరుఁడు, ఇతమూర్తియై = చలించెడురూపముగలిగి, నభోజుండు= ఆకాశమునందుజనియించిన వాయుదేవుఁడు, కవిప్రధానగురు = శుక్రుఁడు ప్రధాన గురువుగాఁగల నిర్ృతి, (కవిప్రధానమణియనిపాఠాంతముచే గురుశబ్దము కడ వుకారములేనిదోషమును బరిహరించుచున్నారు) శుభ్రగుఁడు - శుభ్ర=తెల్లని, గో=పక్రాయుంధముగల, అమరార్యుఁడుక్ = ఇంద్రుఁడును, ప్రచేతుండు=వరుణుఁడు, అలశంకరుండు=ఈశానుఁడు, ప్రథితుండు=ప్రఖ్యాతివహించిన, మురారి=విష్ణువును, లక్ష్మణానుజన్ముండు = రాముఁడును, ఒక్క

రూపు=వీరందఱును దుల్యమాహాత్మ్యముగలవారే, అయినన్=అయినప్పటికిని, మనంబునన్=మనస్సున, భయమందుదునే = వెఱతునా ?

తా. రాముఁ డష్టదిక్పాలురతో, విష్ణువుతోఁ దుల్యుఁడే కానిమ్ము నేను భయపడి సీత నిచ్చువాఁడను గాను.

లక్ష్మ.—దండి=దండికవి, ధనంజయుండను నతండును=ధనంజయకవి, రాజితమూర్తి = ప్రకాశించెడు నాకారముగలిగిన, భోజుండున్=భోజరాజును, కవిప్రధానగురు = కవీంద్రులకు ముఖ్యోపాధ్యాయుఁడును, శుభ్రగుఁడున్=శుద్ధమైన వాక్యమును గలవాఁడును (అయిన), అమరార్యుండున్=అమరమును జెప్పినయమరసింహుఁడును, ప్రచేతుండు=మంచిమనస్సుగల, అల శంకరుండును = శంకరకవియు, ప్రథితుండు=ప్రసిద్ధిఁగనిన, మురారియు=మురారికవియు, లక్ష్మణాగ్రజన్ముండు = లక్ష్మణకవి, అనన్=అనునట్లు, ఒక్కరూపయినను=ఒక్కరూపమేర్పడినను, మనంబునన్, భయమందుదునే.

తా. పై చెప్పినకవీశ్వరు లందఱును గట్టుకట్టుకొని లక్ష్మణకవి యనురూపముం దాల్చి వచ్చినా రనుకొనుము. నేను భయంపడువాఁడను గాను.

వ. అనిన విని కటకటంబడి యతండన్న కి ట్లనిరెు. 123

తా. ఇట్లు తనమాట వినక యేమోమో చెప్పు నన్నతో దుఃఖపడుచుఁ దమ్ముఁడు వల్కుచున్నాఁడు. రెండుపక్షముల సమము.

పంచచామరము. మహద్విరోధ మెల్లభంగి మానుమంచు నిట్లు నే
బహుప్రకారనీతియుక్తభాషల న్వచింప నా
గ్రహమ్ము పూనినట్టు లుంటికాని మాన బుద్ధి లే
దహో యడంగు దీవు లక్ష్మణాగ్రజన్ముకాఁకచేన్. 124

రాఘు; ల.—మహద్విరోధము = గొప్పవారితో వైరము, ఎల్లభంగి= అన్నివిధముల, మానుమంచున్=వదలుమని, ఇట్లు, నే=నేను, బహుప్రకార= అనేక రీతులుగల, నీతియుక్త=న్యాయముతోఁగూడిన, భాషలన్=మాటలను,

వచింపన్=పలుకఁగా, ఆగ్రహమ్ము=కోపమే, పూనినట్టు=కొనినట్లు (ఆగ్రహమ్ము పూనినట్టులు = ఆగ్రహమునిన్నావేశించినట్లు) ఉంటివి కాని=వర్తించుచుంటివిగాని, మానన్ = విరోధమును మానుటకు, బుద్ధిలేదు=నీకు మనస్సొలుపదు. అహో=అయ్యయో! ఈవు=నీవు, లక్ష్మణాగ్రజన్ము = రామునియొక్క (లక్ష్మణకవియొక్క), కాఁకచేన్=క్రోధముచేత, అడంగుదు=నశింతువు.

తా. బలవద్విరోధము కూడదని యెన్నివిధములం జెప్పినను నీచెవికెక్కుటలేదు. కావున నీ వాతనిక్రోధముచే నశింతువు. నే నేమిచేయుదును.

వ. అని మఱియు రోషంబున నిట్లనియె. 125

తా. (విభీషణుఁడు, భద్రయ్యయు) కోపముతో నన్నులవంకఁ జూచి యీక్రిందివిధమున ననుచున్నారు.

గీ. దంట లక్ష్మణాగ్రజుఁడు క్షేత్రంబుఁ గొనక
విడిచియుండునె నీకు నాకడలి గట్టి
కినుక వచ్చెనేనియును నీవనితతాళి
బొట్టు ఖండములుం జేయఁ బూనుఁగాక. 126

రాఘ.—దంట=దిట్ట, లక్ష్మణాగ్రజుఁడు = రాముఁడు, ఆకడలిగట్టి=సముద్రముంగట్టి, కినుకన్ = కోపముతో, వచ్చెనేని = వచ్చినట్లాయెనా, క్షేత్రంబుఁగొనక = భార్యను గ్రహింపక, నీకువిడిచియుండునే=నీకువదలివేసిపోవునా! నీవనితతాళిబొట్టు =నీభార్యమంగళసూత్రము, ఖండములుంజేయఁ బూనుఁగాక=త్రెంపఁజూచునుగాని.

తా. కోపించి యారాముఁడు సముద్రమును బంధించి లంకలోనికి వచ్చెనా; నిన్నుఁ జంపునుగాని నీకు సీతను విడిచిపోవువాఁడు కాఁడు,

లక్ష్మ.—దంట=దిట్టయైన (సమర్థుఁడు), లక్ష్మణాగ్రజుఁడు=లక్ష్మణకవి, క్షేత్రంబున్=తనలంనేలను, కొనక=పుచ్చుకొనక; నీకున్, విడిచియుండునె=వదలియూరకుండునా! ఆకడలి=ఆకవి యనుసముద్రము, గట్టి కినుకన్=

గట్టిక్రోధముతో, వచ్చెనేని=నీవనితతాళిబొట్టు ఖండములుం జేయఁబూనును గాక. (నీకు+నాకు+అడలి=నీకును నాకును భయపడి, విడిచియుండునె యని యుం జెప్పవచ్చును.)

తా. సుగమము.

క. అని పల్కినయనుజన్మునిఁ
గనుఁగొని దుష్టాత్ముఁ డతఁడు కనలుచు నిట లె
మ్మని కొల్వు వెడలనడిచిన
జననికడకు నేగె నతఁడు సత్వరితముగన్. 127

రాఘు; లక్ష్మ.—అనిపల్కిన యనుజన్మునిన్=ఈప్రకారముగా నయ భయముల హితోపదేశముచేసిన విభీషణుని, భద్రయ్యను, కనుఁగొని=చూచి, దుష్టాత్ముఁడు = చెడుతలంపుగల, అతఁడు=రావణుఁడు, దమ్మన్న, కనలుచు= కోపించుచు, ఇటలెమ్మని = ఇక్కడినుండిపొమ్మని, కొల్వువెడలనడిచినన్ = కొల్వుకూటములోనుండి యావలకుఁ దఱిమివైచినందున(కొల్వులోనుండి యావలకుఁ దానేనడుపఁగా యనియు), అతఁడు=విభీషణుఁడు, భద్రయ్యయు, సత్వరితముగన్=శీఘ్రముగ, జననికడకున్ = తల్లియొద్దికి, ఏగెన్=వెళ్లెను.

తా. అన్నగారు తనమాటలు వినక నిరాదరణముతోఁ బొమ్మనఁగాఁ దల్లియొద్దికిఁ బోయెను. (రెండుపక్షముల సమము.)

వ. అట్లు సని యుచితగోష్ఠి నున్నతల్లింగని దండప్రణామంబు లాచరించి తల్లీ విను మిటమీఁద లక్ష్మణాగ్రజన్మరోషా నల ప్రాప్త పరాభూతి ధర్మరావణ గజగమనాక్రందనస్థితి నెగడుట నిశ్చయం బనితలంచి యాసన్నమరణుం డగు నగ్రభాతృపొత్తు విడిచి శ్రీరామపదారవిందసేవాతత్పరుం డనై యుండం దలంచి నీకెఱింగింప వచ్చితి నని చెప్పెన. 128

రాఘు —అట్లు=ఆరీతిగా, చని=పోయి, ఉచితగోష్ఠిన్=తగిన ప్రసం గాదికమున, ఉన్నతల్లింగని=కాంతాజనముతో సల్లాపించుచున్నజననిం జూచి,

దండప్రణామంబులాచరించి = నమస్కారములొనర్చి, తల్లీ, వినుము = నా మాటలాలకింపుము. ఇటమీఁదన్ = ఇంక, లక్ష్మణాగ్రజన్మరోషానలప్రాప్త = రామునికోపమనునగ్ని వలనఁ గలిగిన, పరాభూతి = పరిభవమునెడు, ధర్మ = స్వభావముగల, రావణ=రావణునియొక్క, గజగమనః భార్యల, ఆక్రందనస్థితి = ఏడ్పులు, నెగడుట=వ్యాపించుట, నిశ్చయంబు=నిజము. అనితలంచి=నేను తలఁచుకొని, ఆసన్నమరణుండు = చావుసమీపమునకువచ్చిన, అగ్రభ్రాతృపొత్తు=అన్నగారిస్నేహము, విడిచి = వదలి, శ్రీరామపదారవింద సేవాతత్పరుండునై=ఆరామునిగొల్చుటయందాసక్తి కలిగి, నీకున్ ఎఱిఁగింపవచ్చితిని= తెలుపుటకు వచ్చినవాఁడ. అనిచెప్పిన = ఇట్లుపలుకఁగా.

వ్యాఖ్య.—లక్ష్మణాగ్రజన్మ = లక్ష్మణకవియొక్క, రోషానలప్రాప్త పరాభూతిన్ = కోపాగ్నిచేనైన పరాభవముచే, ధర్మరావు=దమ్మన్న, అణఁగ = అడఁగిపోవఁగా, (ఇచ్చట అణఁగు - అనుక్రియలోని, సిద్ధఖండానుస్వారము పోయినది.) జగము=లోకము, అనాక్రందనస్థితిన్ = ఏడ్పుడిగినదై, నెగడుట నిశ్చయము; (ఈతఁడు చచ్చిన లోకము సుఖపడు ననుట.) శ్రీరామపదారవింద సేవాతత్పరుండనై =భగవద్ధ్యానము చేసికొనుచు, రామా! కృష్ణా! యని యుండఁదలఁచి, నీకెఱిఁగింప వచ్చితి. తక్కినభాగము పైవలెనే.

తా. మాయన్న నామాటలు వినలేదు. కావున నీతనికి హాని కలుగును. నేనీతనియొద్ద నుండను. శ్రీరామసేవ నాకుచితము. ఈవృత్తాంతము నీకుఁ జెప్పి నీయనుజ్ఞఁ బడయవచ్చితిని- (రెండుపక్షముల సమము.)

క. అవిరతపరమాన్యక్షే
త్రవితత్యపహారి ధర్మరావణు మాత్రా
యువుగలవాఁ డని తలఁచుచుఁ
దవిలి యతనితోడఁ దల్లి తా నిట్లనియెన్. 129

రాఘ.—అవిరత=ఎల్లప్పుడును, పరమ=శ్రేష్ఠురాండ్రయిన, అన్య = ఇతరుల, క్షేత్ర=కాంతల, వితతి=సమూహమును, అపహరి = అపహరించి తె

చ్చునట్టి, ధర్మ=నైజముగల, రావణున్=రావణుని, మాత్రాయువు కలవాఁడని =స్వల్పాయువుగలవానిగా, తలఁచుచున్=ఎంచుచు, తవిలి=విడువక, అతనితోడన్ = విభీషణునితో, తల్లి, తాన్, ఇట్లనియెన్.

తా. పరదారాపహరణదోషముచేతనే రావణుఁ డింకఁ జిరకాలము జీవింపఁ డని తలంచి తల్లి విభీషణునితో నేమో చెప్పుచున్నది.

లక్ష్మ.—అవిరత=ఎడతెగకుండ, పర=పరుల, మాన్యక్షేత్ర = మాన్యభూము లగు, వితతిన్=సంఘమును, (ఈధర్మరావు లక్ష్మణకవి మాన్యముగాక వేఱొకమాన్యము హరించిన ట్లింతవఱకుఁ గనఁబడదు.) అపహరి=పుచ్చుకొనునట్టి, ధర్మరావు=దమ్మన్న, అణుమాత్ర=కొంచెమైన, ఆయువు = ఆయుర్దాయముకలవాఁడని, తలఁచుచున్=తలపోయుచు, అతనితోడన్ = భద్రయ్యతో, తల్లి, తాన్ ఇట్లనియెన్.

తా. సుగమము.

క. ఆలక్ష్మణాగ్రజన్ముని
పాల భయము భక్తి గలిగి బ్రదుకుము నీకున్
మేలగు నీయగ్రజునకుఁ
జాలంగాఁ గీడు లెల్ల సన్నిహితమగున్. 130

రాఘు; లక్ష్మ.—ఆలక్ష్మణాగ్రజన్మునిపాలన్ = ఆరామునియందు, లక్ష్మణకవియందు, భయము, భక్తి, కలిగి, బ్రదుకుము, నీకున్, మేలగున్, నీయగ్రజునకున్ = నీయన్నయగు రావణునకు, దమ్మన్నకు, చాలంగాన్ = మిక్కిలిగా, కీడులు, ఎల్లన్=హానులు, సన్నిహితమగున్ = దగ్గఱకువచ్చును.

తా. స్పష్టము.

వ. అని వీడ్కొలిపిన నతండు లక్ష్మణాగ్రజుం గలసి సఖ్యంబు నొంది యుండె నంత. 131

తా. ఇట్లని తల్లి పంపఁగా, విభీషణుఁడు రామునితో సఖ్యము గావించి కొనియెను. భద్రయ్య లక్ష్మణకవితో హితభావమున నుండెను.

క. కామరొప్ప నలహారిబలము
సమత న్నడువఁగ వననిధి సదుపాయప్రౌ
ఢి మహాళి నిలుప వెడలె జ
యముఁ గోరి యతఁడ యకల్పితాహితభయుఁడై. 132

రాఘ.—కామరొప్పన్=ఏపుగా, అలహారిబలము=ఆవానరసైన్యము, సమతన్=సమానముగ, నడువఁగన్ = పోవుచుండఁగా, వననిధిన్ = సముద్రమందు, సదుపాయ ప్రౌఢిన్=మంచియుపాయముచే, మహాళిన్ = పెద్దకట్టను (సేతువును), నిలుపన్=కట్టఁగా, అకల్పితాహితభయుండై=విరోధులభయము లేనివాఁడై, జయముగోరి = గెల్పు నపేక్షించి, వెడలెన్ = బయలుదేఱెను. అతఁడు.

తా. సముద్రబంధనము చేసి లంకాధిపతిని జయింపవలయు నని కపిసేనతో రాముఁడు వెడలెను.

లక్ష్మ.—అలహారిబలము =ఆవిష్ణుదేవునిబలము, సమతన్=సమముగా, నడువన్=నడుచుచుండఁగా, కవననిధి=కవీశ్వరుఁడు, సత్=శ్రేష్ఠమైన, ఉపాయ = పరవంచనోపాయముయొక్క, ప్రౌఢిమన్ = ప్రౌఢత్వమును, హాళిన్ = క్రమముగ, నిలుపన్=నిల్పుటకు, జయముఁగోరియు=జయమును గాంక్షించియే, తడయక=ఆలస్యము చేయక, అల్పిత=అల్పముగాఁ జేయఁబడిన, అహితభయుండై=శత్రువులభీతిగలవాఁడై, వెడలెను.

తా. తన్ను విష్ణుసేవాబలము పురికొల్పుచుండఁగా నిర్భయముగా జయకాంక్షియై సన్నద్ధుఁ డయ్యెను.

గీ. పెంపెసఁగం *దమూచారిపిండిప్రోలి
కవికులవరుఁడు నడచి సౌఖ్యదసు వేల

* 'దమీచారి' అని పాఠాంతరము.

నగరచిత సంప్రవేశుఁ డయ్యె గురుమంత్ర
సన్నిహితహరిబలముతోఁ జెన్ను మీఱ. 133

రాఘ.—పెంపెసఁగన్ = మహోచ్ఛదశతో, తమాచారిపిండిప్రోలికిన్-తమాచారి = నిశాచరులయొక్క, పిండి=సమూహముయొక్క, ప్రోలికిన్ =లంకాపట్టణమునకు, అవికులవరుఁడు=రాముఁడు, నడచి=వెళ్లి, గురు...బలముతోన్-గురు=మహత్తరమైన, మంత్ర=ఆలోచనచేత, సన్నిహిత=సమీపించిన, హరిబలముతోన్=కపిసైన్యముతో, చెన్నుమీఱన్ = సౌఖ్యద=సుఖము నొసంగు, సువేలనగ = సువేలపర్వతమందు, రచిత = చేయఁబడిన, సంప్రవేశుఁడు=ప్రవేశముగలవాఁడు, అయ్యెన్ = ప్రవేశించెననుట.

తా. రాముఁడు కపిసేనతో లంకాపట్టణముకడ నున్న సువేలపర్వతముపై కేగి విడిసెను.

లక్ష్మ.—పెంపెసఁగన్=వృద్ధియతిశయించునట్లు, తమాచారి=ఇంద్రియనిగ్రహమేస్వభావముగాగల, పిండిప్రోలికవికులవరుఁడు = పిండిప్రోలివారి లక్ష్మణకవి, నడచి, గురు=గురువుగారి, మంత్ర = మంత్రశక్తిచే, సన్నిహిత = సంప్రాప్తమైన, హరిబలముతోన్ = హరిసేవాసహాయముగ, చెన్నుమీఱన్ = చక్కఁగా, సౌఖ్యద=సుఖకరమగు, సువేలన్=మంచివేళయందు, నగర = స్వగ్రామమైనకుయ్యేటియందు, చితసంప్రవేశుఁడు = వ్యాప్తప్రవేశముగల వాఁడు, అయ్యెను = తనయింటికేగెను.

తా. ఇంద్రియనిగ్రహముగలవాఁడు కావున(నే కోపము తగ్గించుకొని) విష్ణుభక్తిబలసంగలిగినసహాయమును నమ్మి తనస్వగ్రామమగుకుయ్యేరునకు. ఆరవెట్టమునుండి తిరిగివచ్చెను.

వ. అవ్విధంబున. 134

క. విలసిల్లునాత్మ నగరా
మలసత్కూటస్థితిన్ సమాహితధృతి యై
యలలక్ష్మణాగ్రజన్ముం
డు లంక సాధించు టెట్లనుచుఁ గడుఁ దలఁచెన్. 135

రాఘ.—విలసిల్లునాత్మన్ = విజృంభించుచున్నతనమనస్సున, నగ = సువేలపర్వతపు, రామ = మనోహరమైన, లసత్కూటస్థితిన్ = మంచిచఱియలయందుండి, సమాహితధృతియై = ధైర్యమువలంబించి, అలలక్ష్మణాగ్రజన్ముండు = ఆరాముఁడు, లంకసాధించుటెట్లనుచున్ = లంకాపట్టనమును బట్టుకొనుటయేరీతినని, కడున్, తలంచెన్ = ఎంతయుం నాలోచించెను.

తా. రాముఁడు సువేలపర్వతముమీఁదనుండి లంకాపట్టణమును సాధించుటకై యోజించెను.

లక్ష్మ.—విలసిల్లునాత్మన్ = ప్రకాశించుమనస్సున, నగర= కుయ్యేరుయొక్క, అమల = నిర్మలమైన, సత్ = యోగ్యమైన, కూట = గృహమునందు, స్థితిన్ = ఉండుటవలన, సమ = లక్ష్మీయుతుఁడైన విష్ణువుచే, ఆహిత = కూర్పఁబడిన, ధృతియై = ధీరత్వమునవలంబించి, అలలక్ష్మణాగ్రజన్ముండు = లక్ష్మణకవి, లంకన్ = లంకమాన్యమును, సాధించుట = తిరుగఁగొనుట, ఎట్లనుచున్ = ఎట్లుసాధింపవచ్చునని, కడున్, తలఁచెన్.

తా. కుయ్యేరులోనుండి లక్ష్మణకవి తనలంకను రాఁబట్టుకొనుటకై తనలో నాలోచించెను.

క. ఘనమతి నట్లు తలంచియుఁ
దనకీశబలంబె ముఖ్యతం దనరుచు గొ
బ్బున వైరిపురము భంగం
బొనరింపఁగఁ జాలు ననుచు నూహించు చొగిన్. 136

రాఘ.—అట్లు = పైరీతిగ, ఘనమతిన్ = చక్కనిబుద్ధితో, తలంచియున్ = ఆలోచించియు, తన = తానుదెచ్చిన, కీశబలమె = వానరసేనయే, ముఖ్యతందనరుచున్ = ముఖ్యసాహాయ్యముగానుండి, గొబ్బునన్ = శీఘ్రముగ, వైరిపురము= విరోధినగరమును, భంగంబొనరింపఁగన్ = భంగముచేయుంటకు, చాలున్ = సమర్థమగును, అనుచున్=ఇట్లని, ఒగిన్, ఊహించుచున్.

తా. లంకాపురమును బట్టుకొనుటకై కపిసేనయే ముఖ్యాధార మని యెంచెను.

లక్ష్మ.—అట్లు = ఆప్రకారము, ఘనమతిన్ = గొప్పయూహతో, తలంచియుం, తనకు, ఈశబలమె = ఈశ్వరశక్తియె, ముఖ్యతందనెరుచున్ = ముఖ్యమైనదగుచు, గొబ్బునన్ = త్వరగా, వైరిపురము = తనశత్రువుని దేహము, ని. 'దేహోనగరీతుపురంపురీ' అని, భంగంబొనరింపఁగన్ = నశింపఁ జేయుటకు, చాలుననుచున్, ఒగిన్, ఊహించెన్.

తా. దమ్మన్న నడంచుటకుఁ దనకు విష్ణుదేవునిబలమే ముఖ్యమైన ట్లెంచెను.

ఉ. సరసపలాశిజాలవిలసద్వివిధోన్నతవప్రమండితం
బురుతృణకాష్ఠవారియుతి యోగ్యత జేర్చిన సుస్థలంబునన్
గరిమ నెలంగునట్టిదియుఁ గావున గట్టిగ లంక సాధ్యమా
వెరవుఘటింపఁ జేసికొని వేడ్కను దారసుఖాప్తిఁ జొక్కెదన్.

రాఘ.—సరస = వీరరసముతోఁ గూడిన, పలాశిజాల = రక్కసి మూఁకలచే, విలసత్ = ప్రకాశించుచున్న, వివిధ = పలుతెఱంగులుగల, ఉన్నత = ఎత్తయిన, వప్ర = ప్రాకారములచే, మండితంబు = అలంకరింపఁబడినది, ఉరు = విస్తారమైన, తృణ = గడ్డి, కాష్ఠ = కట్టెలు, వారి = ఉదకము (వీనితో), యుతియోగ్యతన్ = కూడియుండుటను, చేర్చినసుస్థలంబున్ = కలిగించిన మంచితావులవలన, గరిమ = గౌరవము, నెలంగునట్టిదియుఁ = ఒప్పునట్టిదియును కావునన్ = కాఁబట్టి, గట్టిగ = ముఖ్యముగ, లంక, సాధ్యమా వెరవు = చేపడునట్టియుపాయము, ఘటింపఁ జేసికొని = కూర్చుకొని, వేడ్కను = సంతోషముతో, దారసుఖాప్తిన్-దార = భార్యయొక్క, సుఖ = తేలికగా, ఆప్తిన్ = పొందుటను, చొక్కెదన్ = అనుభవించెదను. (భార్యయొక్క సౌఖ్యప్రాప్తినిచొక్కెదను.)

తా. ప్రతిప్రాకారమునందును రాక్షసులు నిల్చి కాపాడుచున్నదియు, తృణకాష్ఠజలసమృద్ధి కలదియు నైనలంకను జొచ్చి సాధించి పిమ్మట సీతను తేలికగా గ్రహించి సుఖింతును.

లక్ష్మీ.—సరస = ద్రవయుక్తములగు, పలాశి = చెట్టుల, జాల = తోఁపులతో, విలసత్ = విలసిల్లుచున్న, వివిధ = బహుప్రకారములగు, ఉన్నత = పొడుగైన, వప్ర = గట్టులచే, మండితంబు = ఒప్పుచున్నదియు, ఉరుతృణకాష్ఠవారియుతిన్ = వలసినంత, గడ్డి, కట్టెలు, నీరునుంగలిగినదై, యోగ్యతను జేర్చిన = అనుకూలతనుబొందిన, సుస్థలంబులన్ = మంచిచోటులచే, గరిమ నెలంగునట్టిదియుం= గౌరవముగలిగినదియును, కావునన్ = కనుక, గట్టిగన్ = దృఢముగా, లంక = మాన్యము, సాధ్యమా వెఱపు=సాధ్యమగును పాయము, ఘటింపఁజేసికొని = చేకూర్చుకొని, వేడ్కన్ = వేడుకతో, ఉదార = అధికమైన, సుఖాప్తిన్ = సుఖమునొక్క పొందుటచేతను, చొక్కెదన్ = ఒప్పెదను.

తా. చెట్టులు, గట్టులు, నీరు, గడ్డి మొదలగువానిచే మనోహరమైన నాభూమిని నేను సంపాదించికొన్నవాఁడనై సుఖించెదను.

క. అనియంత లంక నరిక
ట్టి నయజ్ఞుం డగుట బల్విడి న్నే నాశ
త్రునిఁ జంపక మత్క్షేత్రము
గొన నొప్పునె యంచుఁ గోపఘూర్ణహృదయుఁడై. 138

రాఘ.—అనియంత= నియామకుఁడు లేని రాముఁడు, (తనపైగొప్పవాఁడును, దన్ను వారించువాఁడును లేఁడనుట) లంకనరికట్టి = లంకాపట్టణమును జుట్టుముట్టి, నయజ్ఞుండగుటన్ = న్యాయము తెలిసినవాఁడు కావున, నే = నేను, బల్విడిన్ = బలాత్కారముగ, శత్రుని = రావణుని, చంపక= వధింపక, మత్క్షేత్రము = నాభార్యను, గొననొప్పునె = పుచ్చుకొనవచ్చునా, అంచున్ = అనితలఁచి, కోపఘూర్ణహృదయుఁడై = కోపముచే క్షోభించిన మనసుగలవాఁడై.

తా. రాముఁడు న్యాయవేత్త కావున విరోధిని జంపకుండ నావిరోధి హరించిన తనభార్యను గ్రహించుట మంచిది కాదని మిగులఁ గినుక వొడమి.

లక్ష్మ.—అని = ఇట్లుతలంచి, అంతన్ = తర్వాత, లంకన్ = మాన్యమును, అరికట్టినయజ్ఞుండు=స్వాధీన పఱుచుకొన తెలివిలేనివాఁడు, అగుటన్ = కావుటంబట్టి, బల్విడిన్ =బలవంతముగ! నేను, ఆశత్రుని=ఆవైరిని, చంపక= చంపినంగాని, మత్క్షేత్రంబున్ = భూమిని, కొననొప్పునె = పుచ్చుకొన వశమగునె, అంచున్ = అనికొనుచు, కోపఘూర్ణహృదయుండై.

తా. అజ్ఞానముచే నాలంకను హరించినవాఁడుతాను బ్రదికియుండఁగా నీయఁ డని వానిం జంప యత్నించి కోపముం గొనియె.

క. ఒనరఁగ నంత నొకించుక
మనమునఁ గృపపుట్టి వైరి మడియకయుండం
దకార్యము చొప్పడునొకొ
యనుతలఁపు దలిర్ప లక్ష్మణాగ్రజుఁ డంతన్. 139

రాఘు.—లక్ష్మ.—ఒనరఁగన్ = ఒప్పునట్లు, అంతన్ = అంతలోనె, ఒకించుక = స్వల్పముగ, మనమునన్ = హృదయమున, కృపపుట్టి = జాలి కలిగి, వైరిమడియకయుండఁగన్ = శత్రువు మృతినొందకయుండఁగనే, తన కార్యము చొప్పడునొకొ=తనపని నెఱవేఱునేమో, అనుతలఁపు దలిర్పన్ = అనునట్టి యూహాయుద్భవింపఁగా, లక్ష్మణాగ్రజుండు = రాముఁడు, (లక్ష్మణకవియుం) అంతన్.

తా. ఒక్కింతజాలిపుట్టి శత్రువు మృతినొందకుండఁ దనవచ్చినపని కొనసాగునేమో యని (రెండుపక్షముల సమాసము.)

చ. అరుదగురాయబార మపు డంపె విరోధిభయంబు నేయుబ
ల్వరుసగ నంగదుం డగములం జరియించెడువారిలోన నే
ర్పరి యని శుభ్రవర్ణముఖపత్త్రి కనంతరయంబునం దగం
దొర యగునాతఁడుం గణకతోడుత లేఖస్మృతిం జనం గనెన్.

రాఘ.—అరుదగు=అపురూపమైన, రాయబారము=దౌత్యము, (రాయబారినిబంపెను) అపుడు, అంపెన్=పంపెను. (ఎవరిని?) అంగదుండు=వాలికొడుకు, విరోధి భయంబుసేయుం బల్వురుసఁగన్=శత్రుభీకరలీలగా, అగములన్=వృక్షములయందు, చరియించెడు వారిలోన్=తిరిగెడు వారియందు, నేర్పరియని=నిపుణుఁడని, దొరయగు నాతఁడున్=సేనాధిపతియైన యాయంగదుఁడును, శుభ్ర=స్వచ్ఛమైన, ముఖ=మోముగల, పత్త్రి=పక్షి (గరుత్మంతుఁడు), కనంతరయంబునన్=కనునంతటి వడిగా, కణఁకతోడుతన్=పూనికతో, లేఖసృతిన్=గగనమార్గమున, (లేఖ=దేవతలు, సృతి=మార్గము, దేవమార్గము, ఆకాశము) చనన్=పోఁగా, కనెన్=చూచెను.

తా. కపిసేనాపతి యైనయంగదుని రావణుని యొద్దికి రాయబారము చేయఁ బంపెను. అతఁడు గరుత్మంతుని వేగమువంటి వేగముతో నాకాశ మార్గమున నేగెను.

లక్ష్మ.—రుస=రోషము, కనంగన్=పొందునిమిత్తము, విరోధి భయంబుసేయుంపల్వన్=శత్రుభయంకరుఁడైన క్రూరుని, (పలువయొక్క రూపాంతరము పల్వ) దుండగములం జరియించెడు వారిలోన=కొంటెతనముగాఁ దిరుగువారిలో, నేర్పరియని=కుశలుఁడని, అరుదగు రాయబారము=ఒక్క కొంటెమనుష్యునిచేత రాయబారపు టుత్తరమును, అపుడు, అంపెన్=పంపెను. దొరయగునాతఁడున్=వెలమదొరయైన దమ్మన్నయును, కణఁకతోన్=క్రోధముతో, శుభ్రవర్ణ=శుద్ధాక్షరములు, ముఖ=ముఖమునందు, కల=కలిగిన, పత్త్రికన్=జాబును, లేఖసృతిన్=ఉత్తరముయొక్క సరణిని, చూచెను.

తా. ఏమన్నను భయపడనివాఁడును గొంటెవాఁడు నైనయొకనిని దమ్మన్నయొద్దికి రాయబారము వ్రాసిపంపెను. దమ్మన్న కోపముతో దానిం జదివెను.

క. మానితనీత్యుపదేశవి
ధాన మమరఁగ వనచారి తతహితఘునప
ద్యానుగతి లేఖరిపుసభ
లో నప్పుడు గదిసి కడుఁ జెలువు మీఱంగన్. 141

రాఘ.—వనచారి = అంగదుఁడు, తతహిత = మిగులనిష్టమైన, ఘనపద్యా = మేఘమార్గముయొక్క, సరణిన్ = దారిని, అనుసృతిన్ = అనుసరించి (గగనముననుండియనుట), మానితనీత్యుపదేశ విధానము=కొనియాడఁదగిన నీతి నుపదేశించుట, అమరన్ = ఒప్పఁగా, అప్పుడు, లేఖరిపు=దేవవైరియగు రావణుని, సభలోన్ = కొల్వులో, కదిసి=చేరి, కడున్ = మిక్కిలి, చెలువుమీఱంగన్ = సుందరమగునట్లు.

తా. రావణుని కొల్వులో గగనమార్గముననుండి యంగదుఁడు నీతిహితము నుపదేశింప నెంచెను.

లక్ష్మ.—మానిత= పూజ్యమగు, నీతి=న్యాయముయొక్క, ఉపదేశ= ఉపదేశముయొక్క, విధానము = ప్రకారము, అమరన్ = ఒప్పునట్లుగా, కవనచారి = లక్ష్మణకవియొక్క, తత=విస్తారమైన, హిత = ఇష్టమగు, ఘన= ఉత్కృష్టమగు, పద్య = పద్యములయొక్క, అనుగతిన్=అనుసరించుటచేత, లేఖ = పత్రిక, రిపుసభలోన్ = దమ్మన్నగారుకొల్వుకూటములో, అప్పుడు, కదిసి, కడుచెలువుమీఱంగన్.

తా. ఉపదేశపూర్వకముగా వ్రాసిన లక్ష్మణకవిపద్యముల జాబును దమ్మనరావు సభలోఁ గాంచెను.

గీ. అవుర జాబిల్లి పినయయ్యె నధికరమ్య
మిమ్మొగంబు సభవ్యవర్ణమిది యిట్టు
లొప్పునే యంచుఁ జూపరు లొకరికొకరు
ప్రౌఢిఁ దద్దర్శనము చేసి పల్కుచుండ. 142

రాఘ.—అధికరమ్యము=మిగులసుందరమైనది, ఇమ్మొగంబు= ఈయంగదునిమోము, సభవ్యవర్ణము = మంచికాంతిగలది (కావుననె), జాబిల్లి = చంద్రబింబము, పినయయ్యెన్ = ఈమోమునందముకడఁ జిన్నఁబోయినది. (తగ్గినది), ఇది = ఈకాంతి, ఇట్టుల = ఈప్రకారముఁ ఒప్పునే=ఆహా! ఎంత సుందరమైనది. అంచున్ = అనుచు, చూపరులు = చూచుచున్నవారు. (చూపఱు, అనియుండవలయును) ఒకరికొకరు= ఒకరితోనొకరు, తద్దర్శనము

చేసి = అంగదునిగాంచి, ప్రౌఢిన్ = ప్రౌఢతనమున, పల్కుచుండన్ = చెప్పుకొనుచుండఁగా.

తా. ఈయంగదుని ముఖము చంద్రుని మించియున్నది. ఎంతకాంతిగ నున్నది! ఈతఁడు రావణుని కనిష్ఠుఁడో నేకాని నచ్చుఁడుచుడీ యని సభలోని వారు తమలోఁదామనుకొనుచుండిరి.

లక్ష్మ.—అపుర = అద్దిరా, జాబు= ఉత్తరము, ఇల్లిపిన = (ఈలిపిన) ఈవ్రాఁతచేతచే, అధికరమ్యము = మిక్కిలిచక్కఁగనున్నది. ఇమ్మొగంబు = ఈయుత్తరముయొక్కముఖము అనఁగా ప్రారంభము, సభవ్యవర్ణము= మంచి యక్షరములతోనున్నది. ఇట్టులొప్పునే = మనకిష్టముగానున్నట్లు, ఈతనికి (దమ్మన్నకు) ఇష్టముగాగనఁబడదుగదా! అంచున్ = అనుచు, చూపరులు= చూచువారు, తద్దర్శనముచేసి = ఆపత్రికంగాంచి, ప్రౌఢిన్ = ఒకరికొకరు, పల్కుచుండన్ = చెప్పుచుండఁగా.

తా. ఈలక్ష్మణకవి వ్రాసినజాబు, అక్షరములు చక్కఁగా నున్నవని యక్కడివారు పొగడుచుండిరి.

క. అటిమటి నానభవారం
దఱు నల్గడ డాసియుండఁ దగ నద్దారముం
దఱఁ దన్ముఖోక్తు లన్నియు
వెఱఁగొందఁగ సముచితముగ వినఁబడె నంతన్. 143

రాఘ.—ఆసభకారందఱున్ = ఆసభ్యులు, నల్గడలడాసి = అన్ని వైపులనుజేరి, అటిమటిన్ = పర్యాకులముగ, ఉండన్=ఉండఁగా, తగన్, ఆద్దారముందఱన్= రావణునిసముఖమున, తన్ముఖోక్తులన్నియుఁన్=ఆయంగ దునినోటవెలువడిన మాటలన్నియును, వెఱగొందఁగన్ = ఆశ్చర్యకరముగ, సముచితముగ = ఎవ్వరికిఁదగినట్లువారికి (దగ్గఱనున్నవారికి స్పష్టముగ, దూరముననున్నవారికిమెల్లఁగ), వినఁబడెన్ = వినవచ్చెను. అంతన్.

తా. అంగదుఁ డెల్లవారు విన రావణునితోఁ గొన్నిమాటలు చెప్పెను.

లక్ష్మ.—అతిముఖర్ = సంభ్రమముతో, ఆసభవారందఱున్, నల్గడ డాసి = నలుతట్లం జేరి, ఉండర్, తగన్, అద్దొరముందరన్ = ఆ వెలమదొర గారియెదుట, తన్ముఖోక్తులు= ఆపత్రికలోని మొదటిమాటలు, అన్నియున్, వెఱఁగొందఁగన్, సముచితముగన్ = ఉచితరీతిని, వినఁబడెన్, అంతన్.

తా. ఆలక్ష్మణకవి వ్రాసిన జాబులోనికొన్నిమాటలు సభవా రత్యాతురులై వినిరి.

వ. ఎట్లనిన. 144

తా. అంగదుఁడు చెప్పినమాటలును, దమ్మన్నకు లక్ష్మణకవివ్రాసిన యుత్తరములోని వాక్యములును క్రిందఁ జెప్పఁబోవుచున్నాఁడు.

ఉ. నీతి యొకింత లేక ధరణీజ ననిందిత లంక రుద్ధ మా
రీతి పొసంగునట్లుగ హరించితి వేటికిఁ బోరరావు వం
శాతియశోపహారి విబుధాహిత పద్ధతి దుష్ట ధర్మరా
యాతత ఘోరగోతతి సమర్థత నిన్ దెగటార్చి వైచెదన్.

రాఘు.—అనిందితన్ = స్తోత్రార్హయైన. ధరణీజన్ = సీతను, నీతి యొకింతలేక = నీతిమాలి, లంకన్ = లంకలో, రుద్ధమారీతి = అరికట్టఁబడిన రీతి, పొసంగునట్లు=చెల్లునట్లు, హరించితివి=అపహరించితివి,ఏటికిఁబోరరావు= యుద్ధమునకింకనురావేమి? వంశాతియశోపహారిన్=నీవంశము సుకీర్తినిహరించు నట్టియు, విబుధాహితపద్ధతిన్=దేవవిరోధమార్గముగలిగినట్టియు, నిన్=నిన్ను, దుష్ట=ఓరిదుష్టుఁడా! ధర్మరై = ధనుర్లక్ష్మిచే, ఆతత = వ్యాప్తములగు, ఘోర= భయంకరములగు, గోతతిన్=బాణపరంపరచే, సమర్థతన్=నాసామర్థ్యమున, తెగటార్చివైచెదన్ = ఖండించివైతును.

తా. పవిత్రురాలైనసీతను హరించితివి. నీవుల స్వవంశముకీర్తిని బాడు చేసితివి. రా యుద్ధమునకు రమ్ము, నిన్ను ఖండించెదను.

లక్ష్మ.—నీతియొకింతలేక =న్యాయమునువిడిచి, ధరణీజననిందిత=భూమిలోనిజనులచేదూషింపఁబడఁదగినవాఁడా, లంకన్=నాభూమిని = రుద్ధము= అరికట్టఁబడినది, ఔరీతిన్= అగునట్టిప్రకారము, పొసంగునట్లుగన్= కూడు

నట్టుల; హరించితివి=పుచ్చుకొంటివి, ఏటికి=ఎందులకనిహరించితివి, పౌర=పౌరుష. రావువంశాలియశోపహారి= రావువారికీర్తిని జెఱచువాఁడా! విబుధాహితపద్ధతి = పెద్దలకిష్టముకానిమార్గముననడచువాఁడా, దుష్ట, ధర్మరాయా! తత = వ్యాప్తమైన ఘోర = ఘోరములైన, గోతతిసమర్థతన్ = పదములపొందికవలన, నిన్ =నిన్ను, తెగటార్చివైచెదన్.

తా. అన్యాయముగ నాలంకను హరించినాఁడవు, నీవంశకీర్తిని జెఱచితివి. నీపైఁ బద్యములం జెప్పి యడఁచెద.

గీ. శ్రీయు నాయు వొప్పఁ బ్రియబంధుయుతి మన
నిచ్ఛ గలిగియుండెనేని విడువు
పూజ్య సుపృథులాంక భూమిజ నాతత
సన్నుతప్రబలయశం బెసంగ. 146

రాఘ.—సుపృథులాంక= పెక్కువిరుదములుగలరావణా! శ్రీయన్ = ఐశ్వర్యమును, ఆయువున్ = జీవితమును, ఒప్పన్ = కూడియుండునట్లు, ప్రియబంధుయుతిన్ = స్నేహితులుబంధువులుఁగలసియుండురీతిని, మనన్ = బ్రదుకుటయందు, ఇచ్ఛగలిగియుండెనేని = నీకిష్టముండినచో, ఆతత=విస్తారమైన, సన్నుత=కొనియాడఁదగిన, ప్రబల = అధికమైన, యశంబెసంగన్ = కీర్తియొప్పునట్లు, పూజ్యన్ = పూజ్యురాలైన, భూమిజన్ =సీతను, విడువు = విడిచిపెట్టుము.

తా. నీకు బ్రదుకుపై మనస్సుండెనా, పదిమందిచుట్టములు చెలికాండ్రతోఁ దిరుగనిష్టముండెనేని సీతనువిడిచిపెట్టుము. (విడువవేని చావు తప్పదు)

లక్ష్మ — శ్రీయన్ ఆయువున్ ఒప్పన్ =ధనాద్యైశ్వర్యములు దీర్ఘాయువును, గలిగి, ప్రియబంధుయుతిన్ = ప్రియులైనచుట్టములతోఁగూడి, మననిచ్ఛగలిగియుండెనేని = నీకుఁ బ్రదుకవలయుననుతలంపున్నయెడల, జనాతతసన్నుత ప్రబలయశంబు = జనులచే మిక్కిలికొనియాడఁబడుకీర్తిగలిగి, ఎసంగన్ = పెంపొందుటకు, పూజ్య=దివ్యమైన, సుపృథు = సారవంతమైన, లాంకభూమి = లంకభూమిని, విడువు.

తా. సులభము.

క. అని లక్ష్మణాగ్రజన్మువ
చనములుగాఁ దన్ముఖమున సర్వము విని గ్ర
బ్బునఁ దనవారికిఁ జెప్పె న
తని మహితక్రోధసరణిఁ దగఁ బట్టుకొనన్. 147

రాఘు.—అని=ఈప్రకారము, లక్ష్మణాగ్రజన్మువచనములుగాన్ = రాముఁడు చెప్పినట్లుగా, తన్ముఖమునన్ = అంగదువిద్వారా, సర్వము=సకలము, విని=ఆలించి, గ్రబ్బునన్ = శీఘ్రముగా, మహితక్రోధసరణిన్ = అధికకోపముతో, తగన్, అతనిన్ = అంగదుని, పట్టుకొనన్ = పట్టుకొండని, తనవారికిన్ = తనపరివారమునకు, చెప్పెన్ = ఆనతిచ్చెను.

తా. అంగదునిముఖమున రాముఁడు వలసినరాయబారమును విని కోపించి యంగదుని బట్టుకొండని తనవారికి రావణుఁడు కట్టడచేసెను.

లక్ష్మ.—అని, సర్వమును = వినఁదగినదంతయును, తన్ముఖమునన్ = ఆజాబువలన, లక్ష్మణాగ్రజన్మువచనములుగన్ = లక్ష్మణకవిమాటలుగా, విని, గ్రబ్బునన్ = వేగముగ, అతనిమన్ = గౌరవముచే, హిత = విడువఁబడిన, క్రోధసరణి = కోపము, తగన్, పట్టుకొనన్ = నాటుకొనఁగా, తనవారికిఁ జెప్పెన్ = తనకుసంబంధించినవారితోఁ జెప్పెను.

తా. ఆజాబుచదువుకొని కోపముతోఁ దనవారిం గాంచి యందలివిషయమంతయుఁ దెల్పెను.

సీ. వారును నాలేఖవైరిపంపునఁ జేర
వచ్చు టంత యెఱింగి వారితోన
తా రాఘరుష వినుదారిన వట్టి యా
ఘనపద్య దృఢశక్తిఁ గాంచి చిమ్మి
వైచిన నాలేఖవైరులు నశియింపఁ
దగుశ్లోకసంగతి మగిడి లక్ష్మ
ణాగ్రజన్మునికడ కరుదేర నంతవృ
త్తాంతంబు దెలిసి యతండు మృదుతఁ

గీ. బని యొకింతయుఁ గా దింక బలియుఁ డైన
యహితుఁ జంపక తదధీన మైనయట్టి
లంక సాధింప నొండు తలంపు గలదె
హరిబలంబె తత్క్రియకుఁ దోడరయ నాకు. 148

రాఘ. — వారును = ఆరావణునిపంపునఁ దన్నుఁ బట్టుకొనవచ్చినవారును, ఆలేఖవైరిపంపునన్ = రావణుఁడుపంపఁగా, చేరవచ్చుట=తనదగ్గఱకు వచ్చిరని, అంతన్ = ఆసమయమున, ఎఱింగి = తెలిసికొని, తాన్ = అంగదుఁడు, వారితోన్ = పట్టవచ్చినవారితోనే, ఉద్ధురుషన్ =కోపమెత్తి, వినుదారినపట్టె = ఆకాశమున కెగిరి, దృఢశక్తిన్ = మిక్కుటమైనబలిమిచే, అఘునపద్యగాంచి = గగనమార్గమునుబొంది, చిమ్మివైవన్ =తన్నుఁబట్టుకొనిన రాక్షసులను విసరివేయఁగా, ఆలేఖవైరులు=రాక్షసులు, నశింపన్ =నాశనమునొందఁగా, తగుశ్లోకసంగతిన్ = తగినకీర్తినిబొంది, మగిడి=మరలి, లక్ష్మణాగ్రజునికడకున్ = రామునిసన్నిధికి, అరుదేరన్ = రాఁగా రాఁగా, అతఁడు = రాముఁడు, ఆంతవృత్తాంతంబున్ దెలిసి = సమస్తవిషయములు నంగదుఁడు చెప్పఁగావిని, మృదుతన్ =మెత్తనిమాటలతో, పని=కార్యము, ఒకింతయును గాదు = కించిత్తయినను నెఱవేఱదు. ఇంకన్ =ఇంకమీఁద, బలియుఁడైన యహితున్ = బలవంతుఁడగు విరోధిని, చంపక = వధింపక, తదధీనమైనయట్టిలంకన్ = వానియాధీనములోని లంకాపట్టణమును, సాధింపన్ = ముట్టడించుటకు, ఒండుతలఁపుగలదె = రెండవయుపాయమున్నదా, లేదు. తత్క్రియకున్ = లంకనుసాధించుటకు, తోడు=సహాయము, హరిబలంబె = వానరసేనయే.

తా. తన్నుఁబట్టుకొనఁ బోయిన రక్కసులతోఁగూడ నంగదుఁడు గగనమున కెగసి యచ్చటనుండి వారిని క్రిందికి విసరి చంపి రామసన్నిధికి వచ్చియంతయుఁ జెప్పెను. లంకను సాధించుటకు కపిసేన నాకు సహాయ మొనర్చును. రావణుని జంపవలసినదే కాని మృదువాక్యములతోఁ జక్కఁబడ డని రాముఁడు నిశ్చయించుకొనె ననుట.

లక్ష్మ.—వారును=దమ్మన్న పక్షమువారును, ఆలేఖ=ఆజాబు, వైరిపంపున = విరోధియగుకవిపంపుటచే, వచ్చుట = వచ్చినదని, అంతఁ, ఎఱింగి, వానితోన = దమ్మన్నతో, తాను=ఆరాజబంధువులు, ఉషరుషఁ = కోపముంగాని, వినుదారిన = వినుచున్నమార్గముచే, పట్టి=అవలంబించి, అఘనపద్యదృఢశక్తిఁ = ఆజాబులోని పద్యములపటుత్వమును, కాంచి=విచారించి, ఆలేఖఁ=జాబును, చిమ్ముకుపైచినఁ = విసరివేయఁగా, వైరులునశింపఁదగుశ్లోకసంగతి = విరోధినాశనమునవలనయిన పద్యముల కూర్పుగలదియై, మగిడి = తిరిగి, లక్ష్మణాగ్రజన్ముకడకుఁ = లక్ష్మణకవియొద్దికి, అరుదేరఁ=తిరిగిరాఁగా, అంతవృత్తాంతంబుఁ, అతఁడు, తెలిసి=సమస్తముం దెలిసికొని, మృదుతఁ= మార్దవముచే, పనియొకింతయుంగాదు = పనియించుకంతయైన సాధ్యముకాదు. తదధీనమైనలంక, అహితుఁజంపక, సాధింప, ఒండుతలఁపుగలదె = రెండవయాలోచనకనఁబడదు. తత్క్రియఁ = విరోధినిచంపుటకు లంకనుసాధించుటకు, నాకు, హరిబలమె = ఈశ్వరసహాయమే, తోడు = సాధనమనుట.

తా. జాబు చదువుకొని కోపముతో వారు దానిం గ్రిందఁ బాఱవైచిరి. ఆవార్త వార్తాహరుఁడు వచ్చి చెప్పెను. లక్ష్మణకవి విరోధిజయమునకై హరిప్రసాదమే కాని వేఱొకటి లేదని యెంచుకొనియె ననుట.

వ. అని మఱియును. 149

సీ. సువిపులోన్నతభుజాశోభ నలపనస
వనధిపతితనూజవినతసుముఖ
శరభకేసరిమరుజ్జాతర్క్షభగజహా
రకుముదతారర్క్షరాజగోము
ఖశ్వేతపృథుసమాఖ్యాసముదంచన్మ
హాబలకలితనీలాంగదారు

ణాతనుభవద్రవిణస్ఫూర్తి మద్వైరి
బలహాతి సేయఁ దోడ్పాటుగాఁగఁ
గీ. బూని నాదుమాన్యక్షేత్ర మైనభూమి
జ నవినిందిత దుర్మార్గచరితుఁ డగుచు
నపహరించినవాని త్రుళ్లణఁతు నుగ్ర
బహుళగోతతి సచ్ఛ్లోకపటిమ వెలయ. 150

రాఘ.—సువిపులోన్నతభుజాశోభ=మిక్కిలివిశాలమును, పొడవును గల భుజసౌందర్యముచే (నొప్పు), నల=నలుఁడు, పనస=పనసుఁడు, వనధిపతి తనూజ=(వరుణపుత్త్రుఁడైన) సుషేణుఁడు, వినత = వినతుఁడు, సుముఖ=సుముఖుఁడు, శరభ=శరభుఁడు, కేసరి = కేసరియనునతఁడు, మరుజ్జాత = ఆంజనేయుఁడు, ఋషభ, గజ, హర, కుముద, తార, ఋక్షరాజ=జాంబవంతుఁడు, గోముఖ, శ్వేత, పృథు, సమాఖ్యాసముదంచత్ = అనుపైపేరులచే నొప్పుచున్న, మహాబలకలిత=గొప్పబలముతోఁగూడిన నీల, అంగద, అరుణతనుభవ=(సూర్యపుత్త్రుఁడైన) సుగ్రీవుఁడు, (ఈమొదలైనవారి) ద్రవిణస్ఫూర్తి=బలాతిశయము, మద్వైరిబలనిహాతి సేయన్ = నాశత్రువులను ఖండించుటకు, తోడ్పాటుగాఁగన్ = సహాయముకాఁగా, పూని=ప్రయత్నించి, అవినిందితన్ = పొగడ్తకెక్కిన, నాదు=నాయొక్క, మాన్యక్షేత్రము=పూజ్యురాలైనభార్య, ఐనభూమిజన్=అయినట్టి భూపుత్త్రిని, దుర్మార్గచరితుఁడగుచున్, అపహరించినవానిన్=ఎత్తుకొనిపోయిన రక్కసుని, ఉగ్ర=ఉగ్రమైన, బహుళ=విస్తారమైన, గోతతిన్=వరసమూహముచే, సత్+శ్లోక+పటిమ వెలయన్ = సద్యశము చెందునట్లుగా, త్రుళ్లణఁతున్ = వానిమిట్టిపాటును దగ్గించెదను.

తా. పైనఁ జేర్కొనఁబడిన కపుల సహాయమున సీతాపహరణము గావించి త్రుళ్లిపడుచున్న రావణుని సంహరించెదను.

లక్ష్మ.—లక్ష్మణకవి యిష్టదేవతను ప్రార్థించుచున్నాఁడు. ఎట్లన:— సువిపులోన్నతభుజా=విస్తారములు నున్నతములునైన భుజములుగలవాఁడా, నవ

నధిపతితనూజ = లక్ష్మీదేవితోఁగూడినవాఁడా, (వనధిపతి=సముద్రుఁడు-అతని కూఁతురు, వనధిపతితనూజ) వినత = నమస్కరించినవారికి, సుముఖ=శుభంకరుఁడా, శర=తెల్లుపూవు, భ=నక్షత్రములు, కేసరి=సింహము, మరుజ్జాతర్షభ =దేవశ్రేష్ఠుఁడైనయింద్రుని, గజ=ఏనుఁగు (ఐరావతము), కుముద = కలువలు, తార=ముత్తెము, ఋక్షరాజ=చంద్రుఁడు, గో=వజ్రము, ముఖ=ఈపైనిచెప్పిన వానివలె, శ్వేత=శుభ్రమైన, పృథు=విస్తారమగు, సమాఖ్యా=కీర్తిగలవాఁడా, సముదంచత్ = అతిశయించుచున్న, మహా=గొప్పదియగు, బలకలిత=బలముతోఁగూడిన, నీలాంగ=నల్లనియవయవములుగల, దారుణతను=గొప్పదేహముగలవాఁడా, భవత్ = నీవనెడు, ద్రవిణ=బలముయొక్క (భవద్ద్రవిణ యని దకారద్విత్వముండఁదగును)స్ఫూర్తి=ప్రకాశము,మద్వైరిబలనిహతి సేయన్ = శాత్రులసంహారముచేయుటకు, తోడ్పాటు=సహాయము, కాఁగన్ =కాఁగా, పూని=గ్రహించి, నాదుమాన్యక్షేత్రమైనభూమిన్ = నాయొక్కమాన్యపుభూమిని, జనవినిందితదుర్మార్గచరితుఁడు, అగుచున్, అపహరించినవానిన్ = ధర్మారావును, ఉగ్ర, బహుళ, గోతతి = పరుషాక్షరములు, విషమాక్షరము గలిగిన వాక్యములుగల, సత్ + శ్లోకపటిమ వెలయన్ = చక్కనిపద్యములు చెప్పి, తుర్ణంతున్=ఉద్ధతిని మాన్పుదును.

చ. అని తలపోయుచో నలప్రజాపతి చేసినమేర దప్పకం
బనివడి యద్రిచారు లసమానమహారుణధామయుక్తితో
డన పరవాహినీశనికటంబున కేగ నరివ్రజంబు సే
యునతనుసంగరంబునకు నోపక పాఱెను జోళ్లు వీడఁగన్.

రాఘు,—అని, తలపోయుచోన్=ఇట్లని యాలోచించుచుండఁగా, అలప్రజాపతిని=ఆరాజు(రాముఁడు), చేసిన=ఏర్పఱచిన, మేర=హద్దు, తప్పకన్=దాఁటకయే, (ఇక్కడ, తప్పకయనికళగానుండుటమంచిది, తప్పకేపని వడియని సవరించితిమా విశ్రమభంగమగుచున్నది) పనివడి = పూని, అద్రిచారులు=కొండలందిరుగువానరులు, అసమాన=సాటిలేని, మహారుణ=మిక్కిలియెఱ్ఱనైన, ధామ=కాంతియొక్క, యుక్తితోడన=కూడికతో, పరవాహినీశ

నికటంబునకు = శత్రుసేనానాయకులసమీపమునకు, ఏగన్ = పోఁగా, అరివ్రజంబు=శత్రుసంఘము. చేయుననుసంగరంబునకున్ = చేయునట్టి గొప్ప యుద్ధమునకు, ఓపక తాళలేక, జోళ్లువీడఁగన్ = కవచంబులూడిపోవునట్లు, పాఱెను=పరువెత్తెను.

తా. రామునికట్టడప్రకారము కపిసేన రాక్షససేనతోఁ దాఁకి యుద్ధముచేయఁగా నోపలేక కవచములూడిపోవునట్లు రాక్షససేన పరుగెత్తిపోయెను.

లక్ష్మ.—అనితలపోయుచోన్ = తలంచుచుండఁగా, అలప్రజాపతి=బ్రహ్మ, చేసినమేరన్=నిల్పినహద్దును, తప్పకన్=అతిక్రమింపకయే, పనివడి శీఘ్రముగ, అద్రి = సూర్యుఁడు, ని. 'రవిరద్రీరవిర్హ్వాళి' యని. చారు=చక్కనైన, లసమాన=ప్రకాశించెడు, మహా=గొప్పదియగు, అరుణ=ఎఱ్ఱని, ధామ=తేజముయొక్క, యుక్తితోన్ = కలయికతో, అపర=పడమరఁగల, వాహినీశ=సముద్రునియొక్క, నికటంబునకున్=చేరువునకు, ఏఁగన్=వెళ్లఁగా (సూర్యాస్తమయముకాఁగా), అరివ్రజంబు = చక్రవాకములసమూహము, చేయుననుసంగరంబునకున్ =ఒనర్చునట్టి మన్మథక్రీడలకు, ఓపక=తాళక, జోళ్లు=జతలు, వీఁడగన్=వీడిపోవునట్లు, పాఱెన్=చెదరిపోయెను.

తా. బ్రహ్మదేవుని నియమప్రకారము సూర్యుఁ డెఱ్ఱనికాంతితోఁ బడమటిసముద్రమునఁ జొచ్చెను. చక్రవాకములు జతలు విడిపోయినవి. ఈ చక్రవాకపక్షులు, పగలుకూడియుండి, రాత్రులలో జతలువిడిపోవునని ప్రసిద్ధము.

చ. అవికి రణాభిముఖ్యమపు డందక నూఱును వేయునై కరం
బు వెలయకుండునట్టిదళముల్ గలయాశరజాతముల్ చెడం
గువలయ మంతలోఁ దెలివిగాఁడెను రాజమహోదయార్థివ
స్తువునకు మేలుగాదె మఱిసొంపఱిపంకజనుల్ కృశించుటల్.

రాఘ.—అపుడు=ఆవేళ, అవికి=భయపడి, రణాభిముఖ్యము=యుద్ధమున కెదుర్కొనుటను, అందక=పొందక, నూఱును వేయును ఐ=నూరులు,

వేలుగా, కరంబు=అత్యంతము, వెలయకుండునట్టి దళములఁ గల=భీతిచే వెనుదీయుచున్న సేనలుగల, ఆశరజాతములఁ = రక్కసిగుంపులు, చెడఁ=నశింపఁగా, కువలయము=భూమి, అంతలోనఁ=ఆసమయమున, తెలివిగూడెను=ప్రకాశించెను. రాజమహోదయార్థి వస్తువునకుఁ=రాజుయొక్క యభ్యుదయముంగోరిన దానికి (భూమికి), మఱి, సొంపఱి=ఏపుచెడి, పంకజనుల్=పాపసహితులైన జనులు, కృశించుటల్=నశించుట, మేలుగాదె=సంతసముకాదా?

తా. రాక్షసులు నూర్లు, వేలు గుంపులుగుంపులుగా, భయపడి యుద్ధముచేయలేక నశించిరి. లోకము సంతసించెను. రాజునకు మేలుగోరువారికి సంతసము కలుగుట తగినదేకదా.

లక్ష్య.—అపుడు = ఆసమయమున, అవి=సూర్యుని, కిరణ=కిరణములకు, అభిముఖ్యము=ఎదురుపడుట, అందక=చెందక, నూఱును, వేయును,ఐ, వెలయకుండునట్టి దళములఁ గల=సూర్యాస్తమానముచే, శతపత్రములు, సహస్రపత్రములునుగలిగి సొంపుచెడిన, ఆశరజాతములఁ=అపద్మములు, చెడఁ=ముకుళింపఁగా, కువలయము=కలువ, అంతలోఁ, తెలివిగూడెను = వికసించెను, రాజ=చంద్రుని, మహోదయ = ఉదయించుటకు, అర్థి=కోరుచున్న, వస్తువునకుఁ=ఏవస్తువునకైనను, మేలుకాదా=శుభమేకాదా. సొంపఱి=అందముచెడి, మఱి, పంకజనుల్=పద్మములు (పంక=బురదలో, జని=పుట్టుకగలవి-పంకజనులు), కృశించుటల్ = వికాసముచెడుట, మేలుగాదె=మేలుగదా !
(తమవృద్ధికంటెఁ బరులక్షయము మిగుల మేలనుట.)

తా. సూర్యకాంతి తగులక పద్మములు ముకుళించినవి. చంద్రునిరాకచే కలువలు వికసించినవి.

క. తనజగడాల్మునుపగ లణఁ
గ నెగడి లోహితత మెఱయఁగాఁ జేరుపసం
జన నలద్యుతిచే వింతగ
తి నిడుపలాశవరసంతతి ఘనత గాంచెఁ. 153

రాఘ.—తనజగడాలు=తన యుద్ధములు, మునుపగలు=మునుపటి పగటియందే, అణఁగన్=అడఁగిపోఁగా, నెగడి, లోహితతన్ = వ్రణములచే నెత్తుపడుట, మెఱయఁగాన్=అతిశయింపఁగా, చేరుపసన్=చేరిన కాంతితో, చనన్=వెళ్లఁగా, అలద్యుతిచేన్=ఆకాంతిచేత, వింతగతినిడు=చోద్యమును గూర్చు, పలాశవర = రాక్షసశ్రేష్ఠుల, సంతతి=సమూహము, ఘనతన్ కాంచెన్=యుద్ధములో గాయములుపడి ఘనతం గాంచెననుట.

తా. చేసినయుద్ధములో గాయములు తగిలినరాక్షసుల మూఁక యా గాయముల యెఱుపుచే వింతగాఁ గానఁబడుచుండెను.

లక్ష్మ.—తనజగడాలు=తనగొప్పకాంతి, (జగ+డాలు) మునుపగలు=మునుపటిదినమందు, అణఁగన్=తగ్గిపోఁగా, నెగడి=ఒప్పి, సంజ=సంధ్యాకాలము, మెఱయఁగా=మెఱయునట్లు, రోహితతన్=ఎఱుపురంగును, చేరుపన్ = చేర్పఁగా, ననలద్యుతిచేన్ = పుష్పములవంటి కాంతిచేత, వింతగతిన్ = వింతయగునట్టివిధమును, ఇడు=కల్గించు, పలాశవగసంతతి = మోదుగులగుంపు యొక్క, ఘనతన్=అతిశయమును, కాంచెన్=పొందెను. (ఇందు, సంజను+అనలద్యుతి-సంజను=సంధ్యయును (కర్త) అనలద్యుతిచేన్ = నిప్పువంటికాంతి చేతనని యొకపాఠమున్నది. కాని సంజను = సంధ్యను, అని యర్థము కల్గుచున్నది.

తా. సంధ్యాకాలము, ఎఱ్ఱని కాంతిచే మోదుగులవలె ప్రకాశించెననుట

వ. ఇవ్విధంబునం బశ్చిమదిగ్భాగంబున బయలుదేఱి క్రమ
క్రమంబున వ్యాపించి. 154

తా. ఉభయపక్షంబుల సుగమము.

మ. ఒకయామం జని రూఢి గ్రమ్మఁ గుముద ప్రోత్సాహముం
దస్యూహ్యా, త్సుకరశ్రీపృథునీలభీకరతమస్స్వార్త్యున్నతుల్
శ్వేతతా, రకపీనప్రభలుం మహోతనుతఁ జేరం దోడనే
ఋక్షరా, జుకళల్ గ్రొంచెము గాఁగఁ గానఁబడె నచ్చో
నెంతయుం వింతగాఁ. 155

రాఘు.—ఒకయాసన్ = ఒక్కదిక్కునకు, జని=వెళ్ళి, రూఢిన్ = రూఢిచే, క్రమ్మన్=వ్యాపింపఁగా, కుముద = కుముదుఁడనువానరుని, ప్రోత్సాహమున్ = సంతోషమును, దస్యు=శత్రులను, హృత్ = హరించునట్టి, ని. "దస్యుశ్శాత్రవశ్శత్రవః"అని. సుకర=సులభమగు, శ్రీ=శోభచే, పృథు=గొప్ప వాఁడగు, నీల=నీలుఁడను వానరుని, భీకరతమ=మిగులభయంకరమైన, స్ఫూర్త్యున్నతుల్=ప్రకాశాధిక్యములును, శ్వేతతార = శ్వేతుఁడు, తారుఁడునను, కపీనప్రభలున్ = కపిరాజులకాంతులును, మహా+అతనుతన్ = అత్యంతాధిక్యముగా, చేరన్=చేరఁగా, తోడనే=వెంటనే, ఋక్షరాజు = జాంబవంతుని, కళల్=కౌశలము, అచ్చోన్ = ఆయుద్ధరంగమున, ఎంతయున్ వింతగాన్=మిక్కిలిచమత్కారముగ, కొంచెముగాఁగన్ = తక్కువయ్యె, కానఁబడెన్ = కనంబడియెను.

తా. కుముదుఁడు, నీలుఁడు, శ్వేతుఁడు, తారుఁడు నను వానరవీరులుగ్రముగా రణ మొనరించుచుండ జాంబవంతుఁ డంతకుమున్ను చేయుచున్న యుద్ధము తగ్గించెను.

లక్ష్మ.—ఒకయాసంజ = ఒకటియగునాసంధ్య, నిరూఢిన్ = నిశ్చయముగా, క్రమ్మన్=క్రమ్ముకొనఁగా, కుముదప్రోత్సాహమున్ = కలువలసంతోషమును, దస్యు=దొంగల, (ని,'దస్యుతస్కరమోషకాః' అని.) హృత్ = మనస్సులకు, సుకర=సులభమగు, శ్రీ=కాంతిచే, పృథు=విస్తారమైన, నీల=నల్లని, భీకర = భయంకరమైన, తమః = అంధకారముయొక్క, స్ఫూర్త్యున్నతుల్= ప్రకాశాతిశయములును, శ్వేత=తెల్లని, తారక=నక్షత్రముల, పీనప్రభలున్ = పెద్దకాంతులును, మహాతనుతన్ = మిక్కిలియతిశయమును, చేరన్=పొందఁగా, తోడనే=వెంటనే, ఋక్షరాజుకళల్=నక్షత్రాధిపతియైన చంద్రుని కాంతులు, ఎంతయున్, వింతగాన్, కొంచెముగాఁగన్, కానఁబడెన్.

తా. అపుడు కలువలు వికసించినవి. దొంగల కిష్టమైననల్లని చీఁకట్లలమినవి. చుక్కలతెల్లనికాంతి హెచ్చెను. ఇట్టితరుణమునఁ జంద్రకాంతి కొంచెమయినట్లు వింతగా నగపడెను.

చ. తదవసరంబునందు బుధదారకుఁ డారజనీచరుండు సొం
పొదవఁగ మింటనుండి తనయుద్ధతిఁ జూపఁగ నేమిచెప్ప నం
గదనలమైందవాతిసుముఖప్రముఖార్హహరివ్రజంబు మే
లుదనకుఁగాంచ రామిఁ దనలోపసమాలి ముడింగె నెంతయున్.

రాఘ.—తదవసరంబునందున్ = ఆసమయంబున, బుధదారకుఁడు=దేవతలను భేదించువాఁడు, ఆరజనీచరుండు=రాక్షసుఁడు (ఇంద్రజిత్తు), సొంపొదవఁగన్, మింటనుండి=గగనముననిలిచి, తనయుద్ధతిన్=తన, యుత్ + హతి = యుద్ధమందుకొట్టుటను, చూపఁగన్, తనయుద్ధతిచూపఁగన్=ఔద్ధత్యమును గనఁబఱపఁగా, ఏమిచెప్పన్ = చెప్పుటకేమిగలదు, చెప్పనలవిగాదు. అంగద = వాలిపుత్రుఁడు, నల=నలుఁడు, మైంద=మైందుఁడు, వాతి = వాతపుత్రుఁడు (ఆంజనేయుఁడు), సుముఖ=సుముఖుఁడు, ప్రముఖ = ముఖ్యులుగాఁగల, అర్హ=ఉచితమైన, హరివ్రజంబు=కపిసేన, మేలు=శుభము, తనకు, కాంచరామిన్=కనఁబడకపోవుటచే, తన+లో+పస+మాలి = తనయందున్న బలముడిగి, ముడింగెన్ = ఖిన్నత్వమునొందెను, ఎంతయున్ = మిగులవికాసహీనమైయుండె ననుట.

తా. అపు డింద్రజిత్తు వినువీథినుండి యుద్ధముచేయ మొదలుపెట్టిన కపిసేన కేమియు వలనుగాక సంకోచించెను.

లక్ష్మ.—తదవసరంబునందున్ = అప్పుడు, బుధదారకుఁడు=బుధుఁడు కుమారుఁడుగాఁగల, ఆరజనీచరుండు = చంద్రుఁడు, సొంపొదవఁగన్ = మనోహరాకారముతో, మింటనుండి = ఆకాశముమీఁద వెలుఁగుచు, తనయుద్ధతిన్ = తనప్రతాపమును, చూపఁగన్ = కనఁబడునట్లు చేయఁగా, అంగదన్=ఆపదచే, నలము=పద్మము, ఐందవ=చంద్రునియొక్క, అతిసుముఖ = మిక్కిలిసుందరములగువానిలో, ప్రముఖ=శ్రేష్ఠమైన, అర్హ = తగిన, హరివ్రజంబు మేలు = కిరణావళియొక్క యుపయోగము, ని. "హరిర్యమార్కాశ్వాగ్నీందు విష్ణ్వింద్రాంశుశుకేషు" అని. తనకుఁ గాంచరామిన్=తనకుఁ గనఁబడని కారణమున, తనలోపసమాలి=తనకాంతిచెడి, ముడింగెన్, ఎంతయున్= మిగుల ముకుళించెను.

తా. అంతట చంద్రుఁడు గగనమున వెలుంగుటచేఁ బద్మము చంద్రకిరణముల కాంతికి సహింపక ముకుళించుకొని పోయెను.

వ. అంత. 157

సీ. తగ నగోచరవృత్తిఁ దాల్చి యెద్దెసఁ దాన
యగుచొప్పి నింగి శబ్దగుణముఖ్య
సాక్షియై రావణసంతాన మహిజాత
లక్ష్యగోసితరామలక్ష్మణంబు
నగుచు నవ్వేళ సొంపుగ విజృంభింపంగ
రాత్రిం రాత్రిచారు లసమాన
శోభావిభూతి నచ్చుగ మించనంతఁ గ
మలజసంతతి మేలు దెలుపుచుండు

గీ. నట్టిదియగు నానాపత్ప్రహారణవాక్య
రాజి నాలించి యజవంశరత్న ముల్ల
సద్విధిఁ బతంగముఖ్యదర్శనము గోరి
తన్నిమిత్తవిచారతత్పరత నుండ. 158

రాఘ.—రావణసంతానము=ఇంద్రజిత్తు, తగన్=తగునట్లు, అగోచరవృత్తిన్=కనఁబటకుండ నుండుటను, దాల్చి=ధరించి, ఎద్దెసన్+తాన+అగుచున్=ఏప్రక్కను జూచినను దానేయున్నట్లు తోఁచింపుచు, ఒప్పి=విజృంభించి, నింగిన్=ఆకాశమున, శబ్దగుణసాక్షియై=ఆకాశమునఁ దానున్నందులకు సాక్ష్యముగాఁ దన ధనుష్టంకారమాత్రముగాఁ దెల్పుచు, అహిజాత=సర్పములని, లక్ష్య=ఊహింపఁదగిన, గో=బాణములచే, అసిత=చిమ్మఁబడిన, రామలక్ష్మణంబు=రామలక్ష్మణులు గలవాఁడు. (నాగబాణములచేఁ రామలక్ష్మణులను బంధించి) అగుచున్, అవ్వేళన్—సొంపుగన్, విజృంభింపఁగన్=వ్యాపింపఁగా, (సామర్థ్యమును గనఁబఱుపఁగా) ఆరాత్రిచరులు=రక్షసులు, అసమానశోభా

విభూతి౯=సాటిలేనిశోభ, అచ్ఛగ౯=స్పష్టముగ, మించునంత౯ = రాక్షసులకు జయము ప్రకటమగుచుండఁగా, కమలజసంతతి=బ్రహ్మకుమారుఁడు(నారదుఁడు), వీనియొక్క, నానా=అనేకములగు, ఆపత్=ఆపదలను, ప్రహరణ=హరించునట్టిదియు, మేలు, తెలుపుచుండునట్టియు, అగు, వాక్యరాజి౯ = మాటలను, ఆలించి=విని, అజవంశరత్నము=రాముఁడు, ఉల్లసద్విధి౯=ధ్యానమార్గమున, పతంగ+ముఖ్య+దర్శనముఁగోరి = పక్షిశ్రేష్ఠుఁడగు గరుత్మంతుని జూడవలయునని, తన్నిమిత్తవిచారతత్పరత౯=ఆగరుత్మంతుఁడు తనయొద్దకే రీతిని వచ్చునాయను నాలోచనలో, ఉండ౯=ఉండఁగా.

తా. ఇంద్రజిత్తు నాగబాణములచే రామలక్ష్మణులను బంధించెను. నారదుఁడపుడు రామునియొద్దికివచ్చి నాగపాశబంధనములను విప్పుటకు గరుత్మంతుని బిలిపింపు మని చెప్పెను. రాముఁ డట్లు తలంచుకొనుచుండెను.

లక్ష్మ.—తగ౯ - అగోచరవృత్తిఁదాల్చి=కనఁబడని రూపముంగొని, ఎద్దెస౯ దానయగుచొప్పి=ఏదిక్కునను తానేయై, శబ్దగుణముఖ్యసాక్షియై=శబ్ద=ధ్వనియనెడు, గుణ=గుణము, ముఖ్యసాక్షి = ముఖ్యమైన సాక్షికలది, ఆకాశమును దెలిపికొనుటకు దానికి రూపములేదు అదియున్నట్లు తెలియును. శబ్దమే సాక్షియనుట. ''శబ్దగుణకమాకాశమ్'' అని. ఐరావణ=ఇంద్రునియేనుఁగురీతిని, సంతానమహీజాత = కల్పవృక్షమువలెను, లక్ష్య=చూడఁదగిన, గో=చంద్రునిచే, ని. 'గౌః క్రతౌవృషభేచంద్రే' అని. సిత=తెల్లనిదియు, రామ=సుందరమైన, లక్ష్మణంబు=శోభగలదియై, ని. ''లక్ష్మీవా౯ లక్ష్మణశ్శ్రీమా౯' అని. అగుచు౯, అవ్వేళ౯ = ఆరాత్రియందు, సొంపుగ౯, విజృంభింప౯=వెలుంగఁగా, ఆరాత్రి, చారుశోభావిభూతి౯—చారు=సుందరమైన, శోభా=కాంతియొక్క, విభూతి౯ = సంపదచే, అచ్ఛగ౯=ప్రకాశముతో, మించ౯=ఉండఁగా, అంత౯=అంతట, కమలజసంతతి=బ్రహ్మవంశస్థులగు బ్రాహ్మణులకు - లేక-పద్మములకు, మేలు=శుభము, తెలుపుచుండునట్టిది=తెలియఁజేయుచున్నది, అగు=ఐన, నానా=అనేకవిధములగు, పత్ప్రహరణవాక్యరాజి౯ = కోడి కూఁతలను, (పత్ప్రహరణము = చరణాయుధము, కాలితోఁగొట్టునది, కోడి) ఆలించి=విని, అజవంశరత్నము = లక్ష్మణకవి,

ఉల్లసద్వీథిన్=ప్రకాశించుచున్న విధానముచే, పతంగ=సూర్యుని, ముఖ్య=శ్రేష్ఠమైన, దర్శనముగోరి=ఉదయమునపేక్షించి, తన్నిమిత్త=ఆసూర్యుని చూచుటకై, విచార తత్పరతనుండన్ = విచారించుచుండఁగా, ఆసక్తికలవాఁడై యుండెననుట.

తా. ఆకాశమున జంద్రుఁడు స్వచ్ఛముగా వెలుఁగుచుండెను. కొంతసేపటికిఁ బద్మములకును బ్రాహ్మణులకును మేలును సూచించుకోఁడికూఁతలు వినఁబడియెను. లక్ష్మణకవిగారు సూర్యోదయమునకై యెదురుచూచుచుండిరి.

క. వినతాతనూజుఁ డప్పుడు
 తనముందట నిలిచి హారులఁ దద్దయుఁ దోలన్
 మును దమ్ములసత్ప్రభ డా
 య నొనర నుదయంబు నొందె నయ్యినుఁ డంతన్. 159

రాఘ.—అప్పుడు, వినతాతనూజుఁడు=గరుత్మంతుఁడు, తనముందట నిలిచి=ఆరాముని యెదుట నిలువంబడిన, హారులన్=పాములను, తద్దయుఁ దోలన్=చక్కఁగాఁ దఱిమివేయఁగా, మును = ముందుగా, తమ్మున్=తమ్ముఁడైన లక్ష్మణుని, లసత్ప్రభ = మంచికాంతి, డాయన్=చేరఁగా, ఇనుఁడు=రాజైనరాముఁడు, ఉదయంబున్=వృద్ధిని, ఒనరన్ = తగునట్లు, అంతన్=అంతట, ఒందెన్=చెందెను.

తా. గరుత్మంతుఁడు రాఁగానే నాగపాశములు వీడినవి. లక్ష్మణుని వికాసముం గాంచి రాముఁడు సంతసించెను.

లక్ష్మ.—అప్పుడు=తెల్లవాఱుచుండఁగా, వినతాతనూజుఁడు = అనూరుఁడు, తనముందట నిలిచి=సూర్యుని యెదుటనుండి, తద్దన్=బాగుగ, హారులందోలన్ = గుఱ్ఱములను దోలుచుండఁగా, మున్=ముందుగా, తమ్ము=పద్మములయందు, సత్ప్రభ=మంచికాంతి, డాయన్=పొందునట్లు, ఇనుఁడు = సూర్యుఁడు, అంతన్, ఒనరన్, ఉదయంబునొందెన్ = ఉదయించెను.

తా. అనూరుఁడను తనసారథి గుఱ్ఱములం దోలుచుండఁగా సూర్యుఁ డుదయించెను. పద్మములు వికసించినవి.

మ. లలి నచ్ఛో హరిమండలాభిముఖలీలావిస్ఫురద్గౌరతో, జ్జ్వ
లపత్త్రప్రచరచ్ఛిలీముఖచయాంచద్ధామధూమ్రాక్షయా
తులసత్సారసమాహితస్థితియుఁ దోడ్తో నొప్పె నాప్రాపునం
గలచక్రంబులునుం గరం బతనుసంగ్రామంబు గావింపఁగన్.

రాక్ష.—లలిన్, అచ్ఛోన్=ఆయుద్ధభూమిని, హరిమండల=వానర సేనకు, అభిముఖ = ఎదురగునట్టియు, లీలా=విలాసముచేత నే, విస్ఫురత్= ప్రకాశించుచున్నట్టియు, గౌరతా = గౌరవర్ణముచే, ఉజ్జ్వల=ప్రకాశించు చున్న, పత్త్ర=రెక్కలచే, ప్రచరత్=తిరుగుచున్న, శిలీముఖ=బాణముల, చయ= సముదాయము గలిగినట్టియు, అంచత్ = ఒప్పుచున్న, ధామ=తేజస్సుగలిగి నట్టియు, ధూమ్రాక్ష=ధూమ్రాక్షుఁడను పేరుగల, యాతు=రాక్షసుని, లస త్సార=మిన్నయైనబలముచే, సమాహిత = ఇష్టమగు, స్థితి=ఉనికి, తోడ్తోన్= వెంట నే, ఒప్పెన్-ప్రాపునంగలచక్రంబులును=ఆతోడ్పాటుననున్న సేనలును, కరంబు=మిక్కిలి, అతను సంగ్రామంబు=గొప్పయుద్ధమును, గావింపఁగన్= చేయఁగా.

తా. వానరసమూహము నెదిరించి బాణపరంపరలచేతను బరాక్రమముం చేతను ధూమ్రాక్షుఁడు యుద్ధముచేయుచుండఁగా రాక్షససేనలు వాని ప్రాపునఁ బెద్దయుద్ధముగావించెను.

లక్ష్మ—లలిన్, అచ్ఛోన్=అచ్చట, హరిమండల=సూర్యమండలము నకు, అభిముఖ=ఎదురగునట్టియు, లీలా=చమత్కారముచే, విస్ఫురత్=ప్రకా శించుచున్నట్టి, పత్త్ర=రేకులయందు, ప్రచరత్=విహరించుచున్న, శిలీముఖ= తుమ్మెదల, చయ = గుంపుయొక్క, అంచత్ = ఒప్పుచున్న, ధామ=(నల్లని) కాంతిచేత, ధూమ్ర=నలుపుతోఁగలసిన యెఱ్ఱరంగుగల యట్టియు, అక్షయ= నాశనములేని, అతుల=సాటిలేని, లసత్=సుందరమైన, సారసము = పద్మము, ఆహిత=కూర్పఁబడిన, స్థితియుఁ=ఉనికిగలదిగా, తోడ్తోన్=వెంబడినే, ప్రాపు

నంగల=సమీపముననున్న, చక్రంబులును = చక్రవాకపక్షులును, కరంబు= అత్యంతము, అతనుసంగ్రామంబు గావింపఁగన్ = మిక్కుటమైన కేళీలోలత నుండఁగా, ఒప్పెన్.

తా. సూర్యుని కభిముఖముగాఁ బద్మదళములు లేచినవి. వానియందుఁ దేంట్లు విహరించుచున్నవి. పద్మముల సమీపమునం గల చక్రవాకములు జోడుగూడి క్రీడించుచున్నవి.

గీ. అహహా! యేమిచెప్పఁగవచ్చు నపు డలహరి
కోమరురాయని శితకరకూటనిహతి
పూనికలు వలనొప్పువిస్ఫూర్తి నణఁచెఁ
దత్పలాశశక్తి దృఢత దఱిఁగిపోవ. 161

రాఘ —అహహా=ఆశ్చర్యము, ఏమిచెప్పఁగవచ్చున్=ఏమిచెప్పుటకును సాధ్యముకాదు. అపుడు = ఆసమయమున, అలహరికోమరురాయని= వాయుపుత్త్రుఁడైనహనుమంతుని, శిత...పూనికలు—శిత = తీక్ష్ణమైన, కరకూట=పిడికిండ్ల, నిహతి=కొట్టుటయొక్క, పూనికలు=యత్నములు, తత్పలాశశక్తి దృఢతన్ = ఆరాక్షసులబలదర్పములు, తఱిఁగిపోవన్=తగ్గునట్లు, వలనొప్పు విస్ఫూర్తిన్ = ఉచితవిజృంభణముచే, అణఁచెన్=అడఁగించెను.

తా. ఆంజనేయుని దృఢముష్టిఘాతములు రాక్షసులబలమును దర్పము నడంచివైచెను.

లక్ష్మి.—అలహరి = ఆసూర్యుఁడనియెడు, కోమరురాయని=చక్కని ప్రభువుయొక్క, శితకరకూటనిహతిపూని=తీక్ష్ణకిరణములు తాఁకుటచే, కలువలన్=కలువపూవులయందు, ఒప్పు = అంతవఱకుఁగల, విస్ఫూర్తిన్=కాంతిని, అణఁచెన్=తగ్గించెను, తత్పలాశ=ఆకలువరేకుల, శక్తి=సత్తువయొక్క, దృఢత=దార్ఢ్యము, తఱిఁగిపోవన్=తక్కువయగునట్లు, (అణఁచెను) అహహా =ఏమిచెప్పఁగవచ్చును.

తా. సూర్యకిరణముల తీక్ష్ణత కలువలయొక్క వికాసమును గొంచె తఱిచినది.

వ. అట్టి సమయంబున. 162

క. తనరూపము గనఁబడ న
ల్లన యాకరజాతముల దళంబులు విచ్చన్
దనరెన్ ధామనిధి ప్రభ
జనసంతతి యప్పు డెదను సంతస మొందన్. 163

రాఘ.—తనరూపము కనఁబడన్ = తనయాకృతి తెలియునట్లు, అల్లన = మెల్లన, ఆకరజాతములన్ = వానరులగోళ్లచే, దళంబులు = రక్కసిమూఁకలు, (ఇక్కడ, ఆకరజాతంబుల దళంబులను పాఠాంతరముగలదు. అపుడు, రాక్షస దళములని చెప్పుకొన వలయును.) రెండవయర్థమున ఆకరజాతంబులదళంబులు = ఆఁడురుకమున బుట్టిన పద్మములరేకులు అనిచెప్పుకొనవలయును. విచ్చన్ = విడిపోఁగా, ధామనిధి = ప్రతాపనిధియైన, ప్రభంజనసంతతి = ఆంజనేయుఁడు, అప్పుడు, ఎదను, సంతసమొందన్ = సంతోషించునట్లు, తనరెన్ = ఒప్పెను.

తా. వానరులగోళ్ల వాఁడిమిచే రాక్షససమూహములు విడిపోవుచుండఁగా హనుమంతుఁడు సంతసించెను.

లక్ష్మ.—తనరూపము, కనఁబడన్, అల్లనన్ = నెమ్మదిగా, ఆకరజాతములు = కొలంకులంబుట్టిన పద్మముల, దళంబులు = రేకులు, విడన్ = వికసింపఁగా, ధామనిధి = సూర్యుఁడు, ని. 'ధామస్థాన ప్రభాజన్మ ప్రభావసుఖజన్మసు' అని. ప్రభన్ = కాంతిచే, జనసంతతి = జనసమూహము, అపుడు, ఎదను = మనస్సులో, సంతసమందన్ = సంతోషమందునట్లు, తనరెన్ = వెలిఁగెను.

తా. సూర్యుఁడు కనఁబడఁగానే పద్మములు వికసించెను. జనులు తెలివినొందిరి.

సీ. దీప్రధర్మమహోచ్ఛవిప్రవాస్తవిముక్త
శరనికరములు తీక్ష్ణత వహించి
ప్రౌఢిమం దేహనిర్మథనంబు సేయఁ బ్రా
గ్భాగమందుననుండి ప్రస్ఫురన్మ

హానలజాతుండు హర్యనీకాధినా
యకుఁడు నైయొప్పునాహరి వెస దను
జగతివారితలీల సరవి గాంచఁగఁ జేసి
యలఘుసన్నుతులతో నలరె నిట్లు
గీ. ఖ్యాతుఁ డాభంగి రణమహి మాతులుండు
నీలఘనత మోహితుఁడు నామూలసంహృ
తపరమహిముఁడు నౌటచేఁ దాన వర్యుఁ
డయ్యెనుం డాయ నంత యాత్రాప్తిఁ గాంచె. 164

రాఘు.—దీప్ర=ప్రకాశించునట్టి,ధర్మ=ధనుస్సుగల,మహాచ్ఛవి=గొప్ప కాంతిగల, ప్రహస్తవిముక్త=ప్రహస్తుఁడను రాక్షసుని చేవిడువఁబడిన, శరనికరములు=బాణపరంపర,తీక్ష్ణతవహించి=వాఁడిఁ జెంది, ప్రాథిమన్=దిట్టతనముచే దేహనిర్మథనంబు సేయన్=అంగములను మర్దింపఁగా,ప్రాగ్భాగమందుననుండి=లంకకుఁ దూర్పుదెసనుండి, ప్రస్ఫురత్=మిక్కిలివెలుఁగుచున్న, మహానలజాతుండు=అధికుఁడైన యగ్నిపుత్త్రుండును, హర్యనీకాధినాయకుండు=కపిసైన్యమునకధిపతియు, ఐ-ఒప్పునాహరి=ఆనీలుఁడను వానరుఁడు, వెసన్=వేగముగ, దనుజగతి=రాక్షసునిగతిని,వారితలీలన్=నివారింపఁబడినదానినిగా,సరవి=వేగ, గాంచఁగఁజేసి=అనఁగా ప్రహస్తునినివారించియనుట. అలఘు=విస్తారమైన, సన్నుతులతోన్=స్తోత్రములతో, అలరెన్,ఇట్లు,ఆభంగిన్,రణమహిన్=యుద్ధభూమియందు, ఖ్యాతుఁడు,=ప్రసిద్ధుఁడును, మాతులుండు=రావణునకు మేనమామయు, నీల=నీలునియొక్క, ఘనతన్=గౌరవముచే, మోహితుండు=మూర్ఛ నొందినవాఁడు (అయ్యెను), ఆమూల=మొట్టమొదటనుండియు,సంహృత=హరియింపఁబడిన, పరమహిముండు = శత్రుసామర్థ్యముగలవాఁడు. ఔటచేన్= అయినవాఁడు కావున,తాన=తానే, వర్యుఁడు=శ్రేష్ఠుఁడగు రావణుఁడు, అయ్యెనున్=ఆరాముని, డాయన్=సమీపించుటకు, అంతన్, యాత్రాప్తిఁగాంచె= ప్రయాణముచేసెను.

తా. ప్రహస్తుఁడు యుద్ధమున విజృంభించెను. వానరుల సేనాధిపతి యైననలుఁడు వాని నడ్డుకొని యుద్ధముచేయఁగా మూర్ఛనొందెను. రావణుఁడు రాముని నెదుర్కొన వెడలెను. ఈ ప్రహస్తుఁడు రావణుని మేనమామ.

లక్ష్మ.—దీప్రధర్మ=మంచియాచారములుకల, మహోచ్ఛ=మిగులస్వచ్ఛమైన, విప్రహస్తవిముక్త=బ్రాహ్మణుల చేతులనుండివిడువఁబడిన, శరనికరములు=ఉదకధారలు, తీక్ష్ణతవహించి=తీవ్రమై, ప్రౌఢిన్=శక్తిచే,మందేహనిర్మథనంబు సేయన్=మందేహులనురాక్షసులను మర్దింపఁగా, ప్రాగ్భాగమందుననుండి=తూరుపుదిక్కునుండి, ప్రస్ఫురత్ = వికసించిన, మహా=గొప్పవియగు, నలజాతుండు=పద్మజాసమూహముగలవాఁడును,హార్యనీకాధినాయకుఁడు=హరి+అనీక+అధినాయకుఁడు=గుఱ్ఱములసమూహమునకుఁ బ్రభువు (సప్తాశ్వుఁడు), ఐయొప్పునాహారి=ఆరీతిగలసూర్యుఁడు, వెసన్=త్వరగా, తనున్=తన్ను,జగతి=భూమిని (భూమియందలిజనులను), వారితలీలసరవిగాంచఁగఁజేసి=నివారింపఁబడినరీతిగాఁజూచునట్లు జేసి, అలఘుసన్నుతులతోన్=గొప్పస్తోత్రములతో,అలరెన్=ఒప్పెను, వెలిఁగెను, ఇట్లు, ఆభన్=కాంతిచే, ఖ్యాతుఁడు=ప్రసిద్ధుఁడును, కిరణమహిమన్=కిరణములమహత్త్వముచే, అతులుండు = సాటిలేనివాఁడును, నీల=నల్లనయిన, ఘన=దట్టమైన, తమః=చీఁకటికి, అహితుండు=విరోధియును, ఆమూల=మూలముట్టుగ, సంహృత=హరింపఁబడిన, పరమ=గొప్పదియగు, హిముండు=మంచుగలవాఁడును, ఔటచేన్-తాన=తానే, వర్యుండు=శ్రేష్ఠుఁడు, అయ్యినుండు=ఆసూర్యుఁడు, ఆ=ఆయట్టి, అనంతయాత్రాప్తిన్=గగనమార్గ ప్రయాణమును, కాంచెన్=కావించెను.

తా. బ్రాహ్మణులచే నీయఁబడినయర్ఘ్యములచే మందేహరాక్షసులను ఖండించుచుఁ దూర్పుదెసనుండి సూర్యుఁ డుదయించి పద్మములను వికసింపఁజేయుచుఁ గ్రమక్రమముగఁ దన్ను జనులు చూచుటకు వలనుగాని యంతటి తీక్ష్ణత వహించి చీకటులను బోఁదఱిమి యాకాశమార్గమున వెలుఁగుచుండెను.

వ. అట్లు వెడలి యనుపమానైకతురంగసూతచక్రంబు నహీనరశ్మివిరాజితంబును సమస్తదివ్యాయుధసమేతంబు నగు

రథంబు విలసిల్ల నత్యంతప్రతాపశాలి యగునతండు తన
కరంబులవేఁడిమిం జూపుచు విజృంభించుసమయంబున. 165

రాఘు.—అట్లువెడలి=ఆరీతిని బైలుదేఱి, అనుపమాన=ఉపమానరహితమైన, ఏక=ముఖ్యములైన, తురంగ=గుఱ్ఱములు, సూత=సూతుఁడు, చక్రంబుఁ=చక్రములునుగలిగినట్టియును, అహీన=బలమైన, రశ్మి విరాజితంబును=పగ్గములచేనొప్పునదియును, (రశ్మి=పగ్గము, గుఱ్ఱమునకుఁ బెట్టుకళ్లెపుఁదోలు మొ.) సమస్త దివ్యాయుధసమేతంబును = అనేకవిధములైన దివ్యబాణములతో నాయుధములతో నిండినదియును, అగురథంబు విలసిల్లఁ=గగనమునందుఁగూర్చుండియనుట. అత్యంత పరాక్రమశాలియగు నతండు=ఆరావణుండు, తనకరంబులవేఁడిమిం జూపుచు=తనబాహుబలమునుగనఁబఱచుచు, విజృంభించుసమయంబున=యుద్ధము చేయునప్పుడు.

తా. మంచిగుఱ్ఱములు సూతుఁడు నానాయుధంబులుగలరథముపై రావణుఁడు రామునితో యుద్ధమునకు వచ్చి తనబాణములవేఁడిని జూపుచుండెననుట.

లక్ష్మ.—అట్లువెడలి=ఉదయించి, ఏకతురంగ సూతచక్రంబును=ఒక్క గుఱ్ఱము, నొక్కసూతుఁడు, నొక్కచక్రముఁను గలది కావుననే, అనుపమాన=సాటిలేనిదియును, అహీన=సర్వశ్రేష్ఠములే, రశ్మి=కళ్లెములు పగ్గములునై, విరాజితంబు= ప్రకాశింపఁ జేయఁబడినదియును, సమస్త దివ్యాయుధసమేతంబును, అగు రథంబు విలసిల్లఁ, అత్యంతప్రతాపశాలి (అగు)=మిగులఁ బ్రతాపము తోశోభిల్లు, అతండు=ఆసూర్యుఁడు, తనకరంబుల వేఁడిమిం జూపుచుఁ=కిరణములవేఁడినిగనఁబఱచుచు, విజృంభించుసమయంబున=వెలుఁగుచుండఁగా.

తా. స్పష్టము.

సీ. ఆలక్ష్మణాగ్రజుం డధికతతో హాను
 మన్ముఖ్యహరిశక్తిమహిమ మిగుల

బాసటయై యొప్ప బహులోగ్రగోవ్యాప్త
 ఘనపద్యత నెసంగు కడఁకతోడఁ
బగతు సాధింతు నంచుఁ గడంగి విమతభ
 యంకరాజిహ్మగుం డైనయతని
సచ్ఛ్లోకవిస్ఫూర్తి సకలదిక్కులయందు
 విబుధకీర్తితమయి విస్తరిల్లె
గీ. నప్పు డదియెల్లఁ దలపోసి యల్లవైరి
 ధర్మ రావాత్తభయుఁ డౌటఁ దానవాధి
 నేత దా లోచనంబు లనేకగతులఁ
 బెదరుచుండఁగ లంకలోఁ జేరి పలికె 166

రాఘు.—ఆలక్ష్మణాగ్రజుండు = రాముఁడు, అధికతతోన్ = ఆధిక్యముతో, హనుమన్ముఖ్య = హనుమంతుఁడు మొదలయిన, హరి = వానరుల, శక్తిమహిమ = సామర్థ్యముయొక్క యతిశయము, మిగులన్, బాసటయై యొప్పన్ = అత్యంతసహకారి కాఁగా, బహుల = అగ్నివలె, (ని. 'బహుల ఆగ్నౌ కృష్ణపక్షే' నానార్థరత్నమాల) ఉగ్ర = ఉగ్రమైన, గో=బాణములచే, వ్యాప్త = వ్యాపింపఁబడిన, ఘనపద్య = మేఘమార్గము గలుగుటచే, ఎసంగు = వృద్ధియగుచున్న, కడఁకతోడన్ = పట్టుదలతో, పగతున్ = విరోధిని, సాధింతునంచున్ = జయించెదనని, కడంగి= (రావణునిగ్రహింప) యత్నించి, విమతభయంకర = శత్రువులకు భయమునుబుట్టించు, అజిహ్మగుండైన = బాణములుగలిగిన, అతని=ఆరామునియొక్క, సత్+శ్లోకవిస్ఫూర్తి = సత్కీర్తి స్ఫురణము, సకలదిక్కులయందున్ = అన్నిదెసల, విబుధకీర్తితమై= దేవతలచేఁ గొనియాడఁబడినదియై, విస్తరిల్లెన్ = వ్యాపించెను. అప్పుడు, అదియెల్లఁ దలపోసి = అదియంతయుం నాలోచించి, అల్ల = ఆ, వైరిధర్మ= విరోధియైన రాముని ధనుస్సునుండిపుట్టిన, రావ = ధ్వనిచే, ఆత్తభయుండౌటన్ = భయమును జెందినవాఁడై, దానవాధినేత=రావణుఁడు, తాన్ = తాను, లోచనంబులు = నేత్రములు, అనేకగతులన్ = పలువిధముల, బెదరు

చుండంగన్ = చెదరిపోవు చుండఁగా, లంకలోఁజేరి = లంకకుఁబోయి, పలికెన్ = క్రిందిరీతిని బలికెను.

తా. హనుమంతుఁడు మొదలైన కపులసాహాయ్యమున రావణు నెదిరించి రాముఁ డాగ్నేయబాణాదులను బ్రయోగించి విరోధిని సాధించెద నని ప్రతినచేయఁగా నతనితో యుద్ధముచేయలేక రావణుఁడు భయపడి లంకలోఁ బ్రవేశించి యి ట్లనుచున్నాఁడు..

లక్ష్మ.——ఆలక్ష్మణాగ్రజుండు = లక్ష్మణకవి, అధికతతోహాను=అధిక+తత+ఊహాను = అధికమగునట్లు వ్యాపించిన యూహచే, మన్మఖ్యహరిశక్తి మహిమ = నాకుముఖ్యుఁడైన శ్రీహరియొక్క సామర్థ్యము, మిగులన్ = ఎక్కుడుగా, బాసటయై యొప్పన్=తోడురాఁగా, బహుల = విస్తారమైన, ఉగ్ర = కఠినములైన, గో = వాక్యములచే, వ్యాప్త = వ్యాపించిన, ఘన పద్యత = ఘనమైనపద్యములు గలుగుటచే, ఎసంగుకడఁకతోడన్ = ఒప్పుచున్న పూనికతో, పగతుసాధింతునంచుఁ గడంగి = వైరియైన ధర్మారావును జయింతునని యత్నించి, విమత...యతని-విమత = విరోధియైన దమ్మన్నకు, భయంకర = భయమునుగల్గించు, అజిహ్మగుండు = ఋజువులయిన వాక్యము గల, అతని = ఆలక్ష్మకవియొక్క, సత్+శ్లోకవిస్ఫూర్తి = ఉత్కృష్టములైన పద్యముల స్ఫురణము, సకలదిక్కులయందు=ఎల్లతావుల, విబుధకీర్తితమయి= పండితులచేఁ బొగడఁబడినదియై, విస్తరిల్లెను = వ్యాపించెను, అప్పుడు, ఆదియెల్లన్ = ఈసంగతి యంతయు, తలపోసి, అల్లవైరి ధర్మరావు = ఆశత్రువైన దమ్మన్నగారు, ఆత్తభయుఁడౌటన్ = భయము చెందినవాఁడై, తాన్ = తాను, నవ+ఆర్తిన్ = నూతనముగాఁ బుట్టిన మనోవ్యథచే, ఏతదాలోచనంబులు = ఈసంబంధమైన యాలోచనములు, అనేకగతులన్ = పెక్కురీతుల, చెదరుచుండ=ఒక యాలోచనమును స్థిరముగాఁగుదురక, కలంక=వైకల్యము, లోఁజేరి = మనస్సులోనాటి, పలికెన్ = ఇట్లనియెను.

తా. లక్ష్మణకవి దమ్మన్నగారిపైని చక్కఁగా నాలోచించి కొన్నిపద్యములను జెప్పి యందఱియొద్దఁ జదువసాగెను. ఆసంగతి యంతయును దెలిసి

కాని భీతిఁ జెంది మనస్సు వికలత్వమునొందఁగా నేమిచేయుటకును దోఁపక యున్నాఁడు.

తే. అలసితి నవాప్తపటులక్ష్మణాగ్రజన్మ
చండగోతతిఁ గుంభకర్ణుం డనయు వి
రోధిధృతిఁ గలనను జంప రూఢి దిట్ట
గాన నర్హము లేపఁగఁ బూనుట లిఁక. 167

రాఘ.—అవాప్త = పొందఁబడిన, పటు=సమర్థములైన, లక్ష్మణాగ్రజన్మ = రాముని, చండ=తీవ్రములైన, గోతతిన్ = బాణములచే, అలసితిన్ = ఆయాసపడితిని, కుంభకర్ణుండు = తమ్ముఁడైన కుంభకర్ణుఁడు, అనయు = నయరహితుఁడైన, విరోధిన్ = రాముని, ధృతిన్ = ధైర్యముతో, కలనను = యుద్ధములో, చంపన్ = చంపుటకు, రూఢిన్ = నిశ్చయముగా, దిట్ట = శక్తి గలవాఁడు, కానన్ = కాఁబట్టి, లేపఁగఁబూనుటలు=నిద్ర మేల్కొలుపఁ జేయం బ్రయత్నములు, ఇఁక = ఇంకమీఁద, అర్హము = తగినది.

తా. నేను రామబాణములచే మిగుల నొచ్చియున్నవాఁడను. కుంభకర్ణుఁడా రాముని జంపుటకుఁ జాలినవాఁడు. కావున వానిని లేపుటకుఁ దగిన ప్రయత్నములు జేయవలయును.

లక్ష్మ.—నవాప్తపటులక్ష్మణాగ్రజన్మ—నవ = నూతనముగ, ఆప్త = పొందఁబడిన, పటు = పటుత్వముగల, లక్ష్మణాగ్రజన్మ = లక్ష్మణకవియొక్క, చండగోతతి = తీక్ష్ణవాక్యములచే, గుంభ= కూర్పఁబడిన, కర్ణుఁడనై = చెవులు కలవాఁడనై, (గుంభమునకు, ని. 'గ్రథనం గ్రంథనం గుంభస్సందర్భో రచనా' అమరము.) అలసితిన్ = అలసటనొందితిని. విరోధి = లక్ష్మణకవి, ధృతిన్ = ధైర్యముచే, కల = విద్యలచే, ననుఁజంపన్ = నన్నుఁజంపుటకు, రూఢిన్ = రూఢిగా, తిట్టఁగాన్ =దూషించుటకు, మొదలుపెట్టఁగా (తిట్టఁగా నని యీ యర్థమున నరసున్న వేయవలసి వచ్చినది పద్యములోలేదు) ఇఁకన్ = ఇంకమీఁ దట, (నేను) పగఁబూనుటలు = వైరభావమును వహించుటలు (ఇచ్చటఁ బగఁబూనుటలు-అని పద్యములోనున్న, పఁగఁబూనుననుచోటఁ బ, గలనడుమ

నున్న యరసున్న యొత్తివేయవలసి వచ్చినది), అనర్ఘములే=అర్ఘములైనవియే గదా యనుట.

తా. లక్ష్మణకవి స్వామీఁదఁ గొన్ని పద్యములు చెప్పి యందఱియొద్దవిని పించుచున్నాఁడు. వానిని నేనును వింటిని. నాకు విసుగును బుట్టించినవి. నన్నుఁ దిట్టుటకును జంపుటకును లక్ష్మణకవి ప్రయత్నించుచుండఁగా నేను వానితో వైరమును వహించినఁ దప్పులేదు గదా.

వ. అని తత్కృత్యంబునందు బద్ధాదరుండై పరిజనంబులతోఁ జెప్పి, తజ్జనాతియత్నాహూయమాననిజాంతికాగతానుపమానాంగస్వానుజాభిముఖుండై. 168

రాఘు.—అని = ఇట్లుచెప్పి, తత్కృత్యంబునందుఁ = ఆకుంభకర్ణుని లేపుటయను పనియందు, బద్ధాదరుండై = అభిలాషముకలవాఁడై, పరిజనంబులతోఁ = పరివారజనులకు, చెప్పి=ఆనతియిచ్చి, తజ్జన= ఆపరిజనులయొక్క, అతియత్న= అధిప్రయత్నముమీఁద, ఆహూయమాన=పిలువంబడిన (అనఁగా లేపఁబడి), నిజాంతిక = తనయొద్దికి, ఆగత = వచ్చిన, అనుపమానాంగ = సాటిలేని పెద్దశరీరముగల, స్వానుజ = తనతమ్ముఁడైన కుంభకర్ణునకు, అభిముఖుండై=ఎదురుగానుండి.

తా. ఎంతో శ్రమపడి సేవకులు లేపఁగా లేచి వచ్చినతమ్ముని గుంభకర్ణుని గాంచి రావణుఁ డేమో చెప్పుచున్నాఁడు.

లక్ష్మ.—అని, తత్కృత్యంబునందుఁ = లక్ష్మణకవితోఁ బగఁబూనుటయందు, బద్ధాదరుండై = అభిప్రాయముగలిగి, పరిజనంబులతోఁజెప్పి =సేవకులను బంపియనుట, తజ్జనాతియత్నాహూయమాన = ఆసేవకులచేఁ బిలువంబడినవారును, నిజాంతికాగత= తనదగ్గఱకు వచ్చినవారును, అనుపమాన=సాటిలేని, అంగ = స్నేహ పరికరములుగల, స్వానుజన్మాభిముఖుఁడై = తన తమ్ములంగాంచి.

తా. దమ్మన్నగారు తమతమ్ములం బిలిపించి యిట్లనుచున్నారు.

సీ. విబుధాపకృతులు గావించు టందమ్మన్న
తనకు హితుండు గామిని నిజేచ్ఛ

మును లక్ష్మణాగ్రజన్మహిత మొందినతమ్ము
కంటె నన్య్వ లసత్ప్రకారము నెడఁ
గనుఁగొని యపరమదనుజరాజగ్గత
మ్మాభావమును లక్ష్మణాగ్రజుస్థితి
వినిపించియు భవద్వచనములచొప్పున
నడిపింపఁ దలఁచి యున్నాఁడ ననికృ
గీ. తంబు సర్వంబు నెఱిఁగించి తన్ముఖంబు
నందుఁ గొన్నిసూక్తులు వినియంతకోప
మానభీకరతం దమ్ము మఱి దురుక్తు
లాడజడిసి రచ్చోవార లప్పుడంత. 169

రాఘ.—విబుధాపకృతులు గావించుట=దేవతలకపకారముచేయుట, అందమ్మన్న=మంచిదియనిపలుకఁగా, తనకు హితుండుగామిని = (రావణునకు) ఇష్టుఁడు కాకపోవుటవలన, నిజేచ్ఛఁన్ =తనయిచ్చచొప్పున, మును = పూర్వము, లక్ష్మణాగ్రజన్మ =రాముని, హితమొందిన = ఇష్టమునుబొందిన, తమ్ముకంటెన్ = విభీషణునికంటె, అన్య్వ = ఇతరుని (కుంభకర్ణుని), లసత్ప్రకారము నెడన్ = ప్రకాశించెడురీతిచెడుటకై, కనుఁగొని=చూచి, అపరమదనుజరాజ = శ్రేష్ఠుఁడుకాని రాక్షసరాజు (రావణుఁడు), అగ్గతమ్ము=అప్పటికి జరిగిపోయిన వృత్తాంతమును (గడించిన), ఆభావమును=ఆయభిప్రాయమును (సీతను వదలుటకిష్టము లేకపోవుట), లక్ష్మణాగ్రజన్మ=రాముని, స్థితి=యుద్ధస్థితియుఁ, వినిపించి=తెల్పి, భవద్వచనంబులచొప్పున నడిపింపఁదలఁచి యున్నాఁడన్ = నీవెట్లు చెప్పిన నట్లు చేయఁదలఁచి యున్నవాఁడను, అని, కృతంబు సర్వంబు నెఱిఁగించి=కడచిన కార్యమంతయును దెల్పి, తన్ముఖంబునందున్ =ఆకుంభకర్ణుని నోటినుండి, కొన్నిసూక్తులువిని = కొన్నిమంచినీతులు విని, అంతకోపమానభీకరతన్ =యమునివలె భయంకరరూపముతో, తమ్మున్ =తమ్ముని, మఱి, దురు

క్తులాడఁగ = నిందింపఁగా, అచ్చోటివారలు = అక్కడివారు, అప్పుడు=ఆసమయమున, జడిసిరి = బెదరిరి. అంతఁ.

తా. తనకుహితబోధచేసినవిభీషణుని మెచ్చనికారణమున నతఁడు రామునిం జేరఁగా మిగిలినతమ్ముఁడైన కుంభకర్ణునితో జరిగిన సంగతియంతయుఁ జెప్పి యిఁక మీఁద నీవుచెప్పినట్లు చేసెదనని రావణుఁడువలుక, కుంభకర్ణుఁడు రామునితో వైరమువలదని కొన్ని సూక్తులు తెల్పిన రావణుఁడు తమ్ముని దురుక్తులాడెను. అందఱును బెదరిరి.

లక్ష్మ.—దమ్మన్న=ధర్మారావు, విబుధాపకృతులుగావించుటఁ = పెద్దలకపకారముచేయుటచే, తనకు హితుండుగామిని = తనకు వానితోఁ బొత్తు కలుగక, నిజేచ్ఛఁ = తనయిష్టప్రకారము, మును=ఇంతకుఁబూర్వము, లక్ష్మణాగ్రజన్మహితమొందిన తమ్ముకంటెఁ = లక్ష్మణకవికి స్నేహితుఁడై యున్న భద్రయ్య యనుతమ్మునికంటె, అన్యులఁ=తక్కినతమ్ములను, లసత్ = ఒప్పుచున్న, ప్రకారము = రీతి, చెడఁ = నశించునట్లు, కనుఁగొని=కాంచి, అపరమదనుజ = నా రెండవతమ్ముఁడా! రా=రమ్ము; జగ్గయ్యా! భావ=భావయ్యా! (ఇట్లని ముగ్గురుతమ్ములనుబిలిచి) తమ్ము=తమ్మయ్యా, మును=ముందుగా, లక్ష్మణాగ్రజుస్థితి = లక్ష్మణకవియొనర్చినసంగతిని, వినిపించియుం=తెలిపి, భవద్వచనంబులచొప్పున నడపింపఁదలఁచియున్నాఁడను అని = మీరుచెప్పినట్లు చేసెదనని, కృతంబుసర్వంబు నెఱిఁగించి = జరిగిపోయినకథచెప్పి, తన్ముఖంబునఁగొన్ని సూక్తులువిని=ఇది మంచిదికాదని యాతమ్ములు చెప్పినమంచిమాటలను గొన్నిటిని విని, అంతకోపమానభీకరతన్ = యమునివలెభయంకరుఁడై, తమ్ముఁ=ఆముగురుతమ్ములను, మఱి=కొన్ని, దురుక్తులాడఁ=వాడుసూక్తులుచెప్పఁగాఁదాను దురుక్తులాడినందున, అచ్చోటివారలు, అప్పుడు, అంతఁ, జడిసిరి.

తా. భద్రయ్య యనుతమ్ముఁ డిదివఱకే తన కీయన్న చేయుపను లిష్టములుగాక లక్ష్మణకవికి స్నేహితుఁడుగా నున్నాఁడు. తక్కిన జగ్గయ్యా, తమ్మయ్యా, భావయ్య లనుమువ్వురు తమ్ములం బిలిచి చరిత్రమంతయుం దెల్పి, వారి

వలనఁగొన్నిమంచిమాటలు విని కోపించెను.(దమ్మన్న పిలువఁగా మిగిలినతమ్ములను భద్రయ్యావలెనే హితోక్తులు చెప్పిరి.)

తే. అవ్విధంబున నాలక్ష్మణాగ్రజునిమ
హాత్త్వ మెఱుఁగక సాధింప నతఁడు తమ్ము
నంచి తత్త్రాసకరగోచయములఁ గ్రుంగఁ
జేసె నని వారి తామోద సిద్ధి బెఱయ. 170

రాఘ.—అవ్విధంబునన్=ఆరీతిని, ఆలక్ష్మణాగ్రజునిమహాత్త్వమెఱుఁగక = రాముని శక్తితెలిసికొనంజాలక, అతఁడు = రావణుఁడు, సాధింపన్ = రాముని నిగ్రహించుటకు, తమ్మునంచి = తమ్ముఁడైన కుంభకర్ణునిరణమునకుఁ బంపి, తత్త్రాసకరగోచయములన్ - తత్+త్రాసకర+గోచయములన్ = ఆరాముని భయంకరబాణసమూహముచే, (ఇచ్చట తత్త్రాసయనియుండినబాగు) అనిన్ = యుద్ధమందు, వారిత=అడ్డుకొనఁబడిన, ఆమోద = సంతోషము యొక్క, సిద్ధిబెఱయన్ = ప్రాప్తిపొందఁగా (తనసంతోషమునకు విరోధముగా), క్రుంగఁజేసెన్ = చంపించెను.

తా. కుంభకర్ణుని రామునితో యుద్ధముసేయఁ బంపి రామునిచే వానిం జంపించెను.

లక్ష్మ.—అవ్విధంబున్ =ఆప్రకారముగా, ఆలక్ష్మణాగ్రజునిమహాత్త్వమెఱుఁగక=లక్ష్మణకవిప్రభావము తెలిసికొనలేక, సాధింపన్ = సాదించుటకు, అతఁడు=దమ్మన్న, తమ్మున్= వారిని (తమ్ములను), అచింతత్రాసకర = మిగుల భయముంగొల్పు, గోచయములన్=మాటలతో, వారు+ఇత+ఆమోదసిద్ధి-వారు=ఆతమ్ములు, ఇత=పొందఁబడిన, ఆమోదసిద్ధిన్=మోదములేకపోవుటను (దుఃఖమును), బెఱయన్=పొందునట్లు, క్రుంగఁజేసెన్ = చిన్నవుచ్చెను.

తా. లక్ష్మణకవిప్రభావము తానెఱుఁగక ఆకవితో విరోధముకూడదని హితబోధచేసి తమ్ములకుఁ జిన్నతనము కలుగునట్లు దమ్మన్న దూషించెను.

ఉ. అట్టియెడన్ బుధారిచతురాత్మజు లల్ల మహోదరాదులై
నట్టిపితృవ్యులం గలసి యభ్రముగా సమితిస్థలంబునన్
గట్టిగ డాసి ధర్మగుణకాండములం బ్రకటింప నీసొగిం
బట్టుగ నంగదానలకుమారకముఖ్యుల నంత ధీరతన్.

రాఘ.—అట్టియెడన్ = అప్పుడు, బుధారిచతురాత్మజులు=దేవవైరి యగురావణునినలుగురు కొడుకులు (అతికాయుఁడు మొదలైనవారు), అల్ల = ఆ, మహోదరాదులైనట్టి = మహోదరుఁడు మొదలుగాఁగల, పితృవ్యులుగలసి=పిన్నతండ్రులతోఁ గూడి, అభ్రముగాన్=వింతగా, సమితిస్థలంబునన్ = రణరంగమున, గట్టిగ, డాసి=చేరి, ధర్మగుణకాండములన్ =విల్లు, నారి, వీని చేవిడువఁబడిన బాణములను, ప్రకటింపన్=ప్రయోగింపఁగా, ఈసు=ఈర్ష్య, ఒగిన్=క్రమముగా, పట్టుగన్ = నెలకొనఁగా, అంగద=అంగదుఁడు, అనలకుమారక=నీలుఁడు, ముఖ్యులు = మొదలైనవారు, అనంతధీరతన్=విశేష ధైర్యముతో.

తా. అపుడు అతికాయాదులైనరావణుని, నలుగురుపుత్రులు మహోదరాదులైన పిన్నతండ్రులతోఁ గలసి యుద్ధమునకు వచ్చిరి. అంగదనీలాదులు వారి నెదిరింపవచ్చిరి.

లక్ష్మీ.—అట్టియెడన్=అట్లుండఁగా, బుధారిచతురాత్మజులు-బుధారి = దమ్మన్నయొక్క, చతుర = నేర్పరులైన, ఆత్మజులు = కొడుకులు, అల్ల మహోదరాదులైనట్టి పితృవ్యులంగలసి = ఆ జగ్గయ్య, తమ్మయ్య, భావయ్య లను పిన్నతండ్రులతోఁజేరి, (ఇందు తమ్మయ్య మొదలైనతమ్ములకు మహోదర శబ్దముచే బొజ్జలున్నట్లు తెల్పుచున్నాఁడు.) అభ్రముగాన్, సమితిస్థలంబు నన్=సభలో, డాసి=చేరి, గట్టిగ = దృఢముగా, ధర్మగుణకాండములన్ = న్యాయముతో సంబంధించిన గుణములను, ప్రకటింపన్ = తెల్పఁగా, ఈ సొగింబట్టుగనన్ = ఈర్ష్యబలముగాఁగా, తాన్ = దమ్మన్న, అనలకుమారక ముఖ్యులన్ = ఆపుత్రులుమొదలైనవారిని, అంతన్, ధీరతన్.

తా. దమ్మన్నకుమారులుగూడఁ బినతండ్రులవలెనే సద్బుద్ధులు చెప్పఁగా దమ్మన్న యసూయ నొందెను.

క. గదిమి రయము న్వడిఁ గనఁ జే
యఁ దృఢత నందు మిగిలి యొక యతికాయుఁడు గో
విదుఁ డగులక్ష్మణుచే నీ
ల్గె దవానలకీల మిడుతలీల నని వెసన్. 172

రాఘు.—గదిమి=అదిలించి(తఱిమి), యమున్=యముని, వడిన్ = వేగముగా, కనఁజేయన్ = చూచునట్లు పంపఁగా (చంపఁగా), దృఢతన్= సామర్థ్యముచే, అందు = ఆరాక్షసులలో, మిగిలి = శేషించి, ఒక, అతికాయుఁడు=అతికాయుఁడను రావణపుత్రుఁడు, గోవిదుఁడు = బాణవేత్తయైన లక్ష్మణకుమారునిచే, దవానలకీలన్=కార్చిచ్చులో, మిడుతలీలన్=శలభము వలె, అనిన్=యుద్ధములో, వెసన్, ఈల్గెను=చచ్చెను.

తా. అతికాయుఁడుగాక మిగిలినవారు మొదటఁ జచ్చిరి. పిదప లక్ష్మణునిచేతఁ బడి యతికాయుఁడును కూలెను.

లక్ష్మ.—గదిమియ = అదల్చియే, మున్=ముందుగా, వడిన్=శౌర్యమును, కనఁజేయన్=చూచునట్లు చేయఁగా, దృఢతన్=దార్ఢ్యముచే, అందు =వారిలో, మిగిలి=అతిక్రమించి, ఒకయతికాయుఁడు=పెద్దశరీరముగల తమ్మయ్యయనునాయన, కోవిదుఁడు=వాక్యవేత్త (పండితుఁడు), అగులక్ష్మణుచేన్ =లక్ష్మణకవిచేత, అనలకీలమిడుతలీలన్=అగ్నిజ్వాలలోమిడుతవలె, వెసన్=శీఘ్రముగ, ఈల్గెదవని=చత్తువని (ముందుపద్యముతో నన్వయము.)

తా. వారిలోఁ దమ్మయ్య యనుధైర్యశాలి దమ్మన్నగారితో నీవు లక్ష్మణకవితోఁ పోర్చికి మిడుత వగుదు వనిబదులు చెప్పెను.

తే. చెప్ప నరుదుగ నట్లు డాసియు నతనికిఁ
గలుగువారెల్ల నని వారితులయి తూల

నాఁడ బుధవైరి మొదలఁ గన్నట్టి పట్టి
వెండియు ననుపమానవాగ్వితతి నెఱయ. 173

రాఘ.—చెప్పనరుదుగన్ = చెప్పుటకువింతయగురీతిని, అట్లు డాసి యుం=ఆవిధమునయుద్ధమునకుఁ జొచ్చియుం, అతనికిఁగలుగువారెల్లన్=రావణపక్షమున వారందఱును (రావణునికిఁబుట్టినవారెల్లననియు), అనిన్=రణమున, వారితులైతూలన్ = వైరులచేనడ్డఁ బడిమృతినొందఁగా, అడన్=అలంకలో, బుధవైరి=రావణుఁడు, మొదలఁగన్నట్టిపట్టిన్ = ఇంద్రజిత్తును (జ్యేష్ఠపుత్త్రుఁడు), వెండియుంననుపన్=మరలయుద్ధమునకుఁబంపుటకు, మానవాగ్వితతి నెఱయన్=అభిమానముపుట్టు వాక్యములు ప్రకటించుచు.

తా. యుద్ధములోఁ దనవారెల్లను క్రమక్రమముగ డాసి మృతులగుచుండ రావణుఁడు, పెద్దకొడుకైనయింద్రజిత్తును మరల రణమునకుఁ బంపుటకై ప్రోత్సాహముచేసి.

లక్ష్మి.—చెప్పన్=అట్లుతమ్మయ్యచెప్పినపిమ్మట, అరుదగునట్లు=అద్భుతముగా, డాసియుం=దగ్గఱకువచ్చి, అతనికిఁగలుగువారెల్ల=దమ్మన్నగారిబంధువులందఱును, అనివారితులై = అడ్డములేకుండ, తూలనాడన్=దూషింపఁగా, బుధవైరి మొదలఁగన్నట్టిపట్టి = ధర్మరాయనిపెద్దకొడుకు, వెండియుంన్=ఇంకొకసారి, అనుపమానవాగ్వితతి నెఱయన్ = ఉపమానరహితమైనమాటలతో ననుట.

తా. దమ్మయ్యగారుచెప్పినపిదపఁ బదిమందియును నీకీపనితగ దనిగట్టిగాఁజెప్పిరి. ఇంకొకసారి దమ్మన్నగారి జ్యేష్ఠపుత్త్రుఁడు, తండ్రితో మాటలాడఁ బోవుచున్నాఁడు.

వ. చుట్టునుం బరివేష్టించియున్న వారందఱు విన నతని కిట్లనియె.

తా. ఇంద్రజిత్తుతో రావణుఁడును, దమ్మన్నగారితో నాతనిపెద్దకొడుకును దగ్గఱనున్నయెల్లవారు వినునట్లు పలుకుచున్నారు.

క. మను గోపాలసుతునిలం
క నొనర నరికట్టి యందుకై వేఁడఁగ వ

చ్చిన యవ్వాక్పతిచే నిం
ద నెఱయఁగా వరము నపుడు దాల్చితి తండ్రీ. 174

రాఘు.—మును = పూర్వకాలమున, గోపాలసుతుని-గో=దేవతలను, పాల=పాలించు, సుతుని=రాజును (ఇంద్రుని), 'పార్థివేతనయేసుతః' అమరము. లంకను = లంకాపట్టణమునందు, ఒనరన్=ఒప్పునట్లు, అరికట్టి=బంధించి, అందుకై = ఆయింద్రుని విడిపించుటకై, వేఁడఁగన్=నన్నుఁ బ్రార్థించుటకై, వచ్చిన, అవ్వాక్పతిచేన్ = ఇక్కడవచ్చిన బ్రహ్మచేత, ఇంద=ఇక్కడనే, నెఱయఁగాన్=ప్రకటముగా, వరమును=అంతర్ధానమందుండి యుద్ధముచేయువరమును, తండ్రీ = కుమారా! (వాత్సల్యముచేఁ బుత్రునిసంబోధనము), దాల్చితి=పుచ్చుకొంటివి గదా.

తా. కుమారా! వెనుక నింద్రునిదెచ్చి లంకలోఁ బడవైచితివి. ఆయింద్రుని విడిపించుటకై బ్రహ్మ యిక్కడకువచ్చి అంతరాళమందుండి యుద్ధముచేయువరము నీ కిచ్చినాఁడుగదా.

లక్ష్మ.—మును=ఇంతకుఁ బూర్వము, గోపాలసుతుని=గోపాలమంత్రికొడుకైన లక్ష్మణకవియొక్క, లంకన్=భూమిని, అరికట్టి = నీస్వాధీనముచేసికొని, ఒనరన్ = ఒప్పునట్లు, అందుకై=నాభూమి నాకిమ్మని యడుగుటకై, వేఁడఁగ, వచ్చిన=కోరవచ్చిన, అవ్వాక్పతిచేన్=ఆకవిచే, నిందనెఱయన్= అతనికిఁ బ్రతికూలుఁడవై నిందప్రకటమగునట్లు, తండ్రీ! కావరమున్ = గర్వమును, అపుడు దాల్చితివి=నీవపుడు వహించితివి.

తా. లక్ష్మణకవి మాన్యమును బుచ్చుకొంటివి. కోరినను వానిని గర్వముచే నిర్లక్ష్యముచేసి నిందఁ బడుచుంటివి.

వ. కావున. 175

తా. ఉభయత్ర సమము.

గీ. మిత్రు లెల్ల నిన్ను మెచ్చరే చరలస
ద్గోత్రమన సుదృఢత గొనబుమీఱ

సాగి ప్రబలుచున్న శఠచిత్తరిపుల జ
యించితేని యశము హెచ్చకున్నె. 176

రాఘు.—చరలసద్గోత్రమునన్ - చర=నడియాడుచున్న, లసత్=పెద్దది యగు, గోత్రమునన్=పర్వతమో యనునట్లు, సుదృఢత=మంచిదృఢభావము, గొనబుమీఱిసాగి=అతిశయించునట్లువెడలి, ప్రబలుచున్న=వృద్ధిపొందుచున్న, శఠచిత్త=తిరస్కార స్వభావముగల, రిపులన్ = వైరులను, జయించితేని= గెల్చితివా, యశము హెచ్చకున్నె = నీకీర్తి యెచ్చునుగదా, మిత్రులెల్లన్= స్నేహితులందఱు, నిన్ను మెచ్చరే=మెత్తురుగదా

తా. ఆయంతరాళమందు మేఘములలో నుండి యుద్ధముచేసి శత్రువులను గెల్చితివా నీచెలికాండ్రు నిన్ను మెత్తురు. నీకుఁ గీర్తి ప్రబలమగును. కావున నడగొండవలె వెళ్లి వారిమీఁదఁ బడుము. (రావణుఁడు చెప్పుమాట)

లక్ష్మీ.—మిత్రులెల్లన్ నిన్ను మెచ్చన్ = స్నేహితులునిన్నుఁ బొగడునట్లు, రేచరలసద్గోత్ర=రేచర్లగోత్రశ్రేష్ఠుఁడా, మనసుదృఢత = మనోబలము, గొనబుమీఱన్=గొనలుసాగునట్లు, సాగి, ప్రబలుచున్న = ఉద్రేకించుచున్న, శఠ=శాఠ్యమును వహించిన, చిత్తరిపులన్=అంతశ్శత్రువులను (కామక్రోధాదులను), జయించితేని = నిగ్రహించితివా, యశము హెచ్చకున్నె = నీకుఁ గీర్తి రాదా. (తప్పక వచ్చును.)

తా. తండ్రీ, రేచర్లగోత్రపావనుఁడా, నీవు కామక్రోధాదులైన యంతశ్శత్రువులను జయింపుము. లేక, ధనాశాగ్రస్తుఁడవైతివేని పరద్రవ్యాదులంగోరితివేని నిన్ను మెచ్చరు. ఇంద్రియనిగ్రహము లేకున్న నిట్టియన్యాయ కార్యములకుఁ బోత్తువు.

క. అని కింక నెవ్వరున్నా
రొనర నరులలోపల నిను నొగి వారింపం
దనయుఁడ నీవు మదుక్తిని
గొనవలయుంగాక సమితి గోవిదు లెంచన్. 177

రాఘ.—అనికి=యుద్ధమునకు, ఇంకన్=నీవుగాక, ఎవ్వరున్నారు? దిట్టలు లేరనుట; నరులలోపలన్=రామునిపక్షమునంగలనరులలో, నినున్=నిన్ను, ఒగిన్=సామర్థ్యముచే, వారింపన్=అడ్డుకొనుటకు, తనయుఁడ=పుత్త్రా! ఎవ్వరున్నారు? నీవు, మదుక్తిని=నామాటను, గొనవలయుంగాక=నమ్మవలయునుగాని (నిన్నుమించువారు లేరనుట), సమితిన్=యుద్ధములో, గోవిదులు=బాణవేత్తలు ఎంచన్=కొనియాడునట్లు, నీవు మదుక్తిని యుద్ధమునకు వెళ్లవలయునుగాని నిన్ను గెల్చువారు నరులలో లేరు. వెళ్లితివేని తప్పక గెల్తువని తాత్పర్యము.

లక్ష్మ.—అని=ఇట్లు చెప్పి, కింకను=కోపముచే, నరులలోపలన్=మనుష్యులలో, నినువారింపన్=నిన్నుఁగాదనుటకు, ఒగిన్, ఎవ్వరున్నారో=ఎవ్వరైననున్నారా (లేరు), తనయుఁడన్=నీపుత్త్రుఁడను, మదుక్తిని=నాప్రార్థనమును, సమితిన్=సభలో, కోవిదులెంచన్=పండితులు మెచ్చునట్లు, నీవు, కొనవలయుం గాక=అంగీకరింపవలసినదే కాని.

తా. నీకోపమున కడ్డుగావచ్చి మనుష్యమాత్త్రుఁడు నిన్ను నివారింపలేఁడు. నీకుమారుఁడను గనుక నామాటలు విని లక్ష్మణకవితో వైరము మానవలసినదే కాని వేఱుపాయము లేదు. నిన్నెవ్వరును వారింపలే (అనుట).రు

మ. అనుచుండ న్విని మేఘనాదుఁడు సరోషాత్ముండు గర్వైక
మం, డనుఁడుం దానయి లేచి హుంకృతులు వింటన్ గాఢ
ముల్గాఁ బరుల్, మునుము న్విస్మయరోషసంభ్రమములం
బొందన్ సదస్త్రాసమూ,వనిరూఢోద్ధతి వారల న్వివశులం
గావించెనత్యంతమున్. 178

రాఘ.—అనుచుండన్=ఇట్లు రావణుఁడు చెప్పుచుండఁగా, మేఘనాదుఁడు = ఇంద్రజిత్తు, విని, సరోషాత్ముండున్ = కోపచిత్తముగలవాఁడు, గర్వైకమండనుఁడున్=గర్వమే ముఖ్యాలంకారముగాఁగలవాఁడును, తానయి=తానుగావున, లేచి=బయలుదేఱి, హుంకృతులు=హుంకారములు, వింటన్=ఆకాశమునందు, గాఢముల్గాన్=దట్టమగునట్లు, పరుల్=విరోధులు, మునుమున్

=ముందు ముందుగా (ప్రప్రథమమున), విస్మయ=అద్భుతమును, రోష=క్రోధ-మును, సంభ్రమము=తొందరయును, పొందన్=పొందుచుండఁగా, సదస్త్రా-సమాన నిరూఢోద్ధతి-సదస్త్ర=బ్రహ్మాస్త్రముయొక్క, అసమాన=సాటిలేని, నిరూఢ=రూఢియైన, ఉద్ధతిన్=ఔద్ధత్యము చేతను, వారలన్=రామాదులను అత్యంతమున్=మిక్కిలి, వివశులంగావించెన్=మూర్ఛనొందించెను.

తా. తండ్రిశోకదగ్ధుఁడై యింద్రజిత్తు రణంబునకు వచ్చి బ్రహ్మాస్త్ర ప్రయోగమున నందఱను మూర్ఛనొందించెను.

లక్ష్మ.—అనుచుండన్=ఇట్లుచెప్పుచుండఁగావిని, (దమ్మన్న) యాల-కించి, మేఘనాదుఁడు, మేఘములవలెధ్వనిచేయుచున్నవాఁడు, సరోషాత్ముఁడు =రోషముతోఁ గూడినవాఁడు, గర్వైకమండనుఁడున్ = గర్వమొక్కటియే భూషణము గాఁగలవాఁడును, (అగుదమ్మన్న) తానయిలేచి=తనంతట తానులే-చి, హుంకృతులు=హుమ్మనుధ్వనులు, వింటన్=వినుటచే, గాఢములుగా=సాం-ద్రములుగా, పరుల్=ఇతరులు, మునుమున్=ముందుముందుగా, విస్మయ, రోష, సంభ్రమములను, పొందన్, సదస్త్రాసము=సభాకంపము, అనన్=పొం-దునట్లును, నిరూఢోద్ధతిన్=నిశ్చలమగునౌద్ధత్యముచే, వారలన్=అక్కడవార-లను, అత్యంతము, వివశులఁగావించెన్=పరవశులంజేసెను.

తా. కుమారుఁడు చెప్పినమాటలపైఁ గోపించి దమ్మన్న మేఘగంభీర-మైన హుంకారము చేసెను. దాని కక్కడనున్నవారు వెఱపునొంది వింతపడి సభాకంపమునొంది పరవశులైరి.

గీ. అంత వారు హితమహాశ్వాసనిభృతోప
ధాప్తిఁ దేఱి రాబుధారి మఱియు
గురు హితార్థులు దనకుంభాసురముఖుల
సోదరసుతుల వినయాదియుతుల. 179

రాఘ.—అంతన్=అంతట, వారు=రామాదులు, హిత...ధాప్తిన్ హిత=ఇష్టమైన, మహా=గొప్పదియైన, శ్వాసని=హనుమంతునిచే (శ్వసనుఁడు=

వాయుం, శ్వసనునికొడుకు, శ్వాసని), భృత=తేఁబడిన ఔషధ=సంజీవనియను
నౌషధముయొక్క, ఆప్తిన్=ప్రాప్తిచే, దేఱిరి=మూర్ఛఁదెలిసిరి.ఆబుధారి=రావ
ణుఁడు, మఱియున్=ఇంకను, గురుహితార్థులన్=తండ్రియైనతనకు మేలుగోరెడు, తన=తనయొక్క, కుంభాసురముఖులన్=కుంభుఁడు మొదలైనవారిని,
సోదరసుతులన్=కుంభకర్ణపుత్త్రులను, వినయాదియుతులన్ = వినయాదిగుణ
ములుగలవారిని (ముందుపద్యముతో నన్వయము.)

తా. హనుమంతుఁడు తెచ్చిన సంజీవప్రభావమున వారు మూర్ఛఁదెలి
సిరి. ఇంద్రజిత్తునకుఁ దోడుగ రావణుఁడు కుంభుఁడు మొదలైన తనతమ్ముని
పుత్త్రులను యుద్ధమునకుఁ బంపెను.

లక్ష్మ.—అంతన్, వారు=దమ్మన్నకుమారులు మున్నగువారు,హిత=ఇష్టు
లయొక్క, మహాశ్వాస=అధికమైనయూఱడింపులచేతను, నిభృతౌషధాప్తిన్=
మంచియౌషధముదొరకుటచే, తేఱిరి=శాంతించిరి. ఆబుధారి=దమ్మన్న, మఱి
యున్=మిగుల, తనకున్=తనకు,గురుహితార్థులన్=గొప్పమేలుకోరునట్టియు,
భాసురముఖులన్=ప్రకాశించెడుముఖముగలట్టియు, వినయాదియుతులన్=వి
నయాదిసద్గుణములతోఁగూడినట్టియు,సోదరసుతులన్=తమ్ములను, కొమాళ్లను,
(ముందఱిపద్యముతో నన్వయము.)

తా. ఆసభలోనిహితులు వారి నూఱడింపఁగా శాంతించి యుండిరి.
తనమేలు కోరిచెప్పుచున్న యాతమ్ములను గొడుకులను గాంచి దమ్మన్న.

క. తనకుహితమైనసూక్తుల
నని లోనికి వీడుకొలుప నచటఁ గదలి య
ల్లన వారు తాపనిశ్వా
సనివారితసత్త్వులగుచు స్వస్థలి కరుగన్. 180

రాఘు.--తనకుహితమైనసూక్తులన్=తనకిష్టమయినపలుకులచే, అనిలో
నికిన్=యుద్ధమునకు, వీడుకొలుపన్=పంపఁగా, అల్లనన్=మెల్లఁగా, వారు=
ఆకుంభాదులు, అచటఁగదలి=అక్కడినుండిపోయి (లంకనుండి వెలుదేఱి),

తాపని=తపనుఁడు, సూర్యుఁడు, అతనికుమారుఁడు తాపని=సుగ్రీవుఁడు, శ్వాసని=వాయుపుత్రుఁడైనహనుమంతుఁడు, వీరియిద్దఱిచేతను, వారిత=నిగ్రహింపఁబడిన, సత్త్వలగుచున్=బలముకలవారై, స్వస్థలికరుగన్=స్వర్గమున కేగఁగా.

తా. మంచిమాటలు చెప్పి రావణుఁడు కుంభనికుంభాదులను యుద్ధమునకుఁ బంపెను. వారు, సుగ్రీవునిచే హనుమంతునిచే నిహతులై స్వర్గలోకమునకుఁ బోయినంత.

లక్ష్మి.—తనకుహితమైనసూక్తులన్=తనకుపయోగించుమాటలను, అని=పలికి, లోనికిన్=ఇంటిలోనికి, వీఁకుకొలుపన్=పంపఁగా, అచటఁగదలి=ఆసభనుండిలేచి, అల్లన=మెల్లగా, వారు=దమ్మన్నసోదరాదులు, తాపనిశ్వాస=వేఁడినిట్టూర్పులచే, నివారింపఁబడినబలముకలవారై, స్వస్థలికరుగన్=తమతమయిండ్లకుఁ జనినపిమ్మట.

తా. వారికిఁ గోపము రాకుండ నేవో మంచిమాటలాడి మీరిండ్లకుఁ బొండు ఈఁగొడవ మీకేల యనిపంపివైచెను. వారు, అయ్యో! ఎంతచెప్పినను వినలేదే యని విచారించుచు నిండ్లకేగిరి. తర్వాత.

క. అలలంకాపతి కపిశి
ష్యులచే నవ్వార్తయంతయు న్విని యిఁకనే
సులువున సాధించెదనో
వలనొప్పఁగ నరసమాజవర్యుని ననుచున్. 181

రాఘ.—అలలంకాపతి=రావణుఁడు, కపిశిష్యులచేన్=మిగిలినరాక్షసులచే, అవ్వార్త=ఆకుంభనికుంభాదులుచచ్చుట, అంతయున్, విని, ఇఁక=ఇంకమీఁదట, నరసమాజవర్యుని=మానవశ్రేష్ఠుఁడైనరాముని, వలనొప్పఁగన్=ఉపాయముమీఱ, సులువునన్=సిరీతెని, సాధించెదనో=సాధింతునా, అనుచున్=అనితలంచుచు.

తా. కుంభనికుంభులు మడిసిరి. ఇంక రాము నెట్లుసాధింతునా, ఏయుపాయము పన్నుదునా యని రావణుఁడు విచారించుచుండెను.

లక్ష్మ.—కవి=కవీశ్వరుఁడైన, అలలం గాపలి=లక్ష్మణకవి, శిష్యులచేక్=తనయొద్దఁ జదువుకొను విద్యార్థులవలన, అవ్వార్తయంతయుఁక్, విని, ఇఁక, నరసమాజవర్యుని=నరసయ్యమ్మగారిపుత్త్రుఁడైన దమ్మన్నను, ఏసులువున, వలనొప్పసాధింతునో యనుచు, ఊహించెను.

తా. తనవా రెంతచెప్పినను వినలేదు, నే నెంత చెప్పినను వినలేదు. దమ్మన్న నిఁక నేయుపాయమున సాధింపవచ్చునో యని యూహించెను.

క. ఊహించి యంత మది కు
త్సాహ మొదవఁ బలికె నాకుఁ దగ దివ్యకలా
దాహీమకరాక్షుఁ డుండఁగ
నాహారిపరవధ యొనర్చు టబ్బుర మగునే. 182

రాఘ.—ఊహించి = ఆలోచించి, అంతక్, మదికి = మనస్సునకు, ఉత్సాహమొదవక్ = సంతోషముకలిగి, నాకుక్, తగక్, దివ్యకలాదాహి=దేవతల నేర్పులను దగులఁబెట్టినట్టి, మకరాక్షుఁ డుండఁగక్=మకరాక్షుఁడను రాక్షసుఁడుండఁగా, ఆహారిపరవధ=ప్రసిద్ధులయినవానరులను విరోధులనుజంపుట, లేక, ఆవిష్ణువుయొక్కయవతారమైన విరోధియగురామునిజంపుట, ఒనర్చుట=చేయుట, అబ్బురమగునే=ఏమికష్టము? (అని), పలికెక్=చెప్పెను.

తా. నాకు, దేవతలను వంచించుశక్తి గలమకరాక్షుఁ డున్నాఁడు. వానింబంపించితినా వానరులను రాముని జయించు నని సంతోషముగా రావణుఁడు చెప్పెను.

లక్ష్మ.—ఊహించి = లక్ష్మణకవి తలంచి (ఉపాయమును), నాకుక్, తగక్, దివ్యకలాద=దేవతలకుఁ గళలనిచ్చెడు చంద్రుఁడును, అహీమకర=సూర్యుఁడును, అక్షుఁడు=నేత్రములుగాఁగలవాఁడు(విష్ణువు), ఉండఁగక్=ఉండఁగా, ఆహారి=ఆదేవుఁడు, పరవధ=శత్రువధను,ఒనర్చుట=చేయుట,అబ్బురమా, అనుచుక్, అంతక్, మదికిక్=మనస్సునకు, ఉత్సాహమొదవక్=ఆనందము పుట్టఁగా, పలికెక్=చెప్పెను.

తా. ఎట్లు దమ్మన్నను సాధింతునా యని యెంచి, ఇంక నేమి ఆసూర్య చంద్ర నేత్రుండైనభగవంతుఁ డుండఁగా నా కబ్బురమేమికల దని సంతోషించెను.

వ. అని తద్భారం బంతయు నతనియందుఁ బెట్టి యాధర్మనాశక పద్యానుసారిబుద్ధి నిశ్చలుండై యుండెఁ దదనంతరంబ. 183

రాఘు.—అని=అట్లుచెప్పి, తద్భారంబంతయుఁ=ఆ యుద్ధభారమంతయును, అతనియందుఁ బెట్టి=ఆ మకరాక్షునిబిలిచియాతనిపైమోపి, ఆధర్మ నాశకపద్యానుసారిబుద్ధి=ధర్మమును నశింపఁజేసెడుమార్గమునుబట్టి తిరుగునట్టి బుద్ధి గలరావణుఁడు, నిశ్చలుండై=నిర్భయముగ, ఉండెన్. తదనంతరంబ=తర్వాత.

తా. మకరాక్షునిపై యుద్ధభారమంతయుఁ బెట్టి యా యన్యాయ మార్గప్రవర్తకుఁడైనరావణుఁడు నిశ్చలుఁడైయుండెను. తర్వాత.

లక్ష్మ.—అని, తద్భారంబు=దమ్మన్ననుసాధించుపని, అతనియందుఁ బెట్టి=ఆహరియందుంచి, ఆధర్మ=ఆదమ్మన్నను, నాశక=నశింపఁజేయు, పద్య=పద్యములను, అనుసారి=అనుసరించిన, బుద్ధినిశ్చలుండై=నిశ్చలబుద్ధికలవాఁడై, ఉండెన్, తదనంతరంబ.

తా. దమ్మన్ననుసాధించుపని శ్రీహరిపైనిడి తా నాతనిపైఁ దిట్టుపద్యములం జెప్పుటలో మనస్సుపెట్టుకొని లక్ష్మణకవి యుండెను.

సీ. ఘనకుంభకర్ణాతికాయకుంభులఁ బట్టి
క్రమమునఁ ద్రుంచినరామలక్ష్మ
ణాహరిసంతతు లట్ల రహిమీఱుచుండంగ
వన చారిసమితి సద్వినుతవిస్ఫు
టశ్లోకములు దిక్తటవ్యాప్తముగఁ గ్రమ్మి
తదహితద్రవిణసంపదలు కొంచె

మగునట్లు సేయంగ నంతట నమ్మక
రాక్షసారాతిశౌర్యమ్ము వొదువ
గీ. నంతనాలక్ష్మణాగ్రజుఁ డమలినగతి
మెఱయ నవ్విరోధిని జంప మేఘనాదుఁ
డయ్యనంతపదవ్యవిలసితాత్మశక్తిఁ
జూప నరుదయ్యెఁ దద్ఘనస్ఫూర్తి యపుడు. 184

రాఘ.—ఘన=గొప్పవారైన, కుంభకర్ణ, అతికాయ, కుంభులన్ = పైముగ్వురురాక్షసులను, పట్టి=పట్టుకొని, క్రమమునఁ ద్రుంచిన = వరుసఁగాఁ జంపినట్టి, రామలక్ష్మణహరిసంతతులు=రాముఁడు, లక్ష్మణుఁడు, సుగ్రీవుఁడును, అట్లు=ఆప్రకారము, రహిమీఱుచుండఁగన్ = తేజస్ఫూర్తినొప్పుచుండఁగా, వనచారిసమితి=వానరసంఘము, సద్వినుతవిస్ఫుటశ్లోకములు = సజ్జనులచేఁ గొనియాడఁబడునట్టివిశదకీర్తులు, దిక్తటవ్యాప్తముగన్=నలుదిక్కులకుఁ బ్రసరించునట్లు, క్రమ్మి=క్రమ్ముకొని, తదహితద్రవిణసంపదలు=ఆశత్రువుల బలసంపత్తిని, కొంచెమగునట్లుసేయంగన్=తగ్గిపోవునట్లొనర్పఁగా, అంతన్, అమ్మకరాక్షసారాతిశౌర్యమ్మువొదువన్ - అమ్మకరాక్ష=మకరాక్షుని, సార=బలమును, అతిశౌర్యమ్ము=ఘనపరాక్రమమును, పొదువన్=అరుముకొనఁగా,అంతన్, ఆలక్ష్మణాగ్రజుఁడు=రాముఁడు,అమలినగతి మెఱయన్=నిర్మలమైనరీతిప్రకాశించునట్లు, అవ్విరోధిని=ఆమకరాక్షుని,జంపఁగా, మేఘనాదుఁడు=ఇంద్రజిత్తు, అయ్యనంతపదవ్యన్=ఆకాశమార్గమున, విలసితాత్మశక్తిన్=ప్రకాశించెడుతనసామర్థ్యము, చూపన్=చూపఁగా, అపుడు = ఆసమయమందు, తద్ఘనవిస్ఫూర్తి=ఆయింద్రజిత్తుమేఘములవిజృంభణము, అరుదయ్యెన్=ఆశ్చర్యమునుగలిగించెను.

తా. కుంభకర్ణుని రాముఁడు, అతికాయుని లక్ష్మణుఁడు, కుంభుని సుగ్రీవుఁడును జంపిరి. వానరవీరులు వారివారికిఁ దగినట్లు సంతసమునఁ బోరుచుండిరి. మకరాక్షుని రాముఁడు సంహరించెను. ఇంద్రజిత్తు మేఘమండలములోనుండి యుద్ధ మారంభించెను.

లక్ష్మ. — ఘనకుంభకర్ణాతికాయకుంభులఁ బట్టి-ఘన=పెద్ద, కుంభ=కుంభస్థలములు, కర్ణ=చెవులు, అతికాయ=పెద్దదేహములుగల, కుంభులఁబట్టి=ఏనుఁగులంబట్టుకొని, క్రమమునన్, ద్రుంచిన=చంపిన, రామలక్ష్మణహరిసంతతులట్లు-రామ=సుందరమైన, లక్ష్మణ=చిహ్నములుగల, హరిసంతతులట్లు=సింహములవలె, రహిమీఱుచుండన్, కవనచారిసమితి=లక్ష్మణకవియొక్క, సద్వినుత=పండితులచేఁగొనియాడఁబడు, విస్ఫుటశ్లోకములు=స్పష్టమైనపద్యములు, దిక్తటవ్యాప్తముగన్=నలుదిక్కులవ్యాపించునట్లు, క్రమ్మి=అలముకొని, తదహితద్రవిణసంపదలు=ఆదమ్మన్నగారి బలసంపదలు, కొంచెమగునట్లు సేయుంగన్ = క్షయింపఁజేయఁగా, అంతటన్, నమ్మక=విశ్వసింపక, రాక్షసారాతిశౌర్యమ్మువాదుపన్=విష్ణుదేవునిబలమందుఁ బ్రవేశించిన, అంతన్, ఆలక్ష్మణాగ్రజుఁడు=లక్ష్మణకవి, అమలినగతిమెఱయన్, అవ్విరోధినిజంపన్=తనవైరినణఁచుటకు, మేఘనాదుఁడయి=మేఘమువలెగర్జించి, అనంతపద్యవిలసిత = పెక్కుపద్దెములతోఁగూడిన, ఆత్మశక్తిఁజూపన్=తనసామర్థ్యముగనంబడఁజేయఁగా, అప్పుడు, తద్ఘనస్ఫూర్తి=అతనిపద్యాతిశయము, అరుపయ్యెన్.

తా. సింహసంతతివలె లక్ష్మణకవిపద్యములు జగద్వ్యాప్తములయి దమ్మన్నగారిహృదయ మందఱకుఁ దెల్పుచున్నవి. ఆపద్యములబలము చాలకుండునని భగవంతునిసాహాయ్యముగూడ నాపద్యములలోఁ బ్రవేశించెను.

వ. తదనంతరంబ. 185

స్పష్టము.

క. వరసాయకవిత్త్వపటు
స్ఫురణుం డాలక్ష్మణుండు సొంపు దలిర్పన్
పరిపంథికొమరు నడఁచెన్
స్థిరనిర్మలలసదమోఘ దృఢగోత్రతులన్. 186

రాఘు. — వరసాయకవిత్త్వపటు-వర=శ్రేష్ఠమైన, సాయక=బాణవిద్యయొక్క, విత్త్వపటుస్ఫురణుండు=పరిజ్ఞానమునమిగులఁబ్రౌఢుఁడగు, ఆలక్ష్మ

ఖుండు సొంపుదలిర్పన్, పరిపంథికొమరునిన్ = రావణుపుత్రుఁడగునింద్ర జిత్తును, స్థిరనిర్మలలసదమోఘదృఢ = స్థిరము, నిర్మలము, ఔజ్జ్వల్యము, శుభ్రము, వ్యర్థముకానివియుఁనగు, గోతతులన్ = శరములచే, అణంచెన్ = చంపెను.

తా. లక్ష్మణుఁ డింద్రజిత్తును అమోఘదివ్యాస్త్రప్రయోగమునఁ జంపెను.

లక్ష్మ.—వర = చక్కని, సాయ = శుభావహావిధితోఁగూడిన, కవిత్వపటుస్ఫురణుండు= కవిత్వపాటవముగలవాఁడు, ఆలక్ష్మణుండు=కవి,సొంపు దలిర్పన్, పరిపంథికొమరు=తనవిరోధియొక్క యొప్పిదమును, స్థిర, నిర్మల, లసత్, అమోఘ, గోతతిన్=వాక్యసముదాయముచే, అడఁచెన్=తగ్గించెను.

తా. దమ్మన్నగారు లక్ష్మణకవిపద్యములచేఁ గొంత విన్నఁదనముం బొందెను.

గీ. అప్పటికిఁ దనమది రోష ముప్పతిల్ల
వఱలుధర్మనిందితకీర్తి మఱియు నద్భు
తమయశక్తి వదలె దానఁ దత్సుమిత్ర
సంతతికి నంటికొనె మానసవ్యథాప్తి. 187

రాఘ.—అప్పటికిన్ = ఇంద్రజిత్తుమృతినొందునప్పటికి, తనమదిన్, రోషముప్పతిల్లన్ = క్రోధముపుట్టి, వఱలు = ప్రకాశించుచున్న, ధర్మనిందితకీర్తి = ధర్మముచే నిరసింపఁబడిన కీర్తిగలరావణుఁడు, మఱియున్, అద్భుతమయశక్తివదలెన్=అద్భుతమైన మయనామకశక్తిని బ్రయోగించెను. దాన్ = దానివలన, తత్సుమిత్రసంతతికిన్=లక్ష్మణునకు, మానసవ్యథాప్తియంటికొనె= మనస్సునందు బాధ యంకురించెను.

తా. రావణుఁడు కోపముతో యుద్ధమునకు వచ్చి మయనామముగల యొకశక్తిబాణమును విడిచెను. అది లక్ష్మణునికిఁ దగిలెను.

లక్ష్మ.—అప్పటికిన్ = ఒప్పిదముపోవునప్పటికి, తనమదిన్, రోషముప్పతిల్లన్, వఱలు, ధర్మనిందితకీర్తి=ధర్మరావనునిందితయశుని, మఱియున్,

అయశక్తివదలెర్ = దైవబలముతగ్గెను, అద్భుతము! దాన=దానిచే, తత్సుమిత్ర సంతతికిక్ = అతనిస్నేహితులకు, మానసవ్యాధా ప్తియంటెకొనె = మనోవ్యధ కలిగెను.

తా. ధర్మరాయనికిఁగోపముపుట్టినది. దానితోదైవబలము తగ్గినది, దానితో మిత్రులందఱకు మనస్సంతాపము కలిగెను.

వ. అంతఁ గొంతతడవునకు మఱియును. 188

తా. స్పష్టము.

క. పావని హరిదయ మృతసం
జీవని నాసన్నయవిలసితు లక్ష్మణు నెం
తే వెలయఁ జేసెఁ దద్రిపు
భావం బడల ననుజనుల పలుకులు నెసఁగెన్. 189

రాఘ.—పావని=పవనపుత్త్రుఁడగు,హరి=ఆంజనేయుఁడనుట, దయన్ = కరుణచే, మృతసంజీవనిన్=మృతసంజీవనియనునోషధిచే,ఆ+సత్+నయ+ విలసితున్=ప్రసిద్ధమగుసత్యముచే నీతిచేఁబ్రకాశించు, ని. "సత్ సత్యేవిదుషి శ్రేష్ఠేసాధౌ" నానా. లక్ష్మణున్ = లక్ష్మణుని, ఎంతేవెలయఁజేసెన్ = మిగులఁ దేజోవంతునిగాఁజేసెను. (బ్రదికించెను) తద్రిపుభావంబడలన్ = విరోధికి భయముకలుగునట్లు, అను = పలుకునట్టి, జనులపలుకులునెసఁగెన్ = జనులవాక్యములు ప్రబలెను.

తా. హనుమంతుఁడు మృతసంజీవనిం దెచ్చి లక్ష్మణుని బ్రదికించెను. రావణునికి భయము పుట్టెను. (మనసుకలఁగెను)

లక్ష్మ.—పావనిహరిదయ = పావనమైనయీశ్వరకటాక్షము, మృత సంజీవనినా = మృతినొందినవారిని బ్రదికించునది యనునట్లు, సన్నయవిల సితున్ = సత్స్వభావముగల, లక్ష్మణున్ =కవిని, ఎంతేవెలయఁజేసెన్ =అత్యం తముఁబ్రకాశింపఁజేసెను, తద్రిపుభావంబడలన్ = దమ్మన్నహృదయముడలు నట్లు, అనుజనులపలుకులునెసఁగెన్ = తన్ననుసరించిన జనులవాక్యములును ప్రబలెను.

వ. అంత. 190

తా. సులభము.

సీ. తివిరి యాలంకాపతికవి గురూపది
ష్టసుమంత్రుఁ డగుట గూఢముగఁ బరమ
హోమాప్తి నొప్పుచునున్న ఘనగతి స
త్పదవి ధూమము నిండఁ బ్రౌఢిఁ గాంచి
నెఱయ శ్రీరామావనిపతి విభీషణ
వరమంత్రసంగతి హరిబలంబు
చేతఁ దద్రిపుఁ డొనర్చెడుకార్య మంతయుఁ
జెడిపోవునట్లుగఁ జేసి యతని

గీ. క్షేత్ర మంగదసంప్రాప్తఖేద మగుచు
భూమిఁ బొరలాడఁ జేసినఁ బ్రోవు మనుచు
సురుచిమయతను భవభయహరణశక్తు
నాత్మవిభు నాసురశ్రేష్ఠు నాశ్రయించె. 191

రాఘ.—తివిరి=కోరి, ఆలంకాపతి = రావణుఁడు, కవిగురూపదిష్ట= గురువైనశుక్రునిచే నుపదేశింపఁబడిన, సుమంత్రుఁడగుటన్ = మంచిమంత్రము తనయొద్దనుండుటచే, గూఢముగన్ = రహస్యముగ, పరమహోమాప్తిన్ = ఉత్కృష్టమగు, అభిచారిక = హోమముయొక్క పొందుటచే, ఒప్పుచున్నన్, ఘనగతి = మేఘమువలె, సత్పదవిన్ = ఆకాశమున, ధూమమునిండన్ = పొగయలుముకొనఁగా, ప్రౌఢిఁగాంచి= నేర్పుతోఁజూచి, నెఱయన్ =స్పష్టముగా, శ్రీరామావనిపతి = రాముఁడు, విభీషణవరమంత్రసంగతిన్ = విభీషణుఁడు చెప్పిన యాలోచన ననుసరించి, హరిబలంబుచేత = కపిసమూహమును బంపి, తద్రిపుఁడొనర్చెడుకార్యమంతయుఁ జెడిపోవునట్లుగఁ జేసి = ఆరావణుఁడు చేయుచున్న హోమమునకు విఘ్నముకలిగించి, అతనిక్షేత్రము= ఆరావణుని భార్య మండోదరిని, అంగదసంప్రాప్తఖేదమగు = అంగదునిచేఁ బ్రాప్తించిన

దుఃఖముగలదియై, భూమిఁ బొరలాడఁ జేసినన్ = నేలంబడి దొర్లునట్లొనర్పఁగా, ప్రోవుమనుచు = రక్షింపుమని, సురుచిమయతనుభవ=సత్కాంతిగల శరీరము గలది (సత్కాంతిగలమయునికూఁతురు), భయహరణదక్షున్ = భయముం బోఁగొట్టఁదగిన, ఆత్మవిభున్=తనపతిని (అసురశ్రేష్ఠున్), ఆశ్రయించెన్ = చేరెను.

తా. శుక్రాచార్యులు చెప్పినప్రకారము రావణుఁడు శత్రుసంహారము కొఱకు అభిచారికహోమమును మొదలుపెట్టెను. దానిపొగ మీఁదికి లేచిన విభీషణుఁడు కనిపెట్టి రామునకుఁ దెల్పెను. రాముఁడు కపులం బంపి హోమము చెడఁగొట్టెను. అంగదుఁడు మందోదరినిఁ బట్టి యీడ్వఁగా రావణుని యొద్దికిఁ బోయి యామె మొఱ్ఱవెట్టెను. ఎంతనిష్ఠలోనున్నను భార్యాపరిభవముం గాంచినవానికిఁ గ్రోధము రాకమానదు.

లక్ష్మీ.—ఆలంకాపతికపి = లంకనేలకధిపతియైన (లక్ష్మణ) కపీశ్వరుఁడు, గురూపదిష్టసుమంత్రుఁడగుటన్ = గురువుచేనుపదేశింపఁబడిన మంత్రముగలవాఁడగుటచే, గూఢముగన్ = రహస్యముగ, పరమహోమాప్తిన్ - పర = శ్రేష్ఠమైన, మహః = కాంతియొక్క, మా = లక్ష్మిని, ఆప్తిన్ = పొందుటచే, ఒప్పుచున్న = ప్రకాశించుచున్న, ఘనగతిసత్పద = యోగ్యులకు సద్గతినిచ్చెడు మంచిపాదముగలవాఁడా! విధూ = హరీ, "విధుశ్శ్రీవత్సలాంఛనః" అమరము. ఇచ్చట ప్లుతముచే, విధుశబ్దము విధూయనియైనది. మము నిండన్ ప్రౌఢిన్ కాంచి=మమ్ముపూర్ణదృష్టిచేఁ జూచి, శ్రీరామావనీపతి = లక్ష్మికిని భూమికిని ప్రియుఁడా; విభీషణవరమంత్రసంగతి - వి= విగతములైన పోయిన, భీ=భయమును, ఈషణ=ఈషణత్రయమునుగల, వర= శ్రేష్ఠములగు, మంత్రసంగతి = మంత్రములసాంగత్యముగలవాఁడా! హరి! బలంబుచేత, తద్రిపుఁడు = ఆనావిరోధి, ఒనర్చెడుకార్యమంతయుఁ జెడిపోవునట్లుగఁ జేసి, అతనిక్షేత్రము=అతనిదేహము, "క్షేత్రంశరీరే కేదారేసిద్ధస్థానకళత్రయోః" అంగదన్=ఆపదచే, సంప్రాప్తఖేదమగుచున్ = దుఃఖ

పడి, భూమింబొరలాడఁజేసి, ప్రోవుము = మమ్మురక్షింపుము. అనుచున్, సుగుచిరమయతను = తేజోమయదేహముగల, భవభయ హారణదక్షు = సంసారభయమునుబోఁగొట్టు, ఆత్మవిభు=ఆత్మాధిపతిని, ఆసురశ్రేష్ఠున్ =దేవతావరేణ్యుని, ఆశ్రయించెన్=కొలిచెను.

తా. లక్ష్మణకవి శత్రుసంహారమునకై యొకమంత్రముచే రహస్యముగ విష్ణుదేవుని నారాధించుచుండెను.

వ. అట్లాశ్రయించి యనేకప్రకారంబులఁ గరుణంబుగాఁ బలుకుచుండ విమతబలాకర్షితాత్మక్షేత్రుఁ డగునాలంకాపతి కప్పుడు మనంబునం గోపం బినుమడించిన నమ్మహామన్యు వానరసమాజబలం బడంచి నిజక్షేత్రంబు వదలించి యెప్పుడింక నాత్మీయగోశక్తి యొసంగ నమ్మహాసద్ధర్మ నరవరభంజనుండను పేరువహింౘెదనో యనుచుఁ దచ్చింతాపరుండై యుండె నంత నాలక్ష్మణాగ్రజక్షేత్రహర్తయంతగపురజనంబులు తమలోన. 192

రాఘ.—అట్లాశ్రయించి = ఆప్రకారము మగనియొద్దఁజేరి, అనేకప్రకారంబులన్=బహువిధంబుల, కరుణంబుగాఁ బలుకుచుండన్=కనికరము కలుగునట్లు ప్రార్థించుచుండఁగా, విమత...పతికి - విమత=శత్రుసేనచే, బలాకర్షిత=బలవంతముగా లాగఁబడిన, ఆత్మక్షేత్రుండు = స్వభార్యగల, (అగు) ఆలంకాపతికి=రావణునకు, అప్పుడు, మనంబునకున్, కోపంబు, ఇనుమడించినన్=కోపమువృద్ధికాఁగా, అమ్మహామన్యు=అధికరోషము గలయతఁడు, వానరసమాజబలంబడంచి = కోతులంగొట్టి, నిజక్షేత్రంబువదలించి=భార్యనువిడిపించి, ఆత్మీయగోశక్తియొసఁగన్=తనబాణముమీఁయునట్లు, అమ్మహాసద్ధర్మ నరవర భంజనుండు-ఆ+మహా+సద్ధర్మ=అగొప్పధనుర్ధారియైన, నరవర=రాజైన రాముని, భంజనుండు=కొట్టినవాఁడు, అను పేరు=అనునట్టిబిరుదును, ఇఁకన్, ఎప్పుడు వహింౘెదనో-రామునిగొట్టినవాఁడను పేరు నాకెప్పుడువచ్చునో, అనుచున్, తచ్చింతాపరుండైయుండెన్ = ఆయాలోచనలోనే యుండెను.

అంతన్, ఆలక్ష్మణాగ్రజక్షేత్రహర్త=రావణునియొక్క, అంతఃపురజనంబులు=స్త్రీలు, తమలోన.

తా. ఏడ్చుచున్నమండోదరిని విడిపించి కోపించి యెపుడు రాముని జంపెదనా యనునాలోచనలో రావణుఁ డుండెను, రావణభార్యలు మనంబునం జింతించుచుండి రనుట.

లక్ష్మ.—అట్లాశ్రయించి=అట్లువిష్ణుదేవుఁగొలిచి, కరుణంబుగాఁ బలుకుచుండన్=దీనముగాఁ బ్రార్థించుచుండఁగా, విమతబలాకర్షితాత్మక్షేత్రుఁడగునాలంకాపతికి=శత్రువగుదమ్మన్నచే నపహరింపఁబడిన లంకనేలగలలక్ష్మణకవికి, అప్పుడు, మనంబునన్, కోపంబినుమడింపన్=అధికకోపముపుట్టి, అమ్మహామన్యువు=కోపముం జెందిన యాలక్ష్మణకవి, ఆనరసమాజబలంబడంచి=ధర్మారాయనిసామర్థ్యమును దగ్గించి, నిజక్షేత్రంబు వదలించి=తనభూమిని వదలించుకొని, ఎప్పుడు = ఏనాఁటికి, ఇంకన్, ఆత్మీయగోశక్తి యెసంగన్=నాయొక్క వాక్యసామర్థ్యముచే, అమ్మహా... పేరు-అ+మహా+అసద్ధర్మ=అగ్గ్రప్పుయన్యాయ వర్తియగు, నరవర = నరశ్రేష్ఠుఁడైనదమ్మన్నను, భంజనుండు=నిగ్రహించినవాఁడు, అను పేరు=అనునట్టిఖ్యాతిని, ఎప్పుడు వహింతునో, అనుచున్, తచ్చింతాపరుండై=అదియేధ్యానముగా, ఉండెన్. అంతన్, ఆలక్ష్మణాగ్రజక్షేత్రహర్త = దమ్మన్నయొక్క, అంతఃపురజనంబులు, తమలోనన్

తా. ఎప్పుడు దమ్మన్ననుసాధించి తనభూమిని దాను గ్రహింతునా యని యాతలంపుననే లక్ష్మణకవియుండెను.

మ. కలితామోఘసుమంత్రలక్ష్మణమహాకవ్యుక్తసద్వాగ్గణం,బుల
హోమమ్మునుఁ బూని యంగదభయంబుం బొందఁగాఁజేసెఁ
గాం,తల సచ్ఛ్రీదళుఁగంగ నిక్కుటిలచేతస్కుండు నేఁ
డైన నీఁ, దలఁపం డక్కట లక్ష్మణాగ్రజునిక్షేత్రంబుల శు
భాకాంతిరొయ్యె. 193

రాఘ.—కలిత=ఒప్పుచున్న, అమోఘ=వ్యర్థముకాని, సుమంత్ర=సన్మంత్రముయొక్క, లక్షణ=చిహ్నములచేత, మహః=ఉత్కృష్టుఁడగు. కవి=శుక్రునిచే, ఉక్త=పలుకఁబడిన, సద్వాగ్గణంబుల=ప్రశస్తవాక్యసముదాయములచే, హోమమ్ముఁబూని=హోమకార్యమును, అవలంబించి, సచ్ఛ్రీదఘుఁగంగన్=శోభతగ్గిపోవుటను, కాంతలన్=స్త్రీలను, అంగద=అంగదునివలన, భయంబున్=భయమును, పొందఁగాఁజేసెన్=పొందునట్లొనర్చెను. ఇకుటిలచేతస్కుండు=ఈకుటిలాత్ముఁడు (రావణుఁడు), అలక్షణాగ్రజుక్షేత్రంబున్=సీతాదేవిని, శుభాకాంక్షియై=మేలుఁగోరి, నేఁడైనఁదలంపఁడు=ఈనాఁడైన నిచ్చుటకుఁ దలఁపఁడుగదా, అక్కటా=అయ్యయో.

తా. శుక్రాచార్యోపదేశమువలన హోమముప్రారంభించి యంగదునిచేత స్త్రీలను భంగపడునట్లు గావించెను, కాని యీకుటిలాత్ముఁ డిన్ని యవమానములం బొందియు నింకను సీతను రామున కిచ్చుట కూహింపఁడే. అయ్యోయని యంతఃపురస్త్రీలవాక్యము.

లక్ష్మ.—కలిత=కూడుకొనిన, అమోఘ=అడ్డులేని, సుమంత్ర=చక్కని యాలోచన (లేక జపము) కలిగిన, లక్ష్మణమహాకవ్యుక్త=లక్ష్మణుఁడను మహాకవిచేఁ జెప్పఁబడిన, సద్వాగ్గణంబులు=పద్యములు, మమ్మున్, పూని, అంగదన్=ఆపదను, భయంబున్=భీతిని, పొందునటులఁ జేసెను. అహో=ఆశ్చర్యము! కాంత+లసచ్ఛ్రీ+తఘుఁగంగన్=వృద్ధిగానున్న తన సంపదయంతయు నశించునట్లు, ఇకుటిలచేతస్కుఁడు=ఈదుస్స్వభావుఁడు, లక్ష్మణాగ్రజునిక్షేత్రంబున్=లక్ష్మణకవిభూమిని, శుభాకాంక్షియై=శుభమునపేక్షించి, నేఁడైననీదలంపఁడు=ఇప్పటికిని వానికిచ్చుట కొప్పుకొనఁడు. అక్కట!

తా. దైవవరముగలవాఁడు సత్కవీశ్వరుఁడు నైనలక్ష్మణకవిగారి పద్యములు దేశవిఖ్యాతము లైనవి. మాకెల్లరకు భయమును గల్గించుచున్నవి. ఇంత యప్రఖ్యాతిని బొంది పదిమందిలోఁ బడినను వానిమాన్యమును వాని కిచ్చుట కిష్టపడఁడే అయ్యో యేమిచేయుందుము?

వ. అని యనేకు లనేకప్రకారంబుల దీనాలాపంబులు వల్కుచుండి రప్పు డబ్ధిధారిఁ జేరి సునీతి మిగులంబెద్దయైన భార్య యిట్లనియె. 194

రాఘు.—అని=పూర్వోక్తప్రకారముగా, అనేకులు=పలువురు, అనేకప్రకారంబులన్=పెక్కుభంగుల, దీనాలాపంబులు=దీనవాక్యములను, పల్కుచుండిరి=అనుచుండిరి. అప్పుడు=ఆసమయమున, అబ్ధిధారింజేరి=ఆరావణుని యొద్దికిఁబోయి, సునీతిమిగులన్ = న్యాయమార్గమున, పెద్దయైనభార్య=పెద్దపెండ్లము (మందోదరి), ఇట్లనియెన్.

లక్ష్మ.—అని = ఇట్లుగా, అనేకులు, అనేకప్రకారంబుల=పలువురు పలుతెఱఁగుల, దీనాలాపంబులు=దైన్యవాక్యములను, పల్కుచుండిరి.అప్పుడు, అబ్ధిధారిన్ జేరి=ఆసజ్జనవిరోధియగుదమ్మన్నతో, సునీతిన్=నీతిమార్గమందు, మిగులంబెద్దయైన=మిక్కిలి నిపుణురాలయిన, భార్య యిట్లనియెన్.

తా. రెండుపక్షముల సులభము.

ఉ. ధన్యుని లక్ష్మణాగ్రజు సుధర్ము నెఱుంగఁగలేక మర్త్యసా
మాన్యునిగా మదిం దలఁచి మానుగ నమ్మహనీయుక్షేత్ర
మున్, మాన్యముఁ గొంకులేక నెరిమారి హరించితి వెం
దుఁ గామమున్, మనుష్యవు లోభమాత్మఁగలమానిసి ధర్మ
పథం బెఱుంగునే. 195

రాఘు.—ధన్యుని=పుణ్యుఁడగునట్టి, సుధర్మున్ = గొప్పవిలుకాఁడైన, లక్ష్మణాగ్రజుని=రాముని, ఎఱుంగఁగలేక=తెలిసికొనఁజాలక, మర్త్యసామాన్యునిగాఁ మదిందలఁచి=సాధారణమనుష్యుఁడని, మానుగన్, (ఇదిస్వార్థపదము) అమ్మహనీయుక్షేత్రమున్=అమ్మహాత్మునిభార్యను, మాన్యమున్=పూజ్యురాలిని, కొంకులేక = సందేహింపక, నెఱిమాలి = నీతివిడిచి, హరించితి = అపహరించినాఁడవు, ఎందున్ = ఎక్కడనైనను, కామమున్=కాముకత్వమును, మనుష్య

వుఁ = క్రోధమును, లోభముఁ=లోభగుణమును, ఆత్మఁగలమానిసి = తన యందున్నవాఁడు, ధర్మపథం బెఱుఁగునే = ధర్మమార్గమును గణించునా ?

తా. రాముని సాధారణుఁడైన నలువురు నరులను జూచుచున్నట్లే చూచి యామహాత్మునిసీతను నీవు హరించితివి. వెనుకముందు నాలోచించినాఁడవు కావు. ఎట్లాలోచింతువు. లోకములోఁ గాముక్రోధలోభములు గలవారికి న్యాయమార్గమిది యన్యాయమార్గమిదియను విచారము చేయుబుద్ధి యుండదుగదా.

లక్ష్మ.—ధన్యుని, సుధర్ముని = ధర్మమెఱిఁగినవానిని, లక్ష్మణాగ్రజుని= లక్ష్మణకవిని, ఎఱుంగఁగలేక = వానిసంగతిందెలిసికొనలేక, మర్త్యసామాన్యునిగా మదిందలఁచి, మానుగఁ, (ఈపదముసతార్థ్యముసేసినపు డుపయోగింపవలెను) ఆమ్మహనీయుంక్షేత్రముఁ = వానిభూమిని, మాన్యముఁ = లంకమాన్యమును, నెరిమాలి, కొంకులేక, హరించితివి, ఎందుఁ=ఎక్కడనైన, కామముఁ మన్యువుఁ లోభముఁ ఆత్మ గలమానిసి = కామక్రోధలోభయుంతుఁడు, ధర్మపథం బెఱుంగునే = న్యాయమార్గముదెలిసికొనునా. (భార్యచెప్పుచున్న నీతిలోనిది కావునఁ గొందఱుతలంచునట్లు, ధర్మ=దమ్మన్నా, పథం బెఱుంగునే=మార్గమెఱుంగునా యనునట్లు విడఁదీయుట యంతమంచిదిగాదు.)

తా. లక్ష్మణకవి సాధారణమానవునిగా నెంచితివి. అట్లు కాదు. అతఁడు వరకవి. వాని భూమిని నీవుహరించుట తగినది కాదు. కామక్రోధాదులు గలవారు మంచిచెడ్డల నాలోచింపరు గదా?

క. విను లక్ష్మణాగ్రజుఁ డరయ
ఘనవర్ణుఁ డనన్యభేద్యకవచస్ఫురణుం
డును గావునఁ దత్క్షేత్రముఁ
గొని బ్రదుకవశమె తదుగ్రగోగణములచేఁ. 196

రాఘు.—విను=వినుము. లక్ష్మణాగ్రజుఁడు = రాముఁడు, అరయఁ = బాగుగానాలోచింపఁగా, ఘనవర్ణుఁడు = నీలమేఘ వర్ణుఁడైన శ్రీమహావిష్ణువు, అనన్యభేద్య = ఇతరులకు భేదింపశక్తిచాలని, కవచ=మైమరువుయొక్క, స్ఫుర

ణుఁడు = ప్రకాశముగలవాఁడు, కావున = కాఁబట్టి, తత్క్షేత్రముఁ = ఆతనిభార్యను, కొని=హరించి, తత్+ఉగ్రగోగణములచేన్ = ఆతనియుగ్రబాణసముదాయమునుండఁ, బ్రదుకవశమె = బ్రతుకువాఁ డున్నాఁడా?

తా. రాముఁడు సాక్షాద్విష్ణుదేవుఁడు. వానిమార్కొనువారులేరు. ఆతనిభార్యను హరించినవాఁ డతనిబాణములచేఁ జావకుండఁ గలఁడా?

లక్ష్మ—విను. లక్ష్మణాగ్రజుఁడు = కవి, అరయన్, ఘనవర్ణుఁడు = ఉత్తమవర్ణములుగలవాఁడు, అనఁగా బ్రాహ్మణుఁడు, అనన్యభేద్యక = ఇతరులు భేదింపఁజాలని (అనఁగా, ఆతనిపద్యముల కితరు లర్థముచెప్పఁజాలరనుట), వచస్ఫురణుండు = పదములజ్ఞప్తికిఁ దెచ్చుకొనువాఁడు, కావున, తత్+క్షేత్రముంగొని = వానిలంకనేలను పుచ్చుకొని, తదుగ్రగోగణములచేన్ = ఆతని కఠినములైనపద్యములలోని మాటలంబడి, బ్రదుకవశమే = బ్రదుకవచ్చునా?

తా. లక్ష్మణకవి కఠినకవిత్వముం జెప్పును. వానిపద్యముల కితరు లర్థము చెప్పఁజాలరు. అంతటిపండితునిభూమిని హరించి వానిచెట్టుపద్యములం బడి యెట్లు నీవు బ్రదుకవచ్చును?

వ. అట్లు కావున. 197

తా. స్పష్టము.

చ. అమరఁగ లక్ష్మణాగ్రజున కాయనక్షేత్రము నిప్పుడేని యి
చ్చి మనుట మేలు నీకిది రుచింపకయుండిన నీవు సావఁ గో
పముఖభయంకరుం డలప్రభాకరసంతతి ధర్మరాజు దుర్దమ
తమచండకాండపటుదండితుఁ జేయుఁగృతాఘునిన్ వడిన్.

రాఘు.—అమరఁగన్, లక్ష్మణాగ్రజునకున్ = రామునకు, ఆయనక్షేత్రముఁ = ఆయనభార్యయగుసీతను, ఇప్పుడేని = ఇంకనుమించలేదు గనుక, ఇచ్చి = సమర్పించి, మనుట=బ్రదుకుట, మేలు = మంచిది. నీకిదిరుచింపకయుండినన్ = నేనుచెప్పినట్టిసమయమున రామునకు సీతనిచ్చుట యిష్టములేదేని, కోపముఖభయంకరుండు = ముఖమునంగోపము కుదిరియుండుటచే

భయముం గల్గించునట్టి, అలప్రభాకరసంతతిధర్మరాజు = ఆసూర్యవంశమందుఁ బుట్టినధర్మప్రభువు, రాముఁడు, (అల + ప్రభాకర = సూర్యునిసంతతి గోత్రజుఁడైన) నీవుపావక్ = నీవుచచ్చునట్లు, కృతాఘున్ = పాపకార్యమొనర్చి, నిన్ = నిన్ను, వడిన్ = వేగమున, దుర్దమతమచండకాండ = సహింపఁ దరముకానిఘోరబాణములచే, పటు దండితున్ = కఠినశిక్షను బొందినవానినిగ, చేయున్ = ఒనర్చును.

తా. ఇప్పుడైనను మిగిలినది లేదు. ఎందఱుచచ్చినను నీప్రాణములు నిల్చియున్నవి. కావున సీత నిమ్ము. లేదా రాముఁడు నిన్నుఁ జంపకమానఁడు.

లక్ష్మ.—అమరఁగన్ = ఒప్పునట్లు, లక్ష్మణాగ్రజునకున్ = లక్ష్మణకవికి, ఆయనక్షేత్రమును = ఆతనిమాన్యమును, ఇప్పుడేని = ఇప్పుడైనను, ఇచ్చి = మరలనిచ్చి, మనుట = జీవించుట, మేలు = తగినది. నీకిదిరుచింపకయుండినన్ = అట్లిచ్చుటకిష్టములేకుండినయెడల, నీవుపావన్ = నీవుమృతినొందఁగా, కోపముఖభయంకరుండు, అలప్రభాకరసంతతి = ఆసూర్యపుత్రుఁడైన, ధర్మరాజు = యముఁడు, కృతాఘున్ = పాపముచేసిన, నిన్ = నిన్ను, వడిన్, దుర్దమతమ = సహింపరాని, చండకాండపటుదండితుఁ జేయున్ = తీవ్రయమదండముచే దండించును, (ఇచ్చటచండకాండ = ప్రచండమైనదండము, "కాండోస్త్రీ దండబాణార్వ" అనినిఘంటువు)

తా. నీవు లక్ష్మణకవికి వానిభూమి యివ్వకుంటివా నీవు మృతినొందిన పిదప యముఁడు నిన్ను దండించును.

వ. నాతెఱంగు వినుము. 199

తా. సులభము.

ఉ. నిక్కపుఁ బాపశీలునకు నీకుఁ గళత్రము నౌట నాత్మలోఁ
బొక్కుచునుండు నాకరయఁ బుణ్యసతీత్వము లేదు లేదిఁకన్
దిక్కయయో యనంగ గురుదివ్యకళాంచితుఁ డౌచు ధాత్రిఁ
బెం, పెక్కినలక్ష్మణాగ్రజున కింపగు క్షేత్రము నీవొసంగమిన్.

రాఘు.—నికృష్టపుఁబాపశీలునకున్ = నిజమైన పాప స్వభావముగల నీకు, కళత్రమునాటచేత, ఆత్మలోన్ = మనస్సున, పొక్కుచునుందున్ = దుఃఖించుచున్న దానను, అనంగగురు = విష్ణుదేవుని, దివ్యకళాంచితుఁడౌచున్ = దివ్యకళచేనొప్పు, ధాత్రిఁబెంపెక్కిన = లోకమునఁ బ్రసిద్ధుఁడైన, లక్ష్మణాగ్రజునకున్ = రామునకు, ఇంపగుక్షేత్రమున్ = ప్రియభార్యను, నీవాసంగమిన్ = నీవీయకపోవుటచేత, నాకు, అరయున్ = విచారింపఁగా, పుణ్యసతీత్వము లేదు, ఇఁకన్, దిక్కు లేదు. అయయో.

తా. పాపాత్మునకు నీకు భార్యనైన కారణమున విచారించుచున్న దానను. నీవు సీతను రామున కీయకపోవుటచే నాకుఁ బుణ్యస్త్రీస్వభావము పోయినది. నాకిఁక దిక్కు లేదు. నే నేమి చేయుందును?

లక్ష్మ.—నికృష్టపుఁబాపశీలునకు నీకుఁ గళత్రము (భార్య) నాటచే, ఆత్మలోఁ బొక్కుచునుందు. తిక్కయయో = ఇతఁడు తిక్కనసోమయాజియే యో, అనంగన్ = అనితలంచునట్లు, గురుదివ్యకళాంచితుఁడౌచున్ = అధిక విద్యలచేఁబూజ్యుఁడగుచు, ధాత్రిన్, పెంపెక్కిన = ప్రఖ్యాతినొందిన, లక్ష్మణకవికి, ఇంపగు = ఇష్టమైన, క్షేత్రమున్ = మాన్యమును, నీవాసంగమిన్ = ఈయకపోవుటచే, నాకు, అరయన్, పుణ్యసతీత్వము లేదు = నేను బుణ్యస్త్రీ గానుండునదృష్టము నాకు లేదు, లేదు, ఇఁకన్ = ఇఁక లేనే లేదు.

తా. నీవు పాపస్వభావుఁడవు. నీకు భార్యనై దుఃఖము లనుభవించుచున్న దానను. తిక్కనసోమయాజివంటి పండితుని మాన్యమును హరించితివి. ఈకారణమున నీవు జీవింపవు. నేను విధవనగుయోగము పట్టును. అయ్యయో.

క. అని సతి బోధించినఁ జ
య్యన నొడఁబడఁ డయ్యె లక్ష్మణాగ్రజుక్షేత్రం
బు నొసంగ నాతఁ డంతం
బునుగతమైనట్టివార లట్టుల కారే. 201

రాఘు.—అని=ఇట్లని, సతి=భార్య మందోదరి, బోధించినన్=బోధ చేయఁగా, అతండు = రావణుఁడు, చయ్యనన్=శీఘ్రముగా, లక్ష్మణాగ్రజు క్షేత్రంబున్=సీతను, ఒసంగన్=రామునకిచ్చుటకు,ఒడంబడఁడయ్యెన్=సమ్మతించినవాఁడు కాఁడు, అంతంబు=చావు, అనుగతమైనట్టివారు=వెన్నాడివచ్చుచున్న వారలు, అట్టులకారే=అట్లే యగుదురుగదా.

తా. మందోదరిబోధించి తర్వాతను సీత నిచ్చుటకు రావణుఁడు సమ్మతింపలేదు. మృత్యువు వెనుకనుండి తఱిమికొనివచ్చుచుండఁగా, నెవ్వరికైనను సద్బోధలు రుచింపవుగదా.

లక్ష్మ.—ఆని సతి=దమ్మన్నగారిభార్య, బోధించినన్=సద్బోధ చేసినను, అతఁడు=భర్తా రావు,చయ్యననోడఁబడఁడయ్యె=చట్టున నొప్పుకొనలేదు. ఎందుకు? లక్ష్మణాగ్రజుక్షేత్రంబునొసంగుటకున్=లక్ష్మణకవిమాన్యము నిచ్చివేయుంటకు అంతం బనుగతమైనట్టివారలు = చావుసమీపించినవారలు, అట్టులకారే= చెప్పినమాటవినరుగదా. తాత్పర్యము సులభము.

వ. తదనంతరంబ నిజవిజయంబుఁ గోరుచుం బయలుదేఱిన యాలంకాపతి పటుతరగోశక్తి హారిబలంబున దృఢతగలయం గదాదులలీలనాక్రమించి సుదర్శనహస్త నాభివత్సజఘనదృఢత్వం బడంచుచుఁ బృథుజంఘాతిశయబలంబులఁద్రుంచుచు సుబాహుగంధవహాత్మజానుతాపం బొనరించుచు నీలతారకోపస్థితి విఫలంబు నేయుచు సుముఖసుగ్రీవాదులకు వివర్ణతం బుట్టించుచుం జేరి యన్నరసమాజవర్యు నొక్కించుక వివశత నొందింప నాలక్ష్మణాగ్రజుం డంత ముఖ్యశత్రు వధార్థంబుగా ననుసమానాగస్తిమిత వచనాంగీకృత హారిమంత్రుండై కమలాప్తుం డగు భగవంతు వేదవిధ్యుక్తంబుగా నిశ్చలభావంబున ధ్యానంబునేసి తత్ప్రసాదలబ్ధ దివ్యతేజోబల

విరాజితుండై యాత్మీయామోఘగోశక్తి ప్రకటంబగు
నట్లుగా విజృంభించిన. 202

రాఘు.—తదనంతరంబ=పిమ్మట, నిజవిజయంబున్=స్వకీయజయమును, కోరుచున్=కాంక్షించుచు, బయలుదేఱిన=యుద్ధమునకువచ్చిన, అలంకాపతి=రావణుఁడు, పటుతరగోశక్తిన్=సమర్థములగు బాణములబలముచే, హరిబలంబున=వానరసేనలోని, దృఢతగల=దార్ఢ్యముగల, అంగదాదులన్=అంగదుఁడు మొదలైనవారిని, లీలనాక్రమించి=యుద్ధవిలాసముచేతనరికట్టి, సుదర్శన... బడంచుచు—సుదర్శన=చక్రమును, హస్త=హస్తమునధరించిన, (భగవంతుని) నాభివత్స=బొడ్డునఁబుట్టినబాలుఁడగు బ్రహ్మకు, జ=సంభవించినజాంబవంతుని, దృఢత్వంబడంచుచున్=బలిమిఁబోఁగొట్టుచు, పృథుజంఘాతిశయబలంబున్=పృథుజంఘుఁడను వానరుని విస్తారమైన బలమును, త్రుంచుచున్=హరించుచు, సుబాహు... బొనరించుచు—సుబాహు=సుబాహునకు, గంధవహాత్మజ=హనుమంతునకు, అనుతాపంబొనగించుచున్=బాధగలిగించుచు, నీల... సేయుచు—నీల=నీలుని, తార=తారుని, కోపస్థితి=కోపమును, విఫలంబుసేయుచు=కోపించి తనపైకి వచ్చినవారిని వ్యర్థులం జేయుచు, సుముఖ=సుముఖునకు, సుగ్రీవ=సుగ్రీవుఁడు, ఆదులకున్=మొదలగువారికి, వివర్ణంబుపుట్టించుచున్=వైవర్ణ్యంబుఁగలిగించుచు, చేరి=సమీపించి, అన్నరసమాజవర్యుని=మానవశ్రేష్ఠుఁడగురాముని, ఒకింత=కొంచెము, వివశతనొందింపన్=మూర్ఛనొందినవానిం జేయఁగా, అలక్ష్మణాగ్రజుండు=రాముఁడు, అంతన్, ముఖ్యశత్రువధార్థంబుగాన్=తనకుముఖ్యవిరోధియైనరావణుంజంపుటకై, అనుప... మంత్రుండై... అనుపమాన=సాటిలేని, అగస్తి=అగస్త్యమునియొక్క, మిత=పరిమితిగల, వచన=వచనములచే, అంగీకృత=అంగీకరింపఁబడిన, హరిమంత్రుండై=సూర్యమంత్రముగలవాఁడయి, కమలాప్తుండగుభగవంతున్=పద్మహితుఁడైనసూర్యుని, వేదవిధ్యుక్తంబుగా=వేదవిధానప్రకారమున, నిశ్చలభావంబునన్=చలింపనిమనస్సుతో, ధ్యానంబుచేసి=స్తోత్రముచేసి (ధ్యానించి), తత్ప్రసాద=ఆసూర్యునిదయచే, లబ్ధ=పొందఁబడిన, దివ్యతేజోబలవిరాజితుండై=ఆమా

నుష తేజస్సును బలమును వహించి, ఆత్మీయ=తనసంబంధమైన, గోశక్తి=బాణ
బలము, ప్రకటంబగునట్లు = ప్రచురముగురీతిని, విజృంభించిన= ఏపుమీఱిన.

తా. రావణుఁడు యుద్ధమునకు వచ్చి యావానరసేన నంతను శీకాకు
పఱిచి రాముని మూర్ఛనొందించెను. రాముఁడు కొంతసేపటికిఁ దెలిసి అగస్త్య
ముని యుపదేశించినసూర్యమంత్రముచే తేజోవంతుఁడై.

లక్ష్మ.—తదనంతరంబ = తర్వాత, నిజవిజయంబుఁ గోరుచున్ =
తనకుజయము కావలయునని, బయలుదేఱినట్టి = బయలువెడలిన, అలంకారపతి
=లక్ష్మణకవియొక్క, పటుతర = విస్తారమైన, గోశక్తి = వాక్యసామర్థ్యము,
హరిబలంబున = విష్ణుదేవునిసహాయముచే, దృఢతగలయట్లు = మఱింతదార్ఢ్య
మునుబొందఁగా,గదాదులలీలన్ = రోగములు మొదలగువానివలె, (ని. 'వ్యా
ధిరోగగదామయాః' అని.) ఆక్రమించి = ఆవరించి, సుదర్శన = శుభదర్శన
ముయొక్క, హస్త = చేతులయొక్క, నాభి = పొక్కిలియొక్క,
వక్ష = వక్షముయొక్క, జఘన = పిఱుఁదులయొక్క, దృఢత్వంబడంచు
చున్ = శక్తినిపోఁగొట్టుచు, పృథు = విశాలమయిన, జంఘ = పిక్కల
యొక్క,అతిశయబలంబున్ = విస్తారమగుబలమును,తుంచుచున్ = ఖండిం
చుచు, సుబాహు = మంచిబాహువులకు, గంధవహ = ముక్కునకు, ఆత్మ =
మనస్సునకు,జాను = మోఁకాళ్లకు, అనుతాపంబొనరించుచున్ = బాధనుబు
ట్టించుచు, నీలతారకోపస్థితి = నల్లనికనుగ్రుడ్డులయొక్కయునికికి, విఫలంబుసే
యుచున్ = ప్రయోజనరాహిత్యమొనరించుచు, సుముఖ = మంచిమొగము
నకు, సుగ్రీవ = మంచికంఠమునకు, వివర్ణతంబుట్టించుచు = వికారభావముం
గలిగించుచు, చేరి, అన్నరసమాజవర్యు = దమ్మన్ననుం, ఒక్కింత, వివశతనొం
దింపన్ = పరవశునిఁగాఁజేయఁగా, అలక్ష్మణాగ్రజుండు = కవి, అం
తటన్, ముఖ్యశత్రువధార్థంబుగాన్ = తనవిరోధివధకొఱకు, అనుపమ=
ఉపమానములేని, అనాగ = దోషములేని,స్థిమిత = నిశ్చలమైన, వచన = వచ
నములచే, అంగీకృత = కూర్పఁబడిన, హరిమంత్రుండై = విష్ణుమంత్రముగల
వాఁడై, కమలాప్తుండు = లక్ష్మికిఁబ్రియుఁడైన, భగవంతున్ = దేవుని,వేదవి
ధ్యుక్తంబుగాన్ = వేదోక్తవిధానమున, నిశ్చలభావంబున = చలింపనితలం
పుతో, ధ్యానంబుసేసి, తత్ప్రసాదలబ్ధదివ్యతేజోబలవిరాజితుండై=అలక్ష్మీపతి

దయవలనఁ దేజశ్శాలినైన, ఆత్మీయూహోసుగోశక్తి=తనయొక్క తేసికవిత్వము, ప్రకటంబుగ = ఎల్లవారికిఁ దెలియునట్లు, విజృంభించెన్ =లేచెను.

తా. లక్ష్మణకవి కవిత్వబలమునకు దైవబలముకూడఁ దోడుపడఁగా నొనర్చినపద్యములచే దమ్మన్నకు శరీరపటుత్వము తప్పి కరచరణాదుల శక్తి యుండిగినది.

క. లలి మున్నలబుధవైరికిఁ
బొలుపు నెఱయ నాభి ముఖ్యముగ నున్నసుధా
తులసద్బల మడఁగెను పే
ర్చులక్ష్మణాగ్రజునిదివ్యశుచిగోశక్తిన్. 203

రాఘ.—లలిన్, మున్ను, అలబుధవైరికిన్ = రావణునకు, పొలుపు నెఱయన్, నాభిన్ = బొడ్డులో, ముఖ్యముగ, ఉన్న, సుధాతులసద్బలము= అమృతముయొక్కమిక్కుటమైనబలము, పేర్చు = అతిశయించుచున్న, లక్ష్మణాగ్రజు = రాముని, దివ్య = శ్రేష్ఠమగు, శుచిగోశక్తిన్ = ఆగ్నేయబాణముచే, అడఁగెను = నశించెను.

తా. రావణునిబొడ్డులో నున్నయమృతకలశమును రాముఁడు అగ్ని బాణముచేఁ గొట్టివైచెను.

లక్ష్మ.—లలిన్, మున్ను, అలబుధవైరికిన్ = దమ్మన్నకు, పొలుపు నెఱయన్=సుందరమగునట్లు, అభిముఖ్యముగన్=స్వభావసిద్ధముగా, ఉన్న= ఉండిన,సుధాతులసద్బలము=ధాతువులపుష్టి (అవయవపటుత్వము), పేర్చులక్ష్మణాగ్రజునిదివ్యశుచిగోశక్తిన్ = వృద్ధినొందుచున్నకవీశ్వరునిపవిత్ర వాక్యముల వలన, అడంగెన్ = తగ్గెను.

దమ్మన్నగారికి మునుపున్నశరీరపటుత్వము లక్ష్మణకవిపద్యప్రభావముచే సన్నగిల్లెను.

వ. తదనంతరంబు. 204

క. ఏపుచెడి నవకము లడఁగి
గోపాలతనూజునతనుగురువాణీశా
స్త్రోపాసనము సఫలముగ
నాపరుఁడు హృదయము సెదరి యసువులఁ బాసెన్. 205

రాఘ.—ఏపుచెడి = హెచ్చుతగ్గి, నవకములడఁగి- నవ = తొమ్మిది, కములు = తలలు, అడఁగి = తెగి (ని. 'కంశిరోంబునోః' అని), గోపాలతనూజు = రామునియొక్క, అతను = విస్తారమైన, గురు = శ్రేష్ఠమగు, వాణీశాస్త్రోపాసనము = బ్రహ్మాస్త్రప్రయోగమునకై చేసినధ్యానము, సఫలముగన్ = సార్థకముగ, ఆపరుఁడు = ఆవిరోధి (రావణుఁడు), హృదయము సెదరి = వక్షము బ్రద్దలై, అసువులఁబాసెన్ = మృతినొందెను.

తా. తొమ్మిదితలలుతెగి రావణుఁడు రాముని బ్రహ్మాస్త్రప్రయోగమున గుండెపగిలి మృతినొందెను.

లక్ష్మ.—ఏపుచెడి = అతిశయముతగ్గి, నవకములడఁగి = శరీరమునఁగలకోమల గుణముపోయి, గోపాలతనూజు= లక్ష్మణకవియొక్క, అతనుగురు= నారాయణునిగూర్చినట్టి (అతను = మన్మథునకు, గురు = తండ్రి), వాణీ = సరస్వతినిగూర్చినట్టి, శాస్త్రోపాసనము = శాస్త్రాభ్యాసము, సఫలముగన్ = ఫలముఁజెందునట్లు, ఆపరుఁడు = దమ్మన్న, హృదయముసెదరి=మనస్సుకలఁగి, అసువులఁబాసెన్ = ప్రాణములను విడిచెను.

తా. మేని నవకము చెడి లక్ష్మణకవిప్రభావముచే దమ్మన్న స్వర్గమునకేగెను.

వ. తదనంతరంబ. 206

తా. సులభము.

క. శ్రితు సరమాకాంతుని బుధ
నుతు నాసురవర్యు లక్ష్మణుం డాలంకా

పతిగా రాము నెఱయునా
నతిఁ జేసి గభీరభాషణంబులఁ బలికెన్. 207

రాఘ.—శ్రితు = ఆశ్రయించికొనిన, సరమాకాంతుని=సరమయను స్త్రీకి భర్తను, బుధనుతున్ = దేవతలచేఁగొనియాడఁ బడినవానిని, అసుర వర్యు = రాక్షసశ్రేష్ఠుఁడగు విభీషణుని, లక్ష్మణుండు=లక్ష్మణస్వామి, రాము= శ్రీరామునియొక్క, నెఱయు = ప్రకాశించెడు, ఆనతిన్ = ఆజ్ఞచొప్పున, లంకాపతిగాన్ = లంకకురాజునుగా, చేసి = అభిషేకించి, గభీరభాషణం బులన్ = గంభీరవాక్యములతోఁ గ్రిందిరీతిని పలికెను.

తా. తన్నాశ్రయించినవిభీషణుని లంకాపట్టణమునకు రాముని యాజ్ఞపై లక్ష్మణుండు రాజుం గావించి యిట్లనుచున్నాఁడు.

లక్ష్మ.—శ్రితు = ఆశ్రయింపఁబడునట్టియు, సరమాకాంతుని = లక్ష్మీసహితుఁడగునట్టియుఁ, బుధనుతున్ = దేవవంద్యుఁడగునట్టియు, అసుర వర్యు = సురశ్రేష్ఠుఁడగు విష్ణుంగూర్చి, లంకాపతి = లంక నేలకధికారియగు, ఆలక్ష్మణుండు = లక్ష్మణకవి, గా రాము నెఱయన్ = ప్రీతిపూర్వకముగా, ఆనతిఁ జేసి = నమస్కరించి, గభీరభాషణంబులన్ పలికెన్ = పెద్దగొంతెత్తి యిట్లనియెను.

తా. లక్ష్మణకవి లక్ష్మీపతికి నమస్కారము చేసి యిట్లనుచున్నాఁడు.

వ. ఎట్టులనిన. 208

తా. సులభము.

క. రవియును శశియును దారలు
నవనియు రాముకథ యుండునన్నాళ్లును దా
నవనాథ విభీషణ లం
క విమతభయవిరహితంబుగా నేలు మిఁకన్. 209

రాఘ.—రవియుం=సూర్యుఁడును, శశియుం=చంద్రుఁడును, తారలు= నక్షత్రములు, అవని = భూమియు, రాముకథయున్ = ఈరాముని చరిత్ర

మును, ఉండునన్నాళ్లు = ఉండునన్నిదినములు, దానవనాథ = రాక్షసేశ్వరా, విభీషణ = విభీషణుఁడా, విమతభయవిరహితంబుగాన్ = విరోధిభయము లేకుండ, ఇంకన్ = ఇంతటినుండి, లంకన్ = ఈలంకాద్వీపమును, ఏలుము = పాలింపుము.

తా. సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు, భూమి, రామకథ యెంతకాలముండునో యంతకాలము నిర్భయముగా లంకారాజ్యమును బాలింపుము.

లక్ష్మ.—దానవనాథవిభీషణ = రాక్షసులకుభయంకరుఁడా, రవియును, శశియుం, తారలు, అవని, రామకథ యుండునన్నాళ్లును, లంకన్ = లంకపాలమును, ఏలుము = రక్షించుము.

తా. ఆచంద్రార్కముగా లంకను స్వామీ రక్షింపు మని లక్ష్మణకవి వాక్యము.

వ. అని లంకాపరిపాలనార్థం బమ్మహాత్ము నియోగించె నప్పుడు సకలవిబుధజనంబులు ననేకవిధంబుల నప్పనికి మెచ్చి సంస్తుతించి రంత నాలక్ష్మణాగ్రజుండు మఱియును. 210

రాఘ.—అని, లంకాపరిపాలనార్థంబు = లంకాపట్టణము నేలుటకై, అమ్మహాత్మున్ = ఆవిభీషణుని, నియోగించెన్ = నియమించెను. అప్పుడు, సకలవిబుధజనంబులును = సమస్తదేవతలును, అప్పనికిన్ = రావణునిసంహారించి విభీషణుని లంకాధిపతిం జేయుటకు, మెచ్చి = మెచ్చుకొని, అనేకవిధంబులన్ = బహుప్రకారములను, సంస్తుతించిరి = పొగడిరి. (రామునిఁ బొగడిరనుట) అంతన్, తర్వాత, ఆలక్ష్మణాగ్రజుండు = రాముఁడు, మఱియున్ = మఱల.

తా. విభీషణునికి లంకారాజ్య మిచ్చినందుకై రాముని దేవతలు మెచ్చుకొనిరి.

లక్ష్మ.—అని. లంకాపరిపాలనార్థంబు = తనలంక నేలను గాపాడుటకై, అమ్మహాత్మున్ = ఆభగవంతుని, నియోగించెన్ = నియమించెను.

అప్పుడు, సకలవిబుధజనంబులుఁ = అందఱుపెద్దలును, అప్పనికి, అనేకవిధంబుల మెచ్చి సంస్తుతించిరి. అంతట, ఆలక్ష్మణాగ్రజుండు = కవీశ్వరుఁడు, మఱియుఁ.

సీ. పాదపాళులసొంపు ప్రకటించుగతి నంది
యలవిరావంబు లందంద చెలఁగ
మధ్యభాగమున రమ్యతఁ గాంచిగోవులు
బలసి యెల్లెడలను మెలఁగుచుండఁ
జనుగట్టులను గ్రమ్ముకొనినభూరికలమా
లికలచేత విచిత్రలీల మెఱయ
సద్రూపకంఠదేశమ్మున నానుతీ
వలసద్రుచులు సముజ్జ్వలత నొనర

గీ. నమరి మంజుభావయువ సరమ యలంక
రింప నొప్పుక్షేత్రము లంక ధృతిని గాంచి
యప్పు డబ్బానిసంతాన మట్టులుంట
నాత్మనెంచి తదభిముఖుం డగుచుఁ బలికె. 211

రాఘ.—పాదపాళులసొంపు ప్రకటించుగతిఁ - పాద = అడుగుల, పాళుల = చిహ్నముల, ('పాళిః కేశుర్ధ్వయోర్లింగమ్' అమరము) సొంపు = సౌందర్యమును, ప్రకటించుగతిఁ = ప్రచురముచేయు రీతిని, అందియలరావంబులు = అందె లనుపాదభూషల ధ్వనులు, అందంద = అచ్చటచ్చట, చెలఁగఁ = వినఁబడుచుండఁగా, మధ్యభాగమున = నడుమున, రమ్యతఁ = సొగసుచే, కాంచి = ఒడ్డాణముయొక్క, గోవులు = కాంతులు, (ని. 'ద్వయోస్తుగౌర్నపుంస్యగ్నిలేజోధామ మహోవిభా' అమరశేషము) బలసి = చుట్టుకొని, ఎల్లెడలను = అంతటను, మెలఁగుచుండఁ = వ్యాపించుచుండఁగా, చనుగట్టులఁ = స్తనములయందు, క్రమ్ముకొనిన = వ్యాపించిన, భూరికలమాలికలచేతఁ = బంగారుసరములచే, విచిత్రలీలమెఱయఁ = అబ్బురమగు

విలాసము నొప్పుచుండఁగా, సద్రూపకంఠదేశమున = మంచియాకారముగల గళసీమను, నానుతీవలసద్రుచులు = నానుతీఁగెయొక్క చకచకలు, సముజ్జ్వలతనొనర = మిక్కిలి ప్రకాశమానమైయుండఁగా, అమరి, మంజుభావయువసరమ - మంజు = మృదువైన, భా = కాంతితోఁగూడిన, అవయవ=అంగములుగల, సరమ = విభీషణభార్య, అలంకరింపన్ =శృంగారింపఁగా, ఒప్పు, క్షేత్రము = భార్యయగుసీతను, లంకన్ = లంకయందు, ధృతిని గాంచి = ధైర్యముగాఁ జూచి, అప్పుడు, అబ్భూమి సంతానము = ఆసీత, అట్టులుంట= అక్కడనుండుటను, ఆత్మ నెంచి = విచారించి, తదభిముఖుం డగుచున్ = ఆమెకెదురుగాఁ దిరిగి, పలికెన్ = రాముఁడు క్రిందిరీతిగా మాటలాడెను.

తా. విభీషణునిభార్యయైన సరమాదేవి సీతాదేవిని చక్కఁగా నలంకరించి రామునియెదుటికిఁ దెచ్చినది. ఆసీతనుగాంచి రాముఁడిట్లనుచున్నాఁడు.

లక్ష్మ.—పాదపాళులసొంపు = చెట్లులబారుల చక్కదనమును, ప్రకటించుగతినంది = తెలుపునట్టి స్థితినిబొంది, అల = ఆ, వి = పక్షుల, రావంబులు = ధ్వనులు, అందందచెలఁగన్ = అందందు వినఁబడుచుండఁగా, మధ్యభాగమునన్ = లంకయొక్కనడుమ, రమ్యతఁగాంచి= చక్కఁగా, గోవులు = పశువులు, బలసియెల్లెడలను మెలఁగుచుండన్ = మందలుమందలుగా నంతటఁ దిరుగుచుండఁగా, చనుగట్టులను = నడచెడుగట్టులపై, క్రమ్మకొనిన = నెఱసియున్న, భూరి=విస్తారమగు, కలమాలికలచేతన్ =రాజనపుచేలచేతను, విచిత్రలీలమెఱయన్, సద్రూపకంఠదేశమ్మున - సత్ = మంచి, ద్రు = చెట్టుల, ఉపకంఠదేశమ్మునన్ = దగ్గఱగా, ఆను = హత్తియున్న, తీవెల = తీఁగల, సద్రుచులు = కాంతులు, సముజ్జ్వలతనొనరన్ = ప్రకాశించుచుండఁగా, అమరి-మంజుభావ = మృదుస్వభావముకలిగిన, యువస= గడ్డియొక్క, రమ= శోభ, అలంకరింపన్, = ఒప్పు, క్షేత్రము = మళ్లుగలిగిన, లంక= లక్ష్మణకవిమాన్యమును, ధృతినిగాంచి=ధీరుఁడైచూచి, (సంతోషముగాఁజూచి యనుట.) అప్పుడు, అభ్భూమి = ఆలంక, సంతానమట్టులుండుటన్ =కల్పవృక్షమువలెఁ గనఁబడుట, ఆత్మ నెంచి = భావించి, తదభిముఖుం డగుచున్ = ఆభూమి వంకదిరిగి, పలికెను = లక్ష్మణకవి చెప్పుచున్నాఁడు.

తా. చెట్లపై నున్నపిట్టలు కూయుచుండఁగా, పశువు లానందము మేయుచుండఁగా మళ్లగట్లమీఁదికి వరియెన్నును పడి నడచుచున్నవారి కాళ్లకుఁ దగులుచుండఁగా, చెట్టులు, తీవలు గలతనలంకను లక్ష్మణకవిచూచి తనమనస్సున కది కల్పవృక్షమువలెఁ గనఁబడఁగా దానితో నిట్లనుచున్నాఁడు.

గీ. నాదు క్షేత్రంబ వైనని న్పరుఁడు గొన మ
నమున నోర్వక విడిపించినాఁడఁ గానఁ
గలయఁదగినవరుల పొత్తి గలసినట్టు
లుండు మిటమీఁద నా కిది యుచితహితము. 212

రాఘ.—నాదుక్షేత్రంబవైననిన్ = నాభార్యవగునిన్ను, పరుఁడు = ఇతరుఁడు, కొనన్ = తీసికొనఁగా, మనముననోర్వక = సహింపఁజాలక, విడిపించినాఁడన్ = నిన్ను విడిపించితిని, కానన్ = కావున, కలయఁదగినవరులన్ = నీకుఁ గూడనిష్టముగల పెనిమిటులను, పొత్తి = కూడి, ఇటమీఁద = ఇంక మీఁదట, వలసినట్లు = నీయిష్టమువచ్చినరీతిని, ఉండుము. ఇదియ = ఇదియే నాకు, ఉచితహితము = ప్రియమైనది, నాయభిప్రాయ మిది.

తా. పరుండు నిన్ను హరించినాఁడని యోర్వఁజాలక వానిం జంపి నిన్ను వదలించినాఁడను. కాని నాకొఱకుఁ గాదు. నీయిష్టము వచ్చినచోటికిఁ బొమ్ము.

లక్ష్మ.—నాదుక్షేత్రంబవైననిన్ = సామాన్యమవైన నిన్ను, పరుఁడు గొనన్ = వేఱొకఁడు తీసికొనఁగా, మనముననోర్వక = = తాళఁజాలక, విడిపించినాఁడఁగాన = నిన్నువానినుండి విముక్తనుగాఁ జేసితిఁగాన, కలయఁదగిన వరులపొత్తి = నీకుచితమైన ధాన్యవిశేషములతోఁగూడి, ఇటమీఁదట వలసినట్టు లుండుము. నాకిది యుచితమును హితమును.

తా. నాభూమి నితరులు హరించినారని పట్టుదలతో నిన్ను విడిపించినాఁడను కావున నీవు నీయిచ్చ వచ్చినట్లు దేయేధాన్యములు పండునో ఆయాధాన్యములచేలతో యథేచ్ఛముగా నుండుము.

సీ. అని పల్కుచుండంగ నచ్చట నున్న య
వనిజ శిఖల నొప్పు ననలముం బ్ర
వేశించి యందులో విలసిల్లె నప్పుడ
య్యిందిందిరంబు లనేకము లగు
రాగమ్ము లెసఁగఁ గారవము లొనర్చెను
జిత్రభానుండు రుచిరమహోచ్చ
వితతి తచ్ఛుచి సువిహితవాక్కు లాలించు
చు నతండు క్షేత్రంబుఁ గొనియె మగుడఁ
గీ. దనపిత యగుగోపాలుఁడు తాతశాంక
రీశ్వరుండు నాతి ష్మాఖ్య నెనయుతాత
* తండ్రియన్న మొదలగు సన్మార్గచారి
పిండిప్రోలివిభులు దివినుండి పొగడ. 213

రాఘు.—అని, పల్కుచుండంగ౯ = సీతతో రాముఁడు మాటలాడుచుండఁగా, అచ్చటనున్న. అవనిజ = సీత, శిఖలనొప్పు ననలము౯ బ్రవేశించి = ప్రజ్వరిల్లుచున్న యగ్నిలోఁజొచ్చి, అందులో విలసిల్లె౯ = ఆయగ్నిలోఁ గనఁబడియెను. అప్పుడు, అయ్యింది౯ = ఆలక్ష్మిని (ఇందిరకు రెండవరూపము ఇంది), తిరమ్ములు = స్థిరములు, అనేకములు = బహుళములు, అగురాగమ్ము లెసఁగ౯ = అనురాగములు ప్రకాశించునట్లు, గారవము లొనర్చెను = గారవించెను. రుచిరమహోచ్చవితతి = సుందరమగు గొప్పకాంతిగలవాఁడు, చిత్రభానుండు = అగ్నిదేవుఁడు, తచ్ఛుచి = ఆయగ్నియొక్క, సువిహితవాక్కులు = ఇష్టములైన పలుకులను, ఆలించుచు౯ = వినుచు, అతండు = రాముఁడు, తనపితయగుగోపాలుఁడు = తనతండ్రి దశరథుఁ డనురాజును, తాత = చతుర్ముఖుండును, శాంకరీశ్వరుండు = శివుఁడును, నాతిష్మాఖ్య౯ - నాతి౯ + మాఖ్య౯ = స్త్రీయైన లక్ష్మిని, ఎనయు = కూడునట్టి, తాతతండ్రి

* తండ్రిలోనితకారమునకు సన్మార్గలోని "న్మా" యతి చెల్లునా ?

=బ్రహ్మతండ్రియగు నారాయణుని, అన్న=ఇంద్రుఁడు (విష్ణుని కుపేంద్రుఁడను పేరుండుటచే నింద్రుఁడు విష్ణునియన్నయయ్యెను.), మొదలగు=మొదలైన, సన్మార్గచారిపిండి = గగనమందు సంచరించువారి సమూహముయొక్క, ప్రోలి=పట్టణమైన స్వర్గముయొక్క, విభులు=దేవతలును, దివినుండి=ఆకసముపైనుండి, పొగడన్ = స్తోత్రము చేయఁగా, మగుడన్ = తిరుగ, క్షేత్రంబుఁగొనియెన్=భార్యను స్వీకరించెను.

తా. రాముని సందేహవాక్యములకు సీత యగ్నిలోఁ జొచ్చి ప్రమాణముచేసెను. అగ్నిదేవుఁడు సీత పరిశుద్ధురాలని పలికెను. మృతినొందిన దశరథుఁడు, బ్రహ్మ, శివుఁడు, ఇంద్రుఁడు, దేవతలును స్తుతించుచుండఁగా రాముఁడు సీతను మరలఁ గైకొనియె.

లక్ష్మ.—అనిపల్కుచుండంగన్ = లక్ష్మణకవిభూమింగూర్చి పల్కుచున్నపుడు, అచ్చటనున్న = అక్కడంగల, అవనిజశిఖలన్ = చెట్లకొమ్మల యగ్రములయందు, ఒప్పు, ననలన్ = పుష్పములయందు, మున్ ప్రవేశించి=ముందుగాఁ ప్రవేశించి, అందులో=ఆపూవులరాశిలో, ఇయ్యిందిందిరములు=తుమ్మెదలు, అనేకములగురాగమ్ము లెసఁగన్ =శ్రావ్యములగు బహురాగములు విస్తరిల్ల విలసిల్లెన్. ఆపుడు, చిత్ర = విచిత్రములగు, భాన్ = కాంతిచే, ఉండు = ఉండునట్టి, రుచిర = సుందరమైన, మహా = ఘనమైన, అచ్ఛ = స్వచ్ఛమైన, విహగతతి = పక్షిసమూహము, రవములొనర్చెను = కూసెను. తచ్ఛుచిసువిహితవాక్కులు=తేటయైన యిష్టమైన యూపిట్టలకూఁతలు, ఆలించుచున్=వినుచు, అతండు=లక్ష్మణకవి, తనపిత=తనతండ్రి, అగు గోపాలుఁడు=గోపాలమంత్రియు, తాతశాంకరీశ్వరుండు-తాత = తాతయైన, శాంకరీశ్వరుండు= శాంకరియనునామె భర్తయగు రామకృష్ణ మంత్రియుం, ఆతిమ్మాఖ్యసెనయుం తాతతండ్రి = తిమ్మయ్యయను తాత తండ్రియును, అన్న = అన్నయగుతిరుపన్న, మొదలగు, సన్మార్గచారి= సన్మార్గవర్తులైన, పిండిప్రోలివిభులు= పిండిప్రోలివంశపుపెద్దలు, దివినుండి = స్వర్గమునుండి, పొగడన్ = కొనియాడురీతిఁగా, మగుడన్ = మరల, క్షేత్రంబున్ = లంకమాన్యమును, కొనియెన్ = స్వాధీనపఱిచి కొనియెను.

తా. తుమ్మెదలు పాడుచుండఁ బక్షులు కూయుచుండ తనతండ్రి, తాత, తాతతాత, అన్న మొదలగుతన పెద్దలు సాధించినాఁడయ్యా యని తన్ను మెచ్చుకొనునట్లు, లక్ష్మణకవి మరల లంకను గొనియెను.

వ. తదనంతరంబ నిజపురస్థాయియై యొప్పుచున్న లక్ష్మణాగ్ర జున కభిముఖం బై సకలవిబుధసముదయంబు నొక్కుమ్మడి నిట్లనియె. 214

రాఘ.—తదనంతరంబ=తర్వాత (సీతను స్వీకరించిన తర్వాత), నిజ పురస్థాయియై=తమయెదుటను, ఒప్పుచున్న = ఉన్న, లక్ష్మణాగ్రజునకున్ = రామునకు, అభిముఖంబై=ఎదురుగానిల్చి, సకలవిబుధ సముదయంబు=సమస్త దేవసమూహమును, ఒక్కుమ్మడిన్=ఒక్కసారిగా, ఇట్లనియెన్.

తా. తమయెదుటం గనఁబడుచున్న రాముంగని దేవతలిట్లనుచున్నారు.

లక్ష్మ.—తదనంతరంబ=పిమ్మట (లంకను స్వాధీనముచేసికొనిన పిమ్మట) నిజపురస్థాయియై యొప్పుచున్న=తనయింటిలోఁ గూరుచుండిన, (ని. 'అగా రేనగరేపురః') లక్ష్మణాగ్రజునకున్=లక్ష్మణకవికి, అభిముఖంబై = ఎదురుగా వచ్చి, సకలవిబుధసముదయంబు=అందఱుపెద్దమనుష్యులును, ఒక్కుమ్మడిన్ = ఏకవాక్యముగా, ఇట్లనియెన్=ఇట్లుచెప్పిరి.

క. క్షేత్రాపహర్త యగుదు
శ్శాత్రవునిన్ గోబలమున సకలజనపటు
స్తోత్రం బెసఁగ నడఁచి నీ
క్షేత్రముఁ గైకొనుట నుల్లసిల్లితి కీర్తిన్. 215

రాఘ —క్షేత్రాపహర్త=భార్యనుహరించిన, దుశ్శాత్రవునిన్ = దుష్ట వైరిని, గోబలమున=బాణశక్తిచే, సకలజనపటుస్తోత్రంబెసఁగన్ = ఎల్లవారు మిక్కిలిఁబొగడునట్లు, అడఁచి=సంహరించి, నీక్షేత్రముఁగైకొనుటన్ = నీభా ర్యను నీవుస్వీకరించుటచే, కీర్తిన్=యశస్సుచే, ఉల్లసిల్లితి=ప్రకాశించితివి.

తా. భార్యను హరించిన దుష్టుఁడగు రావణుం జంపి మరల నీభార్యను గైకొని వచ్చితివి. దీనిచే నీఖ్యాతియు నతిశయమగుచున్నది.

లక్ష్మ.—క్షేత్రాపహర్త యగు=లంకను బుచ్చుకొనిన, దుశ్శాత్రవున్=అత్యంతవిరోధిని, గోబలమున=నీకవిత్వమహిమచే, సకలజనపటుస్తోత్రంబెసఁగన్=అందఱును మేలని మెచ్చుచుండఁగా, అడఁచి=అణఁగించి, నీక్షేత్రంబున్=నీమాన్యమును, కైకొనుటను=పుచ్చుకొనుటచే, కీర్తిన్=ఖ్యాతిచే, ఉల్లసిల్లితి=ప్రసిద్ధుఁడవైతివి.

తా. నీవిరోధిం గెల్చి నీమాన్యమును నీవు నీకవిత్వపటుత్వమున సాధించితివి కావున నీకీర్తి హెచ్చుచున్నది.

వ. కావున. 216

గీ. లక్ష్మణాగ్రజా యలఘుమాన నీయయో
ధ్యానగరి మహార్షితాచ్యుతసుఖ
దశుభరతుని నీతిధను రామకృష్ణు స
భ్రాతృకునిని గూడి ప్రబలు మింక. 217

రా.—అలఘుమాన=ఘనమైనమానముగలిగిన, లక్ష్మణాగ్రజా=రామా, నీయయోధ్యానగరి=నీయయోధ్యాపట్టణమందు, మహార్షితాచ్యుతసుఖదశు-మహార్షితా=మహార్షియగుటచే, చ్యుత=జాఱిపోయిన, సుఖదశు=సుఖావస్థగల, నీతిధను=నీతియనుధనముగల, రామకృష్ణు=మనోహరమైన నల్లనిరంగుగల, సభ్రాతృకుని=తమ్ముడగుశత్రుఘ్నునితోఁగూడిన, భరతుని = భరతుఁడను నీపెద్దతమ్ముని, కూడి=చేరి, ఇంకన్=ఇంక, ప్రబలుము=అతిశయిల్లుము.

తా. అభిమానధనుఁడవైన రామా! యోగివలె సమస్తసంసారసుఖములను విడిచియున్న యాభరతుని గూడి నీవు రాజ్యము చేయుచుండుము.

లక్ష్మ.—అలఘుమాననీయ=ఘనులచే మన్నింపఁబడఁదగిన, ఓధ్యానగరి మహార్షితాద్యుత-ఓ, ధ్యాన=ధ్యానముయొక్క, గరిమ=గౌరవముచే, హార్షిత=

సంతోషింపఁబడిన, అచ్యుత=నారాయణుఁడుగల, లక్ష్మణాగ్రజా = ఓలక్ష్మణా కవీ, సుఖదశుభరతుని=సుఖకరుఁడు, శుభాసక్తుఁడు, నీతిధనుఁడు=వివేకమే ధనముగాఁగలవాఁడు, సభ్రాతృకునిని=తమ్ములతోఁగూడిన, రామకృష్ణుంగూడి= రామకృష్ణయ్యతోఁ జేరి, ప్రబలుమింక=ఇంకవృద్ధిపొందుము.

తా. నారాయణభక్తిపరుఁడా! నీవు నీయన్నయుఁ దమ్ములను గూడి సుఖముగా నుండుము.

సీ. రామ జగ న్మనురక్తి నేలుచు నవ
  నిజ కవనాదుల నెమ్మిఁ గూర్చు
చు మొదల నీసంతతిమన సుబ్బ న్నర
  విభుఁడు ధర్మాత్ముఁడన్ విణ్ను తిఁగని
వెలయఁ గొన్నాళ్లకా వెనుకను గుశలవా
  ఖ్యాతిరమ్యులైన యాత్మజులను
శ్రీరాజ గోపాలకృష్ణమహాభిఖ్య
  లను గాంచి మాకు నెలమిఁ గదురఁగ
గీ. మేధముఖ్యవిధుల మితము లొనర్చి య
  మరగురూ హారాజమాధవాత్మ
తను భవభయదూర తగ నొప్పు మని పల్కి
  స్వస్థలమునకు బుధసమితి యరిగె. 218

రాఘు —రామ=రాముఁడా! జగన్మనురక్తినేలుచున్=లోకమును బ్రీతిగాఁబాలించుచు, అవనిజకున్=సీతకు, అవనాదులన్=రక్షణ మొదలగు క్రియలచే, నెమ్మిఁగూర్చుచున్=ప్రియము సేయుచు, మొదలనీసంతతి=ఆదియందు నీ యొక్క వంశమువారి, మనసుబ్బన్=ఆత్మ యులరునట్లు, నరవిభుఁడు=రాజు, ధర్మాత్ముఁడనన్=ధర్మాత్ముఁడనునటుల, విణ్నుతిఁగని-విట్+నుతిన్+గని=జనులచేఁ బొగడ్తనొంది, వెలయన్=ప్రకాశించునట్లుగా, కొన్నాళ్లకు ఆవెనుకను=కొన్ని

దినములుగడచినపిమ్మట, కుశలవాఖ్యాతిరమ్యులైన=కుశలవులను పేరుచే మిగుల సుందరమైన,యాత్మజాలను=పుత్రులను, శ్రీరాజ=శోభాయుక్తుఁడవైన రాజా, గోపాలకృష్ణమహాభిముఖ్యులను-గోపాల=స్వర్గపాలకుఁడైనయింద్రుని,కృష్ణ=ఉపేంద్రుని, మహాభిఖ్యులను=ఉత్కృష్టశోభలవంటి శోభలుగలవారిని,కాంచి=కని, మాకుక్=మాకు, ఎలమిగన్=ఆనందముకలుగునట్లు, తురగమేధముఖ్యవిధులు=అశ్వమేధము మొదలైనయాగవిధులను, అమితములొనర్చి=పెక్కులు చేసి, అమరగురూ=దేవతలలో శ్రేష్ఠుఁడా, హరాజమాధవాత్మతను-హర+అజ+మాధవాత్మ+తను=హరుఁడు, బ్రహ్మ, విష్ణురూపకమయినశరీరముగలవాఁడా భవభయదూర=సంసారభయము లేనివాఁడా, తగన్, ఒప్పుము, అని, పల్కి, బుధసమితి=దేవతలయొక్క సమూహము, స్వస్థలమునకున్=స్వర్గమునకు, అరిగెన్=పోయెను.

తా. జగమ్మునకుఁ బ్రియముగ మీ పెద్దల కానందముగ భూమి నేలుము. కుశలవు లనుసిద్ధపుత్రులను గాంచుము. మాకు సంతోషముగ నశ్వమేధాది క్రతువు లొనర్పుము. నీవు త్రిమూర్త్యాత్మకుఁడవు. భవబంధరహితుఁడవు. అని దేవతలు పొగడి తమతావులకుఁ బోయిరి.

లక్ష్మ.—రామన్=మనోహరాంగి యగు, జగమ్మను = జగ్గమ్మ యను కాంతను (ఇచ్చట జగ్గమ్మ,జగ్గమయగును వెంకన్న, వెంకనయగును) గాని జగ్గమ్మ యనుచో గకారము క్రింది ద్విత్వ మెట్లుపోవునో),రక్తి శేలుచున్=అనురాగముగా నేలుచు,నపనిజకవనాన్వలన్=నూతనములైనరేకవిత్వము మొదలగువానిని, సెమ్మిగూర్పుచున్=ప్రియముచేనొనర్చుచు, మొదలన్=ప్రథమమున, నీసంతతి=నీపెద్దకుమారుఁడు, మన సుబ్బన్న = (మన యనునది యిక్కడఁ బ్రేమార్థకము) మనయొక్క సుబ్బన్న యనువాఁడు, రవిభా = సూర్యకాంతి వంటి కాంతిగలవాఁడు(కనుక రవిభుఁడు), ధర్మాత్ముఁడు=ధర్మబుద్ధిగలవాఁడు, అన్ = అనునట్టి, విఖ్యాతిఁగని = జనస్తోత్రమునుపొంది, వెలయన్=ప్రకాశించుచుండఁగా, కొన్నాళ్లకా వెనుకను = మఱికొంత కాలము గడచినపిదప, కుశల+వాక్ఖ్యాతిరమ్యులయిన = కుశలములైన వాక్యముల చేత ఖ్యాతిచేత

రమ్యులయిన, ఆత్మజులను = తనయులను, శ్రీరాజగోపాలకృష్ణమహాభిఖ్యులను- శ్రీరాజ = సీతల్లియగురాజమ్మ, గోపాలకృష్ణ = సీతండ్రియగు గోపాలకృష్ణునియొక్కయు, మహాభిఖ్యులను = దొడ్డపేరులుగలవారిని, కాంచి = కనినవాఁడవై, మాకుఁ = మాకెల్లరకు, ఎలమిగదురఁ = సంతోషము హత్తునట్లు, (ఇచట ఎలమిగఁ + తురగమేధ - రాఘువార్థమున, ఎలమిగదుర- ఈయర్థమున. ఈరెండవయర్థమున గదురలో నఱసున్న యెట్లుపోయినది) మేధ= బుద్ధిచేతను, ముఖ్యవిధులు=ముఖ్య వేదవిహిత కార్యములను, అమితములొనర్చి= చాలగనొనరించి, అమరఁ, గురూహ = గొప్పదగు గురూపదిష్టజ్ఞానముచే, రాజమాధవాత్మతనుభవ - రాజమాధవా=రాజమ్మకుఁ బెనిమిటివైయైన, గోపాలునకు, ఆత్మతనుభవ = స్వకీయకుమారుఁడా, (ఈసమాసము మృదువుగాలేదు. దీనివలన గోపాలునకె యితఁడుపుట్టినట్లు స్ఫురించును) మాధవాత్మజయనిన మన్మథుఁడనుకొనినట్లు, (లక్ష్మిపెనిమిటికొడుకు) తగనొప్పుమనిపల్కి, స్వస్థలమునకు = తమతమయిండ్లకు, బుధసమితి = పెద్దమనుష్యులు, అరిగెఁ = వెళ్లిరియనుట.

తా. జగ్గమ్మ యనుభార్యతోఁ గూడి నూతనకవిత్వము ప్రబలించుచు నిప్పుడు పుట్టియున్నసీశుఁడు సుబ్బన్నకూడ సజ్జనుఁడు ధర్మాత్ముఁడు ననుఖ్యాతిని సంపాదించుచుండఁగా మఱి యిద్దఱు సంతానముకలిగి వారికి సీతనిదండ్రులపేరులు గలిగి వెలయుచుండఁగా వారిం గాంచి మేమందఱము సంతసిల్లునట్లు లక్ష్మణకవీ నీవు వర్ధిల్లు మని పల్కి పెద్దమనుష్యులు తమయిండ్లకుఁ జనిరి.

వ. అవ్విధంబున. 219

క. పత్రికలోరూఢం బగు
క్షేత్రము బుధసమ్మతముగఁ జేకొని యెలమిన్
మిత్రతనయాదు లెసఁగ న
మిత్రభయదతేజుఁ డతఁడు మెఱసె నటువడిన్. 220

రాఘ.—పత్రికల-పత్రి = బాణములయొక్క, కల = విద్యయందు, ఉరూఢంబగు - ఉరు = విస్తారముగా, ఊఢంబగు = వహించినట్టి, క్షేత్రమును=భార్యను, బుధసమ్మతముగన్ = దేవసమ్మతముగా, చేకొని = గ్రహించి, ఎలమిన్ = సంతోషముతో, మిత్రతనయాదులు = సూర్యపుత్రుఁడగు సుగ్రీవుఁడు మొదలగువారు, ఎసఁగన్ = ఆనందించునట్లు, అమిత్రభయదతేజుఁడు= విరోధిభయంకరుఁడు, అతఁడు = రాముఁడు, అటు = అట్లు, వడిన్ = ప్రతాపముచే, మెఱసెన్ = వెలింగెను.

తా. బాణవిద్యచేతను సీతను మరలసంపాదించికొని దేవహితముగ సుగ్రీవాదులం గూడి శత్రుభయంకరతేజశ్శాలి యగురాముఁడు ప్రకాశించెను.

లక్ష్మ.—పత్రికలన్ = దానపత్రికలలో, రూఢంబగు = రూఢియైన, క్షేత్రమున్ = మాన్యమును, బుధసమ్మతముగన్ = పెద్దలయంగీకారముతో, ఎలమిన్ = సంతసమున, మిత్రతనయాదులు = స్నేహితులుకుమారులు మొదలైనవారు, ఎసఁగన్ = ఆనందించునట్లు, చేకొని=స్వీకరించి, అమిత్రభయదతేజుఁడు = విరోధులకు భీతిపుట్టించుప్రభావముగల, అతఁడు = లక్ష్మణకవి, మెఱసెన్.

తా. తనకిచ్చినపట్టాలో నిర్ణయప్రకారము తనభూమిఁ దాను బది మందికి సమ్మతముగ మరల స్వాధీనపఱిచికొని పుత్రులు మిత్రులతో సుఖముగనుండెను.

గీ. సరవి నట్లు లంకసాధించి మహిజ నా
దృతిని గొనియు నిజపురికిని బోవ
నంత సాధ్వసమరయగ విమానోన్నత
గతిని బెఱసె నా ప్తకలితుఁ డగుచు. 221

రాఘ.—సరవిన్ = క్రమముగా, అట్లు = ఆరీతిని, లంకసాధించి= లంకాపట్టణమును నిగ్రహించి, మహిజను=సీతను, ఆదృతిని = ఆదరముచే, గొనియుం = గ్రహించి, నిజపురికినిబోవన్ = తనయయోధ్యానగరమునకు వెళ్లుటకై, అంతన్, సాధు = సుందరమైన, అసమ = సమానములేని, రయగ =

శీఘ్రగతిగలిగిన, విమాన = పుష్పకముచే, ఉన్నతగతిని = గగనమార్గమును, ఆప్తకలితుఁడగుచున్ = తనకుఁ బ్రియమైనవారితోఁ గూడి, బెలసెన్ = పొందెను.

తా. సీతను గొని పుష్పకము నెక్కి స్నేహితులు మొదలగు నాప్తులం గూడి సాకేతపట్టణమునకుఁ బోవుటకై యాకాసమునకుఁ జనియెను.

లక్ష్మ.—సరవిన్ = క్రమముగా, అట్లు, లంకసాధించి = లంకమాన్యమునుసాధించి, మహిజనాదృతినిగొనియు = భూజనుల యాదరమును స్వీకరించి, నిజపురికిన్ = తనయుయ్యోరునకు, అంతసాధ్వసము = సర్వభయమును, పోవన్ = పోవునట్లు, అరయన్, కవి = లక్ష్మణకవి, ఆప్తకలితుఁ డగుచున్ = ఆప్తులతోఁగూడి, విమానోన్నతగతిని బెలసెన్ = = విశేషబహుమానాతిశయమును బొందెను.

తా. లంకభూమిని సాధించి తనయూరికేగి యెల్లజనులచే సర్వబహుమానముల నొందెను.

సీ. అట్లరుగంగ సౌఖ్యమున నొప్పారుచు
 రాజిల్లు నాయన రాక నిండు
జాబిల్లిగతి మోదజలధి నుప్పొంగింప
 లలి డాసి తమడెందములను బొదలు
సత్ప్రేమరస మొప్పఁగఁ బిండి ప్రోలివా
 రలు భ్రాతలు గురుమంత్రులు వలికిరి
నిజగురుసత్యవాఙ్నిష్ఠ దీపింప నే
 కవనచర్య నడిపి కడఁగి భృశము
గీ. దమ్మన్నయముఁ జేరఁ దగ లంక సాధించి
జయము దార యశము గయికొని యిటు
రా జితపరశక్తి వౌజిష్ణు నినుఁ గన
హర్ష మయ్యె లక్ష్మణాగ్రజన్మ. 222

రాఘు.—అట్లరుగంగన్=ఆప్రకారముచనఁగా, సౌఖ్యమున నొప్పా రుచు = సుఖలీలలం దనరుచు, రాజిల్లు = ప్రకాశించు, ఆయినరాక = ఆరాముని రాకాగమనము, నిండుజాబిల్లిగతిన్=పూర్ణచంద్రోదయమును వలె, మోదజలధిన్ = ఆనందసముద్రమును, ఉప్పొంగింపన్ = ఉప్పొంగునట్లు చేయఁగా, లలిన్, డాసి=దగ్గఱకువచ్చి, తమడెందములన్ = తమానిమనహృదయములలో, పొదలు = వృద్ధిపొందు, సత్ప్రేమరసము = యోగ్యమగు ప్రీతిరసమును, ఒప్పెనఁగన్, పిండి = పిడిచి, ప్రోలివారలు = అయోధ్యాపురవాసులు, భ్రాతలు = భరతుఁడు శత్రుఘ్నుఁడును, గురు = వసిష్ఠుఁడు, మంత్రులు = సుమంత్రాదులును, విజగురుసత్యవాక్స్థితి దీపింపన్ = నీతండ్రియొక్కసత్యవాక్యము రూఢియగునట్లు, వీకవనచర్యనడిపి = ముఖ్యమగువనవాసమునుగడపి, కడఁకి = పూని, భృశ+ముదమ్ము = మిగులసంతోషము, అనయముఁజేరన్ = ఎల్లప్పుడును జేరునటుల, తగన్, లంకసాధించి, జయము= జయమును, దారన్= భార్యను, యశమున్= కీర్తిని, కయికొని= గ్రహించి, ఇటురాన్ = ఈరీతిగా రాఁగా, జితపరశక్తివి=జయింపఁబడిన శత్రుసారముగలవాఁడవు, ఔజిష్ఠున్ = అయినజయస్వభావముగల, నిసుఁగనన్= నిస్సందేహముగా, లక్ష్మణాగ్రజన్మ = రామా, హర్షమయ్యెన్ = సంతసమయ్యె (నని), పలికిరి = చెప్పిరి.

తా. రామునిరాక విని అయోధ్యలోని భరతశత్రుఘ్నులు, వసిష్ఠుఁడు, మంత్రులు, తక్కినజనులును ప్రేమమీఱ వచ్చి సముద్రము చంద్రునిరాకచేఁ బొంగినట్లు పొంగి నీవు తండ్రిసత్యవాక్యమును బరిపాలించి వనవాసము గావించి విరోధులం జంపి కీర్తిని వహించివచ్చుటచే మాకెంతయు సంతోషమయ్యెనని పల్కిరి.

లక్ష్మ.—అట్లు = ఆప్రకారము, అరుక్ = రోగరహితమగు, అంగ= దేహముయొక్క, సౌఖ్యమున = సౌఖ్యముచేత, ఒప్పారుచు = ఒప్పుచును, రాజిల్లు = ప్రకాశించుచున్నట్టి, ఆయన=లక్ష్మణకవి, రాకనిండు జాబిల్లిగతి= పూర్ణిమయం దైన పూర్ణచంద్రునివలె, మోదజలధినుప్పొంగింప = ఆనందసముద్రము నుప్పొంగునట్లుచేయ, లలిన్, డాసి = చేరి, తమడెందములను= తమచిత్తములందు, పొదలునసత్ప్రేమరసము = వృద్ధిపొందుచున్న ప్రేమయను

రసము, ఒప్పెసఁగన్=పిండిప్రోలివంశజాతులు=పిండిప్రోలివంశము వారు, భ్రాతలు=అన్నదమ్ములు, గురుమంత్రులు=గురువులు మంత్రులును, నిజగురు=నీయొక్క గొప్పదియగునట్టి,సత్యవాఙ్నిష్ఠ=సత్యవాక్యముయొక్క నిష్ఠ,దీపింపనే=ప్రకాశించుటకే, కవనచర్యనడపి=కవిత్వవ్యాపారమునుజరపి, కడఁగి=పూని,భృశము=అత్యంతము, దమ్మన్న=ధర్మరావు, యముఁజేరన్=యముని జేరఁగా, తగన్, లంకసాధించి, జయము=జయమును, ఉదారయశమును=అధికకీర్తిని, కైకొని=స్వీకరించి, ఇట=ఈరీతిగా, రాజిత=ప్రకాశించు, పరశక్తివి=పరులబలము గలవాఁడవు, జైష్ణుక్=అయినజయస్వభావముగల, నినుఁగనన్==నిన్నుఁజూడఁగా, లక్ష్మణాగ్రజన్మ=లక్ష్మణకవీ,హర్షమయ్యెన్=మాకుసంతోషమయ్యె (నని) పలికిరి.

తా. ఏవిధమయిన బాధయును లేకుండ దృఢశరీరముతో లంక సాధించి వచ్చిన లక్ష్మణకవిం గాంచి ఉయ్యూరులోని పిండిప్రోలివారెల్లవారును, అన్నదమ్ములును గురువులు మొదలగువారును వచ్చి నీరాక మాకుఁ జాలసంతోషమును గలిగించినది. లంక సాధించితివి. శత్రుజయముం గావించితివి. అని పలికిరి.

క. అని పల్కుచు వారల గ
బ్బునఁ బూర్ణానందబాష్పపూరంబుల నా
తని నభిషేకించిరి మహి
మను నీతిభరించి యేలు మము నీవనుచున్. 223

రాఘ.—అనిపల్కుచున్=ఇట్లని చెప్పుచు, వారలు=ఆదేవతులు, గబ్బునన్=శీఘ్రముగ,పూర్ణానందబాష్పపూరంబులన్=పరిపూర్ణములగు,సంతోషబాష్పపూరములచే,అతనిన్=ఆరాముని,మహిన్=భూమియందు, మనునీతి=మనువుయొక్క నీతివంటినీతిని, భరించి=వహించి, మమున్ = మమ్మందఱను, నీవు, ఏలుము, అనుచున్, అభిషేకించిరి=పట్టాభిషేకము చేసిరి.

తా. ఆదేవతలు పైరీతిగాఁ బల్కి సంతోషపూర్వకముగా రామునికిఁ దమయానందబాష్పములచేఁ బట్టాభిషేకము గావించిరి.

లక్ష్మ.—అనిపల్కుచున్ = ఈప్రకారముగాఁ బల్కినవారై, వారలు = లక్ష్మణకవియొక్క కుర్యోటిప్రజలందఱును, పూర్ణానందబాష్పపూరంబులన్ = నిండుసంతోషముచేఁ గలిగిన కన్నీటిదుందకముచేత నే, అతనిన్ = ఆలక్ష్మణకవిని, మహిమను = మహిమచేత, నీతిభరించి = న్యాయమార్గముగైకొని, నీవు, గొబ్బునన్ = వేగముగ, మమ్మున్ = మమ్ము, ఏలుమనుచున్ = కాపాడుమని, అభిషేకించిరి = తడిపిరి.

తా. సంతోషముచే వచ్చు బాష్పములతోనే లక్ష్మణకవిని, నీవు మమ్ము న్యాయమార్గమున గాంచుచుండుమని అభిషేకము చేసిరి.

వ. అప్పుడు. 224

క. ఆలక్ష్మణాగ్రజన్మవి
శాలసమాఖ్యాసమానసద్రుచి యాప
ట్టాలంకారసహితత భ
ళీ లెస్సయి యొప్పె నని పలికి రెల్లజనుల్. 225

రాఘ.—ఆలక్ష్మణాగ్రజన్మ = ఆరామునియొక్క, విశాలసమాఖ్యా = విశాలమైనకీర్తియొక్క, అసమానసద్రుచి = సమానరహితమైనకాంతియును, ఆపట్టాలంకారసహితత = ప్రసిద్ధమైనలలాటపట్టముతోఁ గూడినదై, భళీ = మేలు, లెస్స = తగియున్నది, అని, ఎల్లజనులున్ = సమస్తప్రజలును, పలికిరి = స్తోత్రముచేసిరి.

తా. ఆహా! రాముని సత్కీర్తియు, దానికిఁ దగిన ట్లీలలాటమునందలి పట్టమును సరిపడి యున్నవి. బళీ! మేలని జనులు పొగడిరి.

లక్ష్మ.—ఆలక్ష్మణాగ్రజన్మ = లక్ష్మణకవియొక్క, విశాల = విస్తారమైన, సమాఖ్యా = కీర్తితో, అసమాన = సమానములేని, సద్రుచి = కాంతిగలిగినట్టి, ఆపట్టా = ప్రసిద్ధమైనదానపట్టమును; (పట్టాయనునది యన్యదేశ్యము కావచ్చును) లంకారస = లంకభూమియు, హితత = ఇష్టమగుటచేత, భళీ = మేలు, లెస్స = ఒప్పును, అని, ఎల్లజనులు, పలికిరి = కొనియాడిరి.

తా. లక్ష్మణకవికీర్తివలెనే నిరాటంక మైనయాతనిదానశాసనపత్రము స్వచ్ఛమై యున్నది యని జను లనుకొనిరి.

క. తనభూమి నేలుచును బెం
పున భ్రాతృకళత్రపుత్రముఖ్యులతో నిం
పెనసి వరుస సకలసుఖము
లొనర నతం డనుభవించుచుండెం బ్రీతిన్. 226

రాఘు-లక్ష్మ.—తన=తనయొక్క, భూమిని=రాజ్యమును (రాముఁడు), భూమిని=లంకను (లక్ష్మణకవి), ఏలుచున్=పాలించుచు, బెంపునన్=అతిశయముచే, భ్రాతృ=తమ్ములు (రామునిపక్షమున), భ్రాతృ=అన్నదమ్ములు (లక్ష్మణకవి), కళత్ర=భార్య, పుత్ర=కొమరులు, ముఖ్యులతో=ఈ మొదలైనవారింగలసికొని, ఇం పెనసి=సంతోషముతో, వరుసన్=క్రమముగా, సకలసుఖములొనరన్=సమస్తభోగములుగలిగి, అతండు=రాముఁడు, లక్ష్మణకవియు, ప్రీతిన్=ప్రేమచే, అనుభవించుచుండెన్=భోగించుచుండెను.

తా. తనభూమిని బాలించుచుఁ బుత్రమిత్రకళత్రాదులతోఁ గలసిమెలసి సమస్తసుఖములుగల్గి రాముఁడును లక్ష్మణకవియుం హాయిగానుండిరి.

క. ఈలంకావిజయంబును
హాళిఁ జదివిన వినిన జను లలఘుచిరాయు
శ్శ్రీలాభసమన్వితులై
శ్రీలక్ష్మీశ్వరునికడ వసింతు రంటఁ దుదిన్. 227

టీ. ఈలంకావిజయంబును = లంకావిజయమను పేరుగలగ్రంథమును, హాళిన్=సంతోషముగా, చదివిన=పఠించినను, వినినను=ఎవ్వరైనఁజదువుచుండిన యెడ నాలకించినను, జనులు=మనుష్యులు, అలఘు=విస్తారమైన, చిరాయుః=దీర్ఘాయువును, శ్రీ=ఐశ్వర్యమును, లాభ=లాభమును, (వీనితో) సమన్వితులై=కూడినవారై, తుదిన్=అంతమున, శ్రీలక్ష్మీశ్వరునికడన్ = విష్ణుసాన్నిధ్యమున, అటన్=ఆవైకుంఠములో, వసింతురు=కాఁపురముందురు.

తా. ఈలంకా విజయమును జదివినఁ గాని వినినఁగాని సకలైశ్వర్యములుగల్గి భూలోకమునఁ జిరకాలము జీవించి తుదను వైకుంఠప్రాప్తిని సుఖింతురు. రామకథ యిందుండుటచే నట్టిమహిమ గలదనుట. (రాముఁడు లంకలోన విజయమందుటచేతను లక్ష్మణకవి తనలంకకావ్యమును గెల్చుకొనుటచేతను దీనికి లంకావిజయమను పేరు కలిగినది. దీనికే రావణదమ్మీయ మను ప్రసిద్ధనామము గలదు. ఆదిరావణునితో దమ్మన్నను బోల్చి సీతాపహరణబ్రాహ్మణమాన్యాపహరణములు సమానభావములుగాఁ గూర్చినందునఁ గలిగినది.)

స్రగ్ధరాపుష్పగుచ్ఛబంధము.

క్ష్మానారీనాథ నాళీకనయన కనదాకార ధీరస్ఫురద్ధృ
ద్ధ్యానాధీనాత్మ నారాయణ గుణగణపూర్ణా విధూ విజ్ఞ విష్వ
క్సేనా దీనావనా సుస్థిరతర వరదా శ్రీపతీ పక్షిపత్రా
నానారీనాసునాశా నరసురవరవర్ణ్యా నవానల్పవర్ష్మా. 228

టీ. క్ష్మానారీనాథ=భూదేవికినాథుఁడా! నాళీకనయన=పద్మాక్షా! కనదాకార=ప్రకాశమానరూపముగలవాఁడా! ధీర=ధైర్యముచే, స్ఫురత్=ప్రకాశించెడు, హృద్ధ్యానా=హృదయముతో ధ్యానముగలవానికి, అధీనాత్మ=స్వాధీనమైనవాఁడా! నారాయణ, గుణగణపూర్ణా=సకలసద్గుణములుగలవాఁడా! విధూ! (విధుశబ్దమునకుఁ బ్లుతమువచ్చినది. ఇదివిష్ణునికొకనామము.) విజ్ఞ=విశేషముగ నెఱింగినవాఁడా! విష్వక్సేనా! (ఇదియుఁ బ్రసిద్ధనామమే.) దీనావనా=దీనరక్షకా! సుస్థిరతర=నాశనరహితుఁడా! వరదా=వరములిచ్చువాఁడా! (సుస్థిరతరవరదాయనియైనను) శ్రీపతీ=లక్ష్మీనాయకా! పక్షిపత్రా=గరుడవాహనా! నానారీనాసునాశా=సమస్తవిరోధిరాజప్రాణనాశకా! నరసురవరవర్ణ్యా=నరులచేతను, సురలచేతను వర్ణింపఁబడఁదగినవాఁడా! నవానల్పవర్ష్మా=నూతనమును ఘనమైనదియుం నగువర్ష్మముగలవాఁడా!

—●● శ్రీరామకృష్ణపట్టాభిషేకసమయపరిజనస్త్రీసహితవర్ణనము. ●●—

సీ. భానుండు గురుఁడుగాఁ బరఁగె నెయ్యమున ము
న్నట్టియాపావని యగ్రదిశను
శోభనాకృతి లక్ష్మణాభిఖ్య నొప్పును
నీతివిందు సహజనియె వెనుకను
అలసత్యభామహారిర్యబ్జాపరావతా
రములే మహితతఁ జేరఁ గుడినెడమఁ
దారాదిహారాంకితసువత్సనుగ్రీవ
భద్రసద్ధృతిమహామాద్రికలుష
గీ. భావహృద్విభీషణసుదంతావలశుభ
కరలసద్భుజాంగదభల్లుకవరజాత
నాథు లయ్యనిలాదికోణముల వెలయ
నడుమ సమహితయనత నున్నవిభుఁ గొల్తు. 229

తాత్పర్యము.—భానుండుగురుఁడుగాఁబరఁగె = సూర్యుఁడుగురువుగానొప్పెను. నెయ్యమునన్ = స్నేహముచే, మున్ను, అట్టిపావని = అటువంటిహనుమంతుఁడు, అగ్రదిశను = పురోభాగమందును, శోభనాకృతి = శుభాకారముగల, లక్ష్మణాభిఖ్యనొప్పు = లక్ష్మణనామముచేనొప్పుచున్నట్టియుం, సునీతివిందు = నీతిపరిజ్ఞానముగలిగినట్టియు, సహజనియె = తమ్ముఁడే, వెనుకను = పశ్చాద్భాగమునను, అల = ప్రసిద్ధమగు, సత్యభా = సత్యమగుతేజస్సుచే, మహా = ఉత్కృష్టమగు, అరి = సుదర్శనచక్రముయొక్కయుం, అబ్జ = పాంచజన్యమనుశంఖముయొక్కయుం, అపరావతారములువి = రెండవయవతారములైనభరతశత్రుఘ్నులే, మహితతఁజేరన్ = పూజ్యతచేఁజేరునటులు, కుడినెడమన్-కుడి = కుడివైపున, ఎడమన్ = ఎడమవైపున, తారాదిహారాంకితసువత్సనుగ్రీవ = తారమొదలగుకాంతలయొక్క ముక్తాహారములచేతఁ

జిహ్నితమగువక్షఃస్థలముఁగలిగినసుగ్రీవుఁడు, భద్రసద్ధృతిమహీమాద్రి = శుభకరమగునట్టియుఁ ఘనమగునట్టియుఁ ధైర్యమహిమకుపర్వతమగునట్టియు, కలుషభావహృత్ = పాపభావమునుహరించునట్టియు, విభీషణ = విభీషణుఁడును, సుదంతావలశుభకరలసద్భుజ = మదపుటేనుంగులతుండములవంటి భుజములు గలిగినట్టి, అంగద = అంగదుఁడు, భల్లుకవరజాతనాథులు = జాంబవంతుఁడును, అయ్యనిలాదికోణములన్ = వాయవ్యాదిదిక్కులయందు, వెలయన్, నడుమ = మధ్యప్రదేశమున, సమహితనయతన్ = సీతాదేవితోఁగూడుకొని, ఉన్న = కూర్చుండిన, విభున్ = ప్రభువును, గొల్తున్ = సేవింతును.

తా. పూర్వము సూర్యునిశిష్యుఁ డైనహనుమంతుఁడు ముందును, (తూర్పున) లక్ష్మణుఁడు వెనుకను, (పడమర) భరతశత్రుఘ్నులు కుడియెడమలను, (ఉత్తరదక్షిణముల) సుగ్రీవ, విభీషణ, అంగద, జాంబవంతులు, వాయవ్యదిశను, ఈశాన్యదిశను, ఆగ్నేయదిక్కున, నిర్ఋతిమూలను నిలువఁగా మధ్యభాగమున సింహాసనముపై సీతతోఁ గొలువున్న రాముని సేవించెదను.

కృష్ణార్థము.—ఏయ్యమున = ఏకాళింది, భానుండుగురుఁడుగాఁ బరఁగన్ = సూర్యుండు తండ్రిగానొప్పెనో, అట్టిపావని = అటువంటి పవిత్రురాలు, అగ్రదిశను = తూర్పుదిక్కున, శోభనాకృతి = శుభాకారముగల, లక్ష్మణాభిఖ్యనొప్పు = లక్ష్మణయనుపేరుగల, సునీతివిందు = యోగ్యమగునీతిగల, విందుఁడనురాజుయొక్క, సహజని = చెల్లెలుమిత్రవిందయు, అల సత్యభామయు, హార్యబ్జాపరావతారములేమ = లక్ష్మీస్వరూపమైనరుక్మిణియు, హితతఁజేరన్, కుడియెడమను = ఉత్తరదక్షిణములను, తారాదిహారాంకితసువత్ససుగ్రీవ = హృదయమునఁ గంఠమునముత్తెములహారములుగల, భద్ర = భద్రయు, సద్ధృతిమహీమాద్రి = భూదేవివంటి లక్ష్మణయు, కలుషభావహృద్విభీషణ = పాపాత్ములకు భయముంగల్గించు, సుదంతావల = సుదంతయనెడునబలయు, శుభకరసద్భుజాంగద = మంచిభుజకీర్తులుగల, భల్లూకవరజాత=జాంబవతియు, సాధులై = ఆధిలేనివారై, అనిలాదికోణములన్ = తక్కిననాల్గుమూలలను, వెలయన్, సమహితనయతన్ = సమమైనయిష్టము

నీతిగలుగుటచేత, నడచుచున్, ఉన్న = నిలిచిన, విభున్ = దేవుని, కొల్తున్ = భజింతును.

తా. ఎనమండ్రు భార్యలు నెనిమిదిదిక్కులను నిల్వఁగా మధ్యభాగమునసాసీనుఁ డైనశ్రీకృష్ణునిగొల్తును. (ఇప్పద్యమున విశేషణములు కొన్ని యావిశేష్యములకుఁ దగినట్లులేవు.)

ఉభయభాషాకందము.

క. రా మము దేవర కావవ
యా మాజేజే యనయ మయామున్నలజే
జే మదిని నారదేమయి
తేముద్దామోదర యదితేలం దానిన్.

టీ. * * * *

మ. హరి భక్తప్రియ పూరుషోత్తమ మహా
త్మా హంసరాజాంబకా
దరసంయుక్తసుదర్శనాదుల హితా
ర్థం బెల్ల నీడేర్పుశ్రీ
వరుఁడా తండ్రి వికుంఠవాసుఁడ చతు
ర్వక్త్రాత్మజోత్పత్తికృ
ద్ధరుఁడా చెప్పితిఁ జిత్తగింపు కృతి సం
తోషాత్మ గోపాలుఁడా.

టీ. హరి, భక్తప్రియ = భక్తులయందుఁ బ్రేమకలవాఁడా, పూరుషోత్తమ = పురుషోత్తమనామధారీ, మహాత్మా, హంసజాంబకా = సూర్యచంద్రులు నేత్రములు గలవాఁడా, దరసంయుక్త = శంఖముతోఁగూడిన, సుదర్శనాదులన్ = చక్రము మొదలయినవానిచేత, హితార్థంబెల్లన్ = కోరిక

లన్నియయ్యా, ఈడేర్చు = నెఱవేర్చునట్టి, శ్రీవరుఁడా=లక్ష్మీనాథా, తండ్రీ, వికుంఠవాసుఁడ = వైకుంఠనివాసీ, చతుర్వక్త్రాత్మజ = నాలుగు మొగములుగల కుమారుని, ఉత్పత్తికృద్గురుఁడా = పుట్టించిన గొప్పతండ్రీ, చెప్పితిఁ గృతిని= ఈ గ్రంథమును రచించితిని, సంతోషాత్మ=ఆనందమయుఁడా, గోపాలుఁడా= కుయ్యేరులో వేంచేసిన గోపాలకృష్ణా, చిత్తగింపుము.

గద్యము. ఇది శ్రీమత్కుయ్యేటిగోపాలలీలాకటాక్షవీక్షణాసం
ప్రాప్తసాహిత్య సుకవిజనస్తుత్య శుభాపస్తంబసూత్ర భార
ద్వాజగోత్ర పిండిప్రోలిగోపాలామాత్యపుత్ర సరసకవితా
లక్షణవిచక్షణ లక్ష్మణకవి ప్రణీతం బైనలంకావిజయం బను
ద్వ్యర్థిప్రబంధంబునందు సర్వంబును ద్వితీయాశ్వాసము.

సంపూర్ణము.



చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము:—1927.

# ఆంధ్ర గ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అచ్చతెనుఁగురామాయణము, శుద్ధప్రతి | ... | 1 | 4 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 10 |
| అడవిమల్లెలు, ఎనమండ్ర నారాయణమూర్తి | ... | 0 | 8 |
| అధ్యాత్మరామాయణము, క్రొత్తకూర్పు | ... | 1 | 8 |
| అనంతునిఛందము, ఛందోదర్పణము | ... | 0 | 14 |
| అనిరుద్ధచరిత్రము, కనుపర్తి అబ్బయామాత్యప్రణీతము | ... | 0 | 8 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 14 |
| అప్పకవీయము, శ్రీగిడుగురామమూర్తి పంతులుగారి విమర్శతో నున్నది | ... | 2 | 8 |
| అంబరీషోపాఖ్యానము, సటీక (భాగవతము) | ... | 0 | 4 |
| ఆముక్తమాల్యద వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో మేలుకాకితములమీఁద చక్కఁగ మరల ముద్రించియున్నారము. | | 3 | 8 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 2 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైనప్రతులకన్న అన్నివిధములబాగుగనున్నది | | 5 | 8 |
| డిటో అత్యుత్తమప్రతి, రెండుసంపుటములు | ... | 7 | 8 |
| డిటో 3 సంపుటములు | ... | 9 | 0 |
| శ్రీమదాంధ్రభారతము-పద్యకావ్యము:— | | | |
| 7 సంపుటములప్రతి | ... | 14 | 0 |
| 3 సంపుటములప్రతి | ... | 13 | 0 |
| ఆది, సభాపర్వములుగల సంపుటము | ... | 2 | 0 |
| ఆరణ్యపర్వము ,, | ... | 2 | 0 |
| విరాటోద్యోగపర్వములు ,, | ... | 2 | 0 |
| భీష్మద్రోణపర్వములు ,, | ... | 2 | 0 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు ,, | ... | 2 | 0 |
| శాంతిపర్వము | ... | 2 | 0 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక స్వర్గారోహణపర్వములుగల సంపుటము | ... | 2 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | ... | 5 | 8 |
| యుద్ధపంచకము ,, | ... | 3 | 12 |
| శాంతిసప్తకము ,, | ... | 3 | 12 |
| ఆదిపర్వము మాత్రము, పెద్దచ్చు, చిన్నసైజు | ... | 1 | 8 |
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది సూర్యనారాయణశాస్త్రి | ... | 0 | 8 |
| ఆనందరంగరాట్ఛందము, కాలికోబైండు | ... | 1 | 8 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము, కావ్యస్మృతితీర్థ: జనమంచి శేషాద్రిశర్మకృతము, 3 సంపుటములు | ... | 12 | 0 |
| ఆంధ్రబ్రహ్మాండపురాణము | ... | 5 | 0 |
| ఆంధ్రలలితోపాఖ్యానము | ... | 1 | 8 |
| ఆంధ్రభాషాభూషణము | ... | 0 | 2 |
| ఆంధ్రభాషార్ణవము, అట్టబైండు | ... | 0 | 12 |
| ,, కాలికోబైండు | ... | 1 | 2 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీకానుక్రమణికాసహితము | ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 0 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | ... | 0 | 8 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము చక్కనికూర్పు | | 2 | 0 |
| ఉత్తరహరివంశము, నాచనసోమనాథకృతము | ... | 1 | 8 |
| కవికర్ణరసాయనము, (మాంధాతచరిత్ర) | ... | 1 | 8 |
| డిటో మేలుప్రతి, కాలికోబైండు | ... | 1 | 14 |
| కళాపూర్ణోదయము, దళసరికాగితములు | ... | 2 | 4 |
| కాశీఖండము, చక్కనిక్రొత్తకూర్పు | ... | 1 | 8 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 12 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 4 |
| డిటో గట్టుప్రభుకృతము | ... | 0 | 6 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| కృష్ణరాయవిజయము, కుమారధూర్జటికృతము | ... | 0 | 8 |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు | ... | 0 | 6 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 8 |
| గణికాగుణప్రవర్తనతారావళి | ... | 0 | 2 |
| గరుడాచలము, యక్షగానము, పెద్దచ్చు | ... | 0 | 2 |
| గోపీనాథరామాయణము, 2, సంపుటములు, శ్రీమద్రామాయణమునకు సరియైనపద్యము, కవనముమిక్కిలిసొంపు; పీఠిక అతివిపులము | | 7 | 8 |
| చాటుపద్యమణిమంజరి, క్రొత్తకూర్పు, ప్రథమభాగము | ... | 1 | 4 |
| డిటో రెండవభాగము, సాధారణప్రతి | ... | 1 | 6 |
| డిటో మేలుప్రతి, గ్లేజుకాకితములది | ... | 1 | 10 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము | ... | 1 | 2 |
| ఛందోదర్పణము (అనంతునిఛందము) | ... | 0 | 14 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము, చక్కనికూర్పు | ... | 1 | 0 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 6 |
| తారాశశాంకవిజయము, చక్కనికూర్పు | ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 4 |
| తెనుగుసమస్యలు | ... | 0 | 2 |
| దశకుమారచరిత్రము, పద్యకావ్యము, కేతనకవికృతము చక్కనిప్రతి | | 1 | 8 |
| దశావతారచరిత్ర, నూతనముద్రితము | ... | 2 | 0 |
| దసరాపద్యములు | ... | 0 | 2 |
| నరసభూపాలీయము, అట్టబైండు | ... | 0 | 10 |
| డిటో మేలుప్రతి, కాలికోబైండు | ... | 1 | 0 |
| నలోపాఖ్యానము, సటీక, చిన్నసైజు | ... | 0 | 6 |
| నలచరిత్ర, ద్విపద | ... | 0 | 14 |
| నిర్వచనోత్తరరామాయణము | ... | 0 | 12 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము | ... | 0 | 6 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము | ... | 0 | 4 |

| | | రూ. | అ. |
|---|---|---|---|
| | | ప్రతి 1-కి రూ. | అ. |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి తిమ్మకవికృతము | ... | 0 | 4 |
| డిటో కాలికో బైండు | ... | 0 | 8 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రగ్గడ, క్రొత్తకూర్పు | ... | 1 | 0 |
| డిటో కాలికో బైండు | ... | 1 | 6 |
| పంచతంత్రము, నారాయణకవికృతము | ... | 0 | 12 |
| డిటో కాలికో బైండు | ... | 1 | 2 |
| డిటో వేంకటనాథరాజకవికృతము | ... | 1 | 4 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు | ... | 0 | 10 |
| డిటో కాలికో బైండు | ... | 0 | 14 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు, క్రొత్తకూర్పు | ... | 0 | 8 |
| బసవపురాణము, పిడుపర్తిసోమనాథ ప్రణీతము | ... | 2 | 4 |
| బ్రహ్మోత్తరఖండము | ... | 1 | 0 |
| బిల్హణీయము, చక్కనికూర్పు | ... | 0 | 8 |
| భాస్కరరామాయణము, చక్కని క్రొత్తకూర్పు | ... | 4 | 0 |
| భోజరాజీయము, అనంతామాత్యకృతము | ... | 1 | 2 |
| భోగినీదండకము | ... | 0 | 1 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల. రామస్వామిశాస్త్రులుగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాకితములమీఁద స్ఫుటమైన అక్షరములలో చక్కగ ముద్రించియున్నారము. | ... | 2 | 0 |
| మార్కండేయపురాణము, మారనకృతము | ... | 1 | 12 |
| డిటో కాలికో బైండు | ... | 2 | 2 |
| మొల్లరామాయణము, చిన్నసైజు, పెద్దక్షరములు | ... | 0 | 10 |
| రసికజనమనోభిరామము | ... | 0 | 12 |
| డిటో కాలికో బైండు | ... | 1 | 0 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కని క్రొత్తకూర్పు | ... | 2 | 8 |

